

# పీఠిక.



## అయ్యలరాజు నారాయణామాత్యకవి.

" నిందతునందతు వా సన్నసూయు రనసూయు రత్ర కింతేన,
య త్సన్మానసగమనా యైవేదం మమ తు పాథేయమ్"

## ప్రాచీనకవి.

హంసవింశతి యనునీపద్యకావ్యమును రచించిన యీమహాకవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. సూరనామాత్యునకుఁ బుత్త్రుఁడు. ఈయన తల్లి కొండమాంబ. ఇంటిపే రయ్యలరాజువారు. ఇక్కవి స్వవిషయము నిట్లు చెప్పుకొన్నాఁడు.

" వ. వెండియు నఖండతేజఃకాండమార్తాండమండల ప్రచండుండును, నిజకీర్తితరణాకర్ణనకృశీభూతపారావారపునరభ్యుదయకారణానూనదానధారాప్రవాహసంజాతవహావాహినీవ్యూహుండును, నిస్తులప్రశస్తసద్గుణరత్నాకరుండును, ....... నారాయణామాత్య దేవేంద్రుండు కొండొక శుభవాసరంబున నత్యంతసంతోషితాంతఃకరుణుండై " అని

దీనింబట్టి చూడఁ గవులకు నైజమగుదరిద్రము తన్ను బాధింపఁ జాలకుండఁగా ధనసంపన్నుండై గొప్పదాతయై యున్నట్టు పొడకట్టుచున్నది. తనొక్కరు పురికొల్పంగాఁ గవిత్వమున కారంభించినట్లుగూడ నీతఁడు చెప్పకొనక పోవుటంజూడఁ నైవిషయము స్థిరపడుచున్నది. ఇష్టదైవమగు శ్రీరామమూర్తి స్వప్నమున సాక్షాత్కరించినట్లు, గ్రంథమొనర్పం బురికొలిపినట్లు గూడఁ జెప్పుకొనలేదు. కారణమేమో. ఆశ్వాసాంత్యగద్యమునందు

" నిస్సహాయకవితానిర్మాణచాతుర్య నిస్తంద్ర,
శ్రీరామనామపారాయణ నారాయణామాత్య ప్రణీతము.

అని చెప్పుకొనుటంబట్టి పరికింపఁగా గ్రంథమును జెప్పి యితరులకుంజూపి వారిసంస్కరణముల నంగీకరించుకవి కాఁడనియుఁ బండితకవియనియు, శ్రీరామ భక్తుఁడనియు స్పష్టము గాక మానదు. మఱియు భగవద్భక్తాగ్రగణ్యులనం బ్రఖ్యాతివహించిన ప్రహ్లాదాదిపరమభాగవతుల నిష్టదేవతాస్తుతిలోఁ జేర్చుటంజూడ నీమహాకవి భక్తుఁడను మాట దృఢపడకపోదు. ఈమహాకవి యీగ్రంథమున నింతకుముందు దానుఁ గ్రంథముల నొనరించినట్లు చెప్పుకొన కుండుటం జూడ నిదియే ప్రథమగ్రంథమని తేటపడుచున్నది.

ఆంజనేయశతకము తొలుత రచించి తరువాత హంసవింశతి నొనరించి యాపిదప దశావతారకథాసంగ్రహమును రచించినట్లు కొందఱు వ్రాసియున్నారు. కాని ఆంజనేయ శతకవిషయమింతు వ్రాసియుండక పోవుటచే నిర్ధారణముచేయ వీలులేదు. ఒకప్పు డది శతకమైనందున నీస్వల్పవిషయము నేల చెప్పుకొనవలయు నని యూరక విడిచియున్న నుండవచ్చును. దశావతారకథాసంగ్రహము నాచేతఁ బడలేదు కాన నావిషయమును నేను జర్చింపఁజాలకున్నాఁడను.

ఇఁక నీతఁ డేగ్రామమునఁ గాపురముండెనో యనువిషయము చర్చింపఁదగినదైయున్నది. అయ్యలరాజు రామభద్ర మహాకవి ఒంటిమెట్ట యనంబడు నేకశిలానగరవాసియనుట సర్వజనాంగీకృత మగువిషయము. రామాభ్యుదయము రామభద్రవిరచితముగదా. అయ్యలరాజు, భాస్కరకవి యీయిరువురును రెట్టమతమును రచించినమహాకవులు. వీరు కర్నూలు మండలములోని యెఱ్ఱపాలెమునకు బాలకుఁడయి, యహోబలక్షేత్రమునకు ధర్మకర్త యయిన వేంకటరాజునకు రెట్టమతగ్రంథము నంకితముచేసియున్నారు. కనుక వీరిరువురును గర్నూలుమండలములో నివసించువారే యనుట స్పష్టము. రాజాశ్రయమునకై యితరమండలములలోనున్నవారు రాఁగూడదా యన్నఁబైవేంకటరాజు పాళెగాఁడే కాని గొప్పరాజ్యము కలవాఁడు కాఁడు. అట్టివానినాశ్రయించుట కెంతయో దూరమునుండి కవులు చనుదెంచి రన్నమాట విశ్వాసపాత్రము గాదు. ఆప్రాంతముల నివసించువారికి వారియందు విశ్వాసము గల్గియుండును గాన వారాశ్రయించియుండుట స్వభావము. కాఁబట్టి పైయిద్దరును గర్నూలుమండలవాసులో లేక యాచెంతనున్న కడపమండలవాసులో యై యుందురు. కడపమండలమున కహోబిలము మిగుల సమీపము.

ఈనారాయణకవి హంసవింశతిలోఁ బూర్వకవిస్తుతిం జేయుచు

"ఉ. అయ్యలరాజు తిప్పసచివాగ్రణిఁ బర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ బ్రధానవరుం డగుకొండధీరునిం

జయ్యనఁ దిమ్మయప్రభుని సత్కవితారచనాఢ్యులైనమా
యయ్యలరాజువంశజుల నాదికవీంద్రుల సన్నుతించెదన్.

అని చెప్పుకొన్నాఁడు. దీనిం బరికించి చూడఁగాఁ దమపూర్వులు మహాకవులైనట్లును దానావంశసంభూతుఁడననియు, నయ్యలరాజు వారికుటుంబము విద్వత్కవికుటుంబమనియుఁ జెప్పుకొన్నట్లు స్పష్టము. ఇందతిశయోక్తి యెంతమాత్రము లేదు. పయిపద్యమునఁ జేర్కొనఁబడినరామభద్రాదికవులు కడప కర్నూలు మండలములలోని వారయినట్లు స్పష్టమైనందున నీతఁడుగూడ నీప్రాంతముల నివసించినవాఁడే యని తోఁపక మానదు. ఇతని దీగ్రామ మని నిశ్చయింపఁ దగినయాధారము లీగ్రంథమున లేవు. ఊహ లెవరి కెట్లు తోఁచునో యట్లు నిర్ధారణము చేయునవకాశ మిందువలనఁ గలుగుచున్నది. ఇటీవల నాకుఁ దెలియవచ్చిన విషయ మేమనఁగా ఈనారాయణకవి కడప మండలములోని పుల్లంపేట తాలూకాలోనున్న పొత్తపియనుగ్రామములోనివాఁ డని, దానికిం దగినన్ని సాధనములు దొరకినంగాని 'ఇదమిత్థ' మ్మని సిద్ధాంతము సేయఁ జాలకున్నాను.

కొందఱు నారాయణకవి నెల్లూరుమండలములోని గోరుగుంతలపా డనుగ్రామమున నుండినవాఁడనియుఁ గావున తనయొక్కయు తన మేనమామయొక్కయు గ్రామములకుఁ జెంతనున్న కంభము, మార్కాపురము మొదలగు గ్రామములపేరులు చెప్పెననియు వ్రాసిరి. ఆమాట విశ్వాసపాత్రముమాత్రము గాదు.

హంసవింశతి పంచమాశ్వాసములో గ్రామములపట్టికలో "రాయదుర్గము, గుత్తి, రాయవేలూ, రానుగోంది, మాహురి, కాశి, గోలకొండ,..." అని ప్రారంభించి కలగూరగంపగా నామములు చెప్పఁబడియున్నందున దత్తమండలవాసియే యని స్పష్టమగునే కాని యితరవిధము గాదు. మఱియుఁ దక్కిన కొన్ని మండలములోని పెద్దపెద్ద గ్రామములపేరులు చెప్పి దత్తమండలములోనున్న చిన్నపల్లెలపేరులు కూడఁ జెప్పియున్నందునఁ బైయూహకుఁ బ్రబలమగు నాధారము కనఁబడకపోదు. అందును గడపమండలములోనున్న పోరుమామిళ్ల, సిద్ధవటము, కసూరు, (కసునూరు) గండికోట, సింహాద్రిపల్లి, పుట్లూరు, చింతగుంట మొదలగు గ్రామముల పేరులు చెప్పబడియుండుటంబట్టి పరికించినను దత్తమండలములలోఁ గడపమండలవాసియే యని నిర్ధారణము చెయ నవకాశముగల్గునే కాని వేఱొకయూహ కవకాశము కల్గదు. ఇంతమాత్రముచేతనే యీనాయూహయు నిశ్చయముకానేరదు. దత్తమండలకవిచరిత్రము మును వ్రాయుచున్నాఁడను గాన నప్పుడు చర్చించి వ్రాసెద. పుష్పగిరితిరు

ణాళ్ళనుగూడఁ బేర్కొనుటయుఁ గూడ నాపైయుద్దేశ్యమును బలపఱచుచు నన్నా చరిత్రమునమిగుల శ్రమించి చర్చింపఁ బురికొలుపుచున్నది.

పంచమాశ్వాసములో "ముంగిస, పిడఁగి, జోణంగి, యింగిలీషు, కుక్కగుంపు లంగోతులఁ గొన్ని గొనిరియె" అని చెప్పియుండుటంబట్టి చూడ నూఱు నూటయేఁబది సంవత్సరముల క్రిందట నున్నవాఁడని చెప్పనచ్చునేమో. ఇఁక నీవిషయమును వదలి ప్రకృతవిషయమునకుం గడంగెదను.

ఇక్కవికవితాశక్తి యెట్టిదనియే యిపుడు విచారింపవలయు. దేశకాలాదుల నిర్ణయించు గ్రంథములు వేఱుగా నున్నవి. ఆవిషయ మిట నంతగాఁ జర్చింపఁ దగినది కాకపోయినను సందర్భమును బట్టి మూఁడుమాటలు వ్రాయవలసివచ్చినది. ఈహంస వింశతి యైదాశ్వాసముల గ్రంథము. హంస హేమావతికి నిరువదిదినములు కథలు చెప్పి యామె పరునింటికిఁ బోకుండఁజేసినది. కావున హంసవింశతి యని గ్రంథమునకు నామముగల్గినది. గ్రంథ మంతిపెద్దదిగాకపోయినను నవరత్నములను దిరస్కరించు పద్యము లిందుఁగూర్పఁబడియుండుటచే నిది వరమణిహారమని చెప్పకతప్పదు. ఒక్క దానినిమించి వేఱొక్కపద్యము లలరారుచుండును. శైలియో రసికజనహృదయానంద జనకము. కథలో నొకదానిని మించి వేఱొకటి బుద్ధిచమత్కారమును జూపుచున్నవి. ఇట్టి యుత్కృష్టగ్రంథరాజమును వ్రాసి యిమ్మహాకవి సమానులలో నుత్తమ శ్లోకుఁ డయ్యెను. వేయుమాటలేలగాని యిక్కవిమహేంద్రునివలెఁ గవిత్వము చెప్పుట కడుదుర్లభము. కందమునకుఁ గవిబ్రహ్మ యగుతిక్కయజ్వ యని విని యుంటిమి. తరువాత నే నని యాధునికులలోని కవిచౌడప్ప చెప్పుకొనియెను. ఇమ్మహాకవి కందపద్యముల నల్లుటలోఁ దిక్కయజ్వను మించె నని చెప్పి మహాపాతకము నార్జించుకొన నభిలషింపనుగాని యంతవాఁ డని చెప్ప జంకుపడి వెనుకంజవేయను. ఒక్క కందములేగా దేపద్యము చదివినను సెబాసని శిరఃకంపము చేయవలసియే వచ్చును. నారాయణకవిని నోటికసి దీరఁ దిట్టవలయు నని పూనుకొన్న కఠినాత్ముఁడుగూడ సాంతముగాఁ జదివినచో నమస్కరించి శతధాసహస్రధా పొగడునే గాని వేఱొక మాట నోటఁజెప్పఁజాలఁడని నానిశ్చయ మని త్రికరణశుద్ధిగాఁ జెప్ప సాహసించుచున్నాను.

ఈగ్రంథము నీతిబోధకము గాదనియుఁ జెడుతలంపులను వృద్ధిచేయు ననియుఁ గాన నసద్గ్రంథమనియు నిట్టి గ్రంథమునఁ దనశక్తిని వినియోగించి కవి తనజీవితమును వ్యర్థముచేసికొనియె ననియును గొందఱతాత్పర్యము. నే నట్లనఁ జాలకున్నాను. అల్ప

మతినగుటచేనే నొక్కఁడనైకాను నిష్పక్షపాతముతో లఘువెన్నుచుంది యట్లనక తప్పదనియు నా భావము.

ఇందు హేమావతి యిరువదిదినములు భర్త దేశాంతరము పోయిన కారణముచేతను, హేలయను నొకమాలిక ప్రోత్సాహముచేయుట చేతను, జిత్రభోగుఁడను నాపురపాలకుఁడైనరాజు నొద్దకుఁ బోవఁ బ్రయత్నింపఁగా నామె యింట నున్న హంస యాహేమావతి కేమోకథలు చెప్పి యాబుద్ధిమాన్పె నని చెప్పఁబడి యున్నది.

పరసంగమమునకై యువ్విళ్లూరుచు నింటదండించుపెద్దలు లేక తానే యధికారముగలదిగా నున్న నవయువతికి నాబుద్ధిమాన్పుటకు వేదాంతవాక్యములుపనికివచ్చునో, ఆమెకు విన రుచించునట్లు ఆలాటి కథలనే చెప్పి, యట్టికృత్యములలో రాఁగల కష్టములం దెల్పి, చిక్కులు సంభవించినపుడు తప్పించుకొనునంత శక్తి నీకుఁ గలదా యని ప్రశ్నించి, యామె చెప్పఁజాలక యూరకుండఁగాఁ దా నాయుక్తిని దెల్పి, నీకట్టిశక్తికూడ లేదే యిట్లెప్పనికిఁ బూనెద వని చీవాట్లుపెట్టి, యామె బుద్ధిని మరలించి సద్బుద్ధిని నెలకొల్పిన నామాటలుపనికివచ్చునో, బుద్ధిమంతులే నిశ్చయింతురుగాక.

దుర్జనుని సజ్జనునిగాఁ జేయుటకు దండనముపనికిరాదు. సామోపాయ మావశ్యకము. శ్రోతకు హితముగా ముందు మాటలాడి, సమయోచితముగా నీతులు నేర్పి, యతనిమార్గము తప్పుగా నున్నదని యతనికే తోఁచునట్లు చేసి క్రమముగా సజ్జనుల మార్గమునకు నతని దేవచ్చునే గాని గుబాలున నొక్కపెట్టున నీతివాక్యములు తాను జిన్నతనమున వ్రాసినవి చదివి వెంటనే వానిని సజ్జనశిఖామణి జనపునిజనకునిగాఁ జేయ శక్యముగా దని నానమ్మకము.

మొత్తముమీఁద నట్టివిషయములు గలగ్రంథము తొలుచూత్తు నీతిబాహ్యమనియే తోఁపకపోదు. అంతమాత్రముననే దానిని దూషింపఁగూడదు. అట్టి గ్రంథమునఁ జివఱకుఁ దేలునీతి యేమని విచారింపవలయు.

ఆనీతి చెడుతోవలఁ బోవఁ జూచునొక యన్నులమిన్నను సన్మార్గమునఁ బోవునట్లు చేయుట యని తేలినపుడు దానిని మెచ్చవలయునేకాని యందున్న కథాంతర్భాగముతగు పద్యముల నాల్గింటిని వ్రాసిచూపి యిట్టియవినీతి బోధకపద్యములున్నవి గాన నీగ్రంథము దుర్నయమును బోధించునసరాదు. ఈవిషయమై యీగ్రంథమున నైదవ యాశ్వాసమునందు

క. పరపురుషసంగమంబిహ, పరసుఖదూరంబుగానఁ బాతివ్రత్య
స్ఫురణగలసతులు మదిఁగోరరటంచునునిశ్చయించి ప్రవాదంబెసఁగన్.
అనియు,

ఉ. మున్నలరావణాదులుసముద్ధతి సాధ్వులఁ గోరి యేమిసౌ
ఖ్యోన్నతిఁ జెందిరిట్లగుట నుర్విజ నావళులన్య కాంతలం
బన్నగఁగోరరాదు కడుఁ బాతకమంచుఁ దలంచి యింతిపై
నున్నమనంబు ద్రిక్కనియథోచితపద్ధతినుండె భూవరా.

అనియుఁ జెప్పఁబడియున్నయది. ఈనీతులను మనంబునం దుంచుకొనియే యీమహాకవి యింతగ్రంథము బెంచి వ్రాసియున్నాఁడు.

---

## కథాచమత్కారములు.

ఇంక నిందలి కథాచమత్కారములం గూర్చి యించుక తెలుపవలసియున్నది. తొలిరేయి హేమావతి హేలయను దూతిక పురికొల్ప శృంగారించుకొని చిత్రభోగు నింటికిఁ బయనమై ప్రాణపద మనఁదగియున్న హంసయొద్దకు వచ్చి తన యుద్యమమును దెల్పఁగా హంస యామెకు భర్తలేనితఱి నిల్లువెడలి పోఁగూడదనియు బరపురుష సాంగత్యము మహాపాపహేతు వనియుఁ జెప్పెను. అప్పట్టునందు

ఉ. అక్కట! భర్తఁ గాపురము నారడిపుచ్చి నృపాలమౌళితోఁ
జొక్కి రమించు నందులకుఁ జొచ్చినఁ దావకబంధువర్గముల్
దక్కనిసేతు రమ్మ చరితవ్రతముల్ చెఱునమ్మ జాతికిం
బక్కన నిందఁజెంది తలవంపులు దెత్తు రఁటమ్మ మానినీ. 124

సీ. అత్తమామలు గన్న నారడిపుత్తురు బావ పరీక్షింప నేవగించు
మఱఁదులు గాంచిన గఱకఱి నెంతురు వదినె లెఱింగిన వానిచెడుదు
బంధువుల్ గనినచోఁ బరఁగనిందింతురు తోడికోడలు చూడ నాడికొనును
బతి గనుఁగొన్నచోఁ బ్రాణహాని యొనర్చు నాడవా రెఱిఁగిన పన్నెదఱుగు
నరయ నిది గాక యన్నిట నాఁడుపుట్టు
పుట్టఁ బాపంబు పుట్టినఁ బుట్టినింటి
కేని మఱి చొచ్చినింటికిఁ గీర్తి ఘనత
దేక యపకీర్తి దెత్తురే తెలియ లెచట. 125

సీ. పంక్తికంఠుని మోహపరితాప మెంచెనే భువనమాత జగత్పవిత్ర సీత
యలపులిందుని బొంద నాసక్తిఁ జెందెనే ప్రియహితామితనయభీమతనయ
నహుషుని విరహంపుఁ దహతహ ల్బాచెనే సాంద్రసద్గుణచర్య యింద్రుభార్య
మఱి సింహబలునిపై న్నాయలఁ జిక్కెనే యారడి పనిఁబూని యాజ్ఞసేని
తే. మునుపటిపతివ్రతలు మహామూర్ఖచిత్తు
లైనదుర్జను లతిఘోరసూనసాయ
కాస్త్రజర్ఝరితాత్ములై యాసపడిన
మాన ముడిపుచ్చుకొని రఠే మచ్చకంటి. 127

చ. పతిహితభక్తిచే వెలయు పద్మదళప్రతిమాననేత్రనుఁ
వ్రతములసోద లేటికి ధ్రువంబుగఁ బుణ్యము లబ్బునెప్పుడుం
బతిని దిరస్కరించి పరభర్తలఁ జెందినభామపుణ్యముల్
గతజలసేతుబంధములు గావె వచింపఁగ నెంతనోచినన్. 128

అను నీమొదలగుపద్యరత్నములను గ్రంథకర్త కూర్చి యీగ్రంథము నలరారఁజేసి యున్నాఁడు. ఆమెచిత్తస్థితి నెఱింగి తగినయుపాయము నాలోచించి యెట్టులేని కాలము పుచ్చవలెనని యూహించియే

మ. అధిపుల్ కూరఫణిస్వరూపుల... ........లీడేర్చుకో. 135

అను మొదలగు మాటలు చెప్పి నాఁటిరేయి పుచ్చెను. మఱుదినము రాత్రి ఆమె యథాపూర్వముగ సింగారించుకొని రాఁగా నిఁక నీతులవలన లాభములేదని యుపాయము తెలిసినఁగాని యిప్పనిలో మెలఁగరాదని చెప్పి యదెట్లని యామె ప్రశ్నించునట్లు చేసి యొకకథ చెప్పి కథాంతమున నిట్టి యిక్కట్టున నెట్లు బొంకవలెనో తెల్పుమని యడిగి యామె చెప్పలేకపోఁగా తానే యాపద్ధతిని జెప్పుచు నాఁటిరేయిని బుచ్చెను. అట్లే యిరువది దినములు గడిపెను. ఇందలి కథలన్నియు నొకదానికన్న నింకొకటి యుక్తిలో మించునట్లుండును. ఒకకథకన్న నింకొకకథలో నడిగిన ప్రశ్నమునకు సమాధానము చెప్పుటకు బుద్ధిచమత్కార మెక్కువ కావలసియుండును. పోనుపోను కథలు మిగులఁ జమత్కృతి గలిగి చెన్నారుచుండును. ఇట్టు లిరువదిదినములు గడిపి హంస హేమావతిని దుర్వృత్తికి లోనుగాకుండఁజేసెనని కవి గ్రంథరూపమునఁ దెలియఁజేసెను.

ఒక్కొక్కకథయు వ్యభిచారమునే బోధించుచున్నదే యెట్లిది నీతిబోధకమగు ననరాదు. హేమావతిదుర్వృత్తిని రూపుమాపుటకు నితరోపాయము సాధ్యముకాదు

గాన నీయుపాయమే తగినదని భావించి యామార్గముననే తుట్టతుద కామెను సచ్ఛీలాలంకారభూషితనుగా నొనరించెను. కావున నీ మొత్తముమీఁద గ్రంథము దుర్నీతిబోధక మనరాదు. గ్రంథకర్తయాశయముగూడ నట్టిది కాదు.

వేడినీరు పోసిన నిల్లు మండిపోవునేమో యని శంకనొందినట్లు ఒక్కొక్క కథను బఠించి కొంప మునిఁగిపోవునే యని విభ్రాంతినొందుధీరస్వాంతుల కొక్కనమస్కార మనుటకన్న నెక్కువవ్రాయ నా కవసర మిటఁ గనఁబడలేదు.

ఇంతట నీవిషయ ముజ్జగించి యిప్పుడీ గ్రంథమునం గల పద్యములయందలి చమత్కృతింగూర్చి యించుక తెలిపెదను.

ఇమ్మహానుభావునకుం గలలోకజ్ఞాన మసమానమనుట యతిశయోక్తియని యెవ్వరన రని నానమ్మకము. ఒక్కొక్కకథలోఁ బ్రస్తావమునకుం దగిలినకులముల వారివిషయములు చర్చించునపు డీయనకుంగలలోకజ్ఞానము తేటపడఁగలదు. ఒక్కొక్కతెగవారికిం గావలసిన వస్తువులపేరులు, వారియాఁడువారికింగల యాభరణముల నామములెట్లు తెలిసికొని కూర్చెనో యని యోజించునపుడు మనస్సు ఆశ్చర్యమును బొందకపోదు. పెక్కుప్రదేశములుతిరిగి యందున్నవారియాచారములు పరిశీలించుటలో నీతనిశక్తి యనుపమానము. ఇంతమాత్రమే కాదు. ఒక్కయర్థముగలపదము లెన్నిగలవో యన్నియు నీతఁడు కూర్చి కవులకు మహోపకార మొనర్చెను. ఈక్రిందిపద్యములం బఠింపుఁడు.

సీ. వెలయు హరిశ్చంద్రువిధమున నలుని వీఁకను బురుకుత్సుచాడ్పునఁ బురూర
వునిలీల, సగరు లాగునఁ, గార్తవీర్యుమర్యాదను గయుక్రియ నంబరీషు
మతమున శశిబిందుమహిమ నంగుని తేఁ బృథునిమాడ్కి మరుత్తువృత్తిభరతు
నీతి సుహోత్రునిభాతి భార్గవుబలె రాముపోలిక భగీరథునిపోలుపు
న, శిబిసంగతి, మాంధాత నయమునను, య యాతికరణి దిలీపునియట్ల రంతి
రీతి నాచక్రవాళపరీతభూతధాత్రి పాలించునపిభుండుద్విభుండు. ౧ ఆ. ౪౨ ప.

ఇట్టిపద్యము లింకనుం గలవు. ౨ ఆ. ౧౪ ప. ౫ ఆ. ౧౬ పద్యములను జూచునది.

ఇంతియకాక శ్రుతిస్మృతి శాస్త్రపురాణేతిహాసాదుల నామములను, ధాన్యవిశేషముల పేర్లను, గూర్చినపద్యముల నొక్కసారి చదివినయెడలఁ బరమానందమును బాఠకు లనుభవింపకపోరు. సంస్కృతసమాసములు గలపద్యములను, దేశ్యపదములు గలపద్యములను జూచితిమా శిరఃకంప మొనర్చి బళీ యనకుండ వీలుఁ బడదు.

ఈయుదాహరణములు పైవిషయమును సిద్ధాంతీకరింపఁగలవు.

సీ. శ్రీడావహిష్ఠప్రవేగోన్మదోగ్రరోషప్రదోష వితర్కచపలధైర్య
................ ......... ............. జడిసి తెలిసి. ౪ ఆ. ౧౭౩ ప.

ఉ. అంత వసంతవేళఁ జెలువంతటు నెంతయు సంతసిల్లి న
త్యంతలతాంతమంతదళపత్ర నిశాంతదురంతతాంతతా
శాంతికరంబు.......... ............... ౫ ఆ. ౨౨౨ ప.

దేశ్యపదములకూర్పు

చం. సకినెలకీలుకంఠమునఁ జాయమెఱుంగులసొంపుకెంపు ము
క్కుకొనల పచ్చరాచిలుక కోళ్ళఁ దనర్చినపట్టు పట్టెయ
ల్లికపయి జాఫరాజినుఁ గులేపునఁ జెందుపలంగుపోషుత
క్కికగలజాళువాగొలుసు గీల్కొను మంచముపైమహోన్నతిన్. ౧ ఆ. ౨౩౯ ప.

ఇట్టిపద్యముల నింకనుం జూపుటకంటె బుస్తకమునే పఠించి చూడుఁ డని చెప్పుట మేలని తోఁచుచున్నది.

అర్థచమత్కృతి యీతనికి నుగ్గుతోఁబెట్టినట్లున్నదని యీక్రిందిపద్యము తేటపఱుపకపోదు.

సీ. కువలయానందంబుఁ గూర్చి యేలు ఘనుండు విబుధులఁబోషించుసద్విభూతరణుండు
సర్వజ్ఞమౌళిభూషణ మైనధన్యుఁడు లలితవిభ్రమరూపలక్షణుండు
సరవిగళల్మించు శ్యామాభిరాముండు వఱలెడుసన్మార్గవర్తనుండు
విష్ణుపదార్చితవిహితశుభ్రకరుండు శమితతమోహారి యమితశీలుఁ
డమ్మహారాజచంద్రుఁ డాయననిజాంకే, రంగమంతయు నినుఁజేర్చి రమణతోడ
నేలఁగలఁడమ్మ నీపుణ్య మెసఁగెనమ్మ, తమిని నీడేర్చునమ్మ కుందనపుబొమ్మ.
౧ ఆ. ౯౩ ప.

ముక్తపదగ్రస్తము.

సీ. శ్రీపార్వతీకుచశిఖరస్థలవిహార హారాయమాణమహాభుజంగ
జంగమస్థావరసంచారసమభావ, భావజరూపప్రభావహరణ
రణరంగనిర్జితరౌద్రమహాసుర, సురయక్షసేవితచరణయుగళ
గళదరస్థాపితకాలకూటక్షీర, క్షీరాబ్ధిపుత్రీశఘోరబాణ
బాణనామకరాక్షసత్రాణదక్ష, దక్షకల్పితయాగవిదారణోగ్ర
యుగ్రభీమాదినామధేయప్రసిద్ధ, సిద్ధభయభంగ కాశివిశ్వేశలింగ.
౧ ఆ. ౧[illegible] ప.

శృంగారము.

సీ. జక్కిమాటలుగాక. సరిచేయవచ్చునే సవరంబు లీశిరోజాతములకుఁ
బూఁతసుద్దులుగాక పోల్పంగవచ్చునే చందనం బీమేనిగందమునకు
....................... నొక్కొకవేళనదియు. ౧ ఆ. ౨౧౦ ప.

కందము.

గమ్మత్తు చిమ్మ నొకకథఁ గ్రమ్మఱఁ దెల్పెదను వేణిఁ గ్రమ్మవిరులపైఁ
దుమ్మెదలు జుమ్ముజుమ్మనఁ గొమ్మా తలయూఁచి మెచ్చు కొమ్మా నన్నున్.
౨ ఆ ౬ప.

స్వభావోక్తి.

ఉ. మోమునహించెఁ దెల్వి జిగిమోవి రుచుల్దగ సందడించె మృ
త్స్నమలఁ మించెఁ జన్మొనలు శ్యామలకాంతి వహించె యానముల్
వేమఱు మందగించెఁ గడుపృద్ధి భజించెను గౌను చిట్టుముల్
రామకు సంభవించె నళిరామతరంబుగఁ జీరచిక్కెనన్. ౨ ఆ. ౯౩ ప.

కల్పనలు.

తే. కొమరె పొక్కిలి బంగారుకుంజెయందు రతియు శృంగార మనుధాన్యరాశి నించి
దంచ నిడినట్టిరోకలిసంచుమీఱి, రోమ రాజిదనర్చు నారూఢిగాఁగ.
౨ ఆ ౧౦౦ ప.

తే. వక్రయానంబుతో నాగచక్రకుచలు, నిలువుఁ గన్నులతో దేవనిలకచలు
నాతిమృదుగతిచపలేక్షణములకలికి, క్రిందుమీదయ్యెఁ గాదె పూర్ణేందువదన.
౨ ఆ. ౧౮౧ ప.

ఇట్లెన్నెన్నివిషయముల నెత్తిచూపినను తృప్తికొఁజాలదు. ఇంకను పెంచి వ్రాయుట గ్రంథమంతయు నిందు వ్రాసినట్టులగును. కాన వదలితిని.

ఎట్టి మహాత్ములకైనను ప్రమాదము లుండకపోవు. "ప్రమాదోధీమతామపి" అనుట స్పష్టమేకదా. ఇమ్మహాకవి యన్నివిషయములలోఁ బండితుఁడై, లోకానుభవము గలిగి సొంపుగఁ గవిత్వముఁ జెప్పనేర్చియు వ్యాకరణమును పెక్కుతావుల మఱచి పోయి స్వేచ్ఛగాఁ బ్రవర్తించి "నిరంకుశాఃకవయః" అనుమాటను సార్థకము చేయఁ జూచెనని చెప్పవలసి వచ్చెఁగదాయని చింతించెదను. కొన్నికొన్ని తావులఁ బద్యములలోఁ గూర్చినపదములు శుద్ధియులైవి కనఁబడుచున్నవి. అందుఁ గొన్నింటినిం దుదాహరించెదను.

## తత్సమసంధులు.

| అసాధువు. | సాధువు. |
|---|---|
| నెలంతదిగాక ౨ ఆ ౧౨౭ ప. | నెలంతయదిగాక |
| కుటిలకుంతలయ్యోడఁ ౫ ఆ ౬౬ ప | కుటిలకుంతలయయ్యోడఁ |
| ఆరతిసేనపుడు ౫ ఆ. ౧౩౬ ప. | ఆరతిసేనయపుడు |

## ద్రుతముపైనున్నయచ్చునకు సంశ్లేషము.

జలాభిపూర్ణమగుచున్నా బావి ౧ ఆ. ౧౭౫ ప.

అటుకన్నెలమిఁ ౩ ఆ. ౯౧ ప.

## ఈక్రిందిసంధికి దేవుఁడే శరణము.

కురకరుఁడ స్తమించుదనుకా నొకరీతి. ౫ ఆ. ౭౩ ప.

## విభక్తి ప్రత్యయపుఁ జమత్కారము.

ఉపనాయకులతో రతి ౫ ఆ. ౩౧౨ ప.

## క్త్వార్థకసంధులు.

| ఆసాధువు. | సాధువు. |
|---|---|
| అనిదీవించక్షత ౧ ఆ. ౪౭ ప. | అనిదీవించియక్షత |
| చూచిదితెలియదు ౩ ఆ. ౪౩ ప. | చూచియిదితెలియదు |
| చూచిటురమ్ము ౩ ఆ. ౧౫౬ ప. | చూచియిటురమ్ము |
| చూచదయత ౪ ఆ. ౩౦ ప. | చూచియదయత |
| తాల్చొగిఁ ౫ ఆ. ౭౪ ప. | తాల్చియొగిఁ |
| తలఁచటు ౫ ఆ. ౧౯౫ ప. | తలఁచియటు |
| వచ్చిట ౫ ఆ. ౧౬౧ ప. | వచ్చియిట |

వచ్చిట యనునది యడిదము సూరకవిమతమునుబట్టి సాధువే. "ఇడఁగవచ్చు నుల్యప్పపై నిత్యసంధి" అని. అయినను శ్రుతి కటువుగా నున్నది.

## కువర్ణమునకు ముందునగాగములేమి.

బరుదైనపిఱుఁదుకు ౧ ఆ. ౬౨ ప

వాడుకెదిరి ౧ ఆ. ౨౩౩ ప.

## ద్రుతసంధులు.

| | | | |
|---|---|---|---|
| ఏఁటిమీఁదాఁటునెలలు | ౩ ఆ. ౧౫౧ ప. | ఏఁటిమీఁదనాఁటునెలలు | అనవలయు. |
| తోడితెచ్చితింటికి | ౫ ఆ. ౧౯౧ ప. | తోడితెచ్చితినింటికి. | |

### నుగాగమము రాకుండుటకు.

నోరవెడలగ్ని దీప్తలు. ౫ఆ ౫౭ప వెడలునగ్ని దీప్తు లనియుండవలయు

### ఈక్రిందివి వింతరూపములు.

| తప్పులు | | ఒప్పులు |
|---|---|---|
| పొందుపఱచుక | ౧ఆ. ౧౭౨ప | పొందుపఱచుకొని |
| హత్తుక | ౧ఆ ౧౯౯ప | హత్తుకొని |
| తెలుసుక | ౧ఆ. ౨౩౧ప | తెలిసికొని |
| కట్టుక | ౧ఆ. ౨౫౯ప | కట్టుకొని |
| అలవఱచుక | ౨ఆ. ౧౧౧ప | అలవఱచుకొని |
| అక్కునఁజేర్చుక | ౨ఆ. ౧౬౪ప | అక్కునఁజేర్చుకొని |
| అలవరించుక | ౨ఆ. ౨౦౮ | అలవరించుకొని |
| త్రొక్కుక | ౨ఆ. ౨౩౬ప | త్రొక్కుకొని |
| పెట్టుక | ౪ఆ. ౧౧౩ప | పెట్టుకొని |
| తెఱచుక | ౪ఆ. ౧౬౭ప | తెఱచుకొని |

ఇట్టి వింక నెన్నియో కలవు. గ్రంథవిస్తృతి భీతి మానితి.

### ధాతువులు.

చేతురమ్మ ౧ ఆ. ౧౨౪ ప. ఈరూపము పెక్కుతావుల నీగ్రంథమునఁ గానఁబడుచున్నది. "చువర్ణకంబుతోడ దుగ్దకారంబు తకారంబగు" బాలవ్యాకరణము క్రియాపరిచ్ఛేదము ౧౧౭ సూ. "చేతురు కోతురిత్యాదు లసాధువులని యెఱుంగునది. కొందఱివి సాధువే యని యుపయోగించుచున్నారు. ప్రయోగములు గలవనుచున్నారు.

### తప్పుసమాసములు.

అష్టోత్తరశతతిరుపతులు ౪ ఆ. ౨౧౫ వచనము.

### అఖండయతి.

గ్రక్కిఱులు మ్రింగుకొనుచు నొక్కొక్కరొకరె. ౪ ఆ. ౩౮ పద్యము ఈ యఖండయతిని సాధింపఁబూని కొందఱు భారత ద్రోణపర్వమున నాల్గవయాశ్వాసమున సాత్యకితో భూరిశ్రవుఁడు చెప్పుమాటలలో నున్న "తేఁకువలేక పుత్తెంచిన యప్పాండవజ్యేష్ఠునకుఁ దలవంపుగాఁగ" అనుపద్యమును తేఁకువలేక పుత్తెంచిన యప్పాండవాగ్రజునకుఁ దలవంపుగాఁగ" అను తప్పుపాఠముగా గ్రహించి సాధువే యనుచున్నారు.

## మఱికొన్నితప్పురూపములు.

కంద్ము ౫ ఆ. ౧౫౩ ప. ఎలవిక్, శాయి, ప్రౌఢతనము ఇత్యాదికములు పెక్కులు గానంబడుచున్నవి. వీనిని ప్రమాణములుగాఁ గైకొనినచో భాషాలలనామణి శృంగారము చెడుననుటకు సందియముండదు.

ఇట్టి వెన్నియో యున్నవి. కొన్నియతులుకూడఁ జెడినవి. వానినెల్ల వ్రాయుట యనవసరమని మానితి. చూపినవానిలోఁ గొన్ని సాధువులని తమకుఁ దోఁచిన నన్ను మన్నింతురుగాక. నాకుఁ దోఁచినవానిని మీకుఁ దెలియఁజేసితిని.

ఇట్టి వెన్నితప్పు లుండినను ఈమహామహుని కవిత్వము నిరుపమానమై శృంగారసాగరమని చెప్పఁదగి సుజనసుతికిం దగియున్నదని మాటికిమాటికి నిరాఘాటముగాఁ జెప్పఁగలను. ఈగ్రంథమునఁ బ్రమాదపతితములగు తప్పులను ద్రోసివైచి సాధురూపములం గైకొని యీసుకవిశైలి నవలంబించి కవిత్వము చెప్పినఁ గర్ణరసాయనమై యుండుననుట కొంతయుసంశయములేదు. ఇంకను బెంచివ్రాసిన గ్రంథవిస్తర మగు నన్నభీతచే మానితిని.

కడప
10. 10. 1919.

ఇట్లు విన్నవించువిధేయుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.



శ్రీ ర స్తు

# హం స విం శ తి





షీ : కే

రామాంకజ యైనజానక యురస్సీమాంతరాత్యంతవి
స్తారప్రోజ్జ్వలహారనాయకమణి సందర్శితం బౌసిజా
కారం బారసి యన్యకాంత యను శంకం జెందు నం చెంచి త
న్నారీరత్నము నంకపంక్తి నిడు సీతాభర్త నన్ బ్రోవుతన్.

చ. తన కిది కేళిసద్మ మయి తద్ద్రయుఁ బద్మ వహించి తొల్లి లో
చనముఖహస్తపాదయుగ సామ్యముఁ జెంది సుగంధసంపద
దనరఁ దొడంగె నిప్పు డని తా దయ మీఱఁగఁ జేతఁ బట్టెనో
యన వనజాతపాణి యగునట్టిమహీసుత మమ్ముఁ బ్రోవుతన్. 2

క. యమునాగంగార్ఘ్యరసం, గమవిశ్రమ మాత్మసేవకప్రవితతికి
దమరుచు లిడ నెడయక లో, కము లేలు భవానిశివుఁడు గడు మముఁ బ్రోచున్.

ఉ. మేరునగప్రపాతమున మించి రహిం దమకన్మణిప్రభాం
కూరకదంబకం బనగ కుంకుమగంధరసంబు భారతీ
క్రూరకుచద్వయీనిహతి గొప్ప యురంబున డంబు జూపఁ బా
ల్పారు సరోజపీఠిఁ గొలు వయ్యెడు దేవుఁడు మమ్ముఁ బ్రోవుతన్. 4

తే. వాణి వజురాణి ఘననీలవేణి మధుర, వాణిఁ బల్లవసంకాశపాణిఁ బృథుల
సైకతశ్రోణి వాత్మలో సన్నుతింతు, సుమధుమధురసుధావచస్స్ఫూర్తిఁ గోరుతు. 5

శా. లీలాకేళికృతస్వకందుకము లై లెక్కింపఁ గారాని యు
ద్వేలాత్మశ్రవణద్వయప్రచలనావిర్భూతవాతోత్థగో
త్రాళు ల్భ్రామి నభోంతరాళమున నృత్యం బాడ నర్తించు గా
రీలీలావతిపట్టి మత్కృతికి నిర్విఘ్నత్వ మిచ్చుం గృపన్.

ఉ. తావక పాదపద్మముల తాడన మొక్కటి దక్క నేపనుల్
గావు మదీయపాణులకుఁ గావునఁ జూడుము వీని నంచు సీ
తావిభుమ్రోల నిల్చి ప్రమదంబునఁ జూపెడురీతి మోడ్పుకే
ల్పావనభక్తిఁ బూనెడుకృపావని పావని నెంతు నామదిన్. 7

చ. తనతనుకాంతి కాంచనకృతంబులరీతి రహించ మారుతా
శనవరభూషణౌఘములసారెఁ గనుంగొని చేయి సాఁచి కై
కొనఁ బటుఘూత్కృతుల్ నిగడ ఘోరఫణావళు లెత్త భీతిచా
లనము వహించు నైజసతులం గని నవ్వు సుపర్ణు వేఁడెదన్. 8

తే. ఆత్మఁ బ్రహ్లాదరుక్మాంగదాంబరీష, శౌనకవ్యాసశుకపరాశరవిభీష
ణార్జునవసిష్ఠపుండరీకాఖ్యభీష్మ, దాల్భ్యనారదముఖ్యులఁ దలఁతు భక్తి. 9

సీ. వాక్యనిర్జితశేషు వాల్మీకి వాల్మీకి, హరిభక్తియుక్తిధీవ్యాసు వ్యాసు
ఘనభావకాళిదాసును గాళిదాసును, జారుమాధుర్యవాచోరుఁ జోరు
దివిజేంద్రధనదవైభవభూతి భవభూతి, ధర్మబుద్ధి నవీనదండి దండిఁ
గవితాభ్రహృష్టమాధవమయూరు మయూరు, భాసురాకృతిఁ బుష్పబాణు బాణు
తే. మానితాచారమథితాసమాఘు మాఘు, ధ్యానబద్ధమురారి మురారి గాత్ర
పటువిభారవి భారవిఁ బ్రస్తుతింతు, సర్వశబ్దార్థవిజ్ఞానసరణికొఱకు. 10

ఉ. నన్నయభట్టు భీమకవినాథుని దిక్కనసోమయాజిఁ బె
ద్దన్నను ముక్కుతిమ్మసచివాగ్రణి బమ్మెరపోతరాజు గా
రన్నను రంగనాథుని మహామహుఁ బిల్లలమఱ్ఱివీరభ
ద్రున్నుతియింతు నాంధ్రకవిరుద్రుల సత్కరుణాసముద్రులన్. 11

ఉ. అయ్యలరాజుఁ దిప్పసచివాగ్రణిఁ బర్వతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిఁ బ్రధానవరుం డగుకొండధీరునిం
జయ్యనఁ దిప్పయప్రభుని సత్కవితారచనాఢ్యులైన మా
యయ్యలరాజవంశజుల నాదికవీంద్రుల సన్నుతించెదన్. 12

చ. సరసులు గద్యపద్యములచాతురికిం దల లూఁచి మెచ్చఁగా
విరసు లసూయచేత మతివేడ్క వహింపరు తేఁటిమొత్తముల్
శరవరవిందబృందఘనసారమరందసుగంధసంగ్రహ
స్ఫురణ వహించుఁ గాని పురసూకరపంక్తులు చెంద నేర్చునే. 13

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవిస్మరణంబును గుకవితిరస్కారణంబునుం గావించి తదనంతరంబ.
14

సీ. ఎవని కీరితి సభృద్ధవసభృద్ధరబుధ, కరిసైంధవసమిద్ధహరిణరుచిర
మెవని మేధంబు రుష్భవక భుగ్ధవవిభూ, ద్భవమయద్ధవగురు ప్రతివిఘాతి
యెవనియీాపహిమ రుగ్భవసరిద్ధవలస, ద్భువనభృత్త్రిపురభిద్భూరిమహిమ
యెవనిరూపమ్మృతభుగ్ధవసుతోద్విపప్రతీ, డుద్విడ్భ్రదాప్తపుత్రోల్లసనము
తే. మంత్రిమాత్రుండె యతండు మంత్రిమాత్ర, తంత్రసంత్రాసకరణస్వతంత్రుఁడమల
రాజవంశసుధావార్ధి రాజసూర, యార్యనారాయణామాత్యవర్యుఁ డలరు. 15

వ. వెండియు నఖండతేజస్కాండమార్తాండమండల ప్రచండుండును నిజవితరణాకర్ణ నకృశీభూతపారావారపునరభ్యుదయకారణానూనదానధారాప్రవాహ సంజాత మహావాహినీవ్యూహుండును నిస్తులప్రశస్త సమస్తసద్గుణరత్నరత్నాకరుండును గౌండిన్యసగోత్రపవిత్రుండును గొండమాంబాగర్భవారాశిచంద్రుండును నగునయ్యలరాజు నారాయణామాత్యదేవేంద్రుండు గొండొకశుభవాసరంబున నత్యంత సంతోషితాంతఃకరణుండై. 16

## షష్ఠ్యంతంబులు

క. వారణభయ వారణజయు, కారణ చక్రాహతారికరవారునకున్
నీరాకర ధారాధర,భారాజీ భాసురప్రభాపూరునకున్. 17

క. భీషణ ఖరదూషణ పరి, శోషణ సురపోషణోగ్ర శోభనమతికిన్
శేషాహిప భాషాధిప, యోషాహిపరాన్యకీర్తి యోగోన్నతికిన్. 18

క. సింధుసుపుత్రీకుచధర, కంధరశుభవిగ్రహునకుఁ గమలజసురరా
ట్సింధురముఖ సింధురముఖ, బంధురజాతస్తవార్హ పదనివహునకున్. 19

క. తక్షక కులశిక్షక చల, పక్షకళాత్యయణహేమపటసంభృతికిన్
దక్షాధ్వర శిక్షాకర, రక్షాచరణప్రవీణరాజన్నతికిన్. 20

క. వక్త్రత్రయచక్రకుచా, వక్రతనూరూపవైభవదచారునకున్
జక్రాహిత చక్రాహిత, చక్ర మహావక్రమోపసంహారునకున్. 21

క. భామాయుత కామాయిత, కోమలసుందరశరీరగురుధామునకున్
భీమరిపుస్తోమవపు, స్థేమతమస్సోమునకును శ్రీరామునకున్. 22




# హంసవింశతి

## ప్రథమాశ్వాసము



### కథాప్రారంభము

వ. అంకితంబుగా రచియింపం బూనిన హంసవింశతి యను మహాప్రబంధంబునకుఁ
గథాక్రమం బెట్టి దనిన. 23

సీ. నానాగమస్ఫూర్తిఁ బూనిహంసాశ్వాస, న్మహిమంబుఁ గను ధరామరులు హరులు
తేజోమదంబుల దిక్కుంభినీశుల, నురుమాడ నోపు భూపరులుఁ గరులు
మణిచక్రములు భూరిగుణకోటి కేతువు, లలరఁగా నొప్పు వైశ్యులు రథములుఁ
బరజీవజీవనోద్ధరణధర్మఖ్యాతి, విలసిల్లు శూద్రులు వీరభటులు
తే. విమలసుమనఃప్రమోదరాగములఁ దనరి, పల్లవప్రాప్తిచే మించు ప్రౌఢవార
వనిత లారామములుఁ గల్గి వినుతికెక్కు, భూమిరత్నంబు నైషధపురవరంబు. 24

క. కలితమహాబలసఖ్యో, జ్జ్వలవిక్రమనిహతవిమతసాలోరుయశో
నలరాజచరిత మప్పుర, తిలకము సమ మనఁగ నెచ్చుఁ దేజోవతికిన్. 25

క. ఆపురము ధరాలలనా, నూపురమై రత్నసౌధనూతనరుచికిన్
దాపురమై యగ్రాంకప, గోపురమై పొగడ నెగడుఁ గుంభినిలోనన్. 26

వ. మఱియు నప్పట్టణంబు దివ్యసాలోచ్ఛ్రియకలితంబు గావున నాకలోకంబును
మహాశుద్ధాంతరంగంబు గావున యోగిజనంబును నీలగవాక్షప్రబలంబు గావునఁ
గిష్కింధానగరంబును గుంభీనసరభసంబు గావున రసాతలంబును గంధర్వప్రచు
రంబు గావున దేవలోకంబును గురుకవిబుధద్విజరాజభాసమానంబు గావున గ్రహ
మండలంబును ననుకరించి మత్స్యకూర్మాదిమహిమంబులు వహించి కమలాలంకృ
తంబునై శ్రీమహావిష్ణువుం బురుడించుసరోవరంబులు గలిగి యొప్పు నెప్పుడు. 27

ఉ. ఆపుర మేలు మేలు భళి యంచు నుతింప జను ల్నవద్వయ
ద్వీపవసుంధరాస్థలి నుదీర్ణజయాంకలిపు ల్లిఖించి చా
హోపటుశక్తి నిల్పినమహారజతద్యుతు లొల్కు కంబము
ల్ప్రాపితశౌర్యరేఖ లయి భాసిలఁగా నలనాముఁ డున్నతిన్. 28

తే. ప్రబలరాఘవరాజవీరప్రతాప, రాజపరమేశ్వరాఖ్య దిగ్రాజకులమ
శోజయంకరబిరుదైకవైభవా యటంచు మాగధు లెంచఁగ మించు నతఁడు 29

వ. ఇట్లు మహీశాసనంబు సేయుచు నొక్కనాఁడు.

ఉ. ఆతరణిప్రభుండు గొలువై చెలువై బలవైరి భోగసం
ప్రీతి దలిర్పఁగా నృపవరేణ్యులు మాన్యు లగణ్యపుణ్యసం
ఘాతు లమాత్యు లార్యు లధికారులు వీరులు చారు లష్టది
గ్జాతవిచిత్రవస్తువులు గానుక దెచ్చినవారు గొల్వఁగన్. 31

క. ఉన్నయెడ నాగ్గి వేదము, లెన్నఁగఁ దగుశాస్త్రచయము లితిహాసాదుల్
పన్నగఁ దెలిసిన ప్రత్యు, త్పన్నమతి యనెడుపురోహితశ్రేష్ఠుఁ డెలమిన్. 32

ఉ. వచ్చి ఫలోపవీనములు స్వస్తిచతేస్త్వతిసూక్తి ముద్నగా
నిచ్చిన నాదరించి వసియింపఁగఁ జేసి నృపాలుఁ డెంతయుక్
ముచ్చటలుం బ్రసంగములు మున్పటిరాజులచర్యలుం గథల్
చెచ్చెర నానతి మ్మనినఁ జిత్తము రంజిల నాతఁ డత్తఱిన్. 33

ఉ. చెప్పఁ దొడంగెఁ దేనియలు చిల్కఁగ ద్రాక్షలు రాలఁగ ప్రపుం
దిప్పలు చిమ్మ రేఁగఁ గడుఁ దీయనియిక్షురసప్రపూరముల్
చిప్పిలిపర్వఁగా నమృతశీకరము ల్వడిఁ గ్రుమ్మరింప న
ప్పప్ప యి దౌర యంచు జను లందఱు నౌఁదల లూఁచి మెచ్చఁగన్. 34

తే. చెప్పుచుండంగ భామల చిత్తవృత్తి, తెలియ బ్రహ్మకు నైనను గొలఁది గాదు
ధాత్రిఁ జిత్రవిచిత్రంబు దలఁచి మాడ, దాని నెఱిఁగింపుబ్రాహ్మణోత్తమున్నంగాక.

వ. అని యడిగిన నతనికిఁ బురోహితుం డిట్లనియె 36

క. మంకులు మాయోపాయలు, బొంకులపుట్ట లతిపాపపుం జగజంతల్
జంకెనలు సేయు యువతులు, శంకరుఁడుం దగఁడు వారి చర్యలు దెలియన్. 37

తే. అయిన నొకకథ గలదు రాజాగ్రగణ్య, తొల్లి పరమేశ్వరుండు సంతోషమొదవఁ
బార్వతీదేవి కెఱిఁగించె బాగుమీఱ, నది యెఱింగింతు వినుము నీ వవధరించి. 38

వ. అని యిట్లనియె 39

సీ. మంజులమాణిక్యపుంజరంజితఘన, ప్రాకారచుంబితాభ్రస్థలంబు
చంద్రకాంతోపలసౌధపాండురకళా, మ్రేడితప్రాలేయఘృణికరంబు
రత్నకుడ్యావళీరమ్యాంశుసందోహ, బహులీకృతార్కప్రభాచయంబు
గంభీరపరిఘాంసితాంభశ్ఛటాతమో, లోకీకృతాధరలోకవితతి

తే. యామికాహూతిజాతదిశాధినాథ, పురభయంకర భేరీకాభూరిదంధ
ణంధణధణధ్వనిప్రతినాదదాయి, గోపురం బొప్పు నుజ్జయనీపురంబు. 40

క. అపుటభేదనమునను ది, శాపుటభేదనఘోరసంగరజయభే
రీపటలఘనంఘనుం డొక, భూపాలుఁడు గలఁడు చిత్రభోగుం డనఁగన్. 41

సీ. వెలయహరిశ్చంద్రు విధమున నలునివిధిఁ, గను బురుకుత్సుచాడ్పునఁ బురూర
పుంలీల సగరులాగునఁ గార్తవీర్యుచు,ర్యాదను గయుక్రియ నంబరీషు
మతమున శశిబిందు మహిమ నంగుని తెఱఁగు, బృథునిమాడ్కి మరుత్తువృత్తి భరతు
నీతి సుహోత్రునిభాతి భార్గవుబలె, రాముపోలిక భగీరథునిపోలుపు

తే. నశిబిసంగతి మాంధాతనయమునను య, యాతికరణి దిలీపునియట్ల రంతి
రీతి నాచక్రవాళపరీతభూత, ధాత్రిఁ బాలించుసవిభుండు దద్విభుండు. 42

తే. ఆతఁ డంతిపురంబులో హావభావ,విభ్రమ విలాసవైఖరు ల్విస్తరిల్లు
మనుని సామ్రాజ్యలక్ష్మిలహరుపుఁ జెందు,చెలుబుగొలుఁ గంగఁగొలువుండెఁ జెలువుమీఱ.

వ. ఉన్న సమయంబున. 44

సీ. పాదపైనజిలుగుఁగెం జడలకీల్గంటుచు, నిండారెమువిభూతి పెండెకట్లు
వీనులపటికంపు వింతకామాత్రులు, గనుబొమ లందునఁ గావిబొట్టు
కుచములపైఁ గావి కుబుసంబు గళమున, నలరారు రుద్రాక్షహారతతులు
చే నాగబెత్తంబు చిన్నికృష్ణాజిన,మక్షిగోళంబుల నంజనంబు

తే. కావివస్త్రంబు పావాలు కక్షపాల, తామ్రకటకంబు సింగినాదంబు క్రోవి
పొందుసిద్ధక్రియలు చిదానందభూతి, యొనరఁ బూనుక నొకమహాయోగురాలు.

తే. చెట్టుడిగి వచ్చినట్టులఁ జెంత నిలువఁ, జూచి లేచి నృపుండు సంస్తుతుల మ్రొక్కి
పీఁట వేయించి కూర్చుండఁ బెట్టి తా న్నుఖాసనాసీనుఁడై యున్న యవసరమున.

సీ. శ్రీరస్తు శుభమస్తు ధీరస్తు విజయోస్తు, పుత్రరంజనమస్తు పుణ్యమస్తు
ధనమస్తు ధాన్యమ స్త్వనవద్య సుఖమస్తు, చిరతరసంకల్ప సిద్ధిరస్తు
సత్యమస్తు మహోస్తు శౌర్యమస్తు యశోస్తు, స్వ స్త్యస్తు సుగుణోస్తు శక్తిరస్తు
సామ్రాజ్యమస్తు శాశ్వతధర్మఫలమస్తు, వృద్ధిరస్తు మహాప్రసిద్ధిరస్తు

తే. జ్ఞానమస్తు శ్రియఃపతి ధ్యానమస్తు, గురుచరణభక్తిరస్తు సత్కుశలమస్తు
శాంతిరస్తు నిరంతరైశ్వర్యమస్తు, భాగ్యమస్తు మహాసార్వభౌమ నీకు. 47

క. అని దీవించి చక్షతపు, ష్పనిచయము విభూతిపండ్లు ఫలములు దివ్యాం
జనములు సిద్ధక్రియలును, దనరఁగ శివశక్తి భూమిధవున కొసంగెన్. 48

వ. ఇట్లొసంగిన వినయంబున లేచి కైకొని స్వాగతంబడిగిన సంతోషించి మనోరంజనార్థంబు ధర్మార్థకామమోక్షంబులు రాజ్యలక్షణంబులుఁ బురాణేతిహాసంబులుఁ గొన్ని లోకాభిరామంబులు ననాగతవర్తనంబులు నుచితానుచితకథాస్వారస్యంబులుఁ దె

లిపిన విని మహాత్మురాలా మీరు వినని కనని కార్యంబులు ముల్లోకంబుల నెవ్వియు
లేవైన నొక్కటి యడిగెద నానతిమ్మని యి ట్లనియె. 49

క. ఏయేభూములఁ జూచితి, వేయేరాజ్యములఁ గలరు శృంగారకళా
ప్రాయ లగురూపరేఖా, శ్రీయుత గలకన్నె లనిన శివసత్తి యనెన్. 50

మ. మది రంజిల్లగఁ జెప్పెద న్వినుము ప్రేమన్ సచ్చిదానందసం
పదచేతం గరజం బలంబుగఁ గన్పట్టున్ ధరాధీశ యీ
యుదయాస్తాచలసేతుశీతనగమధ్యోద్యద్ధరాచక్ర మిం
పొదవన్ దేశములందు నుండుదురు విద్యుద్వల్లికాభాంగనల్. 51

ఉ. డెబ్బదిరెండుపాళెములఁ దీవిఁ దలిర్చు సమస్తదుర్గముల్
జొబ్బిలు కల్మిఁ బట్నములుఁ జొక్కపుఁ బేటలుఁ బాతకంబు పో
ద్రోబ్బెడుతీలఁ జాల్తిరుపతు ల్గనుఁగొంటిని నందు రందులన్
సిబ్బెపునిబ్బరంపుబిగిఁ జిక్కని చక్కనిగుబ్బగుబ్బెతల్. 52

క. వెలనాడు వేగినాడును, బలుగులనా డ్పాకనాడు పొత్తపునాడున్
గలమురికినాడు రేనా, డలయక గనుఁగొంటి నచటియబలలఁ గంటిన్. 53

సీ. లాట కర్ణాట మరాట విధూటులఁ, బాండ్య పౌండ్ర విదర్భ పద్మముఖుల
బంగాళ వంగ కళింగ లతాంగులఁ, గుకురు కేరళ కురు కోక కుచల
మళయాళ నేపాళ మాళవ యువతుల, మత్స్య వత్స కరూశ మానవతులఁ
గోస లాంధ్ర విరాట కుంతలస్త్రీ లను, బాంచాల బర్బర భామినులను

తే. ద్రవిళ గాంధార కాశ్మీర ధరణిసతుల, మగధ కొంకణ టెంకణ మానినులను
మఱియుఁ దక్షిణధార ణీమండలములఁ, దనరు చెలువలఁ జూచితి ధరణినాథ

తే. రాజవశ్యౌషధాకృతుల్ రమ్యతరర, తిస్వరూపలు మోహనదివ్యమూర్తు
లతులతర కామమంత్రదేవతలు వీర, లనఁగ నుందురు సుందరు లచట నచట. 55

ఉ. ఈనవఖండమండలమహీస్థలి నెల్లఁ గనంగ దేవ నే
నీనగరీలలామమున నెంతయు రేఖఁ జెలంగు మన్మథా
ధీనసుమోహనాకృతి రతి న్నగుమి న్నగుసొరుగల్గుసా
తానిబిసప్రసూనదళధాళధళీతరళాక్షిఁ జూచితిన్. 56

తే. దానిప్రియునాయకుఁడు విష్ణుదాసుఁ డనెడు, పేరుగలవాఁడుకలవాఁడు పెద్దవాఁడు
హేమవతి యనఁ దనరున య్యింతిఁ బొగడఁదరమె బ్రహ్మకు నైన శంకరున కైన.

ఉ. ఆమధురాధరాధరకచాళి కనద్ఘన నైగనిగ్యమా
యామృదులోరుసారరుచిరాంబురుహాక్షులధాళధళ్యమా
యామెఱుఁగారు బోఁడిజిగి యబ్బెడుగుబ్బల చాకచక్యమా
యేమని చెప్పవచ్చు జగతీశ్వర శాశ్వతరూపసంపదల్. 58

క. దానిజగ గానికములుకును, దానితనుద్యుతులనాఁపు దానివిధంబున్
దానివగ దానియందము, మానవపర మరుఁడు గన్న మగ్నుఁడు గాఁడే 59

క. నగ లొలుకు ధాగధగ్యపు, జగి నుల్కెడు నుబ్బుఁగబ్బి సెబ్బెపుగుబ్బల్
నిగనిగలు గులుకు కొప్పును, సొగసుం గలికనులు దాని సొమ్మై పరఁగున్. 60

ఉ. విండ్లకు మేల్తరంబు ఘన వేణి కనుం బొమదోయి బంగరుం
గిండ్లకు మేటి సాటి తులకించుచనుంగవ లేఁతతమ్మిపూఁ
దూండ్లకు మిన్న యన్న జిగిఁ దొల్కెడుచేతులు లోకమందుఁ బూ
బోండ్లను గానమో వినమొ పోలరు తత్సతికాలిగోరునన్. 61

సీ. కబరీభరమునకుఁ గందంబు సెల్లును, తపలమాలికలు నేత్రములకుఁ జెల్లుఁ
గరంబులకును మంగళిమహాశ్రీ సెల్లు, గాత్రంబునకుఁ జంపకంబు చెల్లు
మధురవాగ్వైఖరికి మత్తకోకిల సెల్లుఁ, జనుగుబ్బగవకు మంజరియుఁ జెల్లు
బిరుదైనపిఱుఁదుకుఁ బృథ్వివిస్తృత్తము చెల్లు, మధ్యంబునకుఁ దనుమధ్య జెల్లు
తే. పాదముల కంబుజము చెల్లుఁ బరఁగు నడకుఁ దనరు మత్తేభవిక్రీడితంబు సెల్లుఁ
గృతులపద్యంపుఁ దగుతిదాకృతులెకృతులు, వాంఛ చెదానిఁ బొందినవాఁడె సుకృతి

తే. చండదోర్దండమండితమండలాగ్ర, ఖండితోద్దండరిపుకాండభండనమునఁ
బండితుం డగురాజవేదండమునకుఁ, గాక యొకపాటివాని కౌకన్నెతగునె 63

ఉ. సౌరభ మొందు కాంచనపు జంత్రపుఁబుత్రికవాగ్విలాసము
ల్వారక నేర్చు రత్నపుసలాక తిరం బగురూపుఁ జెందు తో
ల్కారుమెఱుంగు జిపకళ్ఁ గాంచిన చిత్తరుబొమ్మ యానశృం
గారిణి యా సుధాసరసిఁగా నుతిసేయఁగ వచ్చు నచ్చెలిన్. 64

క. అని సిద్ధరాలు సప్పినఁ, బొనపానఁ గాత్రములు చెందఁ బులకలు వొడమెన్
మనసిజశిఖి యొనసినచోఁ, గనఁబడు ధూమాంకురముల గతి నృపుమేనన్. 65

క అంతట సిద్ధాంగన యా, ద్యంతంబును జెప్పి చన మహాశ్రమమహికిన్
సంతోషంబునఁ జనె భూకాంతుఁడు హేమవతిమీఁది కాంక్ష జనింపన్ 66

మ. కరుణాదృష్టుల నాగవాసముల సోఁకం జూచి వేడ్కన్ మనో
హరము ల్కోకలు రూకలు న్మణులు హారాలంకృతిస్తోమము
ల్సరసత్వంబున నిచ్చి పంచి కొలువున్ జాలించి తాఁ బోయె భూ
పరతీశుండు మనంబు హేమవతిపై బాళిన్ దువాళింపఁగన్. 67

క. మిన్నందు సౌధవీథుల, మున్నత మగుమేలు మచ్చు లొప్పెడుచోట
న్నిన్నగుచిత్తరువులచేఁ, బన్నుగఁ దగు వౌళరహస్య భవనము పజ్జన్. 68

చ. అకలుషదివ్యరత్నమయ మా నొక కేళిగృహంబులోపలం
జికిలికిరీటిపచ్చల రచించినచిల్కలకొల్కినంద మా
సకినెలపట్టెమంచమున చాయవభాసుతివాస్సిపైఁ దురం
గిక మొకమాలులేపున నొగిన్ శయనించి మనోభవవ్యథన్. 69

క. ప్రీతిని హేమావతిపయి, నాతిసుత మనసు నిలిపి యతివిరహార్తిం
జేతోజాతధనుర్భవ, శాతశరవ్రాతసార చకితాత్ముఁడై. 70

క. ఉలుకు న్వెన్నెలవేఁడిమి, కలుకు న్పికపికమిళింద హంసార్భటికిన్
బెలుకు న్మలయానిలునకు, జెలువం బూపాన్పునందుఁ జిరవిరహార్తిన్. 71

. చెక్కటఁ జేయి చేర్చుకొని చింతిలు నుస్సురటంచుఁ జూపులన్
వెక్కస మంది లేచు నెలవిం బొడగట్టినయట్లు నుండఁగా
నక్కునఁ జేర్పఁ బోవు భ్రమ మంది వెసం దలయూచుఁ నంతలోఁ
బక్కున నవ్వు నింతిపయి బాళి నృపాలకమౌళి ఖిన్నతన్. 72

వ. మఱియు నారాజు విరహంబు తాపాతిశయకరంబు గావున నిదాఘంబును విరళీకృ
తాశ్వాసంబు గావున సత్ప్రబంధంబును విచ్ఛిన్నాలంకారంబు గావున యవనవివా
హంబును నిమీలితతారకంబు గావున సహస్రముఖంబును విప్రలాపముఖరంబు గావున
సాయంకాలంబును ననుకరించె నప్పుడు. 73

క. అటువలె నృపనిటలాక్షుఁడు, పటుశరవిరహంబుఁ జెంది బాధ పడంగా
నటనమున హేల యనియెడు, కుటిలాలక వచ్చెఁ దెలివిఁ గొనఁ జేయుటకున్. 74

. పన్నీట న్నయనంబు లొత్తెఁ దనువుం బాటీరపంకంబుతోఁ
జెన్నారం బద నిచ్చి గీరి సిగ లేసెన్ దాయెతు ల్పట్టె జీ
న్నొన్నాపట్టెరుమాలుగట్టె జరతా చుట్టంచు డాల్మించుమే
ల్మిన్నా సన్నపుపుప్పటంబు దగ హోళిం గప్పె సొంపారఁగన్. 75

వ. ఇట్లుపచారంబులఁ గొంతదాపంబు శాంతం బొనరించి నృపాలునకు హేల యి
ట్లనియె. 76

. స్వామి పరాకు నీమదికి సమ్మతి యౌనని యేమి చెప్పమా
ప్రేమ దలిర్ప నేర్పు దల పింప నదెంతటికార్యమైన నే
నే మతి తీర్చి నీకుఁ గల నెంజిలిఁ బాపెదఁ జూడు మన్న నా
శ్రీమహనీయవైభవుఁడు శీతకరాస్యకు హేల కిట్లనున్. 77

. సిద్ధరాలు హేమావతీ సితకరాస్యవలపు రేఖాతిశయవైభవమును దెల్ప
వినఁగ నగు మోహమున నైన వెతను మాప్పకరుణ ననుఁ జేర్చి యమ్ముచ్చకంటిఁ గూర్చి.

క. అని చీనిచీనాంబర, ఘనమణిహారములు మేలు కాల్కడియంబు

గ్రానబుల మెఱుఁగుంగ్రమ్ములు, తను నెమరఁగ వచ్చి పనుప నుచితరీతిన్. 79

ఉ. పూని ముదంబు లుప్పతిల భూవరముఖ్యునిచేత వీడుకో
లై నవరత్నకీలితమహారజతోన్నతదివ్యదీధితి
శ్రేణిఁ దెల్ల దిక్కుల జెలించుచు మించినవిష్ణుదాసు స
న్మానిత గేహసీమకు సుమాశముతోఁ జనె హేలహేలలన్. 80

కస్తూరివీణలుఁ గపురంపు లప్పలు, నిండినగృహములు నెరయ దాఁటి
కుంకుమాగరుఖండసంకుమద బులు, గలుగుబిడారులు గడచిపోయి
గాళము లప్పాళిక మ్చారములు చాల, నించిన కొట్టడీ లెంచియేగి
పునుఁగుచట్టంబులు బుక్కారజంబులు, పొంకమౌ మళిగల పొంతఁ దరలి
మాచె నొకదివ్యరత్ననిస్తులగృహంబు, నందు హేమాసతీకన్య నలరు ధన్య
వరలపొంప్రల కెంకి జవాదినంకి, జాతిగతిలీల నారాజదూతి హేల. 81

వ. ఇట్లు తన్నుఁ జేరవచ్చినరాజదూతిం గనుంగొని మహారాజు మన్ననలమనియెడు పడంతుక యని రత్నంపుగద్దియపై వసియింపఁ జేసి స్వాగతం బడిగిన నబ్బాలకు హేల యిట్లనియె. 82

క. నీచాతుర్యము నీహావ, చాచిత్రపటుత్వ రూప సంపద లెపుడు
న్నీచుట్టంబులు సెప్పగఁ, జూచెద నని వచ్చినాను సుదతీ నిన్నున్. 83

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనిదాన వటంచు వేడ్కతోఁ
జొక్కము చెప్పి రందులకుఁ జూచినయందుకు నామనోరథం
బక్కట సిద్ధమయ్యె ఫల మబ్బెను హా యిటులుండ వద్దె యో
చక్కెరబొమ్మ యంచు సరసప్రతిభాషల నిచ్ఛగింపుచున్. 84

దీనచకోరాళి తృష్ణదీర్పఁగదమ్మ, భామ నీవదనచంద్రామృతంబు
బీదబర్హిణముల నాదరింపఁగదమ్మ, మెలత నీవేణికామేఘపంక్తి
ఘనదరిద్రపికాళిఁ దనియఁ జేయఁగదమ్మ, చెలియ నీవాతెఱచివురుడంబు
బడుగుజక్కవలనింపఁ బ్రోవఁగదమ్మ ముగుద నీచనుదమ్మిమొగ్గదోయి

తే. పేదహంసాళిసందోహ మీమనమ్ము, నిపవోబృందమకరంద నిర్ఝరంబు
లిట్టిపస మిసి జిగిబిగి యీవిధంబు, ప్రణుతి సేయంగఁ దరమె యాబ్రహ్మకైన. 85

క. ఇదిగాక యత్తమామల, ముద మొదవఁగ బంధుసంఘముల దాసీదా
సవళంబుల బహువిశ్వా, సవయుల నీరీతి మనుచు సతులం గానన్. 86

వ. అని యిత్తెఱంగున. 87

ఆ. దానియత్తతోడఁ దగు మామతో బంధు, దాసజనముతోడఁ దగినమైత్రిఁ
గూడి యాడుచుండి కొన్నిదినంబులు, చన్నపిదప నొంటి నున్నవేళ. 88

ఉ. ఒక్కసుధాంశురత్నరుచిరోన్నతవేదికమీఁద నిద్దుఱన్
మక్కువమీఱ నుండి యనుమానముతో నొకకొంతఁ గొంకకోఁ
జక్కట నీకొకండులకు నచ్చికలేక మెలంగ విధుదా
నెక్కడిభర్తఁ గాఁగ సృజియించె నజుం డని హేల నవ్వుచున్. 89

క. ఈరూప మీపటుత్వం, బీరేఖావైభవంబు లీనెఱప్రాయం
బీరసికత నీకును మఱి, యా రాజున కగును నితరమనుజుల కగునే. 90

సీ. కలికి నీసిబ్బెంపు గబ్బిగుబ్బలు వాని, గడుసుచేతులఁ బట్టి కలఁచఁ దగునె
కాంతరో నీతావి కావిమోవిటు వాని, కొక్కిదంతంబుల నొక్కఁదగునె
చెలువ నీజిగిగోముగలమోము మఱివాని, తొట్టినోరున ముద్దు వెట్టఁ దగునె
సుదతి నీకనకంపు సొంపుదేహము వాని, కఱుకుమేనునఁ జేర్చి కలయఁ దగునె

తే. కులుకుశృంగారరసములు చిలుకఁ గేలు, బొమ్మవలె నీటు గలదాన వమ్మ నీవు
మర్కటమువంటివాఁడు నీమగఁడు చూడ, వానితోఁ గూడిరతికేళిఁ బూను టెట్లు

క. నీవంటిరూపవతికిని, నీవంటిప్రియుండు గలఁగ నిర్మింపక హా
యీవిధిని దగులుచేసిన, యావిధి నిటు దూర నింక నగుఫల మేమీ. 92

తే. అయిన మగఁ డెంతనీటుకాఁ డైన నేమి, ప్రాణపద మైనచో శీతిబంధగతుల
నింపు సొంపునుజూచి చొక్కింపఁదగునె, రతికిఁ జొచ్చినతఱి మానవతుల కెప్డు.

ఉ. కేరఁగరాదు నవ్వ గిలిగింతలు వెట్టఁగరాదు చెక్కులం
జీరఁగరాదు గుబ్బలుఁబిక్కనఁ గ్రమ్మఁగరాదు కేళిలో
మీరఁగరాదు పైకొని రమింపఁగరాదు గళారవంబు లిం
పారఁగ నల్పరాదు మదిరాక్షులు భర్తలఁ గూడువేళలన్. 94

వ. అదియునుంగాక. 95

క. పదివేలమదను లొక్కటు, నుదయించినలీల మెఱయు సురగుణుఁడు సుమీ
మదిరాక్షి చిత్రభోగుఁడు, మదిఁ గోరెను నీదుభాగ్యమహిమ మెట్టిదియో. 96

సీ. కువలయానందంబు గూర్చియేలు ఘనుండు, విబుధులఁ బ్రోచుసద్వ్రతరణుండు
సర్వజ్ఞమౌళిభూషణమైనధన్యుండు, లలితవిభ్రమరూప లక్షణుండు
సరవికళల్మించు శ్యామాభిరాముండు, ఏఱలెడు సన్మార్గ వర్తనుండు
విష్ణుపదార్చితవిహితశుభ్రకరుండు, శమితతమోహారి యమితశీలుఁ

తే. డమ్మహారాజచంద్రుఁ డాయననిజాంత
రంగ మంతయు నినుఁ జేర్చి రమణతోడ
నేలఁగలఁ డమ్మ నీపుణ్య మెసఁగె నమ్మ
తమిని నిఁకఁజేర్చునమ్మ కుందనపుబొమ్మ. 97

వ. అనిన విని సంభ్రమభయవిస్మయలజ్జాహాసకౌతుకంబులు మనంబునం బెనంగొన నభ్రముఖియై హేమావతి రాజదూతి కిట్లనియె. 98

ఉ. అమ్మకచెల్ల యిట్టిపలు కాడుదురే మఱియ త్రిమా మలుం
గ్రమ్మితలారులై మెలఁగఁ గామగుణం బులిరీతిఁ దెంపుగా
బమ్మెర రొప్పుచుండఁగను బాంధవులెల్లను గాచియుండఁగాఁ
గొమ్మరొ యిట్టికార్య మొనఁగూడునె కూడిన హాని చెందదే. 99

తే. అనిన హేమావతికి నిట్టు లనియె హేల, యేపటికి నేఁటి ప్రాయంపు టేపు గలదె
మోహ మెక్కొనఁ జక్కని ముద్దుజాణ, యొకని బిగికౌఁగిటను జేర్చి యుండవలయు.

క. ఎక్కడిమగఁ డెక్కడిసఖు, లెక్కడి సియ్యత్తమామ లెక్కడిచుట్టా
లిక్కాలంది దొడ్డ కొంచెము, లెక్కింపకు మరునిహావళిం బడువేళన్. 101

సీ. కోటగోడలకైన మీటుగా నెగఁ బ్రాకి, దాఁట నేర నిదేటి తలిరుఁబోఁడిఁ
ఘుమఘుమార్భటితోడ ఘోషించునదులైన, నీఁదిపోవ నిదేటి యెమ్మెలాఁడి
తనమీఁదితప్పు నొక్కనిమీఁద నిజముగాఁ, బెట్టనేర నిదేటి బిసరుహాక్షి
ధవుఁడైనఁ దనజాడ లెఁగఁ దనిపట్టిన, నిర్వహింప నిదేటి నీటుకత్తె

తే. తలనరులు గన్నచో లేని తాల్మిఁ బూని
బొంకు తథ్యంబు తథ్యంబు బొంకుఁ గాఁగ
నెంచి యుపనాథుతోడఁ గ్రీడించి మించి
చక్కటికిఁ దేని దదియేటిసరసురాలు. 102

వ. అని మఱియు బోధింప సంగంబు పులకాంకురానుషంగంబునుగా నిజాంతరంగంబునం బొడము వ్రీడాభరం బుడిపికొని దరస్మితానతముఖాంబుజయై యెట్టకేలకుఁ జెవి యొగ్గిన నగ్గజరాజగామినిం బాసి తనరాకకెదురుచూచుచున్న రాజసన్నిధికిం జని తాఁ బోయివచ్చినకార్యం బెఱింగించె నంతట దైవయోగంబున విష్ణుదాసునకు దూరప్రయాణంబు సంభవించె నంత. 103

తే. పయనమునకై నయవియమర్పంగనపుడు, పరిచరులకౌనతిచ్చినఁ బటకుటీర
పాత్రసామగ్రి మొదలైన బరువులెల్ల, శకటవాహ్యాశ్వవృషమహోష్ట్రముల కెత్తి.

వ. మఱియుం గలమాన్నంబులుం గలనంటకంబులుఁ బొంగలి పులియోగిరంబు దధ్యోదనంబు నానవాలు జున్నులు మీఁగడపెరుగులు నవనీతంపుఘుటికలు నొలుపుఁబప్పు నప్పడంబులు వఱుగులు వడియంబులుఁ బెరుఁగువడియంబులు మిరియంపుఁబొడి మెంతికూటువ సంబారంబుఁ జింతపండులు బజ్జులు సిరికలుఁ బచ్చిగారబిండ్లూరుఁ గాయలు మామిడితొక్కులునివి మొదలుగాఁగలపరికరంబులును మఱియు వడపప్పు బేడలు వేపుళ్లనుపగుగ్గిళ్లు బొరుగులు బొదులుఁ బాకపుఁజలిమిడికాయమ్ములుం జిమ్మి

లుంటలు నటుకులు మాగలు లాజలుఁ బేలాలుఁ జిటికౌఱుకులు నువ్వులు నానబియ్యం
బులుఁ బేలపిండిఁ బ్రేలసత్తు దోసగింజలు వెల్లగిసెలు గోఁగులు గరింగయములుప్పిళ్లు
సెనగపప్పు బొరుగుపప్పు సారపప్పు జీడిపప్పు బాదంగిపలుకులు గొబ్బెర గసగసాలు
ఖర్జూరములు ద్రాక్షలాదియైన ఫలహారంబులును మఱియు నుండ్రంబులు మండెఁ
గలుఁ గుడుములు దోసెలు వీసెలు రొట్టెలు నిప్పట్లప్పంబులతిరసంబులు సుకియలమృత
కలశమ్ములు సోగులుఁ జక్కెరబుగడలుఁ గరిజాలుఁ బూరివిళంగాయలుఁ దేమనంబును
బాలకాయలుఁ జక్కిలమ్ములు మినపచక్కిలమ్ములు మినపపోకలు మనోహరంబులు
గారెలు బూరెలు మోరుండెలం గరొట్లెలు మణుఁగుబువ్వలుం బేణీలు సీమసత్తిగెలు మడ
తలుఁ బప్పుబూరెలు సజ్జబూరెలు పడలామనడలొబ్బట్లు సారసత్తులు సేవలుఁ జిరిమి
ళ్లు సరడాలుఁ బరిడగవ్వలుఁ జాపట్లు నిడ్డెన తేనెతొలలు బొరుగులు నేలఁకికాయలు
వెన్నమెఱుంగులు నిడికుడకలు పడకుడకలు ముత్తెపుఁ జిప్పలుఁ జంద్రకాంతలుఁ గరిజ
కాయలు బెడదలు లడ్వాలుఁ గోడబల్లు గూడుపరిగెలుఁ దెలుపరిగెలుఁ బూరీలు
గూళ్ళాపిడలాదిగాఁ గల భక్ష్యంబులు గూడలనించి జడసాతానులు గావళ్లంబూని
వెంటనంటిరా నప్పుడు. 105

తే. తనకు నిలువేల్పు లౌ తల్లిదండ్రులకును, భక్తితో మ్రొక్కి తనప్రాణపదమునైన
భార్యతోఁ జెల్పనక్కునఁ బట్టిచేర్చి, నావధూటియు నధిక దీనాస్య యగుచు.

ఉ. ఓమగరాజ నీవు చన నొంటిగ నేనిట నుండనేర్తునే
నామది చూడఁగోరి యిటు నన్నలయించెద వంచు బాష్పధా
రామిళితాక్షి యైఘనతరం బగుశోకముఁ జెంద విష్ణుదా
సామధురోక్తి నూరడిలు మంచు ముదంబునఁ గుస్తరింపఁగన్. 107

సీ. నీతావి కెమ్మోవి నిలుచుఁ బోకంచివా, ల్గంటుల మొనపంటి గంటి గుఱుతు
నీవాలుఁగన్నుల నెఱయుఁ బోనెల్లూరి, కొమ్మలకపురంపుఁ దమ్మరసము
నీ చెక్కులరహించుఁ బోచెన్నపట్నంపు, వారిజేక్షణల క్రొవ్వాడినోరు
నీయురస్థలిమించుఁ బో యఖిలక్షమా, కోమలాంగుల కుచకుంకుమంబు

తే. లింటనె మెలంగువారల కీసుఖంబు, లెటులఁ జేకూరు నని పల్కి హితముఁ జిల్కి
పోయి రమ్మని మోము మోమునఘటించి, చుంబన మొనర్చి పనిచె నయ్యంబుజాక్షి.

వ. అంత. 109

తే. మణిఖచిత హేమపంజర మధ్యమమునఁ
బ్రేమ నాబాల్యముగఁ దాను బెంచినట్టి
హంసరాజంబుఁ గదియంగనరిగి తనదు
శయన మెఱిఁగించి యింటిలో భద్ర మనుచు. 110

క. చెప్పంగఁ దగినమాటలు, సెప్పి మరాళంబు వినుచుఁ జిత్తంబున సొం
పుప్పతిల నిల్లు వెలువడి, యప్పగిదిన్ విష్ణుదాసుఁ డరిగెడువేళన్. 111

తే. ఈడనుపళఁదబందర యింగిలీషు, కళముమొదలయినపేటల గౌరవెల్ల
సౌరభద్రవ్యములు బేరసార మాడిఁ, బిలువ నంపిరి తమతమ పేటలకును. 112

చ. అటువలె విష్ణుదాసుఁడు హితావళి గొల్వఁగఁ దోడబేర మం
పుటకుఁ జనంగ హేమవతి తోడనె శంబరవైరి శాతవి
స్ఫుటచటులోగ్రపంకరుహసూనసవీనశరవ్రజంబుహృ
త్పుటమున గాఁడ నేయ నృపపుంగవుఁ జేరఁగఁ గోరి యున్నెడన్. 113

మ. విలసితమోహదాహపరివేదన పొమ్మనియెత్తిపెట్టఁగా
వలపులపింటివాఁడు వెలివాడితనంబునఁ ద్రోపఁ జూపఁగా
నలమినభీతి లజ్జ వలదం చరికట్టఁగ నింతి నంతలో
జలజహితుండు క్రుంకె నల చానవెత గ్గనలేని కైవడిన్. 114

వ. అయ్యవసరంబున. 115

తే. తరణితురగఖురోద్ధూతచరమశైల
గైరికస్థలపాంసువుల్ గప్పెననఁగ
పశ్చిమంబునఁ గుంకుమపంకమటుల
సాంధ్యరాగంబు మించె నిస్తంద్రమగుచు. 116

ఉ. కాలకళావమాళి దినకాంతవసంతికలోన యామినీ
బాలను సొమ్ము సేయుటకు భాస్కరుఁడన్ కనకంబు గ్రాఁచిక
ల్లోలవతీపరాంతరములో నిడఁ దోఁచినధూమము పైఁదమో
జాలము పర్వె నా రవల గాడ్పునఁ దారలు పొల్చె నెంతయున్. 117

క. అప్పుడు హేమావతి తమి, నుప్పిరిగొని చిత్రభోగ భూపాలునితో
నప్పుష్పబాణకదనము, చొప్పడ నొనరించువాంఛ సొరఁ దమకమునన్. 118

చ. పరఁగెడువస్తుకొట్టడులు భద్రముగా నొగి బీగముద్రలన్
గరిమ నొనర్చి తొత్తులకు గ్రాస మొసంగి నికాయ్యకృత్యముల్
దరలిచి యత్తమామలపదంబుల నొత్తుచు నిద్రపుచ్చి మై
మెఱుపుగ శీతలాంబువుల మిన్నగ మజ్జన మాడి వేడుకన్. 119

సీ. మెఱుఁగుఁగుచ్చెలమీఁద జరతాబుపనిమీఱు, చెంగావిరంగారుచీరఁ గట్టి
గుజరాతి జిగినిస్తుగొల్లదాఁపినడాలు, రహిమించు సైకిణీరవికఁ దొడిగి
ఘుమ్మఘుమ్మనితావి గ్రమ్ముచుఁ గొట్టఁపు, గలపంపు సొగసుగాఁ గలయ నలఁది
తళుకుబెళుకుగఁ గాంచలుకఁ గల్కెదుజతి, మణిభూషణంబులు మమతఁ దాల్చి

తే. తిలక మొగిఁ ... చిత్రభక్తి నలిపి వెంట
బూమె లెఱుఁగని యొకపాటిబుద్ధుతే యాకు
మడుపు లందీయ మోహంబు మరులు గొల్ప
నెడలె నలభామ నిజకేళివేశ్మ సీమ. 120
క. అటుల వెలఁడి. 121

## మొదటిరాత్రిచర్య.

తే. తనకు ప్రాణంబు ... ంబు ... డ్రియునుమ చెలి యైనసలిరాజహంస మున్న
దివ్యనవరత్నఖచితదేదీప్యమాన, కనకపంజర మొక్కఁడంత గదిసి నిలిచె. 122
చ. నిలిచి దరస్మితం బయిన నెమ్మొగ మించుక ఎంచి యా ... దాఁ
దలఁచినకార్య మెల్లఁ బ్రమదంబునఁ దిన్న నికల్కి పల్కులం
దెలిపినరాజహంస సుదతీమణిఁ గన్గొని పక్షయుగ్మముం
దలఁ గదిలించి యందుకు మనంబునఁ జింతిలి యప్పు డిట్లనున్. 123
ఆ. అక్కట ధరిత్రిఁ గాపురము నాఁడెడి పుచ్చి నృపాలవాణితోఁ
... క్కి రమించు నందులకుఁ జొచ్చినఁ దానకబంధువర్గముల్
దక్కిన చేతుగన్న చరిత్రవ్రతముల్ చెడునమ్మ జాతికిం
బక్కిన నిందఁ జెంది తలవంపులు దెత్తురఁటమ్మ మానిని. 124
సీ. అత్తమామలు గన్న నారడివుత్తురు, బాప పరీక్షింప నేవగింతు
మఱఁదులు గాంచిన గఱకతిరెంతురు, వదినె లెఱింగిన వాసి చెడును
బంధువుల్ గనినచోఁ బరఁగ నిందింతురు, తోడికోడలు మాడ నాడికొనును
బతిఁ గనుఁగొన్నచోఁ బ్రాణహాని యొనర్చు, వాడవా రెఱిఁగిన వన్నెదఱుగు
తే. నరయ నిదిగాక యన్నిట నాడుపుట్టు
పుట్టఁ బాపంబు పుట్టినఁ బుట్టినింటి
కేని మఱి చొచ్చి నింటికిఁ గీర్తి ఘనత
దేక యపకీర్తి దెత్తురే తెఱవ తెచట.
క. అగుఁ బ్రాణహాని యపసిరి, యగణిత మగుమానభంగ మహాహా తెలిసె
దెగునయో యింద్రపదవి యనఁ, దగు బుద్ధి జనింపబోలుఁ దరుణీ నీకున్. 126
సీ. పంక్తికంఠునిమోహపరితాప మెంచెనే, భువనమాత జగత్పవిత్ర సీత
యలపులందునిబొంద నాసక్తిఁ జెందెనే, ప్రియహితామితనయ భీమతనయ

నహుషునివిరహంబుఁ దహతహఁ బ్బొచెనే, సాంద్రసద్గుణచర్య యింద్రుభార్య
మఱిసింహబలుని పెన్నామునఁ జిక్కెనే, యూరడిపనిఁ బూని యాజ్ఞసేని

తే. మనుపటిపతివ్రతలు మహామాన్యచిత్తు
లైనదుర్జను లతిఘోరసూనసాయ
కాస్త్రజర్ఝరితాత్మలై యాసపడిన
మాన ముడిపుచ్చుకొనిరఁటే మచ్చకంటి. 127

ఉ. పతిహితభక్తిచే వెలయు పద్మదళప్రతిమాననేత్రకుఁ
వ్రతములసోదు లేటికి ఘురిసంబుగఁ బుణ్యము లబ్బు నెప్పుడుం
బతిని దిరస్కరించి పరభర్తలఁ జెందినభామపుణ్యము
గ్గతజలసేతుబంధములు గావె వచింపఁగ నెంతనోచినన్. 128

క. పతిసేవయె భూషణములు, పతిసేవయె జీవనంబు భామామణికిం
శీల నైనసతులు పరపురుషులఁ గోరినవన్నె లేదు చూవె ధరిత్రిన్. 129

క. లలిజాగ్రత్స్వప్నసుషుప్తులను మనోవాక్శరీరములచే సేవే
బతిసేవయె సువ్రతములు, పతిసేవయె యిహముఁ బరము భాగ్యములనుచున్. 130

క. ఈరీతి హంసపలికిన, నారీమణిచెవుల నవి యిడు నారాచములై
దూఱి చుఱుక్కన నాఁటినఁ, గ్రూరకటాక్షములఁ గ్రుటుకొని తనుఁజూడన్. 131

వ. అత్తెఱవచిత్తం బెఱింగి మరాళం బక్కుటాయిత్తరుణి దుష్కార్యాయత్తం బరాయత్తచిత్తవృత్తి యయ్యె నిట్లగుట మదీరితసునీతివాక్యంబులు దీనికిం బరుషంబులై తోఁచుచున్నవి సమదమదనప్రదరవేదనాదోధూయమానం బైన దీనిమానసంబు సామంబునం గాని చక్కంబడ దని కొంతవడ వంతరంగంబునఁ జింతించి వెండియు నారాజహంసంబు హంసగమన కిట్లనియె. 132

తే. మానవతి నీవు పరసంగమమున కాస
పడఁ దలంచితివేనిఁ జేపట్టుకొంచె
మైనచక్కనియొకయందగానితోడఁ
గూడి యాడక రాజులఁ గోరఁదగునె. 133

మ. అధిపు ల్కాశిరఫణిస్వరూపు లధరం బాసించు పేరీతి భూ
మిధవుల్కాలకరాళకీలిసదృశుల్ మేన్నేనఁ బొందించు పె
ట్ల ధరాధీశులు మత్తదంతిసము లేలా నీవుఁ జెల్లాటమా
డ ధరాభృత్కుచ యిత్తెఱం గెఱిఁగి వేడ్కం గోర్కు లీడేర్చుకో. 134

క. ఇలఁ బతుల చిత్తవృత్తులు, గలయికలం దెలిసి మెలఁగు కాంతల కెలమిం
జెలు వొనరు జయము చేకుఱు, నలఘుశ్రీసౌఖ్య మబ్బు నంబుజగంధీ. 135

వ. అట్లు గావున నిత్తెఱంగునఁ దత్తరంబులేక నృపనందనోత్తముల చిత్తవృత్తి దెలిసిహత్తు
కొని వర్తిల్లు మని హంసంబు ప్రత్యుత్తరం బిచ్చు నవసరంబున. 136

సీ. పిసవెట్టి కసరెత్తి యసరేఁగు నసగూఁటి, పూఁబోండ్లు తమయిండ్లఁ బొంత కరుగఁ
బరుసొమ్ములకు నిమ్ము వడఁ గ్రమ్ము నెఱహమ్ము, దస్కరుల్ దిగులొంది తావుఁ జేరఁ
దనరారు సిరిసౌరు తనివారఁ గలవారు, కనుగూర్కు మదిఁ గోరి కన్ను మూయ
రతిరూపు పసమాపు గతిచూపు గలకాఁపు, గుబ్బెత లెసటికై కుండ లరయ

తే. దూరదేశసమాగతధూర్తపాంథ, జనసమూహంబు పయనంబు సాఁగ లేవ
ఱెక్కలలరించి కుత్తుక లిక్కమించి, కొక్కరో కోయటంచును గోళ్లుగూసె.

క. తెలతెల నయ్యెను దిక్కులు, పలపల నుడుగణము మాయఁ బాఱెను బత్తుల్
కలకలనఁ గూయఁ జొచ్చెను, దులదులఁ గుమ్మెదలు దమ్మితుటుములవెడలెన్. 138

తే. అపుడు హేమావతీకన్య హంసనుడువు, నీతిచాతురి విపరీతి నేర్పు మాని
పడకయిలు సేరి కళవళపడుచు నిమిష, మొక్కయేడుగఁ బవలెల్ల నొనరఁ గడపె.

క. ఉదయోపరి రవిసింహము, మది మీఱఁగ నస్తశైలమత్తద్విపముం
బొదువ గమకించి దుమికిన, యదనున దినకరుఁడు పశ్చిమాశకుఁ జేరెన్. 140

తే. రసికుఁ డైనట్టి కాలంపురక్తవాను, తనరు బ్రహ్మాండ మను పెద్ద దవతిలోన
కాయి నిండారఁ బోసినచందమునను, గారుతిమిరంపుగుంపు సొంపారఁ బర్వె. 141

చ. అనువుగ మిన్ననుం గడితపాశెతమంబునఁ గట్టిపెట్టు శో
భనతరచంద్రదీధితులపంక్తిజమాఖరుచు ల్గణించి యిం
తనుకొని కాలమన్ గణకుఁ డప్పుడు తీర్చి లిఖించి నట్టియా
దినవహిలేఖవ్రాలు లనఁగఁ దెల్విగఁ జుక్కలు పర్వె నత్తతిన్. 142

చ. జలకము లాడి జీనిబురుసాపనివస్త్రము గట్టి మోమునన్
దిలకముఁ దీర్చి క్రొవ్విరులు నించి కచాళిని గబ్బిగుబ్బలం
గలప మలంది గందవడి గమ్మునఁ బూసి నృపాలు నింటికిం
జెలియ చనం దలంచె రతిశిక్షకు రెండవనాఁటిమాపునన్. 143

తే. పోవుచో నమ్మరాళంబు పొంత నిల్వఁ
జెలియ పూనిన జిగినీటు కులుకుఁ జూచి
రాజహంసంబు పలికె నో రాజవదన
పోయెదవుగాని యుపముతోఁ బొసఁగి మనుము. 144

క. ఉపమ యెఱుంగనివారల, కపరిమితావస్థ లొందు నది యెట్లనన
య్యుపమ యెఱుంగక కాదే, చపలత మున్నొక్కనక్క సమసెం బెలుచన్. 145

వ. అనిన విని హేమావతి యిట్లనియె. 146

## రెండవరాత్రికథ.

క. ఆకథ వినియెద నడుపు సు, ధాకరకలు రాలఁ దేనెధారలు చిలుకన్
లోకేశతురంగమ యన, నాకలికికి రాజహంస మప్పుడిట్లనియెన్. 147

క. వినవమ్మా హేమావతి, కనవమ్మా స్థూలసూక్ష్మకార్యములు దగన్
మనవమ్మా నన్నోచ, క్కనికొమ్మా మెచ్చుకొమ్మ కథ విని పొమ్మా. 148

క. విభ్రమమణిమండన మన, నభ్రంకష సౌధకేతనాంశుకజనితా
దభ్రానిలహతగతిజా, తాభ్రమణిహయశ్రమోద మప్పుర మమరున్. 149

క. ఆపురవరమణిలో గుణ, దీపక నామమున భూమిదేవుం డలరుం
జూపట్టి వేదశాస్త్రి, వ్యాపారముచేత రెండవవిధాత యనన్. 150

సీ. అఱుఁగులనున్నపుటెఱమట్టిపట్టెలు, దీర్చినగోడలు తేజరిల్ల
నిండుసున్నపుఁబూఁత నెఱచాలు బోదెలు, దిద్దినదేవరమిద్దె దనర
నారికేళపుపట్టె తీసగా నలికిన, ముంగిలిమలెసాల ముద్దుగులుకఁ
బంచవన్నియముగ్గు పద్మము ల్నించిన, బృందావనములోఁగి లంచె వెలయ

తే. నుదికిన మడుంగుదోవతు లుంచినట్టి, దండె మాపాసనము నేయు కుండ మమరఁ
బడలిక లడంచు పసపాకుపందిరలర, నుండు నాబ్రాహ్మణునిగృహం బుత్పలాక్షి.

చ. ఆతనికిఁ జారుశీల యను నంబుజగంధిసుగంధి యొప్పఁ ద
త్సతి తనయుండు లేమిఁ బరితాపముతోఁ గడుపుణ్యభూము లా
యతమతిఁ ద్రొక్కి బూర్వసుకృతాంశముచే నొకఁ డుద్భవించె సం
తతశుభధాముఁ డప్రతిమధాముఁడు కామగుణాభిరాముఁ డై. 152

వ. అంత గర్భాధాన పుంసవన సీమంత జాతకర్మ నామకరణాన్నప్రాశన చౌలోపనయన వివాహ ప్రాజాపత్య సౌమ్యాగ్నేయ వైశ్వదేవ గోదాన స్నాతక పితృమేధంబు లను షోడశకర్మంబు లెఱుంగం జేసి. 153

తే. వానితలిదండ్రు లత్యంతవత్సలతను, బూఁటపూఁటకు గోముచేఁ బొసఁగఁ బెంచి
ప్రాభవం బొప్ప నసమానవైభవమున, ఘనతఁ షోడశకర్మాధికారిఁ జేయ. 154

వ. అంత నత్యంతకుశలస్వాంతంబున నవ్వటుశిఖామణి వేదవేదాంగాది బ్రహ్మవిద్యాభ్యాసానంతరంబున గానంబును గవిత్వంబును గోక్కాకంబును జూదంబును దేశభాషయును విజ్ఞానంబులు లిపిలేఖనంబును జరాచరాన్యథాకరణంబును విలువిద్యయును సర్వశాస్త్రపరిజ్ఞానంబును శాకునంబును సాముద్రికంబును రత్నపరీక్షయు నరదంబుఁ బఱపుటయుఁ దురగారోహణంబును మల్లశాస్త్రంబును బాకచమత్కారంబును దోహదప్రకారంబును ధాతుగంధరసవాదంబును గుట్టుపనులవినోదంబును మహేంద్రజాలంబును జలాగ్నిస్తంభనంబును మొనకట్టును వాక్కట్టును రయస్తంభనంబును వ

శ్యాకర్షణమోహనంబులును విద్వేషణోచ్చాటనసంహారణంబులను గాలవంచనంబులును బత్తిగతిభేదంబులును యోగవాదంబులును వచనసిద్ధులును ఘుటికాసిద్ధులును నింద్రజాలంబును నంజనభేదంబులును ధృతివిశేషజ్ఞానంబులును వంచనంబులును స్వరవంచనంబును మణిమంత్రక్రియలును జోరత్వంబును జిత్తరువు వ్రాయుటయు లోహకారకత్వంబును శిలాభేదకర్మంబును గులాలకర్మంబుచే రథకారకర్మంబును శూర్పకారకర్మంబును జోళ్లునిర్మించుటయుఁ బటకారకర్మంబును నదృశ్యకరణియు దౌత్యకర్మంబును వేఁటసన్నాహంబును బేరంబును బాశుపల్యంబును గృషియు మైరేయంబుఁ గూర్చుటయు లావుక కుక్కుట మేషాదులపోరు హత్తించుటయు ననియెడు చౌషష్టివిద్యలమర్మంబు లెఱింగి యొప్పుచుండు. 155

క. ఈరీతి సకలవిద్యల, నారూఢిగ నారితేరి యవ్వటుఁడు సదా
చారస్థితి గంగాయా, త్రారంభవిజృంభమాణహర్షోదయుఁడై. 156

సీ. సకలౌతికుల్లాయి యొకయింతఁ గాన్పింపఁ, జుట్టియుండినపంచె సొంపు దనరఁ
బడెడుబియ్యము పండఁ బాపైనతపెల యుం,చినచిన్నియసిమిదోస్సీమ వెలయ
ముంజిపైఁ గనుపట్ట ముద్దుగాఁ గట్టిన, యంగవస్త్రపుగుడ్డచెంగు లలర
మాంజిష్ఠిగలిపినమంత్రాక్షతంబులు, పోసినమూరెడుబుఱ్ఱ యమర

తే. ధాతశాటియుఁ బరిపాటిధావళియును, వఱలవేదాంతశాస్త్రంబు వ్రాసినట్టి
తాళదళపుస్తకము చంకఁ దనరఁ బూని, చనియె గడిదేరి యాబ్రహ్మచారి మీఁతి.

క. ఈలీల సకలపురములు, శైలంబులు నదులు నిధులు శాఖిచయంబుల్
గాలువలుఁ బల్లెపట్లము, లాలోకింపుచును బోయి యవ్వటు వెదుటన్. 158

సీ. ప్రాలేయశైలాధిపాలకసంజాత, కర్పూరధాతలోకప్రపూత
జలధినాయకుఁ డేలు సరసంఘటిల్లాలుఁ, బటుభగీరథతపఃఫలము వేలు
తారాధ్వఘట్టనోద్ధతవేగకల్లోల, యఘమహారణ్యదావాగ్నికీల
చంద్రశేఖరశిరస్థలశుభ్రసుమదామ, చందనకుందేందుసదృశధామ

తే. రంగదుత్తుంగదీర్ఘతరంగసంఘ
ఘుమఘుమధ్వానమేఘనిర్ఘోషనృత్య
దహిభుగుద్వేలవాలాంశుయామునోరి
సంగమభ్రాంతిదాభంగ గంగఁ గనియె. 159

మ. కనియభ్యంచితదివ్యతీర్థములలోఁ గౌతూహలం బొప్పఁగా
ఘనవిస్ఫారతి మీర భైరవుని కర్ఘ్యం బిచ్చి సంకల్పముల్
వినతుల్ స్నాన మొనర్చి తత్తటమహోర్వీవాసవిద్యాశ్రీవృ
ద్ధవికౌయంబొగిఁ దెల్ప జాహ్నవిమహాత్మ్యంబుల్ వినెన్ భక్తితోన్. 160

వ. అంతట నాబ్రాహ్మణకుమారుండును దత్తీర్థవాసులకు నిజార్జితద్రవ్యంబులు వ్యయంబు చేసి గోభూతిలహిరణ్యాజ్యవాసోధాన్యగుడరౌప్యలవణంబులనుదశదానంబులనుదు లాపురుష హిరణ్యగర్భ బ్రహ్మాండకల్పవృక్ష సహస్రధేను హిరణ్యకామధేను హిరణ్యాశ్వ హిరణ్యరథ హేమహస్తి హేమలాంగూలపంచలాంగూలవిశ్వచక్ర కల్పలతాసప్తసాగర రత్నధేనుభూత సంఘట్టనంబులను షోడశమహాదానంబులు చేసి కాశికాపురంబున కరిగె నప్పుడు 161

సీ. చిత్రకూటసమానచిత్రకూటవిమాన, భాసురంబు విశిష్టభూసురంబు
వైజయంతవితానవైజయంతివితాన, భూషణంబు నృపాలభీషణంబు
భాసమానశశిప్రభాసమానక్షేమ, సుందరంబు కిరాటమందిరంబు
సుమనస్తుతోద్దామ సుమనస్తుతారామ, బంధురంబురుగ్న్యాత్రసింధురంబు
తే. సతతబహువైభవాసదృశప్రభావ, కీర్తిరాజితకుండలీకృతసుధీర
స్ఫురన్మణిదీపసప్రాంశువలయలలిత, గోపురంబు రహింపఁ గాశీపురంబు. 162

ఉ. ఆపుటభేదనేంద్ర ధృషదాపఁ కల్పితగోపురాగ్రపై
నేపున మాపు రేపుఁ జను నిందుదినేంద్రులపర్వతిద్యుతు
ల్వాపురి వీనికిన్ గ్రహణబాధయ పర్వములందు నే క్రియన్
బ్రాపిత మయ్యె నంచు మది భ్రాంతి వహింతురు తాంత్రికోత్తముల్. 163

తే. అట్టిపుణ్యస్థలంబున కరిగి వేడ్క, గడలుకొన మణికర్ణికాఘట్టమునను
నిలిచి జలకచ్ఛమున స్నాననిష్ఠఁ బూని, వెడలి మాధ్యాహ్నికక్రియ ల్వేగఁ దీర్చి.

క. మణికర్ణిక మణికర్ణిక, మణికర్ణిక యనుచు నడుపు మనుజుల కెల్లన్
గణనాతీతపుదోషము, లణఁగి శతక్రతుఫలంబు లగునని తలఁచెన్. 165

వ. అంతట నవ్వటుశిఖామణి పంచకంబుల రుద్రన్యాసయుక్తంబుగా విశ్వేశ్వరునభిషిక్తుం జేసి పూజించి ప్రదక్షిణనమస్కారంబులు గావించి యిట్లని స్తుతియించె. 166

సీ. జయభక్తమందార జయదుష్టజనదూర, జయజగదాధార శరణుశరణు
జయనిత్యకల్యాణ జయభృత్యసంత్రాణ, జయరమాధిపబాణ శరణుశరణు
జయగోత్రపుత్రీశ జయరక్షితసురేశ, జయపంచశరనాశ శరణుశరణు
జయశరద్ఘనగాత్ర జయపావనచరిత్ర, జయకేందుశిఖినేత్ర శరణుశరణు
తే. జయనిశితశూలసాధన శరణుశరణు, జయమఖామోఘనాశన శరణుశరణు
జయహయాకృతనందీశ శరణుశరణు, జయమహాదేవవిశ్వేశ శరణుశరణు. 167

సీ. శ్రీపార్వతీకుచశిఖరిస్థలవిహార, హారాయమాణమహాభుజంగ
జంగమస్థావరసంచారసమభావ భావజరూపప్రభావహరణ

రణరంగనిర్జిత రౌద్రమహాసుర, సురయక్షసేవిత చరణయుగళ
గళధరస్థాపిత కాలకూటక్షుర, ఖరాష్ట్రపుత్రీశ ఘోరబాణ
తే. బాణనామకరాక్షస త్రాణదక్ష, దక్షకల్పిత యాగవిదారణోగ్ర
యుగ్రభీమాదినామధేయప్రసిద్ధ, సిద్ధభయభంగ కాశివిశ్వేశలింగ. 168
క. అని సన్నుతించి వేడ్కలు, గొన గాంచెంగ బ్రహ్మచారికుంజరుఁడు గ్రమం
బున దేవతాధివాసము, లనువొందఁగఁ గాంచి భక్తి నలమినమతితోన్. 169
క. ఢుంఠిగణాధ్యక్షుని శితి, కంఠుని భైరవునిఁ జండికఁ బటువిద్యా
త్కంఠీరవ మపుడు మహా, కుంఠితతాత్పర్యములను గొలిచి భజించెన్. 170
వ. తదనంతరంబునఁ బంచక్రోశంబునం గల మహాదివ్యలింగంబుల సేవించి యచ్చోటు
వాసి త్రిస్థలికి జనహితసన్యాగయి యగుగయకుఁజని గదాధరుంగొనియాడి ప్రయాగ
కరిగి త్రివేణీసంగమంబునఁ గృతస్నానదానాద్యనుష్ఠానుండై మాధవునారాధించి
స్పష్టపుటంబుంగనుంగొని త్రివేణీతీర్థంబులుఁ నించినకావడి గైకొని పంచక్రోశం
బుననొక్కసురకలలింగంబు సంగ్రహించి నిజస్థానగమనోన్ముఖుండై. 171
సీ. కావడిపై నంటఁగట్టిన యొకకావి, శాటికంబళియాత్ర సంచి యలర
నేతిలడ్డిగనీళ్ల నించినసోరకాయ, బుజ్జలిర్వంకలఁ బొసఁగియుండ
నెగనెత్తి కుఱుచగా బిగియఁ గట్టినపంచె, పైబిగించిన ప్రాత బట్ట యొప్ప
ముఖఘర్మములటోప ముణుఁగఁజుట్టినవల్లె, కొనలు మారుతలౌల్యమున హరింప
తే. గమనజవమున చట్ట్రాడు కాప డదరి, కిఱ్ఱుకిఱ్ఱని భుజమునఁ గేసల్ప
గోడరుద్రాక్షమాలిక ల్కంఠసీమఁ, దనరవచ్చెను వేడ్కన తైర్థికుండు. 172
క. ఈరీతిఁ దనగృహంబున, కౌరయఁ జనుదెంచి కావ డటుదించి మహా
ధీరుఁడు జననీజనకుల, కారూఢిగ సంఘటించె సాష్టాంగంబుల్. 173
క. తత్సమయంబున వారలు, వత్సా మతి యాత్రసలిపి వచ్చితె యని య
ద్వ్యత్సంతోషంబునఁ దమ, వత్సస్థలిఁ జేర్చి ప్రేమ వర్ధిలి చెలఁగన్. 174
తే. శిరము మూర్కొని వదనంబు చెమట నుడిచి
యాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధి
గాను దీవించి యత్యంత కరుణ మెఱయఁ
గొడుకుతోడను నిల్లని నుడివి రపుడు. 175
క. ఏయేపుణ్యస్థానము, లేయేతీర్థస్థలంబు లేయేద్వీపా
లేయేభూములు చూచితి, వాయామహిమలు వచింపు మర్భక మాకున్. 176
క. అని యడిగిన తలితండ్రుల, కనునయమునఁ గాశి గయ ప్రయాగము మొదలౌ
ఘనపుణ్యక్షేత్రంబులు, గని వచ్చితి లింగ మిదిగొ కౌతుక మమరన్. 177

క. ఈపురవరమణిచెంగట, నీపరమేశ్వరుఁ బ్రతిష్ఠ నెంతయుఁ జేతుఁ
దాఁ బురము మోక్షలక్ష్మికిఁ, గాపుర మభివృద్ధిఁ బొందు, గద మన కనియెన్. 178

తే. పుత్త్రకునివాక్యవిస్ఫురదాహ్లాదమునకుఁ, దల్లిదండ్రులు సంతోష ముల్లసిల్లి
నపుడు పాషాణభేదుల కర్థమిచ్చి, శివి నొక దేవళంబు గట్టించి రపుడు. 179

సీ. దండమైన గర్భగృహం బంతరాళికం, బును ముఖమంటపంబును జెలంగ
గాలిమంటపము ప్రాకారంబు లోలీలు, బోదెలు, చుట్టలు పొందుపడఁగఁ
గప్పటచట్టము ల్ఘనగోపురమ్ములు, నగతియుఁ జప్పట ల్సొగసుగులుక
గచ్చుగోడలు రాతికంబము ల్వాలసున్నము సుపర్ణము ద్వారసమితి వెలయ

తే. దృష్టిపాత్రపుబొమ్మలు దెజరిల్ల, నుఱుకుసింగంబు లరగూళ్లు మెఱుఁగుఁదోర
ణములు చిత్రరూపక్రోంబనుల్ రమణ కెక్క, దేవళము మించె నత్యంతదివ్య మగుచు.

క. ఆదేవళంబులోన మ, హాదేవుని నొక్కదివ్య మగుశుభవేళం
బాదుగఁ బ్రతిష్ఠ చేసిరి, వేదాగమశాస్త్రరీతి వేడ్కదలిర్పన్. 181

సీ. చెఱఁగుచోపతిపైనిఁ జీరాడఁగా బోడి, తలఁజుట్టు ధాతవస్త్రంబు మెఱయఁ
జెక్కులకును డిగి పిక్కటిల్ల విభూతి, పెండెకట్లు లలాటభిత్తి నమర
గళమున నలిగొన్న కావిదారముతోడి, రుద్రాక్షమాలికల్ రూఢిఁ దనర
మారేడుబుట్టలో మక్కళించినసందిఁ, గట్టినచంద్రశేఖరుఁడు వెలయఁ

తే. బెట్టె మూఁకుడులో మొగబీరపత్రి
మట్టిధూపార్తి దీపముఁ బెట్టు చమురుఁ
బొందుపఱచుక మునిమాపు పూజసేయఁ
గ్రొత్తకాణాచితంబళి హత్తుకొనియె. 182

క. ఈతీరున నలతంబళి, భూతేశునిపూజసేయ బుష్పంబుల సం
ఘాతముగొని తేలే మని, యాతట్టున నొక్కతోఁట నమరఁగఁ జేసెన్. 183

సీ. సంపెగల్ మొల్లలు జాజులు గన్నేర్లు, విరజాజులును మంచి కురువకములు
ప్రొద్దు దిరుగుడుపూలు పొన్నలు మల్లెలు, పారిజాతములు సేవంతి విరులు
తామర ల్సూర్యకాంతమ్ములు కల్వలు, బొండుమల్లెలపొద ల్పొగడతరువు
లల్లిపువ్వులును నంద్యావర్తములు వాడ, గన్నేరులు తురాయి గట్టిపూలు

తే. మాచిపత్త్రిరి గగ్గెర మరువము కురు, వేరు దవనమ్ములును పట్టివేళ్లు గుములు
బిల్వవృక్షము లాదిగాఁ బేరుగలవి, ప్రబల నొకతోఁట వేయించి బావిద్రవ్వె. 184

మ. అమితానర్ఘ్యనిబద్ధశుద్ధశశికాంతాయామసోపానసం
గమ మంజుగ్రహణాగతోరుఋధి కాక్రాఁ తమ్ఫురత్కుట్టిమం

బమలాంభోరుహషండపాండుకుముదాచ్ఛామోద సంవాసితం
బమృతప్రాయజలాభిపూర్ణ మగుచు న్నాబావి యొప్పుంగడున్. 185

క. అబ్బావికిఁ జేయేతం, బుబ్బుచుఁ దంబళి యొనర్చి యుత్సాహంబుణ్
గుబ్బతిలఁ గొన్ని చెట్లకు, నిబ్బరమున జలములెత్తి నిస్త్రాణుం డై. 186

తే. ఎలమి మఱికొన్ని చెట్టుల కెత్తియెత్తి, యలసి ముంగిసమ్రానితో నానియుండ
గుండ నిండారఁగా ముంచి కూడు దినఁగ, నింటి కేగెను బడెలిక లంటి పెనఁగ.

వ. అంత నొక్కబక్కనక్క గుక్కమిక్కనుచు డొక్కం బిక్కటిల్లిన క్షుధానలం
బున దందహ్యమానం బై డస్సి. 188

తే. పుట్టలను దిట్టలను జెట్లఁ బొట్లఁ గట్ల, వంకలను డొంకలను బీళ్లఁ బాళ్ల జాళ్ల
గుప్పలను దిప్పలను మళ్ల గుళ్ల నూళ్ల, దిరిగి యాహార మందక సొరిగి యరిగి. 189

సీ. వాణికై పోరాడ వచ్చి యొందఱు బ్రహ్మ, దేవుల మనువారు దీరి చనిరి
పార్వతీరతులకై బహుపోరి యొందఱు, రుద్రుల మనువారు రోసి చనిరి
సిరినిఁ జేపట్టఁగాఁ జేరి యెన్ని దశావ,తారము ల్గలహించి తీరిపోయె
శచిమాఱుమనువు రచ్చలఁ బెట్టి యొందఱో, నింద్రులమనువార లేగి రహహ

తే. చూడ నవి యెల్ల యుగచర్య సుద్దులయ్యె
బోయెఁ గాలంబు పూర్వ విస్ఫురణదప్పె
దార్ఢ్య మాలోచనము తెల్వి దగ్గపడియె
నౌరవిధి నేటి కిట్లాయె ననుచు నడరి. 190

తే. ప్రాముజఠరాగ్నిచేఁ గింక రోమియనుచు, నడరు వేదనచేఁ గ్వయాస్వామి యనుచు
విస్మయపుమూర్ఛచే నాహ తోస్మి యనుచు, బలువరింపంగ సాగెన బ్బక్కనక్క.

వ. ఇట్లు క్షుధాతురత్వంబునఁ గంఠగతప్రాణం బై నోరం దడిలేక మాటిమాటికిఁ బొడ
ము మూర్ఛల నలసి సొలయుచు మెత్తమెత్తగావచ్చి తత్కూపతటస్థిత ద్రోణికా
గ్రంబున నున్న యల్పజలంబులం దనకంఠంబుదడిపికొని యయ్యేతంబుముంగిసమ్రా
నికి వెదురునకు నంటఁ గట్టినవారు పరిమళం బాఘ్రాణించి దోనిం బడి చని నేఁడీ
పశుకృత్తిరజ్జువున క్షుధాభారంబు హరించెదననితలంచి యుబ్బుచు నెక్కొనుతమ
కంబున ముంగిసమ్రానిపైకిఁ జివుక్కున నెక్కి యబ్బక్కనక్క దారు వేణుబంధనఁ
బగుచర్మరజ్జువుఁ దెగం గొఱికిన. 192

తే. మ్రాను మీటుగ నెగయ గోమాయు వప్పు, డేకతాళప్రమాణము లైగసి కూన
గుంతలోఁబడ గ్రుడ్లువెల్కుఱక నాల్క, నడుమ గఱచుక నఱచుచు బెడిసిపడిసె.

వ. ఇట్లు క్షుధాతురత్వంబున నాహారంబె చూచెఁగాని తనచేటు దెలియదయ్యె నివా
నక్క తెఱంగున రాజసంయోగంబె చూచెదవుగానియితరోపద్రవంబులువిచారింప

నయిన నిత్తెఱంగునఁ జిత్తంబునఁ బత్తిరంబు లేక తెలిసి మెలంగు మని హంసంబు
వినయోక్తులు పలుకుసమయంబున. 194

ఉ. అలమినవేడ్క ఘోటకనకాంగులు సజ్జగఁ బిల్కఁగాఁపుఁగాఁ
తులు తెలియావనాళములు ద్రొక్కఁగ జారగభీరనాయిక
ల్నిలయముఁ జేరఁ దస్కరులు నెక్కొనుభీతిని దావు లెక్కఁగాఁ
గెలఁగుచు వేగుఁజుక్క పొడిచెన్ బలసూదనదిక్తటంబునన్. 195

క. అంతట హేమావతి గే, హాంతరమున కేగి పార్థివాయత్తమతిం
గంతుసుమకుంతదళిత, స్వాంతంబున నా దినాంతసంతమసమునన్. 196

చ. కలపము గబ్బిగుబ్బలను గప్పుచుఁ బువ్వులసరాలు గొప్పునం
గులికెడిచంద్రకావి నెఱి కుచ్చెలఁ దీర్చినకోకశ్రోణినిం
దిలకము మోమునన్ మణులఁ దీరినసొమ్ములు మేన వేడుకన్
వెలయ నమర్చి మేల్ముసుగు వేసి నృపాలునికేళిఁ జేరఁగన్. 197

---

## మూఁడవరాత్రికథ.

క. కలహంసోజ్జ్వలరత్నశ, కలహంసక యుగము ఘల్లుఘల్లని మ్రోయన్
గలహంసగమన చనఁగాఁ, గలహంసము హేమవతిని గని యిట్లనియెన్. 198

ఉ. ఇంకొకగాథగద్దు విను మింతటిలోఁబడి పాఱిపోవఁ డో
పంకరుహాయతాక్షి యుపభర్తల హత్తుక తత్తరాన మీ
నాంకునికేళిఁ దేలఁగఁ జనంగ నొకానొకమాట వచ్చినన్
బొంకఁగలేవు బంతి యని పొంకపలెం గులటావధూటికిన్. 199

క. అని రాజహంసమణి పల్కిన హేమావతి వినోదకేళిగతి గిరు
క్కున మరలివచ్చి యాకథ, వినియెద నను వొందఁ జెప్పు విహగోత్తంసా. 200

వ. అని యడిగిన హేమావతికి హంసం బిట్లనియె. 201

క. విను మనఁగా ననఁగా నొక, కనకోజ్జ్వలకూటఘటిత ఘనగోపురశో
భనకృతకధరీకృతనా, కనగరిమణిభద్రపురము గల దొకభూమిన్. 202

క. ఆనగరము భోగప్రతి, భానగరిపుఁ డైనమాణిభద్రుఁడు భద్రా
నూనచరిత్రుఁడు కాంతిను, ధానిధి నృపు లెంచ శాశ్వతమ్ముగ నేలున్. 203

తే. అతనిచెంగట నసహాయుఁ డనెడువాఁడు, చండదోర్దండమండిత మండలాగ్ర
దండితారాతిరిపుతల గుండుగండఁ, డనెడిబిరుదు దొంది తిరుగు నాయకులలోన. 204

సీ. భిండివాలాసికోదండభల్లాతక, నారాచరోహణనఖరవజ్ర
ముష్టిముద్గరహలముసలభుసుండిక, ప్రాసప్రకూర్మకర్పటకటార
కాగరాయోదండకణయకుంతాంతళ, పరశుతోమరచక్రపరిఘపట్ట
సములునంకిణికొదిసబళంబు చివ్వఁటె, సెలకట్టె యాదిగా నిల నుతింపఁ
తే. దనరు ముప్పదిరెండాయుధములు మఱియుఁ
జిఱుత చెయ్యమ్ము గండగత్తెర తుపాకి
గొరకను సుగాలమును గ్రద్దగోళ్లు బుట్టె
చూరిబాణాసరించు నవ్వీరుఁ డెపుడు. 205

వ. వెండియు నవ్వీరుండు సమదండ గజదండ భృంగిదండ యెడమపరభృంగి కుడిపరభృంగిభృంగిపటలముపయి నరపుదండ సింగంపుదండపాదలికదండ యడుగడుగుపాదలికదండ మద్దెలసంచుదండ కుక్కుటపుదండ మొదలుగాఁగల పదిరెండుదండల యఖండపాండిత్యంబు దెలిసి యెడమడుగుపరువడి కుడియడుగుపరువడి కదలుపరువడి దాఁటుడుగుపరువడి కోపుపరువడి అంత్రటీకనాట్యము ధాయ దాణుధోణఉరు ధోడ ఝూటుధాణు కపాలు ధారుకధారుక ధాకు ధాణు ధాకు ఝూటు నివి మొదలైన పదునాలుగువిసరులమర్మంబులుం జూచి కక్కి కొక్కిస డొక్కరము త్తెర డొక్కరము కుమ్మరింపు బోడింపు సందుసీసంబును గొంతుమాసును సమసంబును సురాటంబును జేవయుఁ గందనంబును గల్లంబును ద్రోపును గిర్లయుంబరిబొందుటయుఁ గొండివేటును ఘణంబును గస్తాతుసు భారంబును చొంగిణియుఁ బెట్లాగును రూణింపును సరిబిత్తరంబును లాగును విట్టాలయంబును దిణింగిణియుఁ బాదనివారణంబును బాదగళాప్తియు గళకత్తెరయుఁ గాళనిల్కడయు నృసింహంబును నాదియగు ముప్పదిరెండువిన్నాణంబుల నాణెంబు పరీక్షించి వంటియడుగుకత్తెర సర్వబంధకత్తెర పాదలికకత్తెర చిట్టడుగుకత్తెర పావుపావులు జాగినపావు మొదలుగాఁగల పదిరెండుపరువళ్లయగణ్యప్రావీణ్యం బెఱింగి హరిగతి గజగతి వ్యాఘ్రగతి మహిషగతి జంబుకగతి మర్కటగతి మార్జాలగతి హరిణగతి చకటగతి పక్షిగతి తాండవగతి నరగతి మొదలైనపదిరెండుగతుల యవార్యచాతుర్యంబు నేర్చి విష్ణుచక్రంబును రామబాణంబును నాగబంధనంబును ద్రోలకరి మెఱుపును అల్లిమత్తును విస్సందును హస్తాభరణంబును బదఖండనంబును బరిత్రాడునులోబిత్తరి వెలిబిత్తరి సర్పాంకుశంబు మొదలుగాఁగల పదిరెండుగాయమానంబుల భేదంబులు విచారించి లోమొన వెలిమొన యునిమొన ముమ్మొన చతురమొన పుణ్యమొన పాపపుమొన చాటడుగుమొన కదలుమొన అరమీటుమొన నెఱమీటుమొన సరితాళంపుమొన యాదిగాఁగల పదిరెండు మొనల [illegible]రితేరి లో వెలిగ జ్జడుముకు చూరణనఱవు మొదలగునలుకులదగులుంగనుం

గొని దండలాస్యతాండవము తుటుము కలయిక మెలపు చక్కిం గ్రింపు దిశాపదిశలు పాదపు పాటవ హస్తపుపాటవ దేహపుపాటవ నయనపాటవ విపరీతకడ ఏకసర పైసర భృంగి పటలము ఝంపు డెక్కె కరలాఘవంబు లాదియగు షోడశోపవీతంబులరీతులు నేర్చి భ్రాంతంబును వ్రాంతంబును ఆప్లుతంబును ఆవిష్కృతంబును అక్షిప్తకంబును ఆకరంబును అవికరంబును మిశ్రితంబును మానుషంబును నిర్మర్యాదయు విచిత్రంబును ఛిన్నంబును సవ్యజానువు అపసవ్యజానువు క్షిప్తంబును ధృతంబును గూఢంబును లంబనంబును సవ్యబాహువు వినీలబాహువు త్రిబాహువు సవ్యోత్తరంబును ఉత్తరంబును తుంగబాహువు సవ్యకరంబును గ్రథితంబును యూథాధికంబును అపృష్టప్రహారంబును వల్గితంబును స్వస్తికంబు లనెడి ద్వాత్రింశత్ప్రచారంబులు విచారించి యనుక్రమపరాక్రమంబున సాటిలేక మెలంగు మఱియును. 206

ఉ. పాదవమేలు చెంపపయి జక్కగ వ్రేలు రుమాలు మీసము
లీఁదను జీరుకేలు జిగిమించఁగఁ గప్పినశాలు వైరులన్
వాములగెల్చు వాలు చెలువంబుగ దాల్చినపూలు నొప్పఁగా
నాకొరయొద్దసంబళికె లంచుచు నుండు నతండు 207

తే. అతనికులభామ గుణధామ యలఘుకామ, యతులితారామ యసమరూపాభిరామ
వదనజితసోమ యధికలావణ్యసీమ, హేమరేఖాసనామ యైయింతి వెలయు. 208

ఉ. కన్నులచందము న్నగుమొగంబు విధంబును గిల్కుపల్కులుం
జన్నులపొంకము న్నడుము చక్కఁదనంబును బాహులందముం
బెన్నెఱిగుంపుసోయగము బిత్తరి యాచెలియందకాక యే
కన్నియలందుఁ గన్గొన మొగాదిగఁ జూడమె మూఁడులోకముల్. 209

సీ. జల్లిమాటలుగాక సరిసేయవచ్చునే, సవరంబు లీశిరోజాతములకు
బూఁతసుద్దులుగాక పోల్పంగ వచ్చునే, చందనం బీమేనిగంధమునకు
మాటమాత్రముగాక దీటుగావచ్చునే, గగన మీనడుము సోయగమునకును
వదరుపల్కులుగాక తుదిసాటివచ్చునే, కిన్నరకాయ లీచన్నుగవకుఁ

తే. జక్కఁదన మెల్ల ముల్లెగా సంతరించి, బ్రహ్మదేవుండు తననేర్పు ప్రౌఢిచేతఁ
దీర్చిసృజియించెఁ గాబోలు దీనినవఁగ, వీటఁ జరియించు నొక్కొకవేళ నదియు.

తే. దానిఁ దనివారఁ జూడనిమానవుండు
మాఁచి తలయూఁచి మెచ్చనిసుజనవరుఁడు
మెచ్చి విరహార్తినొందనిమేటిఘనుఁడు
కలుగఁ డెంచైన మూఁడులోకములయందు. 211

క. మదమొదవు కోడెవిటులకు, హృదయపుటాంతరములోన హేమాహేమిక

బదివేల మన్మథులు పు, ట్టుదు రాసిమాటికుచపటుత్వము గన్నన్. 212

వ. అది మఱియును. 213

తే. బిడ్డపాపలఁ గని పెంచు జిడ్డులేక, తిండిచే గండమండైన దండికతన
నెసఁగు నసగూటిపిసవెఱ్ఱి కసరురేఁగి, జారవాంఛావిహారంబు సలుపసాఁగె. 214

చ. విటులకుఁ గొంగుబంగరము వేడుకకొంప్రకుఁ బట్టుగొమ్మయు
త్కటతరమన్మథార్తులకుఁ గల్పకుజంబు భుజంగకోటికిన్
ఘటితనిధానసీమ యుపకాంతులచేరువపంట జార స
త్పటలికిఁ బంచదార యను దానివిలాసమయారె యారయన్. 215

సీ. కరిమాపుమై సన్నకరలచీరటువిప్పి, చెలువైనసరిగంచుచీరఁ గట్టి
మెరుఁగంచుకమ్మలు దొరయనంచటుడించి, మఱులరంజిల్లుకమ్మలు ధరించు
జిటిపాటిసొమ్ము దీసి మెఱుంగుకట్టాణి, పూసలహారము ల్పొసఁగఁ దాల్చు
గుత్తంపురవికె దాహత్తకుండగఁ జేసి, కలపంబు కులుకుగుబ్బలను బూయు

తే. నడర బెడగైననిడువాలుజడ సడల్చి
కుప్పె గన్పడ సవరంపుఁ గొప్పుఁ బెట్టు
మఱియు ముంగిట నిలుచుండి మొలకనగవు
లెసఁగ విటభాగ్యరేఖయా హేమరేఖ. 216

చ. కిలకిలనవ్వు నెమ్మోవి పలుగెంటుల దీఁటుఁగుచంబు లోరగా
వెలువడఁ బైఁట వేయు నెఱి వింతగఁ గేరు మరుల్కొనంగ బె
ళ్కులు గొనఁ జూచు లేనిసగలుంగొని మాటికిఁ గుల్కుఁ గోటిచి
మ్ములు నొనరించు నవ్వెలఁది మోహపుఁ బ్రాయమువానిఁ జూచినన్. 217

సీ. ఏటినీఁటికటంచుఁ బాటిపంకెత్తుక, పలుమాఱు దిరుగు నిబ్బరముతోడ
రోలు రోఁకలి కంచు రూఢిగా నిల్లిల్లుఁ, దిరుగు నెప్రొద్దుఁ దత్తరముతోడఁ
గూరగాయల కంచుఁ గోరి తా బాజారు, కును మఱిమఱి నేగుఁ గొమరుతోడఁ
బనిలేనిపనిజోలి గొని వాడవాడలఁ, జరియించు సారె కచ్చెరువుతోడఁ

తే. బోలికలనెంచు వలరాచపోగరు నిగుడఁ
గులుకుఁ బ్రాయంపు నెఱనీటు కోడె కాండ్ర
గమికిఁ దనజగ్గు జిగిసంచకార మొసఁగి
వలపు రెట్టింప మెలఁగు నవ్వనజగంధి. 218

క. తనకంటికిఁ బ్రియమయ్యెడు, ఘనునొక్కనివెంట నంటి కౌతుక మొప్పన్
మనసంటి కౌఁగిలింపక, చన దింటికి దానిబల్వ్యసన మే మందున్. 219

సీ. అసువోసెడు దాని హస్తంబు రీతిని, గుంచెదీసెడుదాని కొమరుమిగుల

నడచిక్కుడయ్యంబు చందంబునను జెట్టు, విడిచినభూతంబు కడకతోఁడ
మద్దెలలో నెల్క మర్యాద నెఱిగె, గనబిల్కుసన్యాసి యనువుమీఱ
వల్లంబుపోనాడు వైశ్యుని కెనను, గాలుగాలినపిల్లి క్రమముదోఁప
తే. గంతుమాయల నుమ్మెత్తకాయఁ దినిన, నెత్తితెఱఁగున వ్యసనంపు నెఱపువోడమి
చికిలినెఱసన్నె కాఁడకు సిసము నెత్త, నెనసిచరియించు నీటు నా హేమరేఖ. 220
క. ఈలీలఁ బురములోపల, మేలౌ ప్రాయంపురూపు మీఁటగువారిం
జాలి భయ లజ్జ లన్నియుఁ, దూలి చనన్ వెన్నుఁ జఱచి తొలఁగక కలయున్.
వ. ఇత్తెఱంగున. 222
చ. చవిగొని జార వీరరతిసౌఖ్యము దెప్పలఁ దేల నెప్పుడున్
దివురుచు మోహవార్ధిని మునింగి యొకానొక కాలమందునన్
శివశివ కాఁపురంబుపయిఁ జింత యొకింతయు లేక చిత్తసం
భవునిజమాయఁ గప్పి కలఁపం దలవాకిట నుండు నెప్పుడున్. 223
శా. ఈమర్యాదను గొన్ని నాళ్లు సనఁగా హెచ్చైనకార్యార్థమై
భూమీశుం డొకనాఁడు పొమ్మనినచోఁ బూత్కారుఁడై యాగతిన్
స్వామీ కట్టడఁ జేసితే యనుచు నీ జన్మం బిదే లంచుఁ జిం
తామగ్నత్వముఁ జెంది మందిరములోనం జేరి పెండ్లాముతోన్. 224
వ. అసహాయుం డిట్లనియె. 225
తే. భూవరుం డొక్కపయనంబు పొమ్మటన్న
మంచి దని వచ్చితని సమ్మతించి నేను
సంబళము కంబళము కత్తి చద్ది చల్ల
డంబు కేడెంబు ధట్టి తెమ్మంబుజాక్షి. 226
క. అని పల్కరించినప్పుడె, ఘనకుంతల తోడు          మని యిం
పెనరవని యిచ్చి పనిచిన, జనె నాతఁడు పయనమయి విచారముతోడన. 227
వ. అట్లు సహాయుం డరిగినపిమ్మట. 228
క. ఆహేమరేఖ మదిఁ గల, మోహావేశమునఁ దోడిముద్దియతోడన్
బాహాబాహిఁ బెనంగెను, సాహో యని కంతుపాద శహరహిఁ గేరెన్. 229
చ. పొలుపగు మావిలేఁజిగురుపొందిక పోఁతపిరంగిలోన నె
క్కొలిపిన పుష్పగుచ్ఛ మనుగుండు పరాగపుమందు నించి వె
న్గలపుఁబరాక్రమాగ్నిఁ గొని కంతుఁ డనేటపరంగిభామ గు
బ్బలనెడుదుర్గము ల్పగిలిపార గుభిల్లున నేసి యార్చెనన్. 230
క. అలికుచ మూర్ఛిలి తెలుసుక, కళవళపడి లేచి మనసు గాసిల్లంగా

ఖళిరా యని కొలువడి తన, సేవకులను జూచికొనుచు నిలుచున్నఁతన్. 231

చ. మెలిపడుతీఁగమల్లె జిగి మించిన సోగ జినుంగుపచ్చడం
బలుపడు చల్వదోవతి యొయారపు గందపుఁబూఁతడొల్లుపో
గులు మణిముద్రిక ల్వెలపు గుల్కెడువీడ్యము చంకశాస్త్రమం
పుల్లెలతుద ముచ్చెలుకొనెలయఁగ స్తగుణంగను వైద్యుఁ డొప్పఁగన్. 232

తే. వైద్యమాత్రంబునన కాదు సజలునట్టి, నిరుపమాకార సౌభాగ్యవిస్ఫురణచేత
నాశ్వినేయులతో నైన నతఁడు వాదు, కెదిరి యోజింపకయె జవాబియఁగలఁడు.

వ. మఱియు నశ్వగంధాదిఘృతంబును శైలేయకఘృతంబును షట్పలఘృతంబును దూర్వాదిఘృతంబును బంచగవ్యఘృతంబును నార్ద్రికఘృతంబును గదళీకందఘృతంబునుగల్యాణఘృతంబును దండులీయకఘృతంబును గూశ్మాండఘృతంబును మొదలయిన ఘృతంబులు సేయ నేర్పును బంచాగ్నిచూర్ణంబును జిత్రకాదిచూర్ణంబును బడబానలచూర్ణంబును మాణిమంథచూర్ణంబును మరీచ్యాదిచూర్ణంబును తాళీసచూర్ణంబును నేలాదిచూర్ణంబును దుంబురుచూర్ణంబును గర్పూరాదిచూర్ణంబును బంచబాణచూర్ణంబును భృంగ్యాదిచూర్ణంబును నాదియైన చూర్ణంబు లొనరించుచు నుపమయు జించిల్యాదిలేహ్యంబును ద్రాక్షయాదిలేహ్యంబును బతుష్షిపరీచ్యాదిలేహ్యంబును గుసుమార్ద్రాదిలేహ్యంబును బిప్పల్యాదిలేహ్యంబును బిల్వాదిలేహ్యంబును గుండల్యాదిలేహ్యంబును మొదలుగాఁగల లేహ్యంబు లొనరించు నైపుణ్యంబును నారికేళాదిరసాయనంబును గుడనాగరాదిరసాయనంబును శిగ్రుపుష్పరసాయనంబును జాతిఫలరసాయనంబును సుకుమారరసాయనంబును భల్లాతకీరసాయనంబును సుదర్శనరసాయనంబును వారాహీరసాయనంబును విళంగాదిరసాయనంబును నమృతరసాయనంబును నాదిగాఁగల రసాయనంబులు సేయ పాఁటికి లెఱుంగుపిథంబును శరపుంఖాదితైలంబును లక్ష్మీనారాయణతైలంబును లాక్షాదితైలంబును ధన్వంతరితైలంబును బంచార్కతైలంబును బాశ్చాత్యనింబతైలంబును విషముష్టితైలంబును గేతకీతైలంబును స్నేహార్కతైలంబును వాతాంతకతైలంబును బాతికాతైలంబును భూనాగతైలంబును భృంగామలకతైలంబును మొదలగు తైలంబుల పరిజ్ఞానంబును నారికేళాంజనంబును సౌవీరాంజనంబును శింఖద్రావాంజనంబును నీలాంజనంబును గరుడాంజనంబును గపోతాంజనంబును గర్పూరాంజనంబును మొదలుగాఁగల యంజనభేదంబులఁ గూర్చుచమత్కారంబును నగ్నికుమారకము రాజమృగాంకము బూర్ణచంద్రోదయము వసంతకుసుమాకరము వాతరాక్షసము చంద్రహాసము చంద్రప్రభావతీరసము కందర్పాంకురరసము షణ్ముఖరసము కాలాగ్నిరుద్రరసము తాళకేశ్వరరసము ప్రతాపలంకేశ్వరము చాతుర్థికరామబాణము విష్ణుచక్రరసము విశ్వంభరరసము బడబానలరసము నారాయణరసము మదన

శైరవరసము భార్గవరసము జ్వరాంకుశము స్వచ్ఛంద భైరవము సంజీవనరసము రసభూపతి చింతామణి మొదలైన దివ్యరసౌషధంబులు గంధకరసనాభుల లక్షణంబు లెఱింగి విలుచు ప్రావీణ్యంబులును లోహభస్మ తామ్రభస్మ వంగభస్మ సీసభస్మ నాగభస్మ శంఖభస్మ ముపరభస్మంబులు సేయుటయు దుర్వ్యాది గుళికలం బరళ్యాదిమాణిక్యద్ర తాళీసమాత్రులుగల్గు నవధానంబును క్షీరద్రావకగుగ్గులు పిష్టకషాయంబులు మూలికలు తైలకల్కికలు సేయు నౌచిత్యంబును సూత్రస్థాన శారీర నిదాన శాస్త్రంబుల పరిచితియును డెబ్బదిరెండు నాడీభేదంబులును వాతపైత్యశ్లేష్మంబుల సుల్బణంబులైన ప్రశతషష్టి రోగంబులకు దత్తచ్చికిత్సలు చేయుచాతుర్యంబును గలిగి రెండవధన్వంతరి యనం బరగు నతండు. 234

తే. వీథివెంటను రాఁ జూచి వెలఁదియనియె, శౌరి యిల్లుండవలసె యొయ్యార మహాహ
హానిఁ జిక్కించుకొని మారవిగ్రహమున, భంగపడఁజేయ నిది యేటి పౌఢతనము.

క. అని తనమనమున ననుకొను, చును నిలుచున్నంత దాని సొగసు నొయారం
బును గని మనవిజయస్మో, హనవిద్యను జొక్కి యాతఁ డంచుకు రాగన్. 236

ఉ. ఎక్కడనుండి యెక్కడికి నేమిప్రయోజన ముండి పోయె దీ
వక్కట నామ మే మనిన నన్నియుఁ జెప్పి పరోపకారి రా
యిక్కలకంఠకంఠి యని యెంతయు దగ్గరఁ జేరి మారుఁడుం
బ్రక్కలు నెక్కొనం బొడువఁ బైకొను మోహముచేత లేవయున్. 237

తే. అమలశశికాంతకాంత శుద్ధాంతికకు, గానిశాంతాంతరంబున ఘుమ్మరనెడు
పచ్చబచ్చెన చిత్తరు పనులమించు, ప్రతిమసంఘట్టనల మంటపంబులోన. 238

చ. సకినెలకీలుకంఠమున జాయమెఱుంగులసొంపు కెంపు ము
క్కుకొనల పచ్చరాచిలుక కోళ్ళఁ దనర్చిన పట్టుపట్టెయ
ల్లికపయి జాఘరాజినుఁగు లేపునఁ జెందుపలంగుపోషు త
క్కిక గలజాళువాగొలుసు గీల్కొనుమంచముపై మహోన్నతిన్. 239

తే. అపుడు గుప్తగుణాహ్వయుం డనెడి వైద్యు
నెలమిఁ గూర్చుండఁ బెట్టి యా హేమరేఖ
పండుటాకులఁ గప్రంపు భాగములను
వేడ్కతోడుత నిద్దఱు వేసికొనుచు. 240

మ. సరసాలుం జిలునవ్వులు స్మరకథల్ సయ్యాటముల్ వింతలుం
గరిగింతల్ వలపించుటల్ చతురతల్ కాంక్షల్ వినోదంబులుం
దరితీపుల్ వలపుల్ మిటారితనముల్ దాటింపులుం దచ్చన
ల్నెఱబిస్నల్ మరపించుటల్ సొగసులున్నిట్టుల్ ప్రచారింపుచున్. 241

సీ. ఆసక్తి దీఱనియాలింగనంబులు, నురువాంఛ దరగనిఘురితవితతు
లనురక్తివాయనియక్షచుంబనములు, తమివెలిగానిదంతక్షతంబు
లభిలాష లుడుగనియతిచపేటంబులు, తాత్పర్య మెడలనితాడనమ్ము
లాక్షలు మానని చౌశీతిబంధము, ల్భావ మూననికరాస్పర్శనములు
తే. కలితకలకంఠకలహంసకలరవములు, పలుకు కికికిక కసకస ప్రకట టకుట
కకుట కహాకహా హాసనముల్గళరవములు, చెలఁగ నిద్దఱు రతికేళి సలుపునపుడు.

తెమలను నిన్నుఁ బాసి సుదతీ యని తీయనిసేమమోవి కా
యమృతరసార్ద్రమేని సమమా యని మాయనిమోహదాహసం
భ్రమ మెదలోన నెంతదలపా యని పాయనికూర్మితోడి నా
తమిపరభామలందు గలదా యని గాయనికాఁగిలింపుచున్. 243

వ. ఇట్లన్యోన్యసరససల్లాపంబుల గుప్తగుణుండు సురతకేళికాలోలుండై హేమరేఖతోఁ
బెనంగుసమయంబున. 244

సీ. కొప్పెరపెట్టుగాఁ గొమ్ముగొప్పనొనరించి, పైరుమాలు బిగించి పచ్చడంబు
నాగవల్లీదళపూగపూరితమైన పడిలోన నిడికొన్నయడప యొకటి
చాయలఁ దనరారుసకలాతియొరతోడి, పృథుభుజస్థలినొప్పు పెద్దకత్తి
చీర్ణంపుఁబనిచేత జిగిమించుకరమున, సొంపైన సత్తునున్నంపుఁగాయ
తే. పాదములమెట్లు మొలఁదాల్పఁ బడిన బాఁకు
చద్దిగట్టినవస్త్రంబు చంకదుద్దు
నపుర గమనజవోద్భవశ్రమముఁ జెంది
యప్పు డసహాయుఁడింటికి నరుగుదెంచె. 246

క. అరుదెంచి పురుషుఁ డుండెడి, యరువెంచి నిజప్రసిద్ధి కందఱు నళికే
బిరుదెంచి రోషవశుఁడై, సరిదంచితఘోషభాషఁ జానను బిలిచెన్. 245

క. జడియక యిపు డాసతి యే, పడువున బొంకంగవలయు వనరుహగంధీ
యడుగుం దప్పిన దప్పదె, పిడుగుం దప్పనను మాట పేర్కొన వినవే. 247

వ. అని. 248

ఉ. ఈవిధి హంసలోకవిబుధేంద్రుఁడు ప్రశ్న మొనర్చి పల్కె హే
మావతి కొంతకొంత యనుమానముతో బొటవ్రేల నేలరే
ఖావిధ మొప్ప వ్రాయఁ గుతుకంబున నీ కిది తోఁచెనేని ను
ర్వీవరుఁ జేరనేగుమని వేఁడిన నప్పువుఁబోడి యిట్లనున్. 249

క. నినువంటికతలకారిని, గనివినియెఱుగని నడుగఁ గావలెఁ గా నీ
ననువంటివానినడిగిన, వినుపింతునె యెట్లు బొంక వివరింపఁగదే. 250

క. అని యడిగిన హేమావతి, కను వాగం బొప్ప రాజహంసకలాపం
బనియె నసహాయుం డటులనె, ఘనరోషం బుట్టిపడంగ ఘూర్ణించుటయున్. 251

తే. వైద్యుం డప్పుడు గడగడ వడంకి నాథ, బుద్ధియేమరి పల్కె నప్పువ్వుబోడి
వెఱవక మటంచు దిట్టయై కన్నుఁ జరచి, సంచి విడిపించి యపుడు స్వస్వామికనియె.

చ. కడుపున శూలయెత్తి నడిగాలిసి ప్రాణము లేగునట్లయె
తొడిఁబడ నీవు లేమి ఘనదుఃఖముచే వెతఁ బొంది యీమహా
త్ముఁడు పునః నేఁగఁ గావు మరి తోడ్కొనివచ్చితి నీతఁ డౌషధం
బిడుటను నేను జీవము వహించితిఁ బ్రమ్మట నేమి చెప్పుదున్. 253

క. అని యున్న రస్సు వనునో, వన్నలోదరి రోగమునఁ బ్రియాంగనపౌరలన్
గని కుస్తరించి వైద్యుని, మనమున రంజిల్లఁ జేసి మమత దలిర్పన్. 254

తే. నీఋణము దీర్పఁ గలవాఁడ నేయటంచుఁ
బచ్చడం బిచ్చి బహుమాన మెచ్చ వైద్యుఁ
బంపి సందేహమందక భార్యతోడ
నిందు వేడుకనుండె నో నీరజాక్షి. 255

వ. అని మరాళశేఖరంబు చెప్పిన నరాళకచ యగు హేమవతి తనమనంబున. 256

క. సురుచిరమణితాటంక, స్ఫురితప్రభ చెక్కులందుఁ బొలయ శిరంబున్
మఱి త్రిప్పి పొగడె నహహా, గరితలమున్నదియె కాక కలదే పుడమిన్. 257

వ. ఆసమయంబున. 258

తే. మైవియల్లక్ష్మి కస్తూరిమల్లిచీర, రేయిఁ గట్టుక సడలించి రేపటికడ
నుదయరాగంబు దాల్చినయొఅపుడోఁపఁ, దమము జాఱంగ సాంధ్యరాగము జనించె.

చ. పలపల నయ్యెఁ దారకలు పక్షులు గూయఁ దొడంగె దీపముల్
వెలతెలఁ బాఱె దిక్కులకుఁ దెల్వి జనించె బిసప్రసూనముల్
దులదుల విచ్చెఁ దావులకు దొందడిఁ జేరిరి జారచోరులా
మలయసమీరణంబు కడుమందగతిన్ విహరించె నత్తఱిన్. 260

తే. తఱి యనుకశాదుఁ డుదయభూధరహసంతి
నరుణహేమంబునకు వన్నియలను నింప
గ్రాఁచి నీరార్చ నెత్తినకరడు నాఁగ
సూర్యబింబంబు పొడిచె నవార్యగతిని. 261

క. మణిఘంటలమొలనూలున్, ఝణఝణయని మ్రోయఁ గేళిశాలకు జని య
య్యణుమధ్య నృపార్పితగుణ, గణయై వసియించె దినము కల్పముగాఁగన్. 262

వ. అని ప్రత్యుత్పన్నమతి చెప్పినవిని సంతోషించి నలుండు తరువాతివృత్తాంతంబాన తిమ్మని పలికిన. 263

మ. హరకోదండ విఖండనప్రచురబాహాదండదండాయుధా
ద్యురుదిక్పాలసురాసివార్యతరబాణోద్దండదండాంకభి
ద్ధరిణాక్షీమణిజీవనాకృతినిజాభ్యాఖండఖండాబ్జభి
ద్భరసాభృద్రిపు వాహసన్నిభయశోభా కాండ కాండోదరా. 264

క. ధారాధరఘృణివారా, వారణరాజన్యవైరి వారణధీరా
ధీరాజిత శుభకారా, కారణపురుషానతార కరుణోదారా. 265

కలహంసోత్సాహవృత్తము.

కలుషదూర భవవిదూర కమలసారలోచనా
కలితహార వరవిచార ఖరవిహార మోచకా
లలితనీరనిధిగభీర లసదుదారకీర్తిని
ర్దళితహార శరపటీర ధరసుధారసోత్కరా. 266

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవిత్రాయ్యలరాజాన్వయసుధావార్ధిపూర్ణిమాచంద్ర నిస్సహాయకవిత్వనిర్మాణచాతుర్య నిస్తంద్రశ్రీరామనామపారాయణనారాయణామాత్యప్రణీతం బయినహంసవింశతి యనుమహాప్రబంధమునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు

# హంసవింశతి

## ద్వితీయాశ్వాసము.



శాంకరీశచాపవి
నాశ ధరాధీశ వంశనలినదినేశా
క్లేశ హరాకాశ దరా
కాశఝురాబ్జాభిరామ కాంతియశోమా.

వ. అవధరింపుము నలరాజన్యునకుఁ బ్రత్యుత్పన్నమతియిట్లనియె నట్లు హేమావతి కేళిని
శాంతంబుఁ జేరి రాజవిరహంబున నొండొకరీతిఁ బ్రొద్దు గడపుచున్నంత దినాంతం
బు గావచ్చిన. 2

శా. ఆహేమావతి మానసాటవిసముద్యద్దీప్తిమైఁ బేర్చుమా
రాహంకారపరాక్రమానలము బాహ్యస్థాన కేళ్యర్థమై
యోహో వెల్వడి పెక్కురూపములచే నొప్పారి కన్పట్టు నా
గేహాంతంబుల దీపపఙ్క్తులు చెలంగెం గెఱరంగు పొంగారఁగన్. 3

సీ. నును పెక్కు జిగిచెక్కులను మిక్కుటపుఁ డెక్కు, గ్రొమ్మోవుపంజుల క్రమ్ములలర
నిడువాలు గలకీలు జడమేలు నగఁగ్రాలు గొప్పైనసవరంపుఁ గుప్పెదనరఁ
దెలిపువ్వు కళ క్రొవ్వు వెలిరువ్వు చిఱునవ్వు, గలుగు నెమ్మోమునఁ దిలక మమర
రహిగుబ్బలుల నిబ్బరము ద్రొబ్బఁ గలగుబ్బ, కవమీఁదిపైఠిణీ యవిక మెఱయ
తే. బళుకుబళుకున గతులయం దళికి బెళుకు, కులుకుఁ గౌనున జాళువాతళుకులొలుకు
మేటియొడ్డాణ మలరార నీటుఁబూని, వచ్చి రాయంచకడ నిల్చె వనరుహాక్షి. 4

వ. ఇత్తెఱంగున నిరుపమశృంగారతరంగితాంగయై రాజపుంగవసంగమార్థంబరుగుచు దన
చెంగట నిల్చిన యారాజాననావతంసంబునకు రాజహంస బిట్లనియె. 5

## నాల్గవరాత్రికథ.

క. గప్పత్తుచిమ్మ నొకకథఁ, ప్రేమ్మటఁ దెల్పెదను వేణిఁ గ్రమ్మ విరులపైఁ
దుమ్మెదలు జుమ్ము జుమ్మనఁ, గొమ్మా తలయూఁచి మెచ్చుకొమ్మా నన్నున్. 6

వ. అని యిట్లు చెప్పఁదొడంగె. 7

క. కలదభ్రంకషకేతన, చలదభ్రం బైనచైత్ర శక ఘనపుర ము
జ్జ్వలదభ్రకచాదర్శన, దలదభ్రపురీసుపర్వ దారోదరమై. 8

సీ. వేదశాస్త్రపురాణ విద్యాగరిష్ఠులై, విలసిల్లుచుండెడి విప్రవరులు
గరిడిలో నెఱహొంత కాఱులై సాముల, మీఱినరాజకుమారమణులు
గోటికిఁ బడగెత్తుకొని యున్నసెట్టెక్కాము, ల్పెక్కులై వర్ధిల్ల బేరిజనులఁ
గడుధాన్యరాసులు గగనంబుతో రాయు, కలిమిచె మించిన కాఁపుప్రజలు
తే. భూమిమదధార లూరెడు వారణములు, ధాటిపాటనమున నొప్పు ఘోటకములు
ఘోరరణరంగపటులైన వీరభటులుఁ, బ్రబలియుండగ వెలయు న ప్పట్టణంబు. 9

క. ఆపట్టణంబులోపలఁ, జూపట్టును దంతువాయ చూడామణి రే
ఖాపట్టభద్రుఁడేసిరి, నేపట్టున నోరపోర మింతయులేకన్. 10

సీ. కుంచె మగ్గపుగుంత గూటఁబు పగ్గంబు పరిటె ద్రొక్కుడుపట్టె పలకదోసి
పరిపరియచ్చులు చరికుండయూడిత, చీడుదబ్బలు దండె నాడె కోవి
కోఁతిపుల్లలు నాల్కకడుతెరికొయ్యలఁ జొప్పయూచలుఁ గోఁత చూఱుకత్తి
కొరంపుఁ బడుగులు గండెలకప్పెర, గోలము లాకలు నిలికడవ
తే. గంప డొల్లకళాసంబు కదురుచెమికె, నూలురాట్నంబు జాలంబు గ్రాలుగ్రోడ
వణల నాశుభ భద్రు నివాసభూమి, యప్పురంబున సంతతం బొప్పుచుండు. 11

తే. గొప్పకన్నులు చిఱునవ్వు గులుకు మోము బవరిగడ్డము చక్కనై పరఁగు ముక్కు
నెగుభుజంబులు విపులత్వ మెసఁగురొమ్ము, జిగిమిగులులీల గనుపట్టుఁ దొగటసెట్టి.

ఉ. ఆఁటది నేర్పుతో నగల యందముఁ జందము జూపఁ బూని కో
లాటము వేయుకై పడిని లాలితదృక్తరళ ప్రభావళుల్
పాటిగఁ బోఁగు వెంబడిని బార్శ్వములం జరియింప వస్త్రముల్
ఘాటిగ నేయు నప్పలాక తట్టున బెట్టు ఖణి ల్లణి ల్లనన్. 13

తే. అరవిరుల తేనెచూలచాలు మరునివాలు, మిసమిసలప్రోలు పలరాజు మేటిడాలు
ముఱిపెముల కొచ్చుకొనఁ జాలుముద్దరాలు వానియిల్లాలు దొమ్మర వానిడోలు. 14

ఉ. దానిముఖప్రభాగరిమ దానికపోలకళావిశేషముల్
దానిచెడంగుచూపులును దానికుచంబులఁ జెంపనందముల్

దానిచెలువో విలాసములు దానికచాళియుచు ల్గణింపఁగా
మానవతీలలామ విను మర్త్యులమర్త్యులు నైనశత్రుశే. 16

క. జిగిఁజిలుకు కులుకుగుబ్బలు, నిగనిగలఁ జెలంగు నెఱులు నిద్దపుఁ గన్నుల్
నగవు దళుకొత్తు మోమును, మగువా యాబిడకె కాక మఱికలదటవే.

క. తొడలందము కటిచందము, నడుగుం దమ్ముల బెడంగు నాస్యము రంగుల్
జడపులుకుజ మెడకులుకు, న్నడబెళుకుం జూడ నాఘు నస్తని కమరున్. 17

తే. చిన్న చీమల నునుబారు చెలువయారు, గదళికాకాండములమీఱు కాంతయూరు
లందముల జెందు రతిఁగేరు నతివసౌరు, దాని కెనయైననారు లి ద్ధరణి లేరు. 18

క. కందర మాచెలి పొక్కిలి, కందర మావీఁగసనంబు కచము రదంబు
ల్కుందరమాసములు నా, కుం దరమా పొగడ నలకు కుందరనుకటిన్. 19

సీ. మిళిదంబుజలదంబు బలుడెంబు చెలఁడంబుఁ, దులకించు నష్టుద్ధు కలికివేణి
సిరిపట్టుఁ గలిగట్టు జిగిగుట్టు వెలిఁబెట్టు, చెన్నారు నక్కన్నె చన్నుదోయి
నునుకందు పైఁ జెందు నని యిందురుచి గ్రందు, పఱపఁగాఁ జాలు నబ్బాల మోము
తెలిదమ్ములను గ్రమ్ము కళ జిమ్ము ననయమ్ము, మిన్నయా నబ్బోటి కన్నుఁగవయుఁ

తే. దావి తేనియ బావియందములదీవి, మావిచిగురాకు చెంగావి మారుఠీవి
కప్పురంబులకోవి యక్కాంత మోవి, యనుచు వినుతింపనా నేత వనితయలరు. 20

తే. పరిమళ మెనంగు బంగారు ప్రతిమవంటి, తొగట వాల్గంటి జిగినీటు తొలకరింప
సొగసుకాండ్రకు మోహరాసులు జనింప, నూరయొకయోరఁ జెలువార బారసాచి.

సీ. పొంగు వెంబడిఁ బర్వి పొల్చు వాల్పూపుల, ధళధళ ల్వాదండ కళలనీనఁ
బుంజంపుకట్లు దెం పుటకుఁ బర్వెత్తుచో, మట్టెల ఖణఖణ ల్బెట్టు మోయ
గిలెత్తుచో బాహు మూలజాత ప్రభా, చక దకల్ పైఁడి వసంతమాడ
బరిటఁ ద్రిప్పగ జాఱు పైఁటలోఁ గన్పట్టు గుబ్బలమిసమిస ల్దొబ్బులాడ

తే. వింతవగకప్పు నెఱిఁగొప్పు వీట మెఱయు, నిగనిగ ల్జాతినీలాల నిగ్గునింపఁ
గుచభరంబున నడుము కొంకుచు వడంక, నూలుదోఁడును వేడ్క నవ్వాలుఁగంటి.

చ. కరములఁ గంకణాలి ఘలుఘల్లన రాట్నము ద్రిప్పు వేళఁ బైఁ
టర దిగజాఱి వెల్కుఱుకు నబ్బురపుజ వెలిగబ్బిగుబ్బపై
సరు లిసుమంత చిందుగొనఁ జిక్కని చూడ్కులఁ జూచువారి చే
యురమున గాడ నవ్వేలఁది యోర్పునఁ గండెలు చుట్టు నేర్పునన్.

ఆ. పడుగుఁ జేయువేళఁ బటము లల్లెడువేళఁ, గూడు దినెడువేళఁ గూర్కువేళ
మగని కన్నోరంగి మార్మగలను గూడు, నింటిపొరుగుసఖుల యిండ్లలోన. 24

క. గడిదేతీ జారవిద్యన్, వడిగట్టు దురంతకంతు వసజశరాళిజ

బడఁగాలనికతమున నా, ఁడువున నత్తొగటబోటి వర్తిలఁ దొడఁగెన్. 25

వ. ఇత్తెఱంగున నత్తెఱవ చిత్తజాయత్తచిత్తయై వర్తింపుచున్న సమయంబున. 26

సీ. నొసలిపైఁ జుక్కల ♦ మిసిమి నామపు రేఖ, లనువొందు భుజముపై ♦ నసిమి సంచి
వాలుగనుల గాజు ♦ నీలాలపోఁగులు, పైనొప్పు పప్పళి ♦ పచ్చడంబు
మెలిగొనఁ జుట్టిన ♦ తలపాగ దెఱఁ గుంచి, నైటపేటా చుట్టు ♦ పట్టుశాలు
కడిఁదిమీఱఁగఁ జంక ♦ నిడినబొట్టియకోల, డాకమ్రోసెడుడుబు ♦ డక్కకేల

తే. పఱల దిక్కుల నెంచి దు ♦ ర్వారమైన, కీడు మేలును దెల్పుచుఁ ♦ గేక లిడుచుఁ
గెర్లికొనుచును దనపేరు ♦ కేరికొనుచు, నచ్చె నచటికి డుబుడక్క ♦ వాఁడొకండు. 27

ఉ. ఆడుబుడక్కివానికి ర ♦ యంబున భిక్ష యొసంగ నేఁతపూ
బోఁడి ప్రకోష్ఠకస్థలికిఁ ♦ బోయి తనుం గొనియాడువాని నా
మ్రేడితసూక్తిపైఁ బెదవి ♦ మీఁదను లేనగ వంకురించి చిం
దాడఁగ ముష్టిఁ బెట్టి బహి ♦ రంగణభూమిని నిల్చి యుండఁగన్. 28

సీ. మెలిఁబెట్టి చుట్టిన ♦ తెలిపైఠిణీపాగ, చెవిసందిపొగలోఁ ♦ జొక్కు కలముఁ
దొడిగిన నెఱచల్వ ♦ నడరు సంగిజోడు, జీరాడునడికట్టు ♦ చెఱఁగుకొనలుఁ
బదతలంబుల నెఱ్ఱ ♦ పాఱుపాపోసులు, చెక్కు గాఁ జంకఁ జీ ♦ టీఖలీతి
నడికట్టులో మొల ♦ నిడినకలందాను, హస్తాగ్రమున వ్రేలు ♦ దస్తరంబు

తే. మించుబాహువుమీఁదఁ గా ♦ శ్మీరశాలుఁ, జెవుల ముత్యాలపోఁగులుఁ ♦ జెలువుదనర
కలఁతి నిర్వక్కవిదొనతి ♦ యమర నటకుఁ, బారుపత్యంబు సేయు వ్యా ♦ పారివచ్చె. 29

తే. వచ్చుచుండెడి వ్యాపారి ♦ పెచ్చువగలు
మెచ్చి యచ్చెలి తమి హెచ్చి ♦ రచ్చసేయఁ
బగటునగవీఱఁ గోర్కులు ♦ బారుదీరఁ
బొగరుఁ జూపులతోఁ బడా ♦ వగలఁ జూచె. 30

ఉ. చూచినయంతలో మరుఁడు ♦ చొక్కపుఁ గప్ర పుటాలపుంటలన్
లేఁజివురాకుఁ గ్రొవి నల ♦ లేపు పయోధరచక్రవాకముల్
వే చలియింప హృత్పుటము ♦ బీటలు వారఁగఁ దెప్పతెప్పనన్
గోచునదాఁక నూఁది మది ♦ గొలుపడన్ వడి నార్చి వ్రేసినన్. 31

క. ఊహాలు కుతుకబంధై, మోహాము తలమునుఁక లగుచు ముదియ మదిలో
బాహాబాహి కచాకచి, కూహాక మతిపట్టి పెనఁగి కో యనుచు పడిన్. 32

తే. అంత నయ్యింతి యింతంత యనఁగరాని
వంత మదిఁ గొంత చింతించి కంతునిశిత
కుంతహతి కోర్వలేక దివాంత వేళ
మంతనంబున వెడలి గే హాంతరమున. 33

ఉ. ఉరిసినపల్లవెంబడు కలు నూడినదంతము లంబకంబులం
గురిపెడు బాష్పజాలములు గూను వడంకెడు మస్తకంబుఁ గం
పరఁ దగు తోలు పాదములు దర్శనము ల్వడి చీరపోఁగునూ
ల్తైరసెడు మంత్రసానిఁ గని మించెడువేడ్క నుతించి మ్రొక్కినన్. 34

గీ. ఆలకించి లేచి యది యెవ్వ రని చీరి, యమ్మ నీవఁటే య టంచుఁ బొదవి
యేమిపనికి వచ్చి తీసందెవేళల, ననుచు నడుగఁ దొగట వనిత పలికె. 35

ఉ. ఆరయ నిష్టుహాపురికి హాసను మీసము మీఁదఁ జిల్కు వ్యా
పారి యొకండు నిండు రతి భర్తను బోలినవాఁడు వచ్చెనే
నారసికాగ్రణిం గదియు నాస వహించితినమ్మ వానితోఁ
గోరినహాను నాకు నొనఁ గూర్చిన నీ కొనరింతుసంపదల్. 36

సీ. నవరత్న రత్నాల బవిరెకమ్మల నిత్తు, నవి నీకు మనసురా వంటివేని
యాణిముత్యమ్ముల హారమ్ము లొసఁగుదు, వానిపై నీ కిచ్చ పూనదేని
గరుడపచ్చలకీలు కడియంబులర్పింతు, నందుకు నీయాస చెందదేని
తళుకుఁగెంపులసంది దండలు చెల్లింతు వానిపై నీబుద్ధి యానదేని

గీ. నూసకము తీఁగ మెడనూలు సొబగునాను
గుండ్లపేరును గైకొన్న కోరినేతు
నమ్మ నావిన్నపంబు నీ వాలకించి
వాని ననుఁగూర్చు నీ సేర్పు వూని మెరసి. 37

మ. అనుమక్క వేఁడిన మంత్రసాని విని నెయ్యం బారఁగాఁ బల్కె నో
వనబోఁడీ నినుఁ జూడ మన్మథునకై నక్క మోహము ల్పుట్టఁగా
మనుజుం డీతఁడు భీష్ముఁడో సనకుఁడో మాహీంద్రుఁడో వ్యాసనం
దనుఁడో యెంతటివాఁడు వీఁ డనఁగ బం దాకోరుఁగాఁ జేసెదన్. 38

క. సౌనమందు రసముఁ బసరును, ఘనమణిమంత్రౌషధములుఁ గైకర్ణికకా
వును మొగసిరి క్రియ బంతిబ, దనిక గుళికమూల్కె బూతిఁ దవిలిచి తెత్తున్. 39

వ. అని చెప్పి వీడ్కొల్పిన. 40

తనయింటికి హేమంతిని, చనె నానిశిఁ గడపి మంత్రసాని రహస్యం
బునఁ బొరుపత్తైగాఁడుం, డిన చక్కికిఁ బోయి మొక్కి నిపుణత మెఱయన్. 41

సీ. దాక్షిణ్య మనురక్తి దయయు విశ్వాసంబు, బాంధవ్యము హితంబు భయము భక్తి
యంతఃకరణము స ఖ్యంబుఁ బోరామియు, నేస్తంబుఁ జెలిమియు నెనరుఁ బ్రేమఁ
జల్లఁదనంబు వాత్సల్యంబుఁ గలుపుఁ గో, ల్తనముఁ బ్రీతియు మంచితనము మైత్రి
ప్రాణపదంబుఁ దా త్పర్యంబు గారాబు, మనుగుణ్య మనుబంధ మనుసరింపు

తే. మచ్చిక దను జుట్టరిక మైక్య మిచ్చకంబు
స్నేహ మనురాగ మాసక్తి మోహనియతి
సలిపి కడుఁ దక్కె ననిపించి సొలయఁ జేసి
వెగడుపడ కప్పు డాత్మప్ర వీణమహిమ. 42

గ. స్తుతులు ప్రసంగము ల్కథలు సుద్దులు వార్తలు రాచకార్యముల్
చతురత లేతిహాసములు శాస్త్రములం దగుజాతిగాథలుఁ
సతకడము ల్పురాణములు సామెతలుం బరిహాసకంబు లిం
గితములు జారజారిణుల కేళిచరిత్రముల న్వచించుచున్. 43

ఉ. దేవపరాకు హాసకళ దేటెడు నీదగురూపవైభవం
బేవిధినో కనుంగొనె ర తీశ్వనుఁ బొల్పడి చిక్కి సొక్కి నీ
సేవయ చేయఁ గోరి నిను శీఘ్రమె ర మ్మని చెప్పి పంపె నో
భావజరూప యాతొగట భామిని కామవికారచిత్తయై. 44

తే. హత్తుకొనవచ్చు నీసంటి యందగాని
కట్టిముద్దులగుమ్మను గుట్టుతోడ
ననిన మన సిచ్చి మదిలోన హర్ష మెచ్చి
మంత్రసానికి విడె మిచ్చి మమతతోడ. 45

క. ఆపనులకె యేఁకారెడు, తాపము గలవాఁడు గనుకఁ దగ నాతఁడు ని
క్షేపముఁ గనిన దరిద్రుని, యేపున ముద మంది దాని కిట్లని పలికెన్. 46

ఉ. అచ్చటి కేను వచ్చునెడ యం బగు వేళ యెఱుంగఁ దెల్పినన్
ముచ్చట దీర్తు నంచు మది ముద్దియతో వివరించి పంపఁగా
నచ్చెలి తంతువాయుల టాంగన చెంగట నీ ప్రసంగముల్
చెచ్చెరఁ జేయ నత్తఱిని చెట్టిదుకూలము లమ్మువేడుకన్. 47

సీ. కలసమీపపుటూళ్ళ కాఁపుగుబ్బెతలని, మ్మళికి నాకర్షఁప మంత్రవిద్య
బచ్చఁ బ్రాయపువృషభవ్యూహముల నెల్ల, వఱలంగ గుమిగూర్చు పగ్గెత్రాడు
చిల్లరసరకుల నెట్టబేరాల కిం, పుగ లాభ మొందింపఁ బూఁటకాఁపు
పెనుకోలుకొండ్రకు జనసమూహంబుల, గణితి మాపెడు నాయకప్రభుండు

తే. ముద్రగరిటియ భుజముపై మొనయఁ బెట్ట
ఘంట ఖంగని మ్రోయ నం గళ్ళఁ బడిని
మరిగి తిరుగు సళాదికి మణియకాండ్ర
కవనిబడికాఁపు సాలింత నలరు సంత. 48

క. అంతట నాసంతకుఁ దన, కాంతుఁడు వస్త్రమ్ము లమ్మఁ గా నేగిన హే

మంతిని వ్యాపారివిటో, పాంతమునకు మంత్రసాని ననిపిన నదియున్. 49

తే. పోయి సమయంబుఁ దెల్పిన బ్బోజాఁగువేడ్క
వింత నెఱపూఁత గంధంబు విరులు సరులు
కప్రఁపువిడెంబు జిగిచెల్వ గలుగు సొగసు
దనర హేమంతి యిలు సేరెఁ దత్క్షణమున. 50

ఉ. చేరినఁ దంతువాఁడుసతి సిస్తుగ నిస్తులరత్నవస్తువి
స్తారసువర్ణవర్ణముల సంపదలిం బొనరించు కేళికా
గారములోన దివ్యమగు కమ్మనితావుల హంసతూలికం
జేరిచి మేర మీఱుతమిఁ జీరగ మాఁదునిపోరి కయ్యెడన్. 51

చ. త్వరపడి గబ్బిగుబ్బ కడ వాఁడినఖంబులఁ జీఱి చీఱి పై
సిరితళుకొత్తుతేట నునుఁ జెక్కులు ముద్దులు పెట్టి పెట్టి వా
తెఱ మొనపంటికొద్ది కసి దీఱఁ జుఱుక్కున నొక్కి నొక్కి యీ
కరణిఁ బరస్పరంబు జయకాంక్షఁ బెనంగఁగ నింతి పైకొనెన్. 52

సీ. చిటిలెడుగంధంబుఁ బెటిలెడుకస్తూరి, చలియించురత్నకుండలయుగంబుఁ
గదలెడునెఱివేణి పదలెడుపువ్వులుఁ, జెమటఁ గరంగుకుంకుమపుఁబొట్టు
వికసించుకన్నులుఁ బ్రకటించుమణితము, ల్గంకణఝుణఝుణత్కారరవముఁ
బొదలెడుచనుదోయి కదలెడుహారము, ల్ఘననితంబాఘాత నినద మడర
తే. నిటలసంచలదలక ముత్కూట నఖాంక
మమితవిశ్వాసమారుతం బతను గేహ
దర్శనోత్సాహిపతిచపేటప్రదాయి
యైనపుంభావసురత మయ్యతివ సలిపె. 53

వ. పత్రియు నయ్యుపరిసురతంబుతమి యెక్కుడయి దృఢకుచాశ్లేషణంబు విడువఁ జే యంజాలక శీతకాలంబును బ్రకటీకృతతారకంబును సంశ్లిష్టప్రియతమంబుఁ గావున నిశాసమయంబును సంచలితపయోధరంబును నిర్గళితకృష్ణవేణ్యాదికమలంబుఁ గావున శరత్కాలంబును బల్లవరాగసంపాదకంబును గలకంఠకూజితంబును గావున వసంతకాలంబును ధ్వనిప్రధానంబును గలితవిశ్రమంబుఁ గావున సత్ప్రబంధంబును గళితవసనంబును బహుబంధబంధురంబును గావునఁ బ్రబుద్ధసిద్ధమార్గంబునుఁ బోలి వెలయుచుండె. 54

ఉ. ఆసమయంబునం జెమట లాస్యముఁ గప్పగ నిండుబళ్కిక
ల్లానిలఁ జేయఁగాఁ గబళికాంక్షకు జీవము వేగురింప ని

శ్వాసము బాయకీర నిజ వల్లభుఁ డౌ శుభభద్రుఁ డబ్జ సం
వాసముఁ జేరవచ్చి తల వాకిలిఁ దీయని పిల్చె వల్లభన్. 55

తే. అప్పు డేరీతి నుపనాథు నపల కనుప, సుందరీ యేయుపాయంబుఁ జూడవలయు
జాణవౌదువు సారవాంఛలకు నైతె, తెలుపుమనిపల్కెఁ గలహంస దేవవిభుఁడు.

క. అని యడిగిన హేమావతి, విని దీర్ఘోచ్ఛ్వాస మొకర విడిచి నిజాంఘ్రిం
గనుదృష్టి నిలిపి మెల్లన, మునిద్రేల న్నేల గీచి ముసుకొని పలికెన్. 57

క. తెలియ దెటుపనుపవలెనో, పలుమఱు నే బ్రహ్మలోక పర్యంతంబుం
గలయ వివరించి చూచితి, నలవడ దది నీవె తెలుపు హంసబిడౌజా. 58

క. అని యడిగిన హేమావతి, కనురాగం బొప్ప రాజహంసం బనియెన్
వినుము నిజాధిపు డటువలెఁ, దనుఁ బిలిచిన యువతి లేచి తెరలక ప్రీతిన్. 59

క. పిలిచిన గుండె లొటుక్కనఁ, గలఁగుచు వ్యాపారి వెడలఁ గానెటు లనుచున్
దలఁచినచో వెఱవకు మని, నిలిచిన దార్ఢ్యమున మానినిమణి వేడ్కన్. 60

ఉ. ఆత్తఱి బిత్తరై ఘనము దా సుచిత్తపు సత్తుపొత్తుతో
బిత్తరి తత్తరింపకయ పేర్కొని వాకిలి దీసి వేగమే
చిత్తజువంటినాయకుని చెంతను నిల్చి తదీయనేత్రముల్
మెత్తనిచేత మూసి దయ మించఁగఁ దోడ్కొనివచ్చెఁ జెచ్చెరన్. 61

ఉ. అవగఁ జూచి యవ్విటమహామకరాంకుఁడు చిత్తవీథిలో
నావగమాన మానిని నయం బొదవం గనుసైగ చేసినం
దా నగు చోటి కేగెఁ దదనంతర మక్షులివేల మూసితే
పోవఁగరా దటంచుఁ బతి ముద్దియ నిట్లడిగెం బ్రియంబునన్. 62

తే. అటుల నడిగిన ప్రియభర్త యంబకముల, మూఁత చాలించి యామించు ముద్దుగుమ్మ
సిగ్గు కడ్డంబుగాఁ బతిచేల మలమి, కొనుచుఁ బలికెను జిన్నెలు కొసగు చూప. 63

చ. జలకము లాడఁ గోరి బురుసాపని చీర సడల్చి సందులో
పలికిఁ జనంగ నీదు చనుఁబల్కు వినం బడఁ దల్పుఁ దీయఁగా
వెలువడి వచ్చితిన్ నలపు వెల్లువ దొట్టఁగ నంచు నాయకుం
గులుకుమిటారి గబ్బిచనుగుబ్బల గౌఁగిటఁ జేర్చి పల్కెనన్. 64

తే. భామ తనమీఁద నెవరైన బాగుఁ జూచి
చిత్తము గరంగి శుభభద్రశేఖరుండు
గుణవతి వటంచుఁ బ్రియురాలిఁ గుస్తరించి
నిండుమోదమ్మున సుఖాన నుండె నపుడు. 65

క. ఇంతయుపాయముఁ గలిగిన, నింతీ చనవచ్చు జాణ నెనయఁగ లేదా

కాంతుఁ డెఱింగిన నృపమణి, చెంతను నేమొగముతోడఁ జేరెదొ చెప్పుమా. 66
తే. అనుచు రాయంచ నుడివిన విని శిరంబుఁ
ద్రిప్పి హేమావతి ప్రమోద మొప్పఁ బలికె
నౌనె మజ్ఝారె యదిగాక యాఁడువారి
తల్లి యనుచును జిఱునవ్వు దలకొనంగ. 67
క. తెలవారె నపుడు దీపపుఁ, గళికలతో వెల్లఁ బాఱఁగాఁ దనమోమున్
భళిర కథాలాపం బని, జలజేక్షణ చనియె కేళిసదనంబునకున్. 68
చ. చని జలజాప్తుఁ డస్తగిరిచాటున కేగినయంత మజ్జనం
బొనరిచి వ్రాఁతపుంబనుల నొప్పు దుకూలము గట్టి రత్నకాం
చనమయభూషణంబులును సారపు మేల్తిలకం బమర్చి ఘు
మ్మనువిరు లూని యచ్చెలి నృపాగ్రణి చెంగటి కేగుచున్నెడన్. 69
మ. కని చంద్రాంగబిడౌజుఁ డిట్లనియె శృంగారంబు లెస్సాయె మే
ల్దనరారెన్ భళి హొంతకారివిగదే తన్వంగి రాజాంతికం
బునకుం బోయెద వేమొ యొక్కకథ యొప్పం దచ్చమత్కారము
ల్విని పోనిల్పిన నంటిపండ్లనె నయున్ శ్రేయించు మంత న్వెసన్. 70
క. అన విని హేమావతి మో, మున నవ్వు జనింపఁగ తలమునిపుట్ట సుమీ
కన నీదుకడుపు బ్రహ్మకు, వినఁ దరమా యనుచుఁ బలికి వినుపింపు మనన్. 71
క. కప్పురపుఁదునుక లలవడ, విప్పుగ విరితేనె వాన విడివిడి కురియం
జొప్పడర హంస సురపతి, చెప్పెను హేమావతీ కుశేశయముఖికిన్. 72

---

## అయిదవరాత్రికథ.

క. ఆలింపు మహాభ్రంకష, కేళీ ప్రాసాదనిలఘృణిగాఢతమః
పాళీ సతతవిహారిసు, రాళీ పురజాలకులటమై సర మనఁగన్. 73
తే. పుర మొకటి యుల్లసిల్లు సంస్ఫురితపూర్ణి
మానిశాకరధిక్కారిమంజులాస్య
యందు నొకగొల్ల సంపల్లతాంగి పిల్ల
విజయుఁ డనుపేర సిరులచే వెలయుచుండు. 74
సీ. కంబళితలగుడ్డు కవ్వము మజ్జిగ, బాన గొడ్డలి నుచ్చు పాఁతలగుది
కావడి యుట్లు చిక్కము సంది కడియంబు, నూకలతోఁప పొగాకుతిత్తి
బొప్పి మజ్జిగముంత బొటమంచిపిల్లల, గూడు దామెనత్రాడు కోఁతకత్తి
తొర్లుగట్టెయుఁ జలదుబ్బచిల్కుడుగుంజ, బూజబిందెలు వెన్నపూసచట్టి

తే. పాలబుడిగలు వడిసెల ప్రాఁతమెట్లు
మలపమందులపొడి బుఱ్ఱ మన్నెముల్లు
తోలుకుళ్లాయి తొడుపును దొడ్డికంప
చుట్టు చవికెయుఁ గొమరొప్ప సాలయు నతఁడు. 75

చ. కుఱుబలిదోరచారనలగుం డ్లెఱగొండిలిమూలబొల్లివిన్
నఱిగివి నెట్టుజోడు పులి నల్లని వెఱ్ఱివిపుల్ల చిల్లవిన్
బఱిగివి మొఱ్ఱివిన్ గరకపల్లవి నాఁదగుపేళ్ల నొప్పెడున్
గొటియలు వేనవేలుఁ గలగుంపు లసంఖ్యము లుండువానికిన్. 76

తే. బోడ పొడమట్టినామంబు బొల్లిపూరి, జాలనల ఘల్లవెరబట్ట చారబరగి
కఱుకుగడ్డము తెలిమొఱ్ఱి గొరదోర, పసెదుపేరుల మేకగుం పతనికుండు. 77

తే. మట్టె చేమటె కరపస్స మైలబట్ట, కోరతలపూజ దెఱ్ఱనిచార బోడ
పొడకపిలకన్నె బొలిచుక్కపుల్లవియను, పేళ్ల నొప్పారిమందలోఁ బెక్కుగలవు.

క. పల్లవి నల్లవి యెనుములు, బిల్లల నిడుగోడిగలుఁ బెంపుడు పెదపా
ట్లెల్లను దుక్కొడ్లును విల, సిల్లఁగ నావిజయుఁ డచట సిస్తుగ నుండున్. 79

క. అతనికి మంజుల యనఁగా, సతియొక్కతె గలదు దాని సరి యెన్నుటకుం
గొతుకుపడు రతికిఁ జతురత, యితరుల నిఁక నెన్న నేల యిందునిభాస్యా. 80

క. ఆకుల్కు లాయొయారము, లాగనుదమ్ముల మెఱుఁగు లాగౌను బెడం
గాకుచయుగ్మముబింకం, బాకోయిలముద్దుఁబల్కు లతివకె చెల్లున్. 81

క. ఆబిడ గర్భోత్పత్తికి, నై బగిసియు మాలి పతిం తాదృతిమీఁదన్
లోఁ బొడమిన రుచిమించినఁ, బ్రాబల్యము గలుగు విటులపాలిది యయ్యెన్.

సీ. వేశ్యాపతిచకోర విసరంబులకు నురి, విట మృగావళికి లవిత్రకంబు
యువరాజికరులకు నొనరారు నోదంబు, కాముకవ్యాఘ్రింపు గమికిబోను
పాంథమానసమత్స్య పటలికి గాలంబు, పల్లవోష్ఠములకు నల్లెత్రాడు
షిద్గకపోతరాజికిఁ జేరు దీమంబు, లలిభుజంగవిహంగములకుఁ జివురు
తే. జారకిరిపంక్తులకు మోటు సరసశశక, ములకు గట్టువయుపకాంత ముఖ్యచటక
సంఘములకును గుబ్బికశంబరారి, ఘోరరణహారి జయభేరి ఘోషనారి. 83

తే. ఇత్తెఱంగునఁ జిత్తజాయత్తచిత్త
వృత్తిఁ గైకొని జారులపొత్తు సలిపె
నలసటయు వేసటయు లేక యటుల నయ్యుఁ
ఱాలు గాంచఁగ లేక యాసుదతి గుంది. 84

చ. తిరుమలకంచిపుష్పగిరితీర్థములుం జని కొంగుముళ్లతోఁ
వరములఁ దంపతు ల్వడయ వారిగఁ గాన్కలు వైచియంతటన్
బరికలు దృష్టిదీపములఁ బన్నినగద్దెలఁ బెట్టి యేమిటన్
గర మగు పుత్త్రవాంఛ కడఁ గానఁగలేక విచారఖిన్నులై. 85

వ. ఉన్న సమయంబున. 86

ఉ. కొమ్ములు వీరణాలు జిగిగుల్కెడుబ్రాఁతల కృపలీలలం
బ్రమ్ముగ డాల్లు వీరుఁ డగు కాటమరాజుకథానులాపముల్
బమ్మనపుస్తకాలు ముఖపట్టికకట్టురుమాలలున్నెఱా
సొమ్ములు నామము ల్వెలయ సుద్దులగొల్లలు వచ్చి రంతయున్. 87

వ. ఇట్లు వచ్చి. 88

సీ. ఫెళ ఫెళ వీరణాల్ భుళిపెళివాయించి, పోటుబో కొమ్ములు నాట నూఁది
వానకొండెగంగను దొలుత నస్నుతిచేసి, కృష్ణున కతిభక్తిఁ గేలుమోడ్చి
యాదికాలపుగొంద్ర నందఱఁ గొనియాడి, తాతతండ్రులపేళ్లు దలఁచి పొగడి
బిసనుల నరుదుగాఁ జేర్కొని మొఱాయించి, దీవించి వీరుల త్రోవలెన్ని
తే. కులము పెద్దలకథ లామికొనఁగఁ జెప్పి, సిసము పుట్టించి పుత్త్రులఁ జెందఁగలరు
వీరులను గొల్వఁ డని తెల్పి వీడుకొల్పఁ, జనిరి సుద్దులగొల్లలు సంతసిల్లి. 89

వ. ఇట్లు వారలు చెప్పిపోయిన నత్యంతభక్తిప్రియపూర్వకంబుగా నంతట. 90

మ. కొలిచెం గాటమరాజులన్ నతులు చేకూర్చెన్ మహావీర్లకుం
బొలమున్ రాజుల నెంతభక్తిపరతన్ బూజించె నాగంగకున్
వెలయన్ వేటలు బోనముల్ సిడులు గావించెన్ సుతోత్పత్తికై
చెలి యాలాగున సల్పె దైవముకృపన్ సిద్ధించెఁ దద్వాంఛయున్. 91

వ. అంత. 92

ఉ. మోము వహించెఁ దెల్వి జిగి మోవిరుచు ల్దగ సందడించె మృ
త్స్నమతి మించెఁ జన్మొనలు శ్యామలకాంతి వహించె యానముల్
వేమఱు మందగించెఁ గడుపృద్ధి భజించెను గౌను చిట్టుముల్
రామకు సంభవించె నభిరామతరంబుగఁ జీరచిక్కెనన్.

తే. అంత నొకనాఁడు శుభముహూర్తాంతరమున
మంజులాంగన రంగైన మంచిమణుల
సొంపుగాఁ దీర్చి కట్టినయొక్కదివ్య
మందిరములోనఁ జినికుమారిఁగనియె.

ఉ. ఎడఁ కెడుకొను రంగుతలవాసెనగట్టినకొంగు పుక్కిటన్
విడియపుఁ బంగు మైలఁ గొని క్రొవ్వెడు చెలచెఱంగు పాలచె
పుడు చనుదోయి పొంగు పసపు నలవింత బెడంగు నూనె క్రొ
మ్ముడి రుచిఁ జొక్కి బొట్టమరె ముద్దియ యొప్పెను బిడ్డకాన్పునన్. 95

వ. అంత 96

క. అది ప్రతిపచ్చశిరేఖా, భ్యుదయము వలె దినదినమ్ముఁ బొదలెడు కళలం
బొనువంబడి తేఁ బ్రాయపు, పద మెక్కఁగ ముద్దుగులికె మనమలరారన్ 97

క. చన్నులపస యటుమీఁదటఁ, గన్నులపస ముద్దుగులుకఁ గల ముఖమున మే
ల్కన్నెల మిసిమి జిగిబిగివగ చిన్నెలు మసఁ జూచి వలచుఁ జిత్తజుఁ డయినన్ 98

తే. తమకమున క్రొంద నెడు నేరము ఘటించి
తరుణతను వ్లెఁ గొట్టింపఁ దలఁచి మదనుఁ
డీష్యగుండలు వ్లి వేయించె ననఁగ
వాల్యము చనంగఁ గుచము లేర్పడియె నలకి 99

తే. కొమరెపాక్కలిబంగారుకుంచె యందుఁ బరయు ప్రంగాం వసుధాన్యరాశి నించి
దంచ నిడినట్టిరోకలి సంచుమిత్త్రి, రోమరాజి దనర్చు నారూఢిగాఁగ. 100

క చెందిర మా మెయిసిరి సిరి, మందిర మా మోము గోము మదనారిలస
న్మందిర మా కుచయుగ మిం, దిందిర మా వేణి యనఁగ నెలఁత రహించున్. 101

సీ రాణించు నెఱికురుల్ శ్రేణి కందకమున్న, కనుబొమ ల్వక్రిమఁ గనకమున్న
జిగిగుబ్బలు మొగాన కెగయ నిక్కకమున్న, ననుఁ బల్కు నేర్పు నేర్పగొనకమున్న
చూపులఁ జాలుకుగాఁ జాడ సేరకమున్న, పీనల మరుకథ ల్వినకమున్న
లలితయానము మదాలసవెఁ బూనకమున్న, కటిసీమ విస్తృతిఁ గనకమున్న

తే చిత్తజుఁడు తమ్మిపూఁదూఁపు చెఱకువింటఁ
గూర్చి గుఱిచేసి తనునేయ గొల్లవనిత
మమతఁ గని చోరసురతసామ్రాజ్యమునకు
దిట్టతనమునఁ బట్టంబు గట్టుకొనియె. 102

వ. అవ్విధంబున ఘోషకన్యారత్నంబు శైశవయౌవనసమయంబున మన్మథప్రేరితయై
విజృంభించి వర్తించునప్పుడు. 103

సీ. చిన్నిచన్నులుగోళ్ళఁ జీరఁ జెక్కులుగొట్టుఁ, గౌఁగిలించు మటంచుఁ గడియఁ దివురు
గిలిగింత లొకకొన్ని కలయఁగ నెనయించి, మోవి నొక్కుమటంచు మొనసినిలుచు
నిచ్చకం బిగరొత్తుఁ బచ్చికేరఁగఁ బల్కు, ముద్దిడరా యని యొద్ది కరఁగు
నొకదారి కివకీవ లొకదారి మైఁ జూపి, తమిఁ గూడరా యంచు దరికి జేరు

తే. నుపరతికి నెంచుఁ బరిహాసకోక్తు లాడు
చేష్ట లెనయించుఁ బొలయల్క చేతఁ గుందు
వెతల నేకారు మది నిట్లు విటులఁ జూచి
చిత్రజోన్మత్తయై గొల్ల చిన్నె లాడి. 104

చ. జగినెరవన్నెకాఁ డెదుటఁ జీరినవేళల ముద్దుగుల్క మె
ల్లఁగ నడవం దొడంగు ఘనలౌల్యము చూపులఁ జూచి మోహపుం
బిగువునఁ బల్కరింపఁ జను బెళ్కుచుఁ బయ్యెదకొంగు దీఁటుఁ డె
క్కఁగఁ జిఱునవ్వు నవ్వు నొడఁ గూడిన సిగ్గున నేగు నవ్వలన్. 105

తే. ఇట్లు చరియించు నయ్యింతి యెమ్మె లెఱిఁగి
పొరుగునను యుండెడు నియోగిపుత్త్రుఁ డొకఁడు
జారశేఖరుఁ డను బ్రహ్మచారి మీఱి
యొంటిపాటైనఁ దెరవులో నొడిసిపట్టె. 106

మ. అసమాలాప మచుంబితాధర మశయ్యానోన్యవిక్రీడితం
బసమాలింగన మస్థిరోత్సవ మధైర్యస్తంభతాంబూలితం
బసుదంతాంకమ నిర్భయం బమణితం బస్రస్తనీవ్యాదికం
బసిధారావ్రత మైనచోరరతికార్యం బప్డు సంధించినన్. 107

సీ. చిఱుచెమ్మటలతోడఁ బెరసినఫాలంబు, కసవంటివీడినకప్పుగొప్పు
కడురక్తిమము గల్గు గండస్థలంబులు వెనకకు దిగజాఱు వ్రేలుసరులు
పులకలు నిండారఁ బొడమినదేహంబు, ధూళిధూసరితమై దొరయుమీఁపు
మందస్మితంబగు మధురాధరంబును, మందవీక్షణనమ్రమస్తకంబు
తే. తడఁబడ నడంకుచుండెడు తళిరుఁదొడలు
వదలిన బిగించి సవరించి పలుప దనరఁ
దిరిగి చూచుచుఁ దనయింటి తెరువుఁ బట్టి
గొలప్రాయంపుఁ జల్కుల కొల్కి చనియె. 108

క. అగిమొదలు జారశేఖరుఁ, డొదవినయపు డెల్ల గొల్లయుగ్మలి నెంతో
మదనహవమునఁ దేల్చుచు, మది మీఱఁగ మరుని లంకె మానిసి జేసెన్. 109

క. చలి విడిచి జారశేఖరు, కలయిక చవి మరిగి తెరువు కాపెట్టుక ని
చ్చలు లేని పనుల నెన్నె, నలవఱుచుక యుండు విరహ మగ్గల మైనన్. 110

ఉ. కమ్మనిజున్ను మంచినెయి గట్టిది మీఁగడతోఁ బెరుంగుచా
క్కమ్మగు ఘున్న పాలు చిలుకమ్మిసి దీసినవెన్నముద్దవె

చ్ఛమ్ముల క్రైమనాల్గు దిసాలకు మూఁడలమున్లై లిమ్మెయిం
గిమ్ములఁ దెచ్చియిచ్చు రతికిం బ్రతిమాలుచుఁ బిల్చి నిచ్చలున్. 111

తే. ఇటుల నజ్జారశేఖరుఁ డేలఁబట్టి
యింటిలో నున్నవస్తువు లెదురువెట్టి
వలపులకుఁ జిక్కి కేరడములకుఁ జొక్కి
సంగమసుఖంబు కొన్నాళ్లు జరిపెఁ గన్నె. 112

ఉ. అంతటఁ బెడ్లి చేసెద మటంచును దత్సతి తల్లిదండ్రుల
త్యంతమహోత్సవంబునఁ గులానుతితోఁ దగురూపరేఖలం
గంతునిఁ బోలునట్టి మృదుకాయము గల్గినవాని నొక్క శ్రీ
మంతుని జూచి తెచ్చియుఁగుమార్తెవివాహముఁ జేసి రెంతయున్. 113

తే. వేగఁ దలఁబ్రాలుగాఁ జేసి నాగవల్లి
యైనపిమ్మట నత్తింటి కనుపఁ దలఁచి
పయన మొనరించి నెమ్మదిఁ బ్రమద మలర
ననుఁగుఁగూఁతును నల్లుని ననిపి రపుడు. 114

ఉ. దువ్వెనతీరుగాఁ బసపుతో నలరించినబొట్టు నున్నఁగా
దువ్విన కొప్పువన్నెగల దుప్పటి మొప్పు విడెంబు పుక్కిటన్
మవ్వపుఁ బోఁగునూల్ రవలపట్టెలు చేతులఁ బూలగాజులున్
నివ్వటిలంగ గోపహరిణీతరళేక్షణ పోవ ముందటన్. 115

సీ. సద్విజరాజసంశ్రయమహాస్పదలీల, శాఖలు కకుబంతచయముఁ బ్రాఁక
సాంద్రపర్ణక్రమస్థాయిత్వమున మించు, జటలనంతావాప్తి పటిమ మెఱయ
విష్ణుపదార్పితవిహితవృత్తిఁ దనర్చు, నగ్రము లస్త్రాశ్వ ననుకరింప
నహిలోకరాట్ఫణాధారమై యొప్పు, మూలంబు కుండలిముఖ్యు దొరయఁ

తే. దనమహాగమవిఖ్యాతి ధరణిలోన, నఖిలజనులకు నద్భుతం బావహిల్లఁ
దేటపడఁగాను జూపెడు తెఱఁగు దోఁప, మలసి చూపట్టెఁ బథినొక్క మఱ్ఱిచెట్టు.

క. ఆవటభూజము చెంగటి, త్రోవను ముందట విభుండుఁ దొయ్యలి వెనుకం
బోవంగ జారశేఖరుఁ, డావెలఁదికి నెదురుపడియె నంతన్ వేడ్కన్. 117

చ. తమకముఁ బట్టఁ జాలక పథంబున ముందరఁ బోవుభర్తవి
క్రమము దలంపఁ బోక యధికంబగు మోహము నిల్పలేక వే
గమె యెదురించి వచ్చు నుపకాంతుని పల్లవకాంత తెప్పునం
గమకముఁ జేసి గుబ్బకవకౌఁగిట దార్చి సుఖించె వేడుకన్. 118

తే. భ్రామికలు కీర నవోర్వ్యభాష లూరఁగ లయికలు వాడఁ దాపాగ్నికణము లాఱ
సౌఖ్యములు మీఱఁ జేష్టలుసరణి దేఱఁ, జెలఁగె నయ్యిద్దఱు ద్రఢాశ్లేషణములు
క. ఆయెష నిజపతి సతి రా, దాయె నని తలంచి మరి తనుఁ జూచినవో
నాయింతి పతికి హితముగ, నేమునువున బొంకనలయు నెఱుఁగింపఁగదే. 120
క. ఆమాడ్కి హంస యడిగిన హేమవతి యనియె నెవ్వరిడు నిక్షేపం
బేమతి వారేకనులె, నేమనుచుందప్పఁ దాల్చె నెఱుఁగింపుమనన్. 121
ఉ. హంసహిమాంశుఁ డిట్లనియె నయ్యలివేణిని భర్త చూడ జా
రాంసమునందు వ్రేలు కులటాంగన దేహము కంపమొంద సా
యంసమయాదిఁ గోకిలతె నారట మంచుచు వీఁపుదట్టు మో
పుంసపరా యటంచు విటపుంగవు కమ్ము నాటఁ జెప్పినన్. 122
తే. జారశేఖరుఁ డాగొల్లపకియ నపుడు, వీఁపుదట్టుమ వెఱపకు వేయటంచు
పలుకరించె మనంతలోఁ బఱువుదాటి, దారి ప్రియనాయకుఁ డభీతి డాయ వచ్చె
క. వచ్చి యిది యేమిచెలి యని, విచ్చలవిడి వీఁపుజఱిచి వెఱుపు మని లోఁ
జొచ్చిన భయమున నవరిన, గచ్చుగ నిట్లనియె గోపకన్యక పతికిన్. 124
ఉ. ముందర నీవుపోన భయముల్ వదచల్లెడు నీపలుక్రసం
క్రందనుఁ జూచిగుండెలు వకావకలై వెతఁ బొంది యీదయా
తుందిలుఁ బొందునం బ్రతుకు త్రోవనుచచ్చితి లేకయున్న నా
కుందరిలేక యొంటి నిటఁగుందుదుఁ గాదె యనుంగువల్లభా. 125
క. అని చెప్పి నిజేశ్వరుచే, తనువన మోహంపు విటుని దద్దయుఁ బొగడిం
చిన లినలోచన వేడుక, దనరారఁగఁ జనియెఁ బతియుఁ దానును సరణిన్. 126
క. అట్టియుపాయము నీకుం, దట్టిన నృపుపొందుమాట దలఁపుము లేదా
గట్టిగ నీమగఁ డెఱిగిన, యట్టయినను నీగుపాటు లొగదె చెలియా. 127
ఉ. నావిని హంసపల్కునదనంబున హాసము దోఁపఁ బల్కె హే
మావతి యద్దిరా మగలమార్చు నెలంతదిగాక యింకక
ద్దావివరించి చూడ వసుధాస్థలిలోనను నంతలోపల న్
వేవినఁ గేళికాగృహము వేగ చనెన్ నృపమోహమగ్నయై. 128
వ. మఱియు నయ్యహస్సుఖంబు ప్రకాశమానకావ్యలక్షణంబయ్యును బ్రకాశమానకావ్య
లక్షణంబై యనిద్రాళుపనాంతరాళపుండరీకసముదయంబయ్యును నిద్రాళువనాంతరా
ళపుండరీకసముదయంబై యప్రస్ఫుటీకృతకువలయంబయ్యును బ్రస్ఫుటీకృతకువల
యంబైయవిభాసమానద్విజరాజం బయ్యును భాసమానద్విజరాజంబై యవిభాసితతా
రాళిగణంబయ్యును విభాసితతారాళిగణంబై యొప్పెనప్పుడు.

క. ఒకనిమిషం బొకమాసం, బొకఘటికయ యొక్కయయన మొకజా మొకయే
డొకదిన మొకకల్పము గా, నకె గడపెం బగలు విరహసంతాపమునన్. 130
క. రవి యనెడు కాలచక్రము, దివసాంతప్రళయవేళ దీపాగ్నులచే
దివిఁ గాల్చియడఁగ నష్మషి, నిశహాంబన ఘోరతమము నిండెం బెలుచన్. 131
వ. అప్పుడు. 132
చ. చంగుదుకావిపావడపస ల్వొలిఁ జిమ్మగఁ జల్వఁగట్టి కా
లందెలు సందిదండలును హారములు న్మణికుండలమ్ములుం
బొందుగఁ దాల్చి వాసిలెడు పూలసరు ల్కచసీమఁ జుట్టి పా
ల్పొందఁ గళాస గందవొడిఁ బూసి మృగేక్షణ వచ్చి నిల్చినన్. 133
క. చూచి కలహంస మిట్లను, వాచావైచిత్రి మెఱయ వనితా చోద్యం
బై చెలువొందిన యొకకధ, యాచించి నృపాలుకేళి కరుగు మటన్నన్. 134
క. ఆమధురతరసుధారస, సీమాసామోక్తిధార చెవులకు నెంతో
యామోదము చేసిన విని, హేమావతి యనుగ హంస మిటని పలికెన్. 135

## ఆఱవ రాత్రి కధ.

శా. జంబూద్వీపధరారవిందముఖి కంచద్భూషణప్రాయ మై
సాంబప్రస్థ మనంగ నొక్కటిమహాస్థానీయ మొప్పారు ర
మ్యంబై యప్పురిలోన నుండు హరిశర్మాఖ్యుండు విప్రాన్వవా
యంబుల్ శోభిలఁ జేయుకర్మరుఁడు కళ్యాణాంగి యాలింపుమా. 136
సీ. బలుకంచు గుబ్బబోత్తలు పులుతీనెల, వాకిలి నడవ చావడియు మగులు
నఖిలవస్తువుల ధాన్యముల కణజలు, దేవతార్చనమిద్దె తావిపడక
యిలువంటకొట్టంబు పలుగాఁడి పసిదొడ్డి, పసపాకపందిరి బావి తోఁట
మడిసంచిదోవతి మడత్రవే ల్దండెంబు, ధమలికుండంబు బృందావనంబు
తే. నక్షతలచిప్ప సానచిత్రాసనమును
గిండి చిటిచాప పళ్లెంబు గిన్నెపెట్టె
కుశసమిత్పవిత్రములు పెట్టు గొప్పయటుక
యమరఁ గా పుర ముండు నయ్యగ్రజుండు. 137
చ. అతనికి హేమచిత్ర యను నంగన శృంగినవెన్కఁ జారుభా
స్వతి యను ముద్దుగుమ్మను వివాహ మొనర్చిన నింతి యట్టె య
య్యతనునిచేతికత్తిచివు కంతయుఁ బోయినఁ బేవఁ జిక్కు స
మ్మతి నెలజవ్వనంబు పొడమన్ జిగిదేఱు దేహసంపదన్. 138

క. ఆపటుకుచములచందం, బా పెద్దపిఱుందుమంద మామో మందం
బాపాంకం బాబింకం, బాపంకజముఖికె కాక యన్యకుఁ గలదే. 139

ఉ. ఆమధురోష్ఠి గుబ్బకవ నబ్బినసిబ్బెపుఁదళ్కు లంద మా
యామృదులోరుకన్నుఁగవ నన్నవ వెన్నెలలొల్కుచందమా
యామితమధ్యసోముకళ లానినమోము మెఱుంగులందమా
యేమని చెప్పవచ్చు నలినేక్షణ యాచెలిరూపసంపదల్. 140

తే. వక్రయానంబుతో నాగచక్రకుచలు
నిలువుఁ గన్నులతో దేవనీలకచలు
నాతిమృదుగతిచపలేక్షణములకలికి
క్రిందుమీఁదయ్యెఁ గాదె పూర్ణేందువదన. 141

సీ. నెఱిగొప్పు మేఘసందేశంబు కనుదోయి, యందమౌ కువలయానంద మరయఁ
బొంకపుమోము ప్రబోధచంద్రోదయం, బధరంబు మణిసారమౌరఁ జూడఁ
జెలువంపుఁ జిఱునవ్వు సిద్ధాంతకౌముది, స్తనయుగంబు రసమంజరి నుతింపఁ
గరరుహంబులకాంతి కావ్యప్రకాశిక, ఘననితంబము రసాయనము తలఁపఁ

తే. దను వలంకారమతనుశాస్త్రములు చూపు
లహహ మధ్యంబు నాటకం బవనిలోన
విద్యలకునెల్ల మూల మీవెలఁదిఁ గనిన
విద్యలు పఠింపఁగా నేల వేఱె బుధులు. 142

వ. అది మఱియును. 143

చ. బుగడలు నానుతీఁగె మెఱుపుల్గనుకమ్మలు గుండ్లపేరు బ
ల్పగడపుఁ జేకటుల్ రవలపల్లెరుపువ్వులు కుప్పె సౌరముల్
జిగికడియంబులాణిమణిచెక్కినముక్కర గిల్కుమెట్టెలుల్
సొగసు దలిర్ప నచ్చెలియసొమ్ముల నెమ్మెల నొప్పు నెంతయున్. 144

సీ. కప్పుఁగొప్పుఁ బడాబగలఁ జూడనిఘనుండు, వదనంబునకు వింతపడనిజనుఁడుఁ
గన్నుల కాశ్చర్యగరిమఁ జెందనివాఁడు, సరసభాషలకు మెచ్చనినరుండు
గబ్బిగుబ్బలతీరు గాంక్షింపనివిటుండుఁ, గౌను నుతింపనికాముకుండుఁ
గటికి శిరఃకంపపటిమఁ బూననిమర్త్యుఁ, డంఘ్రులు బాపురే యననివిటుఁడు

తే. నాస్తి యనృతంబు దబ్బర నహి హుళిక్కి
కల్ల మఱియిల్ల లేదు భూగతులలోనఁ
గ్రమ్మి జిగిఁ జిమ్ము నమ్ముద్దుగుమ్మ హొయలు
చెలువ మెటువంటిదో కాని చిగురుబోఁడి. 145

సీ. పాపట యిడి నూనెపంకెనతో నున్నఁ, గాఁ గువ్వ నెఱులు కీల్గంటు వైచు
నెఱి యొయ్యారముతోడ నిటికొంగులనిడఁ, జూచి కుంకుమబొట్టు సొంపుదీర్చు
గంధంబుఁబూసినగతి గబ్బిజిగిగుబ్బ, కనమీఁద గుత్తంపురవికె దొడుఁగు
నుష్మత్తపూరీతిఁ గ్రుమ్ముకుచ్చెల నేలఁ, జీరాడఁగాఁ జల్వ చీరగట్టు
తే. నీటు బెళుకున దిగజార పైఁటచెఱఁగు
జగ్గుతో దోపుఁగాటుక నిగ్గుకనుల
మిక్కుటపుఁ జూపు మెఱుఁగు తళుక్కు మనఁగ
వెడలు నొకవేళ గృహము నవ్విప్రవనిత. 146

క. పతిరతిని దృప్తిఁ బొందక. మతిఁ జపలత పుట్టి యన్యమానవురతికిన్
హితముపడి మోహదశలన్, బతిమాలి కృశించుఁ జారుభాస్వతి యెపుడున్. 147

తే. పురములోఁ గల్గుమోహంపుఁ బొగరు చిగురు
కోడె నెఱజాణవిటులకుఁ గొంతకొంత
వింతరతితంత్రములు నేర్పి విడిఁబడున్న
కంతుమదదంతి పంతంబు గదియఁ దిరుగు. 148

క. ఈలీలఁ గొంతకాలము, బాలామణి సంచరించు ప్రాయము నాఁడే
కాలూఁదియున్న యిందిర, తాలిమిచెడి నిలువకచటు తలఁగినయంతన్. 149

సీ. కులమహీరుహమహాక్రూరకుఠారంబు, కోపాగ్నివృద్ధికృద్ఘోరనాడి
సంసారసుఖశైలశరకోటిపతనంబు, దేహవ్యథాలతాదోహదంబు
శశిముఖీదృక్పాతసంరోధిజంబీర, ఫలరసం బతిధైర్యభర్మకషము
ప్రతిభాంబుహృద్గ్రీష్మపవనంబు నిజవధూ రచితనిందాసారనిచయఘనము
తే. సంతతాహారి సంపాదిసంభ్రమప్ర, యత్నవిఘ్నదమతనుక్షుధార్తిదాయి
యమితలఘుతాశ్రయస్థానమై కడంగు, భూరిదారిద్ర్యదోషంబు పొదలె నపుడు.

క. అట్టిమహాదారిద్ర్యము, దొట్టిన హరిశర్మ ధృతియుఁ దూలక తృష్ణం
గొట్టుపడకుండఁగాఁ దన, పట్టపుటిల్లాలిఁ గష్టపడి పోషించెన్. 151

సీ. పంచాంగములు సెప్పి బాజారులోపల, రంజిల్ల యాయవారంబు లెత్తి
తలమీఁద మంత్రాక్షతము లుంచికలకాఁపు, టిండ్ల నుపాదాన మెత్తి తెచ్చి
గ్రహణసంక్రమణాదికాలంబులను రాచ, నగరాశ్రయించి దానములుపట్టి
తిలలు దర్భలు పూని తీర్థసన్నిధిమంత్ర, ములు సెప్పి నీరుకానులు గడించి
తే. జన్నిదములమ్మి గ్రహశాంతి జపముఁజేసి
శవములను మోఁచి దుర్దానసమితిఁ గొగ్గి

పచ్చనాదాయములు గ్రసవాసములకుఁ
గాఁగ దినములు గడపెనకాలమునను.

శా. అంభోజప్రియతిగ్మదీధితిచయవ్యాఘూర్ణనిర్భగ్నభూ
గంభీరోరుశిలోద్గతాగ్నిరజగత్కృన్మధ్యరాడ్భ్రగస
చ్ఛంభప్రత్నఘృణిభ్రమప్రదకనత్సూర్యోపలజ్వాలికా
జృంభత్వానక మొక్క వేసవి జనించెం గాలకూటాభమై. 153

చ. శరచరసాధ్వసప్రదము సర్వబకౌఘమదప్రదాయకం
బురుజలహైన్యకారము సముజ్జ్వలసాంద్రమరీచికాసము
త్కరపనరూపకారకము గాఢపయోధివియోగకార్శ్యభీ
కరతటినీతనుప్రదము కాసరభీష్మము గ్రీష్మ మెచ్చినన్. 154

చ. పవలను వర్తకాగ్రణి నభశ్చలసాగరమధ్యమంబులో
రవి యనునోడమీఁద నపరక్షితిభృత్పురిఁ జేర రా మరు
జ్జవగతి సుళ్లఁ బెట్ట నదిసాగక చిక్కినమాడ్కి సూర్యుఁ డ
య్యవసరమందు మందగతు లానిన దీర్ఘము లయ్యె ఘస్రముల్. 155

తే. మల్లికాకుంజపుంజాబ్ధిమధ్యమున మ
రీచికాస్వాతివృష్టి గురియ జనించి
పత్త్రపుటశుక్తు లెండలఁ బగుల బయలు
పడినముత్తెము లన మొగ్గ లడరఁ దొడఁగె. 156

సీ. దేహంబు బలువెట్టదీసి పిస్తుగ నుండుఁ, జలువ గాఁ బన్నీట జలకమాడి
ఘనసారయుక్తమై తనరారు పాటీర, పంకంబు తనువున నింకఁ బూసి
విమల నాగరచూర్ణవిహితమౌ మాహిష, దధ్యోదనము ప్రొద్దుతటి భుజించి
బహుళేలామజ్జకప్రసవసౌరభమిశ్ర, శీతలజలముల సేవఁ గలిగి
తే. కప్పురపుఁదిన్నె లమర బూఁజప్పరములఁ, జిగురుఁ బాన్పున వసియించి శీతవాత
జాతకరతాళవృంతము ల్సతులు వీవఁ, బ్రొద్దు వుచ్చిరి కొందఱు భోగు లపుడు.

తే. అట్టివేసవివేళ ధనాఢ్యుఁడైన, యచ్చటినియోగి చలివెంద్ర లాదియందుఁ
బెట్టఁ గట్టడిఁ జేసినఁ బేద లగుటఁ, జారుభాస్వతి హరిశర్మ చేరి రపుడు. 158

సీ. లవణశుంఠీజంభలరసానుయుక్తమౌ, నీరుమజ్జిగకుండ బారు లలర
లఘువృత్తైలానూనలలితసౌరభమిశ్ర, శీతలజలకుంభజాత మమర
జీరకకైడర్యచారుగంధములొల్కు, పలుచనియంబళ్లు పంట్లు దనర
రసయుప్పు నీరుల్లి రసము నించినకోళ్లు, గంజికాఁగులగుంపు కడఁ గహింప

తే. గంధబర్హిష్ఠలాయుక్తప్రశస్తి, కాయమానముహుగ్మహురాయమాన
మందపవమానఘనసాగబృందవేది, కొలయువితానపానీయశాల యొప్పె. 159

వ. మఱియు నచ్చలిపందిరి గవాక్షాదిసమాకలితవాయుజాతసంచారంబు గావున రఘురాముని గోరంటకంబును బాంధజనసంతాపహారణంబు గావున సత్కృతసంగమంబును గిబంధప్రచురంబు గావున దండకారణ్యంబును సితాభ్రసంచయకలితంబు గావున శరత్కాలంబును నమృతసంపూర్ణకుంభంబు గావున సురేంద్రనివాసంబును ఛాయాసమేతంబు గావునఁ దపననిలయంబును వివిధకుసుమసుగంధబంధురంబు గావున నారామంబును బురుడించు నప్పుడు. 160

క. అచ్చలిపందిరిలోపల, నిచ్చుచుఁ బాట్యేటిపరసవారికి జల మం
దిచ్చుచును జారుభాస్వతి, యచ్చట హరిశర్మ యుండు నాసమయమునన్ 161

చ. ఉపమరి బుద్ధిశాలి వినయోత్తముఁ డప్రతిమప్రభావళి
తపనుఁ డవార్యధైర్యుఁడు నుదారచరిత్రుఁడు సర్వసత్కళా
నిపుణుఁడు రూపనిర్జితపనేరుహసాయకుఁ డొక్కవిప్రుఁ డా
తపపరితప్తుఁడై జలముఁ ద్రావఁ బ్రపాస్థలిఁ జేరి వేఁడినన్. 162

తే. చారుభాస్వతి శీతలజలము లపుడు
గిండితోఁ దెచ్చి యిచ్చి వీక్షించి వాని
చక్కఁదనమున కలరారి సరస కేగి
యలఘుసాహసమునఁ దమి నిలుపలేక. 163

క. ప్రక్కకెగఁ బోడుప మన్మథుఁ, డక్కోమలి పతికి వెఱవ కానందముతో
నక్కునఁ జేర్చుక పాంథునిఁ, జొక్కుచు నుండంగ మగఁడు చూచె లతాంగీ. 164

తే. ఎట్లు బొంకంగవలె నప్పు డిందువదన, నేర్పు గలిగినదానవు నృపతిమౌళి
కేళికై తేను నీ కిది కేవలంబు, దొడ్డగాదు విచారించి తోనె చెపుము. 165

క. అనిన కలహంసపలుకులు, విని హేమావతివిచారవిపులాబ్ధిమునిం
గినమది నా కిది తెలియదు, వినుపింపుము నీవె యనిన విధి హరి యనియెన్. 166

చ. అటువలె జారుభాస్వతి ధరామరుఁ గౌఁగిటఁ జేర్పఁ జూచి తాఁ
జటులతరోగ్రభాషహరిశర్మ యదల్చినఁ దొట్రుపాటునం
బెటిలక యీతనిన్ వినుము పిన్నతనంబున దేశచారియై
పటుగతిఁ బోయె మాతులునిపట్టి సుమీ యని లేనిదీనతన్. 167

తే. కౌంతునకుఁ దెల్పి మఱిమఱి కౌఁగిలించి
చెమటకణములఁ దనపైఁట చెఱఁగుచేతఁ

దుడిచి యాతనికి ల్పాష్టి తోడి తెచ్చి
మేల మాడుచుఁ బానీయశాల కపుడు. 168

సీ. గొనబుతో నెన్నాళ్లకో నల్ల్వఁగా నేటి, కైన నిన్నెనయ నా కబ్బె ననుచు
నీవు నామీఁద నిజముగాఁ జెప్పుమా, నాయందుఁ బ్రేమ కద్దా యటంచుఁ
బదిదినా లుండక పారిపోయెద నన్నఁ, బోనిచ్చునా వెఱ్ఱిదైన ననుచు
నీప్రాప్తి సుదినసం జేసోము ఫలమొ నా, మనసులో నెంజిలి మాసె ననుచుఁ
తే. జేరిక లొనర్చి తేనియ ల్చిలుకఁ బలికి
మోహ మూరించి తరితీపు మోపుకొల్పి
యతనిమీఁదను బతికిని హితము వోడమ
మున్నె యొనరించి వానితో ముఱియఁ దొడఁగె. 169

క. ఈకరణిఁ జారుభాస్వతి, యాకాంక్షలు దీఱ నాఁ డహర్నిశ మతనిన్
డీకొల్పి రతులఁ జివురుం, జేకత్తి నజేరు సడ్డసేయక యుండెన్. 170

క. అటువలెఁ గాలోచితసం, ఘటితోక్తిస్ఫూర్తి నీకుఁ గలిగిన భూభృ
న్నిటలాక్షఁ గదియఁ జటిపాటి, నటనలఁ బోవమ్మ కుందనపుజిగిబొమ్మా. 171

చ. అన విని మందహాసము ముఖాబ్జమునం జిగురొత్తఁ గర్ణవే
ష్టనమణికాంతి చెక్కులహుటాహుటినాట్యము సల్ప నౌర యం
చును దలయూఁచి వేఁకువగుచోఁ జెలికేళిగృహాంతరంబునం
దెనసి నృపార్పితేచ్ఛఁ బనలెల్లను ద్రోయుచు నుండె నంతటన్. 172

చ. సమయమహేంద్రజాలకుఁడు సారసమిత్రుఁడు నేటిపద్మరా
గము వెస మాయఁ జేసి కుతుకంబున హా యని నీలపంక్తిలన్
భ్రమపడఁ జూచి ఝూ యనుచుఁ బల్కు నుపాయలఁ జేసి చూపెఁ జి
త్ర మనఁగఁ బ్రొద్దుగ్రుంకెఁ దిమిరం బెసఁగెన్ దివి నొప్పెఁ దారకల్. 173

క. ఆవేళను గృహకృత్యము, తా వేగమె తీర్చి పేర్చుతమకంబున రా
డ్దేవేంద్రునిఁ జేరఁగ హే, మావతి నెమ్మదిఁ దలంచి మహితోత్సుకతన్. 174

ఉ. దిద్దిననాభినామము కదించిన మేల్మడిచీఱ చీర్ణమై
నిద్దపుఁబూఁత పుష్పములు నించి ముడించినకొప్పు రత్నము
ల్దద్దయుఁ గల్గుసొమ్ములు గళమ్మునఁ జొక్కపుఁజుక్క యొప్పఁగా
ముద్దియ వచ్చి హంసమణిముందర నిల్చె నృపాభిలాషయై. 175

క. నిలిచిన యాహేమావతి, వొలిచిన కరుణామృతంపుభూరితరోక్తుల్
పొలయఁగ దృష్టిఁ గనుంగొని, దలఁచినపని కపుడు హంస ధరణిపుఁ డనియెన్.

## ఏడవరాత్రికథ.

క. మున్నొక్కపట్టణంబున, సన్నారి మిటారి నేర్పు సామర్థ్యము గై
కొన్నదియై నడచినకథ, చెన్నుగ విని పొమ్ము కనువిచిత్రము గొమ్మా. 177
తే. అనినఁ జిలుకనవ్వు నవ్వి యయ్యంబుజాక్షి, యేమి చిత్రంబు గల్పించి యింతలోన
శీఘ్రముగఁ జెప్పెదవుచేసి సెల వొసంగు, మరి యెదను రాజుపొందునకనిన నపుడు.
క. కాదంబవంశపల్లభుఁ, డాద్భుతిని బరాకు లేక యక్కానొ వినవే
మోదముతో నని చెప్పెను, మేమరమాధుర్యసాధుమేధాభణితిన్. 179
క. విను మనఁగా ననఁగా నిల, ఘనమణిపర మనెడుపురము గలదొకటి వినూ
తనకేతన పటజాతప, వన హతసురసురతఘర్మసనవారంబై. 180
చ. కమటము కట్లు సంచి యొరగల్లును గత్తెర సుత్తె చీర్కముల్
ధమనియు శ్రావణంబు మొలత్రాసును బట్టెడ నీరుకావు శా
ణము పటకారు మూస బలునాణె పరీక్షలమచ్చు లాదిగా
నమరఁగ భద్రకారకసమాహ్వయుఁ డొండొకఁ డుండు నప్పురిన్. 181
చ. కరఁగను బోఁతఁ బోయఁగను గ్రాఁచి కదించను గమ్మి దీయఁగా
నొరయఁగ వన్నియ ల్మిగుల నుండఁగఁ జూపఁగఁ బూదగట్టరే
కరయఁగఁ దీరఁ జెక్కఁబడి యచ్చునవేయఁగ సుద్దగించఁగా
సొరిది విచిత్రచిత్రముగ సొమ్ములు సేయ నతండు నేరిచెన్. 182
క. కంతువసంతజయంతుల, సంతసమున గెలువఁజాలు సౌందర్యమునన్
సంతతసంపద్గరిమఁ గృ, తాంతజిదాప్తుని జయించు నతఁడు శుభాంగీ. 188
వ. మఱియు నాభద్రకారకుడు కోణంబు నాడీప్రచురంబు గావున శరీరంబును శుక్రాం
గారప్రశస్తంబు గావున నక్షత్రమండలంబును గుంభతులాదిసహితంబు గావున
రాశికూటంబును గాంగేయశిక్షగలిగినది గావున శిఖండిఖండనంబును మధూచ్ఛిష్ట
సంయోగంబు గావున యవననివాసంబును వప్రోన్నతంబు గావున మహాపురంబును
మూషికావృతంబు గావున శూన్యాలయంబును దీక్షసాధనయుక్తంబు గావున
యుద్ధరంగంబును శ్రావణయోగంబు గావున వర్షాకాలంబు ననుకరించు- 184
తే. ఆతనివధూటి శుకఘోటి నలువమేటి, యొడయఁ డేలేటి సీమాటి యొఱపుగోటి
కొనవెగయమీటి యిదియేటి కులుకనేటి, పోటి కెదిరేటిశుభవాటి నీటు మెఱయు.
తే. దానికచకుచగళలక్ష్మిఁ బూనఁ దలఁచి, నీలశైలాబ్జములు మ్రోల నిలిచినపుడె
కసవుకట్టెలు నీళ్లనుఁ గడఁగి మోయఁ, జేసె నేమనవచ్చు నచ్చెలువ చెలువు. 186
క. కుందనపురవలు గుప్పెడు, తుఁదిలపుం జన్నుఁగవయుఁ దొలతే నెలకున్
విందు లొనరించుపలుకులుఁ, జందురునిం బోలు మోము సకియకె యమరున్. 187

క. కువలయ మాకుఁగ నెఱిగె, కువలయ మారలుదపెఱుఁగు కుచ కాఠిన్యం
బవలయ మామోహనతా, రవలయ మానఖము లనఁగ రమణి రంహిదున్. 188
మ. కచశోభాగరిమంబు నెన్నడుము సైకంబుల్ మధుప్రాయమా
వచనవ్యూహము లోచనాబ్జములధావళ్యంబు శృంగారస
త్కుచకుంభమ్ములపొంకమున్ ముఖకళాంకూరప్రభావంబు న
య్యచలశ్రోణికిఁగాక నేసకియలందైనం బ్రసర్తిల్లునే. 1
సీ. కుప్పెరాగడిబిళ్ల కుంకుమరేఖపా, పటబొట్టు కమ్మలు బావిలీలు
లలిసూర్యచంద్రవంకలు నూసకము కెంపు,రవలపల్లెరుఁ బూవు రావిరేక
బుగడలు నానుఁగో ప్రులు తీఁగ మెడనూలు, కుతికంటుసరపణగుండ్లపేరు
సరిగె ముక్కర బన్న సరము ను త్తండాలు, కంకణంబులు తట్లు కడియములును
తే. సందిదండలు నొడ్డాణ మందమైన
ముద్రికలు హంసకంబులు మ్రోయుగజ్జె
లలరు బొబ్బిలికాయలు గిలుకు మట్టె
లాది యగుసొమ్ము దాల్చి యయ్యబల మెఱయు. 190
క. దాని నెగాదిగఁ జూడని, మానవునిం దానిపొందు మదిలో నెపుడుం
బూని తలంపని పురుషుని, గానము త్రిభువనములందుఁ గలవారలలోన్. 191
క. ఆశుభవాటి మనోహర, పేశలతర మృదులవాక్యపృథుమాధురిచే
నాశపడి మారభూతా, వేశమునఁ జరించు వీట విటయూథంబుల్. 1
శా. నీవీబంధము చక్కదిద్దునెతివేణిన్ లెస్సఁ గైసేయుఁ గె
మ్మోవిం జిల్కుదరస్మితంబు జిగిచూపు ల్వాఱఁగాఁ జూచుచుం
గ్రేవ ల్గప్పడఁ జేయు నెచ్చెలియతోఁ గేళ్కూల దట్టించి వా
చావైచిత్రిని ముచ్చటాడుసకి తన్ జారు ల్విలోకింపఁగన్. 19
తే. ఇటుల మదమెత్తి తమిచేత నేపురేఁగి, తిరుగు నవ్వీటఁ గల్గినధీరవిటుల
పొందునకు నాసపడి పోసనంగు లేక, కుందుచుండును విరహార్తిఁ జెంది యెపుడు.
వ. అంత. 19
మ. చిగురుం గత్తివజీరుమాఱుపలుపం జెన్నొందు నొయ్యారపున్
సొగసుం బ్రాయము గల్గువాఁ డొకఁడు మేల్పొన్నారి ధూర్తాఖ్యచేఁ
దగఁ బేం పొందినవాఁడు శిల్పఘనశాస్త్రప్రక్రియ న్నేర్పఁగాఁ
గెగువ న్నిల్చెను భద్రకామనకు నంతేవాసియై వేడుకన్. 196
క. వానికుశలత్వసంపద, వానిమనోహారిరూపవరవైభవమున్
వానిఘనబుద్ధిఁ జూచి యు, హీనకరుణ నింట నిల్పి హితమలరారన్. 197

తే. నిత్తకై భద్రకారుఁ డాధూర్తునకుఁ దా, నిటనే యన్నవస్త్రాదు లిడుచుఁ గల్గు
పనులు నేర్పుచు నూడిగ భక్తిమీఱ, నలఘుశుశ్రూష సేయుచు నాతఁ డుండె.

క. కందువమాటల బెళుకుల, మందస్మితరుచిరవచనమాధురిచేతన్
దుంగుడుకుఁ జెంద ధూర్తుని, డెందము గరఁగించి చెలి ఘటించెన్ రతికిన్. 199

తే. ఎడ తెగని మోహ మూరించి యేపు రేఁగి
వేశ్మమున నొంటిపాటైన వేళలందు
మదనకదనంబునకుఁ జాల మరులుకొనఁగఁ
జేయు శుభవాటి ధూర్తుని చిత్త మలర 200

చ. అలయక భద్రకారుఁడు గృహంబున నుండినయప్పుడెల్ల వే
డ్కలఁ బను లభ్యసించుచుఁ దదంబడ కాతఁడు లేనివేళలం
జెలఁగుచు వానిభార్యకడఁ జేరి మనోభవకేళికాక్రియల్
తొలఁగక యభ్యసించు కళితుల్యుఁడు ధూర్తసమాఖ్యుఁ డున్నతిన్. 201

తే. స్నానపానాన్నవస్త్రాది సంగ్రహంబు, భద్రకారుఁడు సెల విచ్చెఁ బనికి మెచ్చి
వానిచెలువంబునకు మెచ్చి వలచినపుడు, చాల శుభవాటి సెలవిచ్చె సంగమంబు.

క. ఈతీరు సకలభోగము, లాతతగతి నడచుచుండ నాధూర్తాఖ్యుం
డాతలిరుఁ గత్తిగలదొర, చేటకటారికిని సత్త సేయక యుండెన్. 203

వ. అయ్యవసరంబున. 204

ఉ. ఆదర మొప్ప నొక్కదివసాంతమునందు మకోణముం బహి
ర్వేదిని భద్రకారుఁ డమరించుక ధూర్తునిఁ జూచి మిద్దెలో
బోదియమీఁదనున్న తుల పొందుగ వేకొనిరమ్మటంచు సం
మోదముతోడ నంపఁగ సముద్రగభీరుఁడు పోయి చూడఁగన్. 205

తే. వానియొయ్యార మొకవింత యైనపుడు
చూచి వలరాజు రాజ్యంబుఁ జూరఁగొలుపఁ
దలఁచి శుభవాటిధూర్తుతోఁ దారసిల్లి
తలుపు గదియించి రతికేళి సలుపుచుండె. 206

క. చెన్నారి చుంబనంబులుఁ, జిన్నారివగల్వినోదచేష్టలుఁ జిన్నెల్
గన్నారఁ జూపి యపుడా, సొన్నారి మిటారి ధూర్తు సురతుల గడఁచెన్. 207

క. ఈలీల మదనకదనా, లోలత్వముఁ బూని యింటిలోపల ధూర్తుం
డాలస్యం బొనరించినఁ, దాలిమి చెడి భద్రకారధన్యుఁడు చింతన్. 208

చ. తడసె నిదేమొ ధూర్తుఁ డల దర్పకు బోలినవాఁడు భార్యయుం
గడు రతిఁబోలు రూపుసిరి గల్గిన జవ్వని యేమిద్రోహముం

గడిమి నొనర్చిరో యనుచుఁ గాలటు నిల్వక వచ్చి గట్టిగాఁ
గడెనిడు తల్పుఁ జూచి ఘనగర్జితభాషలఁ బిల్చె శిష్యునిన్. 209

తే. అప్పు డాజాయ యేచాయ నధిపు మదికి
హితముగాఁ బొంకవలయు నో యింత యనుచు
హంస యడిగిన దరహాస మలర మోము
వంచి హేమావతీసాధ్వి యంచ కనియె. 210

క. ఒకరొకరి బుద్ధి యెట్లో, యకటా తెలియంగ బ్రహ్మకైనను వశమా
కకురించక యిది నీవే, యకుటిలగతి నుడువు మనిన హంసం బనియెన్. 211

మ. విను హేమావతి భద్రకారుఁ డటకు న్వేగంబుగా వచ్చి శి
ష్యునిఁ బిల్వన్ భయ మంది వాఁడు చలితాస్తోకవ్యథం గుంద నా
తని భీతిల్లకు మంచుఁ జెప్పి తులసూత్రంబు ల్వాడి త్రెంచి పై
చి నిరాఘాటత నేగి వాకిలి సడల్చెన్ నాయకున్ దూఱుచున్. 212

వ. అట్లు వాకిలి దీసి భర్తతో మఱియు నిట్లనియె 213

ఉ. తులఁగొని తేను మంచిగుణధుర్యునిఁ బంపితి రౌను మీరలుం
బిలిచినఁ గాడువెత్తుఁ గద భీతిని దారము లన్ని దెంచి యీ
తలుపు గదించి సూత్రములు త్రాసునఁ గూర్చుచున్నవాఁ డిసీ
పలువ మఱెంత నేర్పరని భర్తనుఁ జూపి దురుక్తు లాడినన్. 214

తే. ఎంతలే దింతెకద దీని కిట్లు లనకు
తానె పోయెను గాంత చేఁ దప్పిపోవ
నేమి సేయుదు మని ధూర్తు నితర మనక
డెందమున సందియ మొకింత చెందకపుడు. 215

క. ఎప్పటివలె నుండె విభుం, డప్పగిదిన సూక్ష్మబుద్ధి నారయవలె నో
యొప్పులకుప్పా నీ కని, చెప్పఁగ హంసంబు ముదముఁ జెలువము దోఁపన్. 216

క. ఆవేళ శిరఃకంపము, గావించి యయారె యని చొకాటం బగుకే
లీవాసముఁ జేరెను హేమావతి నృపమోహమగ్నమానస యగుచున్. 217

మ. కనదృక్షాలయ వశామహాబిలమునం గన్పట్టు భాస్వచ్ఛనుం
తనవానర్ఘ్యమణిం దటిన్యధిపసత్రాజిత్తునిం జేర్చె నో
ముకు దాఁ గైకొని కాలకృష్ణుఁ డన నంభోజాక్షుఁ డప్పశ్చిమాం
బునిధిం జేరఁ దదబ్జనాభరుచిఁ నాఁ బొల్పొందెఁ గ్రొంజీఁకటుల్. 218

వ. అయ్యవసరంబున. 219

సీ. విటమనోధృతిశిలావిచ్ఛేదతాటంక, తాటంకమణికాంతితతులు వెలుఁగఁ
బల్లవమానసపటుధైర్యహారక, హారకళాస్తోమ మాఘుళింప
గమనహృద్దార్ఢ్యభంజనకీలకంకణ, కంకణాంగదములు ఘల్లు రనఁగ
జారాత్మదృఢతాసమీరాహిసంతాన, సంతానకుసుమవాసనలు వొలయ
తే. యువజనస్వాంతకాఠిన్యదవసమీర, బంధుఘనసారఘనసారగంధసార
సౌరభోదారకుంకుమస్థాసకంబు, దనర రాయంచకడకు నత్తరుణివచ్చె. 220
ఉ. వచ్చినఁ గాంచి హంసకులవల్లభుఁ డాతలిరాకుబోఁడిపై
లచ్చికనిచ్చగించి యనులాపకలాపకళారసస్థితిన్
మెచ్చి నృపాలుపాలికిని మేకొనిపోయెద వేమె పొమ్ము నా
ముచ్చట లాలకించి కడుముద్దులుగుల్కెడు ముద్దియా యనన్. 221
క. అనిపల్కు నంచవాచా, తనమాధుర్యమున సొక్కి తత్కథయేమీ
వినియెద నన హేమవతి, కనురాగం బొప్ప రాజహంసం బనియెన్. 222

## ఎనిమిదవరాత్రికథ.

మ. కలదుద్యద్ధ్వజశాటికాపటలజాగ్రద్వాతసంచారసం
చలదభ్రస్థలినిల్వనీక్కతదవస్థం బాపఁదద్భూమిరా
ట్కులవాళిన్ శరణంబు వేఁడుటకుఁ దోడ్తోవచ్చెనో యంబుదం
బులనన్ మత్తకరుల్సెలంగ నొకప్రోల్పున్నాగపుంజం బనన్. 223
సీ. గోళ్లురిక్కలజోళ్లు ప్రేళ్లుమావిచిగుళ్లుఁ, జెల్లుఁ బుక్కిళ్లల్లసిల్ల నుళ్లు
దూండ్లు బాహులు గిండ్లుచెండ్లు బోల్పాలిండ్లు, కండ్లు మీల్సింగాణివిండ్లు బొమలు
జూపు మారునితూపుఁజూపు మోములయేపు, బాపురే శశిరూపు మాపవొప్పుఁ
గప్పు పెన్నెఱికొప్పులొప్పు చీఁకటిచొప్పుఁ, గప్పు నవ్వులు విప్పుకప్పురములు
తే. బొంగు బంగారురంగు లసంగడంగు, వంగలతిల నెసంగు మెఱుంగు గుంపు
లనుచు నిజరూపవైభవంబఖిలజనము, లభినుతింపఁగ వెలయుదురచటిసతులు 224
వ. వెండియు నప్పురంబు సర్వమంగళాభ్యుదయనివాసంబై హిమమహీధరంబుపోలికిని
సుధర్మాస్పదరూపరమ్యంబై మేరుశిఖరిభాతిని బురుషోత్తమశోభితంబై శ్వేతద్వీపంబు
కరణిఁ బుణ్యజనానందసమృద్ధిదంబై యలకాపురంబులీలను విబుధమనోరంజకరం
బై యమరావతీపట్టణంబుచాడ్పున రాజహంసాభిశోభితంబై పద్మాకరంబువైఖరిఁ జతు
రాస్యవాణీప్రచురంబై సత్యలోకంబననొప్పు నెప్పుడు. 225
సీ. గొడియదీగములావు గొలుసులొప్పలియుడ్డ, మ్రానుబొత్తలుపుల్లమగలుగోడ
గాయధాన్యంబుల కోణఁజముల్బియ్యంపు, గరిసెలు దినుసులుఖలకొటార్లు

మిద్దెచిల్లరలు నమ్మెడుదుకాణముబచ్చు, మళిగబొక్కసపిల్లముచ్చులందుల
కసణముల్ నాణెముల్గలకల్ల సంచిగో,తము లెక్కకడితెంబు దడము భరణి
తే. తక్కెడి సమస్తవస్తువుల్గవరునటుక, బావినుగ్గులకుచ్చెలపాడిపసుల
గాడిజాలాది దివెగూఁడుగాబుతొట్టె, యొప్పధనచిత్తుఁడను బేరి యుండునచట. 226
సీ. జాజికాయలు రాస్నజాపత్రియు హరిద్ర, నాగర గంధక నాభిరసము
లతిమధురంబు దుత్తాభ్ర కైలాశిలా, జిత్తులు మురుదారుసింగుహింగు
సన్నభేదియు వస యక్కలకర పంచ, లవణచవ్యములు బోళము మణిశిల
పెప్పళ్లె కోష్ఠువు పిప్పలీ మూలంబు, హరిదళ నాగకేసరము లింగి
తే. లీకము సదాపవేళ్లు ధాన్యాకములును
గటుకలోహిణి పటిక జంగాలపచ్చ
కర్పూరియుఁ గ్లారవియు రేణుకమతి వసయుఁ
దాళికము మాంసనఖము నేపాళములును. 227
తే. క్షారపాషాణములునభ్రకంబు లైద, గ్రంథితగరంబును యవానికాద్వయంబు
కచ్చురములుమరాటిమొగ్గలు కుసుంభ, కుసుమములు కుందురుష్కము లెసఁగఁగలవు.
సీ. గంటుభారంగియుఁ గంకుష్ఠముచు మెంతి, మంజిష్ఠి జిలకఱ్ఱ మ్రానిపసపు
విషకంటకౌలామ్లవేతసంబును నీరు, చించలంబును బులిచించలంబు
జీరకంబును నల్లజిలకఱ్ఱ పుష్కర, మూలంబు కాంపిల్యమును సముద్ర
ఫేనంబు ధాతకీసూవంబు సానువు, లుప్పళులును గజపిప్పలియును
తే. గాక మాచియు స్థౌణేయకంబు చిత్ర, మూల గోరోచనములుఁ గాపోతతార్క్ష్య శై
లసౌవీర రసముఖాంజనములు వెలి, గాగమునఁ గల్గి యుండు నవ్వేరియింట.
వ. మఱియును. 230
సీ. వింతగాఁ బుంజీభవించి నానాధాన్య, ములరాసు లుండెడి నిలయములును
సకలరత్నాకరస్థలములై యేకీభ, వించి విస్మయ మిచ్చు వేశ్మతతులు
నఖిలదేశంబుల నమరు నాణెములపుం, ఖీభవించిన చిత్రగేహములును
జీనిచీనాంబరానూనబృందంబుల, మందీభవించిన మందిరములు
తే. సర్వరసవర్గములు టంకసాల ద్రేయు, చావడి హుమాదినుసు మేలు సరకుఁగలిగి
నాల్గుదిక్కుల పేటల నగరజనుల, కలర నమ్ముచు ధనచిత్తుఁ డచట వెలయు. 231
క. వానికి వసుమతి యనఁగా, మానిని విలసిల్లు నొకతె మదనునిచే నా
నానవసుమపూజిత మగు, చీనిజము దాళి యనఁగఁ జెలువు దలిర్పన్. 232
ఉ. అబిడమోము గోము జిగి యాబిడముద్దులకావి మోవిరం
గాబిడ కప్పుగొప్పు సొగ సాబిడ సూరెలకోపు చూపు జ

గ్గాబిడ గబ్బిగుబ్బసిరు లాబిడ లేయఁబడైన కౌను సొం
పొబిడ యారుతీరు చెలియా వచియింపఁ దరంబె యేరికిన్. 233

క. అలరుం బ్రాయపుఁజిన్నెల, కలిమిన్ రంజిల్ల మెఱుఁగుకరుగునఁ బోయిన్
విలసిల్లు నటనపుత్రిక, పొలుపున నవ్వీటిలోనఁ బొలఁతుక మెఱయున్. 234

చ. పొలఁతుక వేణి కృష్ణతను బూనినయంతనె మోము సూడు చేఁ
దలకి విధుస్థితిం దనరెఁ దాళక చన్నులు నచ్యుతాకృతిం
బొలిచె సహింపలేక నడుమున్ హరిరూపు వహించె నిట్టివా
గ్గలకు మధుద్విషత్వమును దాల్చెను జక్కెరఁగాల్కు నేవియున్. 235

సీ. కులగోత్రములవారి నిలిపె కట్టెలు నీళ్లు, మోయించుచుండెడు ములుచఁదనము
తనుగన్నవారలఁ దన్నిత్రొక్కుక నిల్చి, చెలఁగి పంకావాప్తి చెర్చు సూడ
వినుతకళాఢ్యుఁడై ద్విజరాజు ననిశంబు, దోషాకరుని జేయు దూషణంబు
ఘనరసస్థితిఁ జెంది తనరు మానససీమ, బహుభంగములఁ గూర్చి ప్రబలు నగడు
తే. ప్రస్తావారించికొనియె సప్పద్మనేత్ర, కలరు కుచశైలములును హస్తాంబుజములు
నవ్యముఖచంద్రబింబంబు నాభిసరసి, మెఱయఁ గౌశల్యశక్తి నిర్మించిమించి. 236

క. అంబుజముల బింకంబులఁ, గంబుల నగు నయనయుగము గళముఁ గుచంబు
ల్బింబులఁ గ్రొంబ గడంబుల, డంబుల నిరసించు నప్పడంతి బెడంగుల్. 237

క. డాలా మెఱుఁగులు గ్రొంబగ, డాలా నెత్తావి మోవిపండులు కోదం
డాలా కనుబొమ లతనుని, డాలా వాల్చూపు లన మిటారి గహించున్. 238

ఉ. గుబ్బలనీటు మోముపస కుంతలబృందము నిగ్గుఁ గౌనులో
జబ్బుదనంబు గన్నుఁగవచందముఁ జెక్కుల తేటవోవిన్
గబ్బిచకచ్చకల్ రదనకాంతి కటిస్థలియుబ్బు గంధరం
బుబ్బర మారుతీరు దరహాసము హాసము డంబు చూడఁగన్. 239

తే. దానిసొగ సాత్మలో మెచ్చి, తలఁ గదల్చిఁ కేరిమీసంబుపై ముద్దుకేలు వైచి
యడరి నిటూర్పు వెచ్చి యయ్యారె యనని, మానవుఁడు లేఁడు ధారణిలోనఁ జాన.

క. అటువంటిరూపరేఖా, పటిమం దనరారియుండు భామిని రతులన్
ఘటియింపక పరతరుణీ, విటుఁడై ధనచిత్తుఁ డెపుడు వెలయుం జెలియా. 241

తే. అటువలె నిజాధినాయకుఁ డన్యమృగదృ
గానుకూల్యాగ్రచిత్తుఁడై యహరహంబుఁ
దిరుగఁ దనమీఁద వసలేని తెఱఁగుఁ జూచి
వసుమతియుఁ గాంచె జాతాంకవాహనంబు, 242

క. పతి నడచునట్లు నడచెదు, సతియ పతివ్రత యటంద్రు సజ్జను లనుచుం
బతి పరదారలఁ గూడిన, సతి జారులఁ గూడఁ దొడఁగె సతతము వేడ్కన్. 243

తే. ఇటుల నావైశ్యదంపతు లేపు రేఁగి, మనసు లెచ్చోటఁ గల్గిన మరులు కొల్పి
నెరిమరునితూపు తమచూపు నిగ్రహంబు, వెట్టి మరచివ్వకేగుదు రెట్టులైన. 244

క. ఈతీరు కొంతకాలము, నాతియుఁ దానును బరేచ్ఛ నడచుచు నొకనాఁ
డాతతమదనశరాహత, చేతఃకంజాతుఁడై నిశీథిని వేడ్కన్. 245

క. అత్తింటికోడలికిఁ గా, హత్తుక నతఁ డుండె నొకయువాగ్రణికొఱకై
యత్తెస్వి యటకె పోయినఁ, జిత్రజుఁ డేసకొల్పె వారిచిత్తము లలరన్. 246

తే. తాను గోరినకన్య యీతరుణి యనుచుఁ, జేరె నాసక్తిచే ధనచిత్తుఁ డప్పు
డాయువాగ్రేసరుం డీతఁ డా నటంచుఁ, గదిసె వసుమతి యత్యంతకాంక్షతోడ.

వ. అయ్యవసరంబున. 248

మ. సహసాసంఘటితస్తనగ్రహణసంజాతాంగరోమోద్గమం
బు హఠాచ్చుంబితపాటలాధరముఖాంభోజాక్షిగండంబు దు
స్సహనీవీచ్యుతికంచుకాహృతినఖాంచద్దంతగాఢక్షతా
వహనం బిర్వుర కయ్యెఁ సంగమము దిగ్వ్యారార్పితేక్షాళియై.

క. కలయికల నాఁటిజాబులఁ, గులసతిఁగా నతఁ డెఱింగెఁ గోమలి మగఁ డీ
యలఘుఁ డని తెలిసె నప్పు డెట్టులవలె నచ్చెలి బొంకవలయు వనితా చెపుమా. 250

తే. అనిన హేమావతీభామ హంసదిక్కు, చూచి యగియెటు బొంకెనో చోద్యమహహ
తెలియఁగాఁ జాలనిదినీవె తేటపడఁగ, దెలుపు మనిపల్క రాయంచ తెలప కనియె.

క. ఆవేళ నాయకుఁడు కో, పావేశహృదంబుజాతుఁడై యీనిశిలో
నీవిటకు నొంటి నేటికిఁ, గావచ్చితి వనుచుఁ గినియఁ గామిని యనియెన్. 252

తే. మగఁడ నామీఁద నీకింతమమతలేని
తెఱఁగుఁ గన్గొని కాళికాదేవి కేను
బడుచుఁదనమున మ్రొక్కితి నాపతిని రతికిఁ
గూర్ప నీసేవ సేయింతుఁ గోర్కె మీఱ.

క. అని వేఁడుకొనిన యప్పుడె, ఘనకరుణామృతకటాక్షగరిమమ గాళీ
జనని నను జూచి పో పతి, నెనసెద వనునంతలోన నిటు వెతిఁగితి నిన్.

ఉ. వింతలు కాళికాజనని విశ్రుతసత్యములంచుఁ బల్కఁగా
నంతకుమున్నె యచ్చెలియు నుసురెంచిన జాడఁ గోర్కెతుం

జాంతరసీమ నుండి యిది యహో నిజ మంచు నెంచిన వర్తకుం
డెంతయు విస్మయాకులితహృత్పుటుఁడై నిజభార్య నన్నతిన్. 255

తే. స్తుతులఁ గరఁగించి సాష్టాంగ నతులొనర్చి, గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చినిక్కోర్కులలర
జేసెదనటంచు బాసలు చేసి సతిని, దొడరి ధనచిత్తుఁ డింటికిఁ దోడితెచ్చె 256

క. అది మొదలుగఁ బరభామలఁ, గదియక ఘనచిత్తుఁ డెపుడు కాంతామణికిన్
ముద మలర వశ్యుఁడై తగఁ, బొదివెను నీ కట్టినేర్పు పొసఁగినఁ బొమ్మా. 257

క. అనవిని నాసికఁ దర్జని, యునిచి కడుశిరంబు ద్రిప్పి యోహో చిత్రం
బని తెల్లవారుచుండుటఁ, గని సోమగాత్రి వియోగకలనఁ జనియెన్. 258

వ. అని ప్రత్యుత్పన్నమతి చెప్పిన విని సంతోషించి నలుండు నాతియవాతివృత్తాంతంబు
జెప్పు మని ప్రార్థించిన. 259

మ. స్మరవాత్సల్యవిశేషరక్షితసనీమాతంగమాతంగసం
హారయోషిన్నుత పాదపంకరుహశోభాభంగభాభంగభా
స్వరసర్వామరవానిచిత్రజలరుట్సారంగసారంగరా
ట్శిరపద్మస్తుతిజాతముత్పులకపన్నీలాంగనీలాంగదా.

క. సవనావన జగదవనా, దవనాను విషాగ్నిహరణ దారుణ భువనా
భువనాధిపనుత సవనా, సవనాభిద్యుతిజితార్కజాసరసవనా. 261

పృథ్వీవృత్తము. కులాచలకులాచలావలయకూటఘోణీఫణీట్
తలాతలతలాతలాది జగదర్ధిదిగ్దార్ఢ్యబృహ
త్కళాధరకళాధర ప్రబలకార్ముకారోపకృ
త్కళాధరయిలాధర ప్రతిమధైర్యచర్యాకరా. 262

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవిత్రాయ్యలరాజాన్వయసుధావార్ధిపూర్ణిమా
చంద్ర నిస్పృహాయకవిత్వనిర్మాణచాతుర్య నిస్తంద్ర శ్రీరామనామపారాయణనారా
యణామాత్యప్రణీ[illegible] బైనహంసవింశతి యనుమహాప్రబంధమునందు ద్వితీయా
శ్వాసము.

శ్రీరస్తు

# హంసవింశతి

## తృతీయాశ్వాసము.



జానకీక్షణోత్పల
రాజా రాజాధిరాజ రాజన్నిజసే
వాజాతహర్ష మునిజన
తాజలరుహచండధామ దశరథరామా.

వ. అవధరింపుము ప్రత్యుత్పన్నమతి నలరాజ్యానున కిట్లనియె నట్లు ప్రభాతసమయం
బుగా వచ్చినం గనుంగొని. 2

మ. చని పూఁజప్పర మొప్పుచుండెడు మణీసౌధంబులోఁ గెంపుటా
మొనముక్కుల్గలపచ్చటాచిలుకకో ళ్లొప్పొందు బంగారపుం
బనిరంగారెడుతూఁగుటుయ్యలపయిన్ బాగొప్ప మేన్సేర్చి యా
వనజాతాక్షి దినాంతవేళ మనుజస్వామిస్పృహాధీన యై. 3

చ. మిడిగలవజ్రపున్ రవల మిన్కులకమ్మలు జాతికెంపుటా
కడియములున్ సుహాణులచొకాటపుహారములున్ మృగీమదం
బడరెడుపట్టుచీరసొగసౌ ననఁ దాల్చి నృపాలు కేళికిన్
నడిచె సభూలలామ తమినాటినచిత్తము తత్తరింపఁగన్. 4

క. ఆయెడ హంసకులాగ్రణి, యాయోషామణిని గాంచి యనుపమవచన
క్రియలరఁగ నొకవిచిత్రో, పాయపుఁగథ విను మటంచుఁ బలికి వచించెన్. 5

### తొమ్మిదవరాత్రికథ.

ఉ. సాలము మిన్నునంటి ఘనసంపదఁ గాంచె నగర్త యీర్ష్యచేఁ
దాళ కనంతభోగములు తద్దయుఁ బద్దునఁ దాను జెంద నా
మేలనఁ గోట యున్నతియు మిక్కిలి ఖేయము లోఁతు గల్గి శో
భాలలితం బనంగ నొకపట్టణ మొప్పు నితంబినీమణీ.

క. ఆనీటిలోన రంగా, జీవనలాంభోధి పూర్ణశీతమయూఖుం
బై వెలసి చిత్రగాయం డనఁ, గా వార్తకు నెక్కి యతఁడు కాఁపుర ముండున్.
తే. హరితహారిద్రకృష్ణరక్తావదాత, శబలపాటలధూమలశ్యామకపిశ
వర్ణములఁ గూర్చి చిప్పలవాగెలునిచి,చిత్తరువు వ్రాయుగుళ్ళలోఁ జిత్రఘనుఁడు.
క. సురవిద్యాధరకిన్నర, గరుడోరగసిద్ధసాధ్యగంధర్వహరి
ద్వరయక్షాసురనలినజ, హరిహరము త్ర్యక్షిపరుల నతఁడు లిఖించున్. 9
సీ. హరికరిపృగఖడ్గకిరితరక్షుద్వీప, సైరిభగోకర్ణశరభచమర
గంధర్వరోహిషగవయభల్లుకరామ, శశజంబుకోష్ట్రాశ్వశల్యకోక
వామీఖరోరణశ్వానతుకపిబభ్రు, సరటేర్కలూతాఖుసర్పమకరి
శతపదిబస్తమత్స్యడులీవృశ్చిరా(?), గాఁ ధేయరక్తపాకమనక్ర
తే. గోమహిషజలశుక్తిచిక్రోడములను, సింగిలీకాలురయుమీంద చెలిదిపురువు
కొక్కువెంట్రుసనలికిరి కోర్నలాది, గాఁగలుగు జంతువులఁ జిత్రఘనుఁడు దీర్చు.
తే. గరిమిడిబ్బంది చౌజపందిగాఁడు మంద
గరడ బెగ్గోలురేచ గర్గరమురాళ్ళ
రాచిపెంకులజెట్టి పున్నారిపక్కి
సేచిచెక్కెలచేరనుపేళ్ళఁగలుగు.
సీసమాలిక. గరుడుండు సంపాతి గండభేరుండంబు, చీకురా యాడేలు చెవులపంత
వార్ణెము ఖైరిజాపళము సాళ్వము డేగ, గూడ బా తుల్లంగి కుందటీల
పాలనారాయణపక్షి పాముల మ్రింగు, డంచవేష్టము గ్రద్ద క్రౌంచ మాబ
లగు లోదె గొరకు తెల్లనిపంతబలసక్రె, గూబ శింబరకాకి గుబిలిగాఁడు
నామాలకేతఁడు నల్లాస కప్పెర, కాకి యంబటిదారిగాఁడు మూఁగ
చిందర లకుముకి చిటుత తీతువకోడి, కౌరుకో డేకులనారిగాఁడు
ముసుఁగుకోడియు డాలముట్రైకోడియు బోద, పొన్నంగి కకశేటి బొల్లికోడి
గొంగడి కక్కెర గొక్కెర గోరవంక, పూరేలు కనుపెంటి నీరుకాకి
వెలిచె లావుకపిట్ట చిలుక జీనువకొఁజు, పెడిసకేర్జము డబ్బుబెలవ నెమిలి
జిట్టువ మునుగపూజిట్టువ గిజిగాఁడు, వల్లడ పొడిపిట్ట వంగపండు
బరతము కోకిల పసిరికె తంగేడు, గోరవంక జక్కువ చెలువుకోడి
పట్టుజీనువు కొంగ పాపేరు పిచ్చుక, పోలిక పిక్కిలి మీాల మ్రుచ్చు
చిలుక చకోరంబు జిబ్బిటాయజటాయు, కొండపిచ్చుక వానకోకిలయును
మ్రోనుపొక్కటిగాఁడు మాలకాకి బెనాసి, పాపెర గోరవంక పంది క్రైర(?)

గబ్బిలంబును జాతకము కంకచిటిచెల్వ, పాసుపెంటి మేత్రింత భూతపోతు
గున్నంగి కనకాక్షి గుడిసె బయ్యకపుల్ల, సీతువ బెగ్గురు జిక్కుతురుక. 12

ఆ. పికిలిసేల నెమిలి పెనుగువ్వ బకదారి
పావురాయి సివడు పలుపరింత
చదలుకోడి గువ్వ పదుపుతోఁకలవేడి
యాదిరైనపక్షు లతఁడు దీర్చు. 13

వ. అదియునుంగాక. 14

ఉ. వానిమనోహరాంగవిభవంబును వానిముఖేందుకాంతియున్
వానిపటూక్తివిస్ఫురణ వానివిలోచనదైర్ఘ్యసంపదల్
వానియురస్థ్సలోన్నతియు వానిభుజప్రతిభావిశేషముల్
మానిని యేమిచెప్ప నపమానములౌను తదీయవైఖరుల్. 15

క. ఆతనిగృహమున విద్యా, చాతురికలరారి నృపు లొసంగ రహించున్
జాతిహయశస్త్రభూషణ, మాతంగద్రవ్యమణిసమాజము లెపుడున్. 16

క. పౌరుషముఁ దారతమ్యముఁ గారుణ్యము దానధర్మగరిమయుఁ గులవి
ద్యారసికత్వము వినయము, గారవముం గలిగి చిత్రఘనుఁ డట్లలరున్. 17

క. ఆచిత్రఘనున కలవల, రాచసజీవనిజిరాగుణానకు సెనయై
సూచింపఁ దగినసాపసుది, వాచాలి యనంగ నొక్కవనిత చెలంగున్. 18

ఉ. ఆకమలాక్షి చంచలదృగంచలసీమల బెళ్కుతళ్కులా
యాకలకంఠిపల్కు లలరార సుధారస మొల్కుకుల్కులా
యాకనకాంగియంగరుచిహాటకకోటులఁ జల్కుబెళ్కులా
హా కుటిలాలకా సరసిజాసనుఁడైన నను నేరఁ డెంచఁగన్. 19

క. హరు లాపల్కులు తుమ్మెద, గము లాకచరుచులు నడలు కరులా కదళీ
తరులాతొడ లిందునిబి, త్తరులా గోళ్లెంచఁ బ్రౌఢతరు లాసరసుల్. 20

సీ. మాటలా యమృతంపు తేటలా కపురాల, మూటలా యని జారఁకోటులెన్నఁ
గన్నులా తెలిదమ్మిచెన్నులా మగతేఁటి, యన్నులా యని పల్లవాళులెన్నఁ
జేతులా సుమలతాజాతులా కిసలయ, ఖ్యాతులా యని యుపకాంతులెన్న
గుబ్బలా యపరంజిలిబ్బులా రుచిమించు, దిబ్బలా యని పాంథధీరులెన్న
తే. గోరులా రిక్కసౌరులా కులుకుతగవు
నవ్వులా జాజిపోవులా నాఁటునీటు
చూపులా వాఁడితూపులా సొలపుదెలుపు
ననుచు విటు లెన్నఁదగు నింతి యతనుదంతి. 21

చ. పగ లిగురొత్తఁ జిత్తరువుఁ వ్రాయుము సారెకు దీనిఁ జూచుచుం
దగ నని పద్మసంభవుఁడు దారదయామతిమీఱ మేలుబం
తిగ నొనరించి తత్పతికిఁ దేకువ నిచ్చినమేటి జాసువా
జిగిబిగిఁ గ్రమ్ము బొమ్మ యన సింధురగామిని యొప్పుమున్నతిన్.

తే. కుచలు ఘనసంపదలఁ జెంది గొమరుమిగుల
ముఖము రాజవిభూతిచే మఱియఁ దొడఁగెఁ
గటిమహాచక్రవిభవము గాంచె ననఁగఁ
జెలఁగు వాచాలి గమననిర్జితమరాళి. 23

ఉ. ముద్దులుఁగారు నెమ్మొగము మోహరసంబులు చిందు గుబ్బలున్
దిద్దినయట్లులుండు జిగిఁ, దేఱెడుచెక్కులు కావిమోవియున్
నిద్దపుజాళువాపసిఁడి నిగ్గులు జిల్కు నయారె దేహమున్
దద్దయు నెన్నఁగా నహొ మె దానినవీనవిలాససంపదల్. 24

తే. దానివగలకు లోఁ జిక్కి దర్ప ముడిగి
దర్పకాస్త్రాగ్నికీల దందహ్యమాన
మానసుఁడుఁ గానినరుఁడు భూమండలమున
వెదకినను లేఁడు సుమ్ము సాధ్వీలలామ. 25

చ. అది తమయూరికేనళమునందు దయన్నెలకొన్న భక్తకా
మదుఁ డగురామచంద్ర పెరుమాళ్లలరం దిరునాళ్లలోన నిం
పొదవఁగఁ దార్క్ష్యవాహుఁడయి యున్నతితోఁ దిరువీధు లేగఁగా
ముదమున నమ్మహోత్సవపుముచ్చటఁ జూడఁ దలంచి రా నటన్. 26

తే. పరఁగఁ బదియాఱుగుజ్జులప్రభ యొనర్చి, గంటవేదియు బంగారుకలశ మెత్తి
కంచుగుబ్బలు రావిరేకలును లోప, పత్రములు దీర్చి గొప్పచప్పరము రాఁగ. 27

మ. జగతీజ్యోతులు కాగడాలు బలుబంజాయీలు మోంబత్తులుం
బగలొత్తు ల్దివిటీలుఁ దివ్వెళిఘులుం బంజు ల్మహాజ్యోతులుం
దగ సూర్యప్రభ లాయిలాయులును జంద్రజ్యోతులున్ మైనపున్
జిగటాల్నిచ్చెనపంజు లాగతులు నగ్నిజ్యోతులున్ వెల్గఁగన్. 28

వ. అప్పు డప్పద్మపత్త్రాయతాక్షుని తాదృశమహోత్సవం బేకశరీరంబున నిరీక్షించిన సంతుష్టిగా దని కాయవ్యూహయోగసామర్థ్యంబున ననేకదేహంబులుఁ దాల్చి భక్తి సంయుక్తి నిరుచక్కిం జేరి వీక్షించు సూర్యచంద్రబింబంబులడంబునం బొల్చుచు పట్టుగొడుగులు ధవళాతపత్త్రంబులు రాజింప గరుడధ్వజాదివివిధకేతన జాతవాతాహతిఁ [illegible] నుండ నళికిపడుచుండెడు నమునకాంబుల పతుప్రవ

నక్షత్రబాణపరంపరలు చెలువుమీఱఁ బాతాళభూతలంబుల సంచరించు సంచున వియత్తలంబునఁ దారు విహరించం దలంచి విపులవహ్నిజ్వాలికలు గురియుచు గగనంబున కెగయు కౌక్షోదరానీకంబులవీఁక రివ్వురివ్వున నెగిరి చను నాకసపుఁజువ్వలు మింటనెఱయ ననంతకోటిబ్రహ్మాండనాయకుండైన పుండరీకనాభుం డే తేరం గనుంగొని ప్రమోదంబున మహావేదండయానలు సేసలు సల్లిన నుల్లసిల్లు వెండి పసిండి క్రొవ్విరితండంబుల పొండిత్యంబునఁ బలువెఱంగుల బిరుసుల వింజామరల ఘళిఘళారభటి నెఱయ రాలు సువర్ణపర్ణనియంబు లగుపూవుమొత్తంబులు భూనభోంతరాళంబులం గప్పి యొప్పుచుండఁ దదుత్సవవీక్షణకుతూహలసమాగత శుక్ర బృహస్పతి బుధామలపగిదిం బగులొత్తులు వెలుఁగ వెండియుఁ జక్రబాణంబులు నాకాశచక్రంబులుఁ బిట్టబాణంబులు శతముఖబాణంబులుఁ దాటబాణంబులు దేలుబాణంబులు గురుజులు కుండబిరుసులు సంపంగిపూలబిరుసులు జక్రబిరుసులుఁ బంచవన్నెబిరుసులు గజబిరుసులు మొదలయిన బాణవిద్యలవైఖరులు చిత్రవిచిత్రంబుగాఁ జూపుచు బాణకారులు ముందరనడువ డమరుపురభిడ్డమరు సహచరక్షియదధక్కాహుడుక్కారవచానుకలహ పటహ తిమ్మటావజనిస్సాణఝల్లరీమర్దళమురజపణవాతుత్తుంభికజర్ఝరీ పాళకొమ్ము క్రోలు మోరీభేరులును డోలు గొంయ గుమ్మెతమ్మెట వీరణయురుమ యొంటికంటియురుమ పంబజమిడికతప్పెటగిడిగిడితుడుము చక్కిడియ్యాంకియునుఁ దాళమహోత్తాళంబులును జేగంట చిటితాళంబులుఁ జటికెలు ముఖవీణ శంఖకాంస్యశృంగ కాహళంబులును సన్నెగాళెన ఘరు కరకొమ్ము నాగసరమును నుతిచెంగు చెనవ్వాయి సింగినాదము పిల్లఁగ్రోవి మ్రోలుఁ బీకలును వీణె రుద్రవీణ స్వయంభువీణ మనోహరవీణ నారదవీణ బాణవీణ సరస్వతివీణ స్వరమండలంబు తంబుర రావణహస్తంబురవాలుఁ గిన్నర తిపిరికిన్నర సిద్ధకిన్నర దండె మొదలయిన హృద్యానవద్యవాద్య విశేషంబులు దిక్కులు పిక్కటిల్ల నిర్ఘోషంబులు బోరుకొల్ప నడుగడుగునకు నీరాజనంబులు నేకారతి పంచారతి యశిఘూరతి కుంభారతి శేషారతి గరుడారతి పురుషమృగారతి సింగళారతి యేకదళారతులు కూర్మ స్వస్తిక నభోమంటప రంగవల్లిక లింగస్వస్తిక సర్వతోభద్ర గిరి బంధమయూర నాట్యనాగబంధ వింజామర వ్యజనచ్ఛత్ర సింహాలాట బృందావన కల్పవృక్ష పాలసముద్ర గంగాతరంగ శంఖచక్ర పద్మంబు లనుపేరు గల్గిన ముగ్గులు మాణిక్యమౌక్తిక ప్రవాళ మరకత పుష్యరాగ వజ్ర నీల గోమేధిక వైడూర్యంబు లను నవరత్నంబులం దీర్చి పుణ్యభామినులెత్తుచుండ దశాంగగుగ్గులు సాంబ్రాణి సజ్జరసశ్రీవాసపరళ యావనవృక్షధూపంబులు ఘుమ్మురను వాసనలుఁ గ్రమ్ముకొనఁ బశ్చిమభాగంబునఁ బరమభాగవతోత్త

ములు శ్రీవైష్ణవులుఁ గులశేఖరులుఁ బ్రపన్నకులు యతిరాజవింశతి పూర్వదినచర్య యుత్తరదినచర్య క్షమాషోడశము శఠగోపస్తవము శ్రీగుణరత్నకోశము ముకుంద మాల యష్టశ్లోకి చరమశ్లోకి యాళవందారుస్తోత్రముఁ దిరువాయిమొడి తిరుమంత్రద్వయ చరమశ్లోకంబులు మొదలయిన ద్రావిడప్రబంధములు ప్రపత్తి పూర్వకంబుగాఁ బ్రసంగింప స్థలపరస్థలంబులనుండి చూడవచ్చిన బ్రహ్మక్షత్రియవైశ్య శూద్రులును గోమటి కమ్మ వెలమ వేకరి పట్రగొల్ల బలిజ కుమ్మర వలగండ బెస్తల చిప్పె కమ్మరి వడ్రంగి కాసె కంచర యగసాల ఐడసాలె సాలెన సాతని కటిక భట్టు శెట్టి జాండ్ర తొగట గాండ్లవారును జిత్రకార పందిమాగధ వైతాళిక జైన గూర్జర గౌడమిశ్రులును భేరి ఝల్లియ ఘటికి సృగాలక చిత్రజాతులును బోయయెఱుకు చెంచు యేనాది జిలగరి వానివన్నె గట్టి రంబళి యీడిగె మేదర వీరముష్టి మాష్టి యొడ్డె యుప్పరులును నసిధావక మైలారి తురక పింజారి విప్రవినోదులును జాతికర్త దొమ్మరి డొమిణి బొమ్మలాట వారును నింద్రజాలిక మహేంద్రజాలిక హస్తలాఘవసూత్రనాటక క్షౌరక రజకులును బోగమువారును చెరనాటక భుజంగాలును జంగాలు ఓడ్డెమువాండ్రు తెల్లకోక బత్తులు శివసత్తులు పత్తులు పలునాటివీరులు పరిహాసకులు సుద్దులకుమాళ్లు కొమ్మారిదాసర్లు తవిరుదాసర్లు కోణంగులు సేవకులు పరసలు పడిగెవారు కంచికావళ్లవారు పరంగు లింగిలీసులు పరాసులు వలందలు సన్యాసు లేకదండ త్రిదండు లేకాంగులు వానప్రస్థులు యోగు లవధూతలు పరమహంసలు వైరాగులు జటాధారులు దిగంబరులు గోముఖులు నియమస్థు లూర్ధ్వబాహులును గొరడజోగులు కాటి పాపలు మందపిచ్చులు పిచ్చుగుంట్లు చర్మకర్ములు చండాలమాతంగులు తల క్రిందు జోగులు రామగోవిందులు మొదలగు వారును బురోభాగంబున నేల యీనిన చందంబున వెల్లివిరిసిన చాడ్పున నుసుళ్లవిధంబున మిడుతగమిలాగున బేడిసెకదుపు భంగిని యాకుఁ జిలుకలమొత్తంబువంతునఁ బెరయీగలపగిదిని స్వాతివకంబుల సీకరం గంగాతరంగంబులకైవడి జలబుద్బుదంబుల వైఖరి వర్షధారలపోల్కిని రామరావణబాణపరంపరలరీతినిఁ బుంఖానుపుంఖంబులుఁ దండోపతండంబులు లక్షోపలక్షలు శాఖోపశాఖలుఁ గోటానకోటులు సంఖ్యాతిసంఖ్యలుగా నడుచు సమయంబున. 29

క. నెత్తిఁగంట మాల్లిడుదు ని, ద్దఱుమంచి సమాళ్లుగలుగఁ దయచేసినయో
పెరుమాళ్లని యావాచా, లిరుమాళ్లనొసంగ మ్రొక్కి యేగుచు నుండెన్. 30

క. ఆయెడ వరదత్తుం డను, కాయజరేఖా సమాన కలితాకారుం
డా యింటి యున్నచక్కటిఁ, జాయకనిలుచుండి దానిపై మోహమునన్. 31

ఉ. కందువమాటలాడి పగకౌరితనంబులుసూపి సన్నలిం
పొందుఁగనల్పిచేరికల నుల్లమురంజిలఁజేసి తమ్ములం
బందఁగనిచ్చి మెచ్చి భుజమందుఁగరంబిడి నవ్వుచేష్టఁగే
ళిందమి రేఁచి గుబ్బలు ఘళీయని నల్పిరతైకచిత్తుఁడై. 32

క. ఆవాచాలిని సంకే, తావాసమ్మునకు రమ్మటని ప్రార్థింపం
గావలచి మనసుమెత్తని, దైవానిమనోభిలాష మరలం దీర్చెన్. 33

క. అదిమొదలు సుదతి మదమునఁ, బొదలఁగఁ దుదలేనిమోహములకాస్పదమౌ
మదిని ముదంబులు గుదిఁగొన, మదన ప్రదర ప్రభగ్న మర్మస్థలియై. 34

చ. చవిఁగొనిజారవీరవరసంగమ సంగ్రహణక్రియా మహో
త్సవ పరిశుద్ధబద్ధఘన తద్ధత బుద్ధిని సంచరింప న
య్యువిదకునొక్కపుత్త్రుఁడు సముద్భవమొందె మఱింతనైనఁ బ
ల్లవసురతంబనహ్యతఁ దలంపక యెప్పటి యట్ల సల్పఁగన్. 35

ఉ. సొంపుల నింపుచిత్తిరువుఁ జూడఁగ వచ్చితిమంచు వేడ్కమో
హంపువయస్సుదిచ్చటికి నైపటితేఱె నటంచు మీఁదె యీ
సంపదలుల్లసిల్లఘన సద్మవటంచును దానికోసమై
గుంపులు గూడి వీటవిట కోటులు వత్తురుబోఁటి యింటికిన్. 36

క. ఈలాగు జారకోటికి, మేలౌ నభిమతముఁదీర్చి మెలఁగుచు నుండే
కాలముననొక్కనాఁ డొక, జాలుండను విటుని బిల్చి సంధ్యావేళన్. 37

తే. పురమువెల్వడి కాళికాపుణ్యభవన, సీమ సంకేతమటకీవు చేరు మనుచుఁ
జెప్పివాచాలి పతిలేని చొప్పుఁ జూచి, పుత్త్రు నిద్దురఁబుచ్చితాఁ బోయెనటకు.

తే. పోయి యాకాళికోవెల పొంత నిలిచి, కటికి మబ్బున నలుదెస ల్గలయఁ జూచి
జాలుఁడాచాయ లేకున్న సంశయించి, మనసుదెలియంగ డాఁగెనో యని తలంచి.

ఉ. చీమచిటుక్కుమన్న వినుఁ జిమ్మట బుఱ్ఱననేగునంతలో
నేముదమంది చూచు సరణిం బశుపక్షిమృగాదిజంతువుల్
వేమఱుఁబోవుచప్పుడులు విస్మయమందఁగ నాలకించు నా
హా మఱిరాకతక్కెనె యటంచుఁ దలంచు వియోగవేదనన్. 40

క. ఏరా తాళఁగలేరా, రారా నన్నేచనేల రారా రాపుల్
మేరా మోహనరూపశ, రీరా యటుడాఁగి పల్కరింపవదేరా. 41

మ. అనివాచాలిప్రియఁ బుఁబల్లవుని డాయం బిల్వఁగా మ్రోయు వా
గ్ధ్వను లాలించి నిజాంగనాగళరవవ్రాతం బిదౌ నిశ్చయం
బనుచుం దద్ధ్వనిఁ దప్పడొక్కపనికై యాదారిగాఁ బోవుచుం
గని యిక్కోటికిఁ జేరఁదీసుచుఁ బత్కంఠంగాఁ జేలాపించెటన్.

క. ఎటుపలెబోఁకఁగవలెనో, కుటిలాలకనీవు తెలిసికొమ్మ నియనఁగా
నిటునటుఁ జూచిదితెలియమి, పటుసూక్తిని నీవె తెలుపు పత్రిప యనినన్. 43

క. ఆ మానసశోకమప్పుడు, హేమావతికనియెఁదను నిజేశుండదుగన్
భామినిధైర్యము విడలక, తామగనికిననియె వేడ్క దనకొత్తంగన్. 44

ఉ. అయ్యలు సందెవేళఁ జనియాడఁగ నింటికిరాక తక్కటే
నియ్యెడనీదువెంటఁ జరియించుచు వచ్చెనొ యంచు భీతిచే
నయ్యలలూగుప్రాణముల నోర్వక నేరెద వీటఁజూచితే
నెయ్యెడ లేఁడు చల్లనిఁక నేమియొనర్తు మనోహరాధిపా. 45

క. అనివాపోవుచు సతిప, ల్కినవిని యాచిత్రఘనుఁడు కినుకెడలి దిగుల్
గొనిమనసువకౌనకనై, చనఁజెడితి నెటేగెనంచు సతితో ననుచున్. 46

తే. నగరమునకేగి యిద్దఱు నాల్గువీథు, లరయుచుండంగ వాచాలి యంతలోన
భవనమునకేగి చనుచెంచి భర్తతోడ, వేడ్కలిగుర్తఁజెప్పెను వింతగాఁగ. 47

క. నేనింటికేగిచూడఁగఁ, దా నిద్రాసక్తిఁ బూనితనయుండున్నాఁ
డో నన మదనా రమ్మని, మాననిదోడ్తెచ్చెమగని మందిరమునకున్. 48

తే. అట్లు తోడ్తెచ్చినిద్రించు ననుఁగు సుతుని, లేపి ముద్దాడుకొనుచుఁ దొల్లింటియట్ల
చిత్రఘనుఁడును వాచాలి చిత్తమలర, నిండుమోదంబున సుఖానసుండి రపుడు.

క. ఆరీతినేర్పుగలిగిన, భూరమణునిఁ జేరుమనుచుఁ బులుఁగులదొర తన్
జీరఁగ హేమావతి విని, యారాచెలియాగడం బటంచు గణించెన్. 50

క. ఈరీతి కథనుజొక్కెప, యోరుహముఖిమెచ్చ నప్పు డుత్పుల్లత్వం
కేరుహగంధానిల మరు, దేరఁగఁ దెలవారవచ్చె దృఢమని యంతన్. 51

సీ. పట్టెమంచము మెత్తె పయిఁదలగడబిల్ల లగరుధూపముదివ్వె లడపముచిటి
చాపజాబిల్లికె సానపువ్వులచెండ్లు తబుకు దంతపుగద్దె తావి కుడుక
గొడుగుపావలు గంధ వడిపెట్టె గంధపుగిన్నె సున్నపుకాయ గిండి సురటి
తంబుర నిల్వుటద్దము తమ్మపడిగము వీణకస్తురి రుద్రవీణ పునుఁగు

తే. కరవటంబాకు సంబళి కప్పురంపుఁగ్రోలిబాగాలు బకదారి గూండ్లుఁడనరు
లోవతీసెలు చిత్తర్వ్యతీవిఁవనరు, కేళినిలయంబుఁజేరె నక్కీరవాణి. 52

క. చేరి దినాంతంబైనన, నీరుహశరకుసుమచాపనిర్ముక్తశరా
సారమొకయింతసైఁపక, భూరమణీరమణుఁజేరఁ బోయెడు బుద్ధిన్. 53

సీ. జలదావళిరహించు చంచలాలతలన వేణిఁగై శకదళశ్రేణి మెఱయ
దినవిభాంకురముమైత్రిని దమ్మిఁజేరెనాఁ, గాశ్మీరరేఖవక్త్రిమునఁదనర
జయశంఖమునకు ముత్తియపుఁజిల్లులు వేసె, మరుఁడు నాగళమున సరులుదూఁగఁ

బుష్పగుత్తులఁ గప్పుపుష్పాడి యనఁగఁద, నడిపూఁత గుబ్బలఁ బరిమళింప
తే. రమ్యమేఖలఘుఘలఘుల్ రత్నహేమ,కలితనూపురఝుళఝుళల్ సలునవలువ
ఫెళఫెళల్ గిల్కుమట్టెల గిలగిలల్ ర, హించరాయంచకడనిల్చెఁ జంచలాక్షి. 5..
తే. నిలిచి హేమావతీనామ జలరుహాక్షి, హంసకులపట్టభద్ర నేఁ డెన మాన
వేంద్రు కడకేగుదుని సెల విమ్ము టన్న, శిరము గదిలించి రాయంచ చెలియ కనియె.
శా. అక్కా రత్నపు బొమ్మసొమ్ములివి లెస్సాయెఁ దుకూలంబహో
చొక్కంబై తగెబుక్క పూఁతసుమముల్ సొంపారె సీబాసు నా
దిక్కుం జూడు శిరోవిధూననము సంధిల్లన్ వహో మాధురిం
జొక్కంజెప్పెదనొక్క గాన విని మెచ్చుల్ మెచ్చిపొమ్మంతటన్. 56
క. అనుచున్న హంసపలుకులు, వినుచున్ వనితాక్షిపలుకు వినియెదనని తన్
గనుచున్నఁ దేనె ధారలు, పెనుచున్ వనజేక్షణ నపుడు బిసగర్త యనెన్. 57

---

## పదియవరాత్రికథ.

క. వినుము సుధానిధి యను పే, రునఁ గృష్ణాతీరమందు రుచిరోన్నత కాం
చనగోపురాధరీకృత, ఘనగోపురమైనపురము గలదొకటి సతీ. 58
సీ. సౌధఖేల ద్వధూ జనద త్తఖనదీబిసాహార తుందిలహంసచయము
హితవయస్యాసమర్పితకల్పతరుసుమస్రగ్వృత్తసౌధయోషాజనంబు
సాలశృంగగశారి కాళీపునఃపునః, పఠిత నిర్జర సతీభాషణంబు
జనకార్పితోగ్రా స్తవనభూజఫలస్పృధ్ధ, ధర్మగోపురశుకీ పైకగణము
తే. మందిరవిటంకకలరవామందకలక, లారవప్రతిరావకార్యమరనాథ
కేళికాగారమణి కుడ్యవాలికంబు, దనరునస్తుసమృద్ధంబు తత్పురంబు. 59
వ. వెండియు నప్పురంబు విబుధరాజ మనోరంజకంబై సుధర్మాస్థానంబునై ఖరి బురు
హోత్తమాధిష్ఠానంబై మెఱుపుపోలికిని రాజశేఖరకుమారాధీనంబై యమర
సైన్యంబు తేవను జనసమృద్ధంబై యలకాపురంబు చాడ్పున నొప్పుచుండు. 60
క. కరితురగరథభటోర్వీ, సురభూసురవైశ్యశూద్ర శుభసౌధాళీ
వరణజలఖేయతరుణీ, పురుషోపవనాదిగరిమఁ బుర మది వెలయున్. 61
ఉ. భూతియుఁ గావిబొట్టుమెయిఁ బూనిన మాల్కెలునుక్కకల్కముల్
చేతఁ గడెంబుఁ దాయెతులఁ జేర్చినమందులు మంత్రతంత్రకో
పేతపునాగబెత్తమరఁ బెట్టెలునొప్పఁగ రౌద్రకర్ముఁడన్
భూతచికిత్సకుండొకఁడు పొల్పుగ నచ్చటనుండు మానినీ. 62
సీ. పైగాలిసోకినఁ బాఱుఁ బిశాచక, తండంబులెల్లను దల్లడిల్లి
పొలయుప దనుఁగొన్నఁ బోపుదయ్యంబుల, విసరముల్భీతిచే విస్తరిల్లి

పేరువిన్నప్పుడే దూరమైచను సూత్రచయములు దిగులున సరభసిల్లి
తొందరి నిల్చినయంతఁ దొలఁగు దుష్టగ్రహప్రచయముల్ భయమునఁ బరిఢవిల్లి
తే. యులుకు నారాత్రిచరనికరము సోఁకఁ, బ్రేతభేతాళమోహినీ పిశితభోక్త్రి
కామినీ శాకినీ డాకినీ మదాంధ, భయకర బ్రహ్మరాక్షసు ల్పల్లటిల్లి. 63

క. క్రూరగ్రహఘోరగ్రహ, చారగ్రహ కూర్మశాక చండిగ్రహకా
శేరిగ్రహాంతరగ్రహ, వారిగ్రహములును బోవువానిఁదలంపన్. 64

క. వెలగల రావుల మట్టుల, వెలుగులఁ బాడింగ్లశూన్య విపినస్థలులం
గలుఁగుల నిలునక తొలఁగును, పులయకభూతములు వానిమంత్రోద్ధతికిన్. 65

క. ఈలాగు మంత్రమారుత, తూలప్రణీకృత సమస్తదుష్టగ్రహుఁడై
యాలోకాలోకాంచిత, భూలోకఖ్యాతి నతఁడు పొలుపొందు సఖీ.

తే. వానిప్రియురాలు విరివాలుఁ బూనజాలు
ఁడు తమినేలు జవరాలు రేఖఁబోలు
మేలుగల జాళువాడాలుఁ గ్రాలు ముద్ద
రాలు ఘనురాలు పేరు నవ్వాలుఁగంటి. 67

క. కుందనపుబొమ్మ తేనియ, చిందెడుక్రొవ్విరులకొమ్మ శృంగారము చె
ల్వొందెడు గుమ్మ శుభాకృతిఁ, గందర్పుని కమ్మ దానికథ విని పొమ్మా. 68

తే. వాలుమీలఁబోలువామాక్షి చూపులు, సోము సాము గోము భాము మోము
మించు మించు సంచు నెంచుమై గులకించు, మిన్ను చెన్నుఁ దన్ను సన్ననడుము

మ. భళిరా ముద్దుమొగంబు తేటలవురా పాలిండ్లసొంపద్దిరా
బెళుకుంగన్నులసోయగంబు కటిబల్మింకంబు సేబాసురా
కులుకుం జెక్కులనిక్కు మిక్కుటపుఁ డెక్కు ల్బల్కుచ్చకోటంబురా
తలరా దీనికి సాటిలేదని విటుల్ తగ మెచ్చ బోఁటొప్పగున్. 70

చ. ఘనకనకంపుసొంపుగలకాయము కాయజుతూఁపు రూపులన్
జెనకిన చూపు కజ్జలవివేషముతోషముఁ జిల్కుపల్కులుం
దనరునవీనసూనముల నవ్వెడునవ్వులు తేనెసోనజా
ల్కొను పెనుతావిమోవి యల కోమలికే తగు నొప్పు చెప్పఁగన్. 71

క. నెలరా మొగము నును వెన్నెల రాజీవాక్షి నవ్వు నీలపురా వ
న్నెలు రాజిలు బలుకీల్జడ, నెలరాలజయించు మిగుల నెలఁతనఖంబుల్. 72

క. నెఱిమురులగుఁ గంధరములు, ధరములకన్నన్ గుచములు తగ సుందరముల్
దరముల సిరి బిత్తరముల్, తరమె లతాతన్విగళము ధర వర్ణింపన్. 73

క. ఇటులఁ గలలేని రేఖా, పటిమయు నెవ్వనముఁ దనరఁ బతి పైని రుచు
ల్పొటమరిల కన్యపురుషుల, ఘటియింపం దొడఁగె రతికిఁ గామినివేడ్కన్. 74

సీ. ఏనాఁటి కేపాప మేలుఁగ నికన్నులకిడియెఁ గాటుక రేఖ లేపుగులుకఁ
బుట్టిపుణ్యా మెఱుంగనట్టి నెమ్మేనికిఁ, బసపున గ్గఘటించె మిసిమి బెళుకఁ
గలనై నఁబంకించి కలయమన్వారివెం డ్రు, కలుదువ్వి కొప్పిడెఁ జెలువమొలుక
నెన్నఁడుపొగ నేలిమెఱుఁగలి గుబ్బల, కలరించెఁ గంచులివలపుచిలుకఁ

తే. బూర్వ మెక్కాలమందైన ముసుఁగనని,
విరిసరులఁ జుట్టెఁ గొమ్ముడి సిరులు దొలుక
నుసుటవిటకోటి నెన్నోటిమదము నాఁటి,
యాఅజముమించి యాచంచలాక్షియపుడు.

ఉ. పాటలు మోము త్రిప్పులఁ పైఁ దమిరించుట లోరచూపులుఁ
మాటలు ముద్దు జంకెనలు మవ్వపునవ్వులు గోఁటిచిమ్ములుఁ
నీటుదొలంపుచిన్నెలును నెవ్వగసన్నలులేని యూరుపుల్
మేటిగసల్పువింత పగమించఁలఁగాంచి పధూటి మాటికిన్. 76

సీ. పూటపూట మెఱుంగు పటుగాఁ బెట్టుచుఁ, గమ్మలు క్రొమ్మించు కాంతులీన
మాటిమాటికినూనె పాటుగాఁ బదనిచ్చి, తలదువ్వి కొప్పిడు వలపుఁ గులుకఁ
గడెగడెకును బెట్టె నిడియున్న గడితంపుఁ, జలుపలుగట్టును జెలువు దనర
దినదినంబును వింతదేఁ జొక్కటపుసొ, మ్ములు దాల్చు నెమ్మేనఁ దళుకులొలుక

తే. గళమునను బూను గందంబు గందవడియుఁ
గొమ్ముడిని జెక్కు సవరంబుఁ గొవ్విరులును
సొగను దనరార విటకోటి సొక్కి తిరుగఁ
జిత్తజాయత్తచిత్తయై చిగురుబోఁడి. 77

తే. మదనపీడితయై యన్యమానవాళి, లాష మెదఁబూని యిటుల నలంకరించి
తిరుగుచుం డెడుపినవాఁడె పెరవుపటుమ, కొనియెఁ దమిదీఱ నమ్ముద్దుగుమ్మ విటుల.

క. కరణమును నూరిరెడ్డిని, గరిపుందగుపాపపత్తెగానిఁ దలారిఁ
దటియైనవేళ నీనలు, గురితోఁ బాలివోనిరతులఁ గూడి సుఖించున్. 79

సీ. పురిబాహ్యపంకేతపరిగృహ బునకేగి, యామికాభిప్రాయమరలఁ దీర్చుఁ
దటియైనయెడఁ జేని దగ్గఱ కేపోయి, ప్రియముగొల్పఁగ రెడ్డి ప్రేమఁ దీర్చు
నంచారికాలయుస్థలికిఁ బిల్పించుక, యధికారికోరిక లమరఁ దీర్చుఁ
నెనయ వేళై యున్నఁ దనయింటికే పిల్చి, గరిమతోఁ గరణంబు కాంక్షదీర్చుఁ

తే. పగలు రాత్రులను నెడఁబాయకుండు, మోహపరితాపవేదన ల్మదిరిచెదరి
చెదరఁ జేయఁగ వేఱొకచింత లేక, చండమదముగ్ధభద్రవేదండగమన. 80

తే. సొగసి సొగయించు నెఱియోర మూపు చూపి
పలికి పలికించుఁ జన్నులు బయల నెరపి
భ్రమసి భ్రమయించుఁ దనకు లోఁబడఁగఁ జేసి
వలచి వలపించు నదియెంతవానినైన. 81

క. ఈస్థితిని గొంతకాలం, బాస్థన్విటకోటిఁ గూడియలరుచు మోహా
వస్థలఁ జరుపఁగఁ బతికొక, ప్రస్థానము సంభవించెఁ బ్రమదం బెసఁగన్. 82

వ. పరపురభూమిభర్త కులభామిని కస్త్రములైనభూతము
త్తిరముగఁ బట్టి బాధలిడు తెంపుననుండఁగ నానిమిత్తము
న్నరపతి పిల్వనంప గమనంబగు వేడుక రౌద్రకర్ముఁడా
తఱి నెఱమాంత్రికుండగుటఁ దద్దయు నేగెఁ జికిత్స సేయఁగన్. 83

తే. అటుల నిజనాయకుండేగి యన్యరాజపురవరముఁ జేరె నంతటఁ బొలఁతి యలరి
తొడుసు మాసెఁగదా యంచు దుడుకుచేసి, విటుల నలరించె నిచ్ఛానువృత్తి మీఱి.

క. ఆజ్ఞయొకింతయు లేమి మ, నోజ్ఞవయోవిటపులకు మనోభవసమర
ప్రజ్ఞలఁ జూపుచు రతిస్త్రై, నుజ్ఞానము వొడమి పడఁతి సొంపున నుండెన్. 85

క. ఈతీరు కొన్నిదినములు, చేతోత్సాహములచేఁ దనరారఁగా
శీతాంశువదన మెలఁగఁగ, నాతలఁపరి యొక్క నాఁటి యామిని వేడ్కన్. 86

ఉ. పువ్వులతోడి కోరసిగఁ బొందుగఁ జందురుకావిజాళువా
మవ్వపుటంచు పట్టుపరుమాలు సుగంధపుఁబూఁత నేతచే
రవ్వగుచల్వ దుప్పటి కరంబున నాకులఁ జంక పత్రముల్
నివ్వటిలంగ దానికడ సద్దురఁజెంద బిరానవచ్చినన్. 87

క. చూచి ముదమంది దిగ్గున, లేచినదై యెదురుగా నిలిచియును నొక్కకేల్
దాచికొని పట్టి మెల్లనె, యాచెలి తన కేళిగృహము నతనిం జేర్చెన్. 88

ఉ. చేర్చి సరాళముల్గలుగు చిల్కలకోళ్ళఁ దనర్చు పట్టెచేఁ
దీర్చిన తూఁగుపాన్పునఁ గదించినకమ్మనిపువ్వు సెజ్జకుం
దార్చి వినోదముల్సలిపి దర్పకదర్పరణప్రవీణయై
పేర్చుచునుండఁగా రతికిఁ బేర్కొని రెడ్డి ప్రియంబు సంధిలన్. 89

సీ. కమ్మిపచ్చడమును గంటీలపోఁగులు, మొలఁజీటికమ్ములముదుగువల్లె
నిడుదతల్వారమూలు రెండొంకటుంగరంబులు లాలుఁజిక్కుబొట్టుపోఁపొంపుల మెఱుఁగు

గందంపునుబూఁత కక్షయుగంబున, నేర్పుగాఁ జెక్కుఁగన్నేరుపూలు
కత్తెరగండంబు గజ్జెలు నందెలు, నాదించు జిగిసకలాదితిత్తి
తే. పాదములఁ గిఱ్ఱుకిఱ్ఱని పలుకుమెట్లుఁ, గుచ్చుటద్దాలఁజేపట్టు కోలయమర
రెడ్డి ప్రియురాలివాకిటఁ బ్రేమనిలిచి, వాకిలిసడల్పుమనుమఁ బిల్వంగనపుడు. 90
క. తలవరి గడగడవడఁకినఁ, గలఁగకుమని వీఁపుఁజఱచి ఘనురాలతనిన్
నిలిపె నొకమూల నటుక, న్నెలమిని వాకిలి సడల్చి హితమలరారన్. 91
తే. రెడ్డి నింట్లోకిఁబిలిచిని నురుహాత్తి, వాకిలిగడించియపుడుఁదా వానికేలు
పట్టుకొనివచ్చిశయ్యపైఁ బవ్వళించి, ననవిలుతు కేళినిద్దఱు పెనఁగుచుండ. 92
చ. తెలితలపాగ చొక్కమొలతిత్తి భుజంబునఁ జల్వపచ్చడం
బలచిటిప్రేలమున్ప్రక యొయారముమీఱఁ బొగాకుచుట్ట సొం
పలరెడు కావిదోవతి పదాబ్జయుగంబున ముచ్చెలొప్పగా
నలవిభుఁడంతగ్రామ కరణం బటకైచనుదెంచి వేడుకన్. 93
క. పెనుతలుపుగడియఁదీయని, ఘనురాలి నతండుపిల్వఁ గాఁపుకొడుకు తా
నినిదిగులొందిన వెఱపకు, మని రెండవమూల నటుక నాతనినుంచెన్. 94
తే. ఉంచికదలకుమిచ్చోట నురగమొకటి, కలదటంచును జెప్పియా కాంత వేగ
కరణమును డాయఁగాఁబోయి గడియఁదీసి, లోపలికిఁబిల్చిమరలఁదల్పునుగడించి.
మ. దయకద్దా యని పల్కరించి తమిఁ జెందంజేసి లేనవ్వులం
బ్రియమొందించి కదించి ముద్దులిడుచుం బృథ్వీధరోరుస్తన
ద్వయిబల్ త్రొమ్మునఁగ్రుమ్మిక్రుమ్మి యనుమోదంబొప్పఁగావించి యా
వియదాకారసుమధ్య సంగమసుఖోద్వేలస్పృహాధీనయై. 96
క. తనివారక నరికట్టిక, యనివారకమోహదోహళామోదము హె
చ్చనువారల్లనోన్యము, చనువారఁగ శౌదులరసి సమరతిఁ బెనఁగన్. 97
వ. ఆసమయంబున. 98
క. నిలువంగి యోరమెలికల, తలపాగ ఖలీతిశాలు తావిమెయింబూఁ
తలు పోఁగు లంఘ్రిరక్షలు, వెలయఁగ వేపారిమీఱి వెలఁదుకకడకున్. 99
మ. వగకాఁడైచనుదెంచి కీవిని బహిర్ద్వారంబునన్ నిల్చిత
ల్పుగదెందియుమటంచు నాప్రవిమలాంభోజేక్షణం బిల్వఁగా
దిగులుంబొందె నియోగి యెట్టులనుచున్ దేహంబుకంపింప నా
చిగురుంబోడి యమాత్యువీ పడఁచితాఁ జెన్నొందఁ శీఘ్రంబునన్. 100
క. మూఁడవమూలను నట్టుక, పైడించి నియోగి నయ్యబల యధికారిం
గూతఁజని తలుపుసడలిచి, వేడుకఁగ్రీడాలయంబు వేగమెచేర్చెన్. 101

ర్యంతము చూడఁదోఁప దిది హంసవతంసము నీవె చెప్పి భూ
కాంతునిఁ జేర నన్ననుపు గాథలచేత నె ప్రొద్దుపుచ్చఁగన్. 112

క. అనవిని మేల్మే లజాణవు, గనఁ జెప్పఁగ రాఁగ యెంత కథయిది నే నీ
మను గెలియకున్నఁ జెప్పెద, వినవే ఘనురాలిబోంటి విశదముగాఁగన్. 113

చ. వినుము నిజేశు నీవు చని వేఁటకు యూరికిఁ బోవ నాఁటిరా
త్రి నిశోకతం బరుండఁ గను దృష్టికిఁ గన్పడెఁ గొన్ని రూపముల్
కనుపడి మమ్ము నీమగఁడు కాలిడనీయఁడు మాస్థలంబులం
దుని మీఁద మేము నిన్ననుచుఁ దూఁటిన నందొక భూతమయ్యెడన్. 114

తే. నాతి యీవేళకును గాచినాము నిన్ను, నీదు మగఁడింటికరుదెంచి నిలిచినపుడు
మా తెరువు దానురాకుండ మనివిచెప్పు, చెప్పకుండిన నీచావు సిద్ధమనుచు. 115

క. బెదరించినాఁటిరాత్రికిఁ, గదలెన్ భూతమ్ములంతఁ గనుకూర్కొడు వే
ళ దినము దినమును పడినా, యెదుటం బొడకట్టి నాపయిం బడి యల్కన్.

క. పదియైన నాల్గు భూతము, లదయత ననుఁ జూచి నీనిజాధిపుఁడు మమున్
మెదలంగనీయఁ డియ్యెడ, విదళింతుము నిన్నుఁ బట్టి వెలఁదీ యనుచున్. 117

క. ఇంతకుమునుదనుకను న, న్నెంతయు బాధించెనింటికీవిప్పుడు రాఁ
బంతము వెడి నీభయమునఁ, గాంతుఁడ యవిపాఱిపోయెఁ గడువడిఁ గంటే. 118

క. ఈరీతి నీభయంబునఁ, బాఱెడు భూతములఁ జూచి భామా వారె
వ్వారని సంశయమున నను, గారింపఁ దలంచి తహహ కరుణయు లేకన్. 119

క. నీవింటలేనితఱి భూ, తావళిచే నొచ్చుకంటె నదయుఁడ నీచేఁ
జావగుట లెస్సతనకటుఁ, గావున నిదె నఱుకుమనుచుఁ గంఠము వంచెన్. 120

ఉ. వంచిన భామినీమణి నవార్యకృపం గని తద్విభుండు హ
స్తాంచిత మండలాగ్రము రయంబున నవ్వలఁ బాఱవైచి రా
జించిన వేడ్కఁ గౌఁగిటను నిల్పి నెఱుల్ కొనగోళ్ళఁ దీటి లో
నుంచకు భీతి యంచు వినయోన్నతి నూఱటఁ బుచ్చి యంతటన్. 121

తే. భూతకాఁపును బెట్టి విభూతిబెట్టి
యంత్రములుగట్టి వెఱవకు మనుచుఁ దట్టి
పోయె లెమ్మన్న స్నానాన్నభుక్తిరతుల
మగనిఁ గఱఁగించి ఘనురాలు మమతనుండె. 122

క. అనియంచ పలుకు నత్తఱి, నినుఁ డుదయాద్రిని వసింప నింటికిఁ జని యా
దిన మెల్లఁ గడపి యామిని చనుదెంచిన నృపతి వెనయు సంతోషమునన్. 123

ఉ. కొప్పున జాజిపూలు మణికుండలము ల్చెవులందుఁ గంధరన్
గొప్పమహాణిసేరుఁ జనుగుబ్బలఁ గుంకుమపూఁత వుక్కిటం

గప్పురపుఁబవిడెంబుఁ గనకంపుఁ గడెంబులుఁ జేతులం గటిం
జొప్పడు పల్వదువ్వలును సొంపుఘటింప లతాంగి యిచ్చినన్. 124

క. కనుఁగొని హంసము తరుణీ, విను మొండొక చిన్నకథ వివేకముతోనే
వినియెద నని నీ వడిగిన, వినుపించెద ననిన విరహవిహ్వలబుద్ధిన్. 125

క. దినములు నీ గాథలచేఁ, జనెఁ గాని నృపాలుఁ జేరఁ జాగక పోయెం
జనియెద నేఁడైనను నా, మనవిని విని వేగ తెల్పుమా పతగమణీ. 126

## పదునొకండవరాత్రికథ.

క. అని పలికిన హేమావతిఁ, గని పల్కెఁ బతంగవిభుఁడు కనకంబను పే
రునఁ దగు పురి నొక విప్రుం, డనవద్యుఁడు చంద్రశర్మ యనఁ దనరారున్. 127

వ. అతఁ డక్షర లక్షణ ఋగ్యజుస్సామాథర్వణంబులు వేదాంత వైశేషిక భాట్టప్రభా
కరపూర్వోత్తర మీమాంసశాస్త్రంబులును, బ్రహ్మాండ విష్ణు నారద మార్కండేయ
వామనాగ్నేయ గారుడ భవిష్య ద్భాగవత స్కాంద మాత్స్య లైంగ కూర్మ
వాయు వరాహ పద్మ బ్రహ్మవైవర్త బ్రహ్మోత్తరఖండంబు లనుపదునెనిమిది పురాణం
బులును ఆదిసభారణ్యోద్యోగ విరాట భీష్మ ద్రోణ కర్ణశల్య సౌప్తిక స్త్రీశాంత్యను
శాసనికాశ్రమవాసాశ్వమేధ మౌసలమహాప్రస్థానిక స్వర్గారోహణంబులను
పదునెనిమిది పర్వంబులును, శిక్షా కల్ప జ్యోతిర్వ్యాకరణ నిరుక్తులును, ఉక్తా
త్యుక్త మధ్యా ప్రతిష్ఠ సుప్రతిష్ఠ గాయత్త్రి ఉష్ణిక్ అనుష్టుప్ బృహతీపఙ్క్తి
త్రిష్టుప్ జగతీ అతిజగతి శక్వరి అతిశక్వరి అష్టి అత్యష్టి ధృతి అతిధృతి కృతి
ప్రకృతి ఆకృతి వికృతి సుకృతి అభికృతి ఉత్కృతియను నిరువదాఱు ఛందస్సు
లును, శైలజ రోమజ వాసిష్ఠ సోమసూర్యాది సిద్ధాంతంబులును, ఉపమా రూప
కదీపకావృత్త్యాక్షేపార్థాంతరన్యాస వ్యతిరేక సమాసోక్త్యతిశయోక్త్యుత్ప్రేక్షా
హేతుసూక్ష్మ లేశ క్రమ సర్వప్రియోర్జస్విపర్యాయోక్తిసమాహితోదాత్తాపహ్నవ
శ్లేషోక్తి తుల్యయోగితా ప్రస్తుతప్రశంసా వ్యాజస్తుతి నిదర్శనాసహోక్తి పరి
వృత్తి సంకీర్ణవిభావనాద్యలంకారంబులును, అమరామర శేష విశ్వశాశ్వత శబ్దార్ణవ
యాదవ వైజయంతీ నానార్థ రత్నమాలికాకార హలాయుధ వాగురికేశవ తార
పాల ధన్వంతరీ ధరణీ ధనంజయ రభస విశ్వప్రకాశ మాధవ చింతామణి జయ
ప్రతాప శుభాంగజయపాల క్షీరస్వామ్య కౌక్షరాది నిఘంటులును, సంస్కృత
ప్రాకృత శౌరసేని మాగధి పైశాచి చూళికోక్త్యపభ్రంశాంధ్రములను నష్టభాష
లును స్వరనిత్యసమానప్లుతకాక్వాదేశ ప్రాదిప్రాది యోగపృథ్యభేద దేశీయోభయశ

కంధ్వంఖండవిభాగ వికల్ప ప్రభునామ భిన్నవర్గ సంయుక్త వికల్ప సంయుక్తము
లను జక్కటియెక్కటిపోలికలును సరసానుస్వార బుజువు లనంబరఁగు యతుల
విధంబులును సమనామసంయుక్త సంజ్ఞిగతోభయ ప్రాది వికల్ప బింద్వర్ధబిందు
బుప్రాస త్రికారసముల్లసుప్రాస మై త్ర్యంత్య మష్కరద్వంద్వ త్రిప్రాస చతుర్థ
ప్రాసా ద్యష్టాదశ ప్రాసంబులును, మగణ యగణ రగణ సగణ తగణ జగణ భగణ
నగణంబులును, జంద్రేంద్ర సూర్యగణంబు లను నుపగణంబులును బ్రయోగించి
తత్తద్దేవతాలక్షణంబు లెఱింగి ద్రాక్షా నారికేళపాకంబుల కవిత్వరచన
లెఱింగి సకల విద్యాపారంగతుండై యుండె నప్పుడు. 128

తే. అతఁడు తనసతు లిద్దఱు నహరహంబు, వా కొనుచ్చుట సైఁపక వలపుఁగులుకు
పిన్న పెండ్లాముపక్షమై పెద్దభార్య, భాషిణీనామఁ గడనుంచె దోష మనక 129

సీ. నెఱిగొప్పు నెఱరంగు నీలంపుసమ్ముచుల్, నారదభావంబు జూపఁగొనఁగఁ
గలికి కౌటుకంటి చెలువుభారద్వాజు, గరిమంబునైనఁ జీకాకుపఱుప
మించు సిబ్బెపుగుబ్బ మినుకులు కుంభజ, సద్వృత్తమాతయు జడియఁజేయ
మందయానపుఁ బ్రౌఢిమము మతంగజధైర్య, పర్యాయ మెంతయుఁ బగులఁ జేయ
తే. నవసుధామయ మధురోక్తి నైపుణములు, శుకమనోవృత్తి నెంతయుఁ జులుకఁ జేయ
మెఱుఁగు జిగినిచ్చునగజక్కునెఱతనంబు, వలయఁజరియించునది యునవ్వీటిలోన.

తే. మగఁడు పెఱవాడవైచిన మట్టుమీఱి, బిడ్డపాపలఁ గనియెత్తి పెంచుజోలి
లేదుగావునఁ దిండిచే నూఁది పోఁత, బొమ్మగతి నుండు నక్కొమ్మ యొమ్మెచిమ్మ.

చ. కుమున సమస్తభాగ్యములు కోరికమీఱఁగఁ గట్టవస్త్రముల్
దొడుగ విశేషభూషణములుం దనరార నలంద గంధమున్
ముడువను మంచిపుష్పములు మొత్తముగల్గిన భోగహీనలై
పడఁతుక లుండనేర్తు రటె ప్రాయమునం బెఱ త్రోవఁ దాయకన్। 132

తే. పిఱుఁదుఁ బిక్కలుఁ జెక్కులు బెడఁగుఁదొడలు
వెడఁద యొడలును జన్నులు వెండ్రు కిడను
సందులేకుండ బలియుట సకియమనసు
జారసంభోగకేళికి స్వారిచెడలె. 133

వ. అది మఱియును. 134

క. జారుల మదిజారఁగ నా, నారీమణి మోవి లేఁత నవ్వొసగింపగా
హారంబుల వారంబుల, హీరంబులనగ రదాళి యించుక మెఱయన్. 135

తే. మనను నిలుపక తమిహెచ్చి మాఱుమగల, వెదకుచుండంగ నప్పుడా వీథివెంట
వింతపరదేశి చతురాఖ్య విప్రుఁడొకఁడు,నచ్చె భాషిణి కనువిచ్చి మెచ్చి చూడ. 136

ఆ. విప్రుఁ డిట్టినియమవిధిని జేసె తెంచుమ, సొలసి తెలప లరసి మాచికొనుచుఁ
దన్నుఁ జూచుచున్నభగణీసురాగ్రణి, నెరణిగాంచి దాని దత్తియిచ్చె. 137

తే. సచ్చి ధర్మాభివృద్ధిఁ గాంచె నటంచుఁ, బరమభాగవతవి మహాభాగ్యశాలి
యనుచు దీవించి నా కింత యన్న మనుము, వేఁడ భాషిణి యావిప్రవిభున కనియె.

క. నేరెయ్యది యయా రెయ్యది, మీ రెయ్యెడ నేగఁదలఁచి నిట్టిటి రిటకం
జారసి యడిగిన బాడబ, సారసలోచనకు వేడ్కఁ జతురఁ డనియెన్. 139

చ. మునుపు ప్రసిద్ధమీఅఁ దమమూఁడన తాతత రాన నుండియుం
డిన యది కాఁరయాచిగను దేఁకణధారణిమందుఁ ద్రోడ్రి నన్
గని చదివించు బుద్ధి నయగారికి నప్పనసేయ నత్తరా
న్యనిగ నొనత్తునంచు బడి కొయ్యనఁ దోడ్కొనిపోయి యచ్చటన్. 140

సీ. నన్నయ్య వారల లోనామాలు సిద్ధంకో, మ్మనినచోఁ గమఫనొప్పనుచు నేడ్చి
దండమ్మునను గుణింతము పెట్ట రమ్మన్న, నంగుత్రిణమాయె ననుచు జుణిగి
శిష్యులచేఁ గాలు సేతులు గట్టించి, తెచ్చి పద్యముఁ జెప్పఁ దెమలకుండి
పలక వ్రాయుము మటంచు బడి కెత్తుకొనిపోవ, బలపంబు లేదని పలుకకుండి

తే. యలుకచే నుంచ బుగ్గలు నులిమి తిట్టి, తొడలు వడిపెట్టి కోదండ మదరఁగట్టి
రెట్ట లెగఁబెట్టఁ బట్టించు తీపు మాపుఁ, గొట్టుబెట్టుగ సన్నకోల దెగను. 141

సీ. గద్దించి వడిజెట్టి దిద్దమంచును వ్రేలు, వెట్టింప నచట నేఁ బెట్టకుండుఁ
బలుమాఱు లోయని పల్కుమంచును గొట్టి, చెప్పినశిలవృత్తి దప్పకుండు
నొకటికి సెలవియ్యనుత్తికి చీఁకటిదాక, బనులగాపరులవెంబడిన పోదు
జననియడుకొ్కని చనువుకోఁ బొమ్మన్న, వినక వేములవెక్కి వెక్కియేడ్తు

తే. సారె పద్యపుఁబలుక పైఁ జమురుపూఁతు
నెప్పుడును బెద్దపలక పొక్కత్తఁజేతు
బాలరామాయణము పుస్తకాలు దాతు
వేయుసజ్జనకోలలు విఱిచివైతు. 142

క. చరికుండ పగులఁగొట్టుదుఁ బరువడి సూత్రంబు త్రెంచి పారఁగవైతున్
మరిమరి బలపము లిచ్చినఁ, బొరిదినముసు బగులఁగొట్టి పోయె నటంచున్. 143

తే. నన్ను బిఁగీలు పెట్టించమనాఁడె యయ్య, వారు నిద్రింపఁగాఁ జూచి చేరియచటఁ
జింత వ్రేల్కొమ్మ వంచుక సిగనుగట్టి, విడిచి యుత్తికితి నయగారు మిడికిపూయ. 144

తే. అంతేఁ దలిదండ్రు లయగారి లదిమొదలుగ, వేఁడివెసలట్లు వేసరి విడువ నేను
గొంటెనగ నారతాయుల గూడుక పలు, గాకిచేష్టల నాటలఁ గ్రందుకొంటి.

వ. అంత మఱియును. 145

సీసమాలిక. దాఁచియు జాబిల్లి బూచి కన్నులకచ్చి, గుడిగుడిగుంజాలు కుందెనగిరి
చీఁకటిమొటికాయ చింతాకుమంగుములు, పులియాటలును జిట్లపొట్లకాయ
తూరనుకొక్కులు తూనిగతానిగ, చిడుగుడు మొకమాట చిల్లకట్టె
దాఁగిలిమూఁతలు తనుబిల్లయాలాకి, గన్నట గురిగింజ కొండకోఁతి
చిక్కణబిల్లయు జెన్నాగుఁడుగుడు, బిల్లబిద్యయు లక్కిడిక్కడండ
గద్దెనబోడి యొక్కసికొక్కు బరిగాయ, పోటు గిరనగింజ బొంగరములు
పెంచులబేరిపోపెల్లుగాలిపటంబు, సరిపేసి పుటచెండు చాకిమూట
గోట దొగ్గనుకాయ గొబ్బిళ్లమోపిళ్లు, నిగపోగిసబంతి దాఁగిలాట
వెన్నెలకుప్పలు వ్రేలుబొట్టగ గిరి, సింగన్నసత్తియుఁ జిందుపలుపు
గచ్చకాయలు కిఱ్ఱు గానుగ ద్రిప్పళ్లు, గుజ్జపెక్కడు మంటు గూన్గనూన్గు
కాలికంచంబును గట్టిగుఱ్ఱమువినా, యుకుతిరితూనె కోట్లాటచెమట
కాయత్తుగొడుగు బొంగరమురాముస్నాట, పాడుగుస్లుయ్యాల బోర్లపక్క
బంగ్లీకలును బొప్ప బొడ్డమ్మంచంబులు, గంరెద్దులాటలు గనికెకుండ
వీనెగాజులుపోతుటీనెగుఱ్ఱంబులు, నాల్గుకంబాలాటనక్కకోఁతి
దంటికిన్న రమంటిగంటిపోట్లాటలు, సింగన్నదాటులు జిరుకురాతి
దాబాటలను మంచితాటాకు చక్రచ, క్రొల త్రిప్పానుతోఁచి గాయపనుపు
పాడుపాతరమాన్లు పాతరల్ బంతులు, చిమ్మనగ్రోవులు చిఱ్ఱుబుఱ్ఱు
లాకుపీకలు జండ్రలాటలు చుండ్రాన్లు, గిలకలు చిటికెలు కీచుబురలు
కోలాటములు పిల్లఁగ్రోవులు గుమ్మడి, క్రోవిమూఁతలు నూఁచుకోవ్రిపులొడ్డు
విసుపునెట్టుచుగాయ విండ్లమ్ములాటలు, పులిజూదములుకట్టెపుట్లచెండ్లు
దాయాలు సొగటాలు దాక్రాయ చదరంగ, ముచుజోటురాళ్లను మూఁతపాడుపు
వామనగుంటలు వడిగుప్పిగంతులు, చెఱకులపందెముల్ చిమ్ముటాయి
తుమ్మెదరేఁపుళ్లు కుమ్మరసారెలు, బందారుబసవన్న పత్తికాయ
తిరుగుడుబీగ్గల త్రిప్పుళ్లు జరుగుళ్లు, చిటితాళమ్రోఁతలు నెటికెతట్లు
తే. తాటియాకులచిలుకలు తాళ్లపాము, లకటయగచాట్లఁ బ్రాఁతనై యాడుకొనుచుఁ
జదువుపై సంధ్యపై నాస్థ చాలలేక, పొలతి యీరీతి నేఁగ్రొద్దు పుచ్చుచుండ
క. వినుమాడ్కి డఁగఁ బెద్దలుఁ, నవుఁగని పనిచేయుమనుచు నాటినకోపం
బున నేపలావ వినలే, కనదేశభ్రమణవృత్తిఁ గైకొని మఱియున్. 147
సత్రాశన పాత్రుఁడనై, విత్రాసము మాని వింత విషయములవడిన్
యాత్రాస్థలఁ దిరిగితి, రాత్రి పవళ్లనక వినుము రాకేందుముఖీ. 148
ఇంత యేమిటికంటేని. 149

తల్లికిఁ గలనైన దయలేదు నామీఁదఁ, దండ్రి యెప్పుడు చూచి శత్రుపడును
బినతండ్రి బెదరించుఁ బెదతండ్రి కొరించుఁ, బెదతల్లి యూరక బెట్టుఁదిట్టుఁ
బినతల్లి మెటికెలు పెట్టినవిఱుచును, నన్నదమ్ములు చూడ రతులకరుణ
పదినెలు మఱఁదండ్రు పదరుచు శాపింతు, రక్కలుఁ జెల్లెండ్రు లెక్కఁ గొనరు
మేనమామలు బావలు గానివానిఁ గాఁగఁ జూతురు మాపాడ కట్టువారు
కంటగింతురు నన్నంటెఁ గములజాతు, వ్రాఁతఫలమేమియో కాని వనజగంధి.

ఇంక నెన్నైనఁగలవు నాహీనదశలు
నాపదలుఁ జెప్పనేఁటికిఁ దాఱు నెలలు
పట్టునది యేటిజోలి నాపాపఫలము
నేఁటితోఁ దీఱె నోకొమ్మ నిన్నుఁ జూడ. 151

క. అని చతురాఖ్యుఁడు వేగమె, తనవృత్తాంతంబుఁ జెప్పి తరలాక్షి క్షుధా
ర్తిని దస్సితి భోజనమిడు, మని భాషించినడుగఁ గానె యది యిట్లనియెన్. 152

క. ఈవేళమాత్ర మన్నము, గావించెదఁగాని మాపు కదలక దినముల్
నీవు పరుండెదవా సుఖ, జీవితముగ నిచట నొకటి చెప్పెద నీకున్. 153

తే. అనినఁ జతురాఖ్యుఁ డామాట కాశఁ బొంది
నీవు చెప్పినమర్యాద నిజము నేను
జేయఁగలవాఁడ నని బాసఁ జేసి యపుడు
భోజనమొనర్చి వెలువడి పోయి యతఁడు. 154

అప్పుడె యేమని యడుగనైతి నటంచుఁ, బలుమాఱుఁ దలఁచి యార్పుల నిగుడ్చు
నిసారించనివేఁడ నేమనునోయని, సంకోచమునఁ గొక్కుచిక్కుఁబోవు
వర్తమానముగా దటంచుఁ బాదచ్ఛాయ, లొనరించు వ్రేళ్లెంచికొనుచునుండు
నీయూర గడియార మేడలేదాయని, వీథివెంబడిఁ బోయి వెదకి చూచు
లీలఁ బవళించు దిగ్గన లేచిపోవు
నిలుచుచోటను నిలువక నివ్వెఱఁగొక్కు
కోఁతిచందానఁ జతురాఖ్యుఁ డుండుదిరుగు
వెలఁదిపై మోహ మెద హ ప్రెయ్యెత్తి. 155

క. ఇటులఁ దమి హెచ్చి మారుఁడు, సటలం బెట్టంగ నొచ్చి సడి నటునిటుఁ జెం
దుటకు వెఱసొచ్చి రతిసం, ఘటనార్థము మిగుల వేగు కాలమునందున్. 156

ఉ. భానుఁడు గ్రుంకఁగాఁ గనియపారముదంబునఁ బొంగి భాషిణీ
మానిని యిల్లుచేరి సరసమాటల చేటులఁ బొద్దుపుచ్చి యా

హా నిపుణోక్తులం జెనక నాబిడఁ జూచి యురమ్మటన్న చోఁ
బూనిక నిట్లు! నేఁడు నెడు బుద్ధిటువచ్చితి నేమి చెప్పరా. 157

తే. మంచి తగినగృహస్థుఁడ నెంచఁబరక, కెత్తుకొమ్మన్నఁ బాతికె కెత్తుకొంటి
వనినఁ గతుకుండు నణఁకంగ నప్పళించి, జడియకు మటంచుఁ గౌఁగిటఁజక్కఁ జేర్చె.

క. కరితీపు నగలుఁ జిన్నెలు, మురిపెములు వినోదకథలు మోహపుభావ
ల్పరిపరివింతలవలపులు, నెఱయంగాఁ జూపి సురతనీరధి ముంచెన్. 159

వ. ఇట్లు చెలఁగి. 160

ఉ. కుసుమ సురతక్రియాం ప్రణయకోపమతం త్యజ పూర్వసంగమం
పరిచిను దేహి గాఢభుజబంధనమంగజశాస్త్రనాసనాం
స్మర దద ఖండనం ఘటయ మామప మారశరాన్నఖక్షతం
విరచయ యంచుఁ బల్కుచు వేడ్కఁ బచింతురు జారదంపతుల్. 161

వ. ఇట్లన్యోన్యసరససల్లాపంబుల నెడ తెగని మోహాతిరేకంబున సంఫుల్లహల్లకభల్లమల్ల యుద్ధమహోద్ధతిసన్నద్ధబుద్ధిని సరికట్లం బెనంగి యుల్లసిల్లి కరంబులు కరంబుల నురంబు నురంబున ముఖంబు ముఖంబున నూరువు లూరువులం గీలు కొల్పికొని నిద్రించు సమయంబున. 162

చ. వనితయు నిద్ర లేచి తెలవారెను లెమ్మని జారులేపి నీ
వనుదిన మిట్లు రాత్రిసమయంబున వచ్చి యనంగసంగరం
బున నను డాయుము మంచు నెరమోహముతో వినుతింప మించి దం
చను నచియించి వేడ్కఁ బడుచుం జతురాహ్వయుఁడేగె నంతయున్. 163

తే. వీగి సంధ్యాద్యనుష్ఠాన మెలమిఁదీర్చి, పురములో రచ్చతావులఁ బ్రొద్దుపుచ్చి
యస్తమయము సమీపమౌ నంతనేటికి, కేగి మజ్జనమాడి యథేచ్ఛతోడ. 164

క. అక్షసరం బార్ద్రాంశుక, మక్షయ కరపాత్ర మమర నతఁ డప్పురిలో
భిక్షాందేహి యటంచు న, పేక్షం బ్రతిగృహముఁ దిరిగి భిక్షం బెత్తున్. 165

తే. ఎత్తితెచ్చిన భిక్షాన్న మెల్లఁజల్ల, శాకమిడునింట భుజియించి సకలవైశ్య
జాల యాచితలబ్ధతాంబూలచర్వ, ణోష్ఠశోణిమ మోమున నొఱపు నెఱప. 166

క. మనుజులు నిద్రాళువులై, యొనరినతఱి నాల్గుదిక్కు లాగిఁ జూచుచు వే
చని భాషిణియింటికి ముద, మునఁ జతురుఁడు నిచ్చదాని ముచ్చటఁ దీర్చున్. 167

వ. ఇట్లు ప్రతిదినంబున వతండు భాషిణీయోషాభిప్రాయంబు దీర్చునంత. 168

మ. ఉహూహూకారితనూవిధూనవ జనవ్యూహోపభూజృంభమా
ఘహాపంక్తిజ్వాలంబు శీతపవమానస్పర్శనోమోద్గమా

సహానాంగాశీలసంతుసంఘము హిమస్రాతాంబుజాతాండజ ని
మ్మహిమ మీఁదఁ బొగసూపె నెయ్యెడల హేమంతుఁడు గర్వాంతమై. 169

సీ. సకలదిశావ్యాప్తబకసితీకృతములు, బహుళనిద్రాముద్రపంకజములు
నిబిడవర్ధితమహానీహారకణములు, శీతలోత్తరజాతవాతతతులు
వర్ధితనిర్ధూమవహ్నిహసంతులు, నైరవవికసనకారణములుఁ
బాలస్పృంతివిహారకేళిదారణములు, యామినీసముదయాయామదములు
తే. సరసమృగమదమేచకాగురుసుగంధ, బంధురశ్రీకుచద్వంద్వభాగయుక్తి
చకితపురుషావళీశీతసాధ్వసములు, భాసురము లయ్యె హేమంతవాసరములు 170

ఉ. శాంతము లయ్యె నెండలు నశాంతము లయ్యె పథాకబంబల
వ్యంతము వాడి వేఁడిమియుఁ దాంతము లయ్యెఁ బయోదము ల్వ్యపా
క్రాంతము లయ్యె నాతతులు కాంతము లయ్యెఁ బహాళసస్తులా
శాంతము లయ్యెఁ దావులు నిశాంతము లన్ హిమవారవారికిన్ 171

తే. అట్టి హేమంతకాలంబునందు నొక్క, నాఁడు చతురుండు భామినితోడఁగూడి
రాత్రిఁ బరిపరిరీతుల రసికవృత్తి, సురతకేళిల నైపుణిఁ జూపు నపుడు. 172

చ. నెలవునఁ జండరశ్మిని గిన్నకేటుంబని తేనిపోనివా
దులజగిడించు బిల్వోడలఁ దోలిన వ్రాలిన చింతనొంది యూ
ర్పు లెనయ దైవమా యనచుఁ బొక్కుచు నెవ్వరు బల్కరించఁ బే
రెలుఁగున భామినీయువతి యింటికి వచ్చె నతండు ఖిన్నుఁడై. 173

తే. వచ్చి యచ్చండరశ్మి తావాకిటెకడ, నిలిచి తనయభ్రమహిషిని బిలువఁగా నె
గుండె ఝల్లని చతురుండు కొంకుచుండ, నతని నెట్లింతి యిలువెళ్ల ననుపవలయు.

క. ఇది తెలిసిన నృపునెనయం, బది మని తాయంచ పలుక భామామణి నా
కది తెలియ దెట్టుల ననిపెను, విదితముగాఁ దెలుపు మనిన విహగం బనియెన్. 175

తే. అటుల నిజపతి తనుఁబిల్వ విటుని కేలు, పట్టితోడ్తెచ్చి భామినీ పద్మగంధి
తలుపుఁ దెఱచుచు నామూల నిలిపి వాని, నాత్మనాథుని కెదురుగా నరిగి యపుడు

ఉ. నెయ్యము మీఱఁగాఁ జరణనీరజము ల్తలసోఁక మ్రొక్కి వే
డ్కయ్యెడఁ బల్లవింప హృదయంబున భామిని యాత్మనాయకున్
శయ్యకుఁ దార్చి దివ్వె లిరుచక్కి వెలుంగ మునుంగు వెట్టి నేఁ
డెయ్యెడ కైన నేఁగవె చెలీ యని పల్కి పరుండెఁ దిన్నఁగన్. 177

చ. అనువచనంబు దన్ను నొకయవ్యగ్రుహంబున కేగు మంచుఁ బ
ల్కినపని యాత్మకాంతుఁ డడిగెహము వెళ్ళడి యూవిటుండు పో

యునతరుణాత భాషిణి నిజేశునిదగ్గఱఁ బండఁ బైపకఁ
గొనకొనలేనివాఁడు లొఁవగూర్చి చరించెను వేఁగునంతకున్. 178

క. జారులపై నాసక్తులు, నారుల కున్నటుల నాత్మనాయకులపయిం
గోరిక లున్నవె యని ఖగ, మారయ వచియించుతటి నిశాంతం బైనన్. 179

మ. కని హేమావతి హాని మెచ్చుచు సమగ్రస్వర్ణసౌధాంతరం
బున నత్యుపనిజాతువాగోలునులజ్ బోల్పొందు నుయ్యాలపై
ఘనతం జేరి వసుంధరాధిపతి యోగప్రాప్తఘస్రాంతమా
దనుకం గుంది తమిస్రమాట కెదమోదం బంది యాపేమ్మటన్. 180

సీ. సకటాక్షదీప్తకాంచనరత్న తాటంక, ధగధగల్ చెక్కులు దలఁగఁద్రోయ
సకపోలకాంతి మౌక్తికహారపట్లకా, చకచకల్యాంద్ర చంద్రికలు గాయ
సవలయధ్వని హేమసప్తకీకింకిణీ, ఘణఘణల్ శ్రుతి కౌతుకముగ మోయ
సస్థానకసుగంధసారసదళదామ, ఘుమఘుమ ల్ఘ్రాణోత్సవముగఁ జేయఁ
తే. గళుకుపనిచిల్కు వగలేఁత తళుకు లొలుకు, జాళువాళమ్మి సరిగంచు చలువవలువ
ధళధళ ల్జాజిపువ్వు మొత్తములు గురియ, నంచకడఁ జేరె హాతానిమించుబోఁడి.

క. చేరిన హేమావతి ముఖ, మారసి నెఱజాణ వేదు వనుదినము మెయి
స్వైలొక వగ గుల్కఁగ శృం, గారింపఁగ ననుచు ముదము గల్పించి యనెన్. 182

## పంద్రెండవరాత్రికథ.

చ. మనవి పరాకుమాని విను మానిని పూసికమై కళింగభూ
మిని సిరి కొస్పదంబు జనమేజయుఁ డేలు సుగంధబంధురం
బను పుర ముల్లసిల్లు మణిహర్మ్యవినూతనకేతనచ్ఛటా
జనితసువాతధూతసురసాలపతత్సుమధౌతవీథియై. 183

శా. ఆం దుండుఁ భసితత్రిపుండ్రమును గామాక్షుల్జడల్కాషపా
లందెక్ దండము కావివస్త్రములు రుద్రాక్షల్ దువాళించు కా
లందె ల్పాదుకలు న్మృగాజినము బెత్తం బొప్ప సంసారియో
గీంద్రుం డొక్కఁడు శూద్రుఁ డీశపదభక్త్యేకాగ్రచిత్తాబ్జుఁడై.

వ. అతండు పృథివ్యప్తేజోవాయ్వాకాశంబు లను పంచభూతంబులును, త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణంబు లనుజ్ఞానేంద్రియంబులును, వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియంబులును, శబ్దస్పర్శరూప రస గంధంబులనువిషయేంద్రియంబులును మనోబుద్ధిచిత్తాహంకారంబులను నంతఃకరణచతుష్టయంబును, జీవునితోఁ గూడి పంచవింశతితత్త్వంబులఁ గని యెఱింగి యమ నియమాసనప్రాణాయామ ప్రత్యా

హార ధ్యాన ధారణ సమాధు లనంబరగు నష్టాంగయోగంబులఁ జతురుండై కమల యోగ బ్రహ్మ గారుడ సుఖ వీర కూర్మ సిద్ధాసనంత కుక్కుటాసనంబుల నిశ్చలత నిలిచి రేచక పూరక కుంభకంబులను, ప్రాణాపాన వ్యానోదాన సమానంబు లను ప్రధానవాయువులను, నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయంబు లనునుపవాయువులను స్వాధీనత నొందించి యిడాపింగళసుషుమ్నా మార్గంబులను, మన్మనిమనోన్మనులను నాదబిందుకళలను, సాంఖ్యతారకామనస్కంబులను, మంత్రహఠ లయ రాజయోగంబులను, మూలాధార స్వాధిష్ఠాన మణిపూరకానాహత విశుద్ధాజ్ఞా సహస్రారంబు లను చక్రంబులను దెలియనేర్చి యాత్మాంతరాత్మ పరమాత్మ జ్ఞానాత్మ స్వరూపంబు లెఱింగి సత్పురుషుల నాశ్రయించి [illegible] ఫల లబ్ధిఁ గానక కేవలంబు శైవమతధురంధరుండై యుండె నంతట. 185

క. ఆరాధ్యుఁడు గురువంశా, చారమునకు గురుమహత్వసత్తముఁడు ప్రియం
బారఁగ నతనికిఁ బెట్టిన, పేరు శివదత్తుఁ డెందు ప్రసవమహాగంధీ 186

తే. సంతతమ్మును జంగమార్చనలు సల్పి, సోమవారంబునను వీరభద్రపల్లె
రంబునిడి వారిపాదతీర్థమున భుక్తశేషమునఁ దృప్తిఁ బొందుచుఁ జెలఁగు నతఁడు.

సీ. ఆయ్యాపకీ ముఖ్యమైనరాణెను, మిండజంగంబులు మెఱసి నడువ
గొరఖుమల్లప్పగంగకు నను కంచి, కొప్పువాడును గలసి చనఁగ
గుమ్మెతల్కిన్నర లూడి వాయించుచు, బైరవజోగి వెంబడి నెకదల
బసవగంటలు బృహత్పటుశంఖములు మ్రోయ, శివరాత్రిజంగాలు చేరికొలువ

తే. లశునతిలపిష్టమాంసభాగంబు నిసిమి, యుల్లిపచ్చళ్లు పులిబోసె లూరుబిండ్లు
మూటజోలలు చిటిగాళ్లు మ్రోసి తేగ, నాతఁ డేఁటేట శ్రీశైల మరిగి వచ్చు. 188

తే. వీరశైవంబు మిసిరి యేవేళనైన, హరహర శివా మహాదేవ యనుచుఁ బల్కు
పలుకనేకాని యితరసంభాషణంబు, లాతఁ డెన్నఁడుఁ బెండ్లాముతోడనైన. 189

క. ఆతనికి విశాలయశం, గాఁ దరుణి యొకర్తు దనరుఁ గమ్మవిరిలకో
రీతురక కౌతులాయము, లో తేజీరతన మనుచు లోకులు పొగడన్. 190

క. దానివిలాసపువదనము, దానిచొకాటంపుగబ్బి తళుకులగుబ్బల్
దానిపసమించుదేహము, మానవతీ పొగడ శక్యమా విధికైనన్. 191

సీ. నీలాల రుచినవ్వు నెఱివేణి మొత్తమ్ము, తమ్ములనిరసించఁ దగుమొగంబు
గంబూరభుగభుగ ల్గలపించు నునుఁ బల్కు, పల్కుదు రాణులపసను మించు
మించులనిర్జించు మెయితీపపొంకంబు, కంబునోయగముల గళముమారు
మారుగుడారము ల్గానినిగుబ్బలు, బలుదీవి నగు నితంబంబుమహిమ

తే. హిమమయూఖాస్య యూరులయేపు తెగను
గడును రంభలపొగను జంఘులు జయించు
నించు విలుకాని శరధుల నేణనయన
యనఘ పదములు కెంజివుళ్ల నహసించు. 192

క. చివురా వాతెఱ నల్లని, కవురా నునునోఁగ వెంట్రుకలు పుత్తడి మేల్
సవురా దేహము ముద్దుల, దవురా యని జనులు పొగడ నాబిడ యమరున్. 193

తే. దానినెమ్మేను మెఱుఁగు దాఁ బూనఁగడఁగి
పుత్తడి వెలంది చిదపైఁ ముద్ర వేసి
యొఱసి యొట్టంబు వడి కాఁగి నెఱయఁ గమిడి
కఱఁగి నీరయి పోవును గనకకంటి

ఉ. సారసమానవీనఘృణి సంపద కొంచును నెమ్మొగంబు కో
సారసమానవిభ్రమము సారెఁ హరించును నాభియున్ సుధా
సారసమానమాధురిని జాల హసించును మోవి చంద్రికా
సారసమానహృద్యరుచి సంతతి మించును గాంతహాసముల్. 195

శా. పున్నాగంబును గెల్వఁజాలు రుచిరాంభోజాస్యవేణీరుచు
ల్పున్నాగంబును నవ్వనోపు నెఱయన్ లోలాక్షియానంబులుం
బున్నాగంబును గేరిమీఱి మెఱయుం బూఁబోఁడి నూగారు డాల్
బున్నాగంబున మించు వాఁకి చెలువంబున్ సారె వర్ణింపఁగన్. 196

క. అతనుజయధర్మలీలా, హితవృత్తిన్ గన్బొమలు రహించె ననుచుఁ దా
నతనుజ యధర్మలీలా, హితవృత్తి రహించి మించు నింతికుచంబుల్. 197

చ. అది పతిభక్తి మీఱరక దినాంతము దాఁకను సేవఁ జేసి యిం
పొదవఁగ నారగించి వసనోత్తమభూషణపుష్పగంధసం
పదలను దేలి రేలు ప్రియునర్తను సిబ్బెపు గబ్బిగుబ్బలన్
గదియఁగఁ గౌఁగిలింపఁ జనఁగాఁ గని కోపవిఘూర్ణితాత్ముఁడై. 198

క. శివభక్తుఁడు హరహరయును, యావలికేఁ బోవంగ నులాడి యని తను ద్రొబ్బం
గనయసుదిగ నుక నాంలఁ, దివురు ప్రతికతివ మోహదీక్ష దెలంగన్. 199

సీ. పదము లొత్తెదనంచుఁ బతిఁ బంపెకల దన, తొడలపై ప్రేసికో మిడిసిపడును
నడుము పట్టెద నంచు నాథుని దిఱుతోడ, ల్పుడికినఁ జీయని పొరలు నవల
నుపబర్హ మెగఁద్రోయ నుకించి మోముపై, మోముఁ జేర్చినఁ జూచి ముడుగులాడు
ప్రేమ్లైటికి కలుదీయ వసనొత్తి హస్తంబు, కుచములపై ప్రేసి కానినఁ దిట్టు

తే. పక్కలోఁజేరి కౌఁగిటఁ జిక్కఁ బట్టి
కులుకుగుబ్బల నెద ఱొమ్ము గుమ్ము క్రుమ్ము
రతి బలాత్కారమునఁ జేయ ధృతి వహించు
ప్రేయసిని జూచి రోయుచుఁ ద్రోయు నతఁడు. 201

క. ఈలాగు నిచ్చ నిచ్చలు, వాలుగుటెక్కెంబుఁ బూను వానిదురఁబుల్
లీల నొనరింపఁ జూచు వి, శాలను చీ రంకులాడి చను మని తిట్టున్. 202

తే. అతఁడుపరసౌఖ్యము నెకోరి యూసఁబొందఁ, డిహమునఁ మచ్చు సౌఖ్యాప్తకింతయైన
జాతి కిడునటి గిలిగింత లెతనర్పఁ, గాని ప్రియురాలి చేష్టలు గలప వతని. 203

వ. మఱియును. 204

సీ. ఎడలేక కవ గూడి యెప్రొద్దు రతిసల్పు, వారివైఖరుల కేకౌరఁ దొడఁగు
సయ్యాటములు గల్గు జంపతీక్రీడసఁ, గెరలి వేమాఱు గ్రక్కున్ప ద్రింగు
గందర్పకేళులఁ బొందుసతీపతు, లాసక్తికిని భావమంగుఁ గుందు
సురతఖేలనవధూవరుల మైత్రికిమాన, సమున నిట్టూర్పులు సల్పి పొక్కు
తే. విరి లకోరీ దునేదారి దురముఁగోరి, మీఱి పోరాడు సుకుమారమిథునతతుల
వైభవముఁ గాంచి హాయంచు వడిఁ దపించు, సంగమవిహీనయైన యాజలజనయన.

తే. కుడువఁ గట్టను దొడుగను ముడువఁ బుడవ, సెంతగలిగినఁ బ్రాయంపుటింతులకును
గ్రామ్యధర్మంబు లేకున్నఁ గలుగు దుఃఖ, మెంతని వచింపనచ్చునో దంతిగమన,

తే. వినుము నానావిధంబుల దినము దినము
రాత్రి రమణుని గదియఁబో రంకులాడి
పోవె యని త్రోయ గుబ్బలఁ బొంగు పైఁట
చెరఁగు బఱుచుకఁ బండు నుస్సురు మటంచు. 207

ఉ. మిన్నక యిట్లు భర్త తనమీఁద విరాళి వహింపకున్న యా
కన్నియ చూచి యీముదిబికారునితోఁ బని యేమి నా కటం
చు న్నిరసించుఁ బంచశరసుందరరూపుల నాగవీథులం
గ్రొన్నన వింటివానిమొనకుం గదియించెద నంచు నెంచుచున్. 208

క. వేవిన శివదత్తుకునకును, సేవలు సేయుటలు మాని చిత్తం బలరన్
భావజనిభు లగుజారుల, తోఁ పిలు గనుచుండె విరహదోహాళ కాంతన్. 209

చ. చికిలి విభూతిరేఖ జిగిఁజిల్కెడు కమ్మలకాంతిఁజోక హా
టకమణిభూషణంబులమిటారపుఁడెక్కులమూఁక వాసనా
ధికసుమగంధసంపదల తేటగు సిస్తులవీఁక యొప్పఁగా
నకట విశాలనామసఖి హర్షముతోఁ జరియింపు చుండఁగన్. 210

క. అంతట నితాంతహర్ష, స్వాంత సుహృద్బాంధవ జనరవక్షుభితహరి
ద్వాంతిశ్రుతియై నగర, ప్రాంతంబునఁ గోడి పదువు పందెము సాఁగెన్. 211
తే. కావిప్రాఁతలు దారాలు కట్టుముళ్లు, ముష్టులును నీళ్లముంతలు మూలికలును
గత్తులపొదుళ్లు మంత్రము ల్కట్టుపసరు, లెనయ వచ్చిరి పందెగాళ్లేపు రేఁగి.
తే. డేగ నెమిలి పింగళి కోడి డేగకాకి, పన్నెలైదిఁటి కిరులందు పన్నెలందు
రాజ్యభోజనగమననిద్రామరణము, లను విచారించి యుపజాతులను పచించి. 213
సీ. పట్టెజుట్టుని మైలపుట్టమిట్టుది గూబ, బిలుకజుట్టుది మూఁగ బిట్టుకోడి
పట్టుమాన్పది యర జుట్టుది బోరది, బూడిదెనన్నది పొడది సెల్లు
కాలుది గుజ్జది గాజులగాడునో, గలది పందెత్తుది గద్దకోళు
దెత్తునిదురగలి దీకెలదారెము, నల్లది కొప్పుడి తెల్లయురగ
తే. పిల్లవేళ్లది మొద్దది నల్లయురగ, లనఁగఁ దగుకత్తికాల్పుంజు లందులోనఁ
బసపుపొన్నె కాలంచె లెసఁగునట్టు, రావిరేకలు బిరుదులు శివి గలుగు. 214
సీ. గరుడందు శరభంబు కంచుడవారము, రణభేరి కొర్చిచ్చు తాతిబొమ్మ
రాముబాణము మిత్తు రాహుత్తు పిడుగు హా, వీరందు పుంజుల వేరువిత్తు
గండగత్తెర గుండె గాలంబు మార్పిఁడు, పట్టభద్రుఁడు బెట్టి భైరవుండు
కత్తులపొది సింహ గాలి బేతాలుండు, పసులపాతర పాదరసము చిలుకు
తే. టమ్ము సుడిగాలి చక్రంబు నలజడదరి
శూలము పిరంగి వెలినక్క సాలువంబు
కాళరాత్ర్యంతకుఁడు పందెగాండ్రు మెచ్చు
లనెడు పేరులపుంజులఁ గొని ముగించి
చ. చొరఁబడి కాంచి ప్రాఁతలును చుట్టియుఁ గత్తులు వ్రేసి సంకెటం
బెరయఁగఁ బట్టి చెక్కుఁ గఱపించి గిరేర్పడ గీచి నిల్చి కొ
క్కొరయఁగఁ జూచి పందియపు టెంకున దిద్దుచుఁ జిట్కెవేసి స
న్నిరి మరిపో యటంచును ఖళీపెళిపుంజులు దన్నులాడఁగన్. 216
క. కృకలాసపులం బుట్టిన, కకపికలా దడచుచుండఁ గాలజ్వరహో
ర్వీకడచు నిలిచిన శకనా, మకు నొకనాయకునిఁ జూచి మానిని మెచ్చెన్. 217
ఉ. మెచ్చినయింతలోఁ జిగురుమే లడిదంబు పిరాన దూసి బల్
పచ్చనివింటిబోయ చెలిపైఁ బడి నిబ్బరపుబ్బునిబ్బెపు
న్మచ్చగలట్టి గుబ్బకన నాఁటఁ గచిక్కనఁ గ్రుమ్మిక్రుమ్మి తా
నచ్చుగఁ బేర్చి యార్చె హరిణాక్షిమనంబు గలంగ నెంతయున్. 218

తే. అపుడు తనవాఁడె తెలిసికొని యబ్జనయన, సరసకుఁ గుబ్బలఁ జన్నారి కోట్ల నవిక
పగలఁ బోకము వాడిపోఁ జక్కఁ బోఁడి, శకునిఁ జూచుచుఁ దనయింటఁ జిక్కనిలిచి.

చ. అతఁ డొకనాటికాల్యకడ కంతటఁ జే చనితాప్రచూడఁ గో
శీతయుతహస్తముల్ గడుగు నేర్పున నుండఁగ వానిచెంతకుం
గుతుక మెలర్పఁగాఁ జని శకుం గని కోమలి కొంకుపాటుతోఁ
గొతుకుచుఁ బల్కె నొంటి నిటు గూడునె రాఁదనవంటిదానికిన్. 220

క. అని నీళ్ళఁ గాళ్ళు గడుగుచుఁ, జనఁ గావలె నమ్మ చెల్ల సరె తడవాయెం
గన నెవ్వారును లేరని, ఘనకుంతల పల్కుచుండఁ గా శకుఁడంతన్. 221

క. ఇంతీ యెవ్వరు లేరని, గొం తేటికిఁ జేసె దెవరు గొనిపోయెద రే
యెంతపనివచ్చినను నిదె, చెంతనె యున్నాఁడ భీతిఁ జెందకు మనినన్. 222

చ. విని చిఱునవ్వు నవ్వి భువి వింతలు పోవుగ నాంత్ర నీగతిం
బనుపడి యొంటి నుండఁగని పల్కుట న్యాయమె యంచుఁ బల్కునీ
వనుదిన మెందు నుండు దెవరైనను వచ్చెద రేల చెప్పుమా
ననవిలుకొనివంటి నెఱనాయక యంచు విశాల వేఁడినన్. 223

క. నేనుండు దెపుడు మాహుర్రి, లోన న్నా పేరు శకుఁడు లోలాయతనే
త్రా నారుల మానసములు, పూని కనుంగొనెడు బుద్ధి భూమిఁ జరింతున్. 224

వ. అని చెప్పి నవ్వుచు వెండియు నిటనియె. 225

క. ఈవీట నొండుచిత్రము, గావించెడిపాటిదానిఁ గన మీవఱకున్
నీవైతె జాణ వౌదువు, గావలు న్మాట లటులఁ గావినఁబడియెన్. 226

క. అదిగాక నిన్నుఁ జూచిన, మొదలున్ మదనాస్త్రతతుల మొనఁబడితి నను౦
గదియించి గబ్బిగుబ్బల, పొదుగున నీ డేర్పరతులఁ బొసఁగించి సఖీ. 227

తే. అనిన విని యావిశాల యారా యటనుచు, మెచ్చి తనమదిలోఁ గల మేలిమెల్ల
దెలిసితివి జాణ వౌదని పలికి యతని, రమ్ము నాయింటి కిపు డని నెమ్మి మీఱ. 228

క. త్వరితగతిం దనయింటికిఁ, దిరిగి తిరిగి చూచుకొనుచుఁ దెరవయు జనెనా
సరణిని వడి శకుఁ డాపడ, శరణమునకుఁ జనియె వేడ్క సఫలతఁ బొందన్. 229

తే. ఇద్దఱీరీతి నింటిలోఁ కేగినప్పు, డొంటిపాటయ్యె శివదత్తుఁ డింటలేని
కతన నని పొంగి యన్యోన్యకాంక్షలూర, సురతకేళికిఁ జెలరేఁగి చొచ్చి రెచ్చి.

చ. అలసటలేక సహ్యగుణ మందక తగ్గక తొట్రుపాటునం
గలఁగక ప్రాలుమాలక వికారముఁ బొందక యాలసించక౦
దొలఁగక నిద్రముబ్బుకొని తూలక నిద్దఱు నేకకాంక్షతో
దలిరుక టాక్షివాని బెడిదంపుఘురం బొనరించి రింపెయ్యన్. 231

సీ. లకుముకులట్లు సర్పములలాగునఁ గుక్కుటజాతిచాడ్పునం
బికములలీలఁ బావురపుబిట్టలతీరునఁ జెట్లవీఁక ధే
నుకముల వైఖరిఁ గపులనూఁకుడుభంగిని భైరవాశ్వయు
గ్మకములరీతి సింహములకైవడిఁ బోరి రనూనగాతురిన్. 232

తే. అటులఁ దమికీగ కుండెడి యాస్థలోగ్ర
ముచ్చటలు గీర నిరువురు మొనసి పెనఁగు
వేళ శివదత్తుఁ డింటికి వేగ వచ్చి
చూచె నాశ్చర్యకోపవిస్ఫురితుఁ డగుచు. 233

వ. ఇత్తెఱంగున. 234

క. ఘూర్ణించి కనులనిప్పులు, పర్ణంబులు గుఱియఁ జూచు పల్లభునకు నా
ధర్మిణి యపు డేవిధమున, హర్షము గావింప వలయు నని యడుగుటయున్.

తే. హంసకులసార్వభౌమ నీ వనుదినంబు, కథకుఁ గథ కట్లు నన్నడుగంగ నేల
చెప్పు మేలాగు హర్షింపఁ జేసె మగని, ననిన హేమావతిని జూచి హంసయనియె.

క. విను మటుల మగఁడు కోపము, పెనఁగొని ఘూర్జించి పలుక భీతిల్లక యా
వలజదళాకారవిలో, చన ధైర్యము చెదరనీకఁ జతురత ననియెన్. 237

క. మఱుకేళిఁ గవయ కవ్వలి, కరుగవె యీ రంకులాడి యని నను నిచ్చల్
నిరసింతువు యోగివ గన, నరకా నీవాకె తాఁకె నాకుంజూడన్. 238

చ. పలుమఱు రంకులాడి యని పల్కెడు నీవచనం బమోఘమై
నెలకొని తాఁకె సిద్ధుఁడవు నీమహిమం బదియేల వ్యర్థమై
తొలఁగు నటంచుఁ బల్కి చెలి దూరిన నాత్మతపోవిభూతిచేఁ
దలకొను వాక్యసిద్ధికి ముదంబు గొనెన్ శివదత్తుఁ డెంతయున్. 239

చ. అటుల నిజాధినాథుఁ డపు డాత్మమహత్త్వగుణోపలబ్ధకు
త్కటమగు మోదమందఁగను గామినిఁ జూచి ననుం బతివ్రతా
పటిమ వహించు మంచు బహుభాషలఁ బల్కుము పల్కకున్న నీ
కిటు ఘటియించు హత్య తను వేటికి నేఁటికి నింద వచ్చినన్. 240

తే. అనెడు పతివాక్యమునకు స్త్రీహత్యకులిక, తనదు వాక్సిద్ధికిని నద్భుతంబుఁ జెంది
నీ-వికఁ మహాపతివ్రతాభావమహిమ, వెలయవే యనియోగి దీవించెఁ బ్రీతి. 241

క. అటువలె దీవించుచు నెప్పటియట్లనె వేఱులేనిపక్షంబున న
జ్జటిలుండుండెను జెలియును, బటుముదమున మెలఁగుచుండెఁ బడఁతుక వింటే.

క. ఆరీతి మహోపాయము, నేరిచిన జ్జారుఁ గనయు నెలకొను మనవా
[illegible] తెల, వాడుచుఁగని భావుకేళి వచ్చెకిఁ జనియెన్. 243

అని ప్రశ్నోత్పన్నమతిచెప్పినవిని హర్షంబునొంది నలుండు దరువాతివృత్తాంతంబావ
తిమ్మని ప్రార్థించిన. 244

మ. నిరవద్యస్వయశోవినిర్జిత మహానీహారనీహారభూ
ధరపుత్రీశ్వర కాశ్యగోత్రవిధికాంతా గౌరవా గౌరవా
కరమందార పటీర శంకర శిత కాతారకా తారరా
డరవిందోద్భవవాహ పథ్యతిథిపాకౌహార కౌహారసా. 245

అనులోమవిలోమకందము. రామాకుజరాజనుత ర
మామరసుమరాగకర సుమాకర సమరా
రామ సరకమాసుర కగ
రామ సురమమారతనుజ రాజకుమారా. 246

తోటకవృత్తము. వారణ వారణ వారణరక్షా
సారస సారస సారసపక్షా
శారద శారద శారద కీర్తీ
హారిమ హారిమ హారిమమూర్తీ. 247

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవిత్రాయ్యలరాజాన్వయసుధావార్థిపూర్ణిమా
చంద్ర నిస్సహాయకవిత్వనిర్మాణచాతుర్యనిస్తంద్రి శ్రీరామనామపారాయణనారా
యణామాత్యప్రణీతం బైనహంసవింశతి యనుమహాప్రబంధమునందుఁ దృతీయా
శ్వాసము.

శ్రీ ॥ స్తు.

# హంసవింశతి

## చతుర్థాశ్వాసము.



### పదుమూఁడవరాత్రికథ.

రాజితజితవారిధి
వారిధితనయాంశజాతవసుధాపుత్రీ
హారిస్తనకుంకుమఘన
సారమృగీమదసుగంధచర్చితవక్షా. 1

వ. అవధరింపుము ప్రత్యుత్పన్నమతి నలునకిట్లనియె నట్లు ప్రభాతకాలంబుఁ గానచ్చినఁ
గనుంగొని. 2

క. చిగురాకుబోఁడి యప్పుడు, మగరాజిగిరాయిడింమ మందిరభూమిన్
బగరాజిల్లెడు తొగరా, జగరాతక నది రసించు సాయంబైనన్. 3

క. కని జలకమాడి సొమ్ములుఁ, దనరంగ నలంకరించి తగలేక్షణరా
డ్తనయునిపై మోహంబునఁ, జనఁగా రాయంచ చూచి సఖితో ననియెన్. 4

తే. అక్కరుచిఁగల్గు చక్కెర లానవాలు, పెట్టెదవె యొక్కగాథఁ జెప్పెదను వేడ్క
నది నవీనప్రవాళరాకాధరోష్ఠి, వినిన నొక్కింతనేర్పు నీకెనయు సుమ్మి. 5

క. అనవిని చెలువ వ్యాలయం, బని చెలుపులకథలు చెప్పి పార్థివుఁ జేరం
జననీయ వైనఁ జెప్పుము, వినియెద నన సతికి హంసవిభుఁడిట్లనియెన్. 6

తే. పూర్వమున బ్రహ్మసభకు నేఁబోయి కొంత
కాలమందుండి యజుఁ బెంపకంబు సేయ
మానససరంబునకు వచ్చిమాముకన
కులజాలను గాంచి భువిఁ జూచుకోర్కి పొడము. 7

సీ. హిమవన్నిషధమేరుహేమకూటాస్తోద, యద్రోణమలయవింధ్యాద్రికూట
మాల్యవన్మందర కైలాస గంధమా, దనసహ్యాచలయాత్రికను పేల

ఋక్ష మత్కత శృంగి ఋశ్యమూక మహేంద్ర, సౌమాన గోశృంగ ఇంద్రవృషభ
శాలేయ మశిరబీజ మత గ కైలాస, శ్వేతకేతు భృగుసీల చక్రవాళ
తే. కనక మేఘాంశుమత్పుష్పగసహస్రాద్రి, చిత్రకూట సుదర్శన శేషసింహ
రోహణ శ్రీగిరికౌంచ చంద్ర మత్స్య, సూర్యరోహణముగిరు లొప్పిదియాంత. 8
సీ. కోరింద నలతుమ్మ గోటికె కోడారయు, నెఱితు రూమును దంతి వెఱ్ఱిపెమ్మ
చిటిగారె సుంపరచి కెఱ్ఱనుమ్మయుఁ, జెల్లమ్మల్లింద కన్నతోపి
జమ్మి బలుసు గార వంద్ర పత్రికి తెల్ల, వుష్పి లొద్దుగ జిడ్డు బుడ్డతుమ్మ
కలివిరి గుంపఱ్ఱియు గచ్చ పెన్నంగయు, దుష్టుమంగయు భూత తోటుఱ్ఱికోవె
తే. మాదృచ్చి చిటికొక్కి శీకాయ మంద్ర తొఱ్ఱి, వెలఁగ వాయస పల్లేరు ములక వేఁప
నగిరె నీర్గొబ్బి మొదలుగా జగతిఁగల్గు, కంప లన్నియు వేవేగ గడచి కడచి. 9
సీసమాలిక. జిల్లేడు రేపలి జిడ్డువెంపలి పైఁడి, తంగేడు తంగేడి తగిడి నస్తె
ములువెంపలి ములునస్తె గలిజేరు గంటగ, జేరుదంతెఁ దారి నేల
తంగేడుమెట్ట బందారి దుంతుగ వ్రష్మ, నండి ధూతులసెట్టు వాండి గ్గ
పిల్లిమాడుపు చార కిల్లక్కు చిత్రమూ, లసు నల్లతీఁగె కోలాకు పొన్న
ముయ్యాకు పొన్నగయు మొగలిర తుత్తెర, బంకమత్తెర హంసపాది గంటె
కాము జిలుగు మెట్టదామర వెఱ్ఱిసె, నగజ ఓరము కాచి నల్లకాచి
శ్రీతులసియు సంబరేణు నేలుసిరికే, శ్వరి నేలవె మూటి ల్లగడ్డ
సహదేవి జుట్టుప చలిపిండి చిటిముటి, పెన్నేరు విషబొద్దపిండి దొండ
నెనుటాయి గొలిమిడి నీరుబచ్చలి ప్రబ్బి, వేరు గన్నేరాఁడు బీరనేతి
బీరపేరా ముట్టి పీచరములు గొలి, మిడి నేనుపాట్ల యుస్మా తిప్ప
తీఁగె విషుకాంత తీం డెఱ్ఱి చిత్రమూ, లము దొండతీఁగె ముళ్ళఁ గొల్ల
జీడెద్దు మక్కేకు చేగొట్ట చంద్రకాం, తెఱ్ఱనిమబ్రెంద యొఱ్ఱతుమ్మి
కుప్ప సూర్యకాంతి ముప్పాడు నరవంపు, గాడి నెకడపర కన్నె కొమర
నల్లగెంటెనపూలి తెల్లగెంటెన యుత్తి, రేణు గుబ్బిరి స బరేణు బండి
గురిగింజ గురువింద తురతపత్తియుఁ బత్తి, తిలదిడ చప్పంవ నులియచీకె
వెలఁగ విషముదారి వెఱ్ఱినుఁ బెన మంచి, కుందెన కలబంద గుప్పాగుత్తి
మామెనయూను నేలమామెన యటకిమా, మిడి దూల గోవెల మేఁక మేయు
తే. నాకు నల్లేరు నులిజము డాకుఁజెముడు
నేలతటక సింబెరయుఁ గోలచెముడు
బొంతచెము డుల్లియును, సదాముష్టి మొదలు
గాఁ గలుగునట్టి చెట్టుఁ గాంచి యంత 10

సీసమాలిక. రావి మామిడికొండరావి మేడియు బ్రహ్మ, మేడియు జీడిమామిడియుఁ జింత
పులిచింత మోదుగు ములుమోదుగును నెల్లి, పుల్లవెలఁగ నెత్తిబిల్ల చిల్ల
బూరుగ కలుగొట్లు భూతపాసిరి కుక్క, బూరుగ చిటిగొట్టి భూతనెరిద
నేరేడు మఱి యల్లనేరేడు పాపెరి, తపసుపూబ తడబేఁకు కడపబట్ట
కడపకొడిశ పాలకొడి శెట్టులొద్దుగు, చిరిబేఁకు లొద్దుగు జీడిపాల
కలు జువ్వి వావిలి గండువావిలి యేరు, మద్ది మద్దియును నేలొద్దియొద్ది
తెల్లకాంచనము తుందిల మెట్టకాంచన, ముప్పి తెల్లుప్పి నీరుప్పి యుప్ప
తాండ్రిచందన మేపి దాసాన మెట్రదా, సానము బందుగ జారజేన
మట్రివిరికి తొండ్లి మఱ్ఱితూ కిచ్చెడ, పెద్దవిరిగి పక్కి గద్దనెల్లి
కాకితూ కందుగు కానుగ పరగోఁగు, గోఁగుబొట్టు కచిక్కి గోఁగుకొండ
గోఁగుపొగడ ములు గోరంజలును బెద్ద, వెలమ సుంకేసరి వెట్రిచిక్కి
నాపప సురపొన్న వారిజముసు బొన్న, నెల్లి మూలుగబిల్లు నెమిలియడుగు
కొండగుమ్ముడు రేఁగు గొరమి సంపఁగికొండ, సంపెంగ మారేడు సరళ దేవ
దారు గుమ్ముడు మోవి తపసియుఁ గుమ్మర, పొల్కి గుగ్గిల మెట్రపొల్కి వేగి
దేవదారు సిరికె తిలకము తెల్లన, గిరి వేఁప కరివేఁప తురకవేఁప
వేరుపనసగుత్తి వెట్రినారు వగేల, పనస కరకకొమ్మి పలుకరేణి
బండచింతయు నల్లబలుసు సురభి చీకి, రేని కూకుడు నెమ్మి పేరింఖణమ్ము
భూతాంకుశ మశోక భూర్జపత్రమ్ములు, బోళము మంకెనపులును గంగ
రేఁగు తక్కిలి ములువేగి భూచక్రము, మొక్కస కొక్కస మొల్లమ్రాను
హనుమంతబీర మంకెన గిరికర్ణిక, పెడమల్లె కొండముక్కిడియుఁ గోల
ముక్కుదాడిమ బీర మొగలింగ గోదాడు, నేదాడు ఖర్జూర మీఁత నేల
తాడి బగిస పోఁక తాడు కొబ్బెర చెట్లు, పెద్దమాను పతంగి బెండగలుగు

తే. కణుదు రిరుసడు కాఁజగ కాన్గ సన్న,
విరిగి సోమింద్ర గున్నంగి దిరిసెనంబు
మొదలుగాఁ గల్గు బహువిధభూరుహములు
నిండియుండెడు కొనలపిండు లరసి. 11

క. వెస జంబూప్లక్ష కౌంచ, చసుపుష్కరశాల్మలికుశ శాకద్వీపా
లెసఁగఁ గనుగొంటి లవణే, క్షుసురాఘృతదధిపయోవిశుద్ధజలాబ్ధుల్. 12

సీ. స్వాయంభువోత్తమ స్వారోచిష బ్రహ్మ, దక్ష వైవస్వత తామసేంద్ర
రౌచ్య రైవత రుద్రభౌచ్య చాక్షుష సూర్య, లనెడు చతుర్దశమనువు లమరి

బ్రాహ్మ్యార్ష దివ్యబార్హస్పత్య సౌరచాం, ద్ర గుహ పావన పిత్ర్య నామకమన
మానమ్ములును గేతుమాల కింపురుష హ, ర్మ్య యైలావృత రమ్య కకురు
తే. భరత భద్రాశ్వ హరిసంజ్ఞ వర్షములును, భారతేంద్ర కశేతు గభస్తి నాగ
తామ్ర రౌహిణి సౌమ్యగాంధర్వకాఖ్య,లమరు నవఖండముల నొప్పు నవనియందు.
ద్రవిళ విదేహ మాళవ మత్స్య మళయాళ, కొంక ణాంగ విదర్భ కురు పుళింద
చేది టంకణ వత్స సింహళ కర్ణాట, మగధ ఘోట కళింగ మద్ర యవన
కుకుర బాహ్లిక పౌండ్ర ఘూర్జర నేపాళ, శక వంగ కాంబోజ సాల్వ లాట
సౌరాష్ట్ర చోళాంధ్ర శబర పాండ్య వరాట, కుంతల కేక యావంతి కాశి
నాట కరహాట సింధు గాంధార నిషధ, కేరళ తురుష్క పాంచాల శూరసేన
కోస లోత్కల కాశ్మీర కుత్స బర్బ, రమరు హూణాఖ్య సర్వదేశములు చూచి.
క. యమునాతమసామధ్య, క్షమఁగమలోత్పలమరందసంగ్రహణాద
భ్రమతిభ్రమద్భ్రమరవి, భ్రమగీతతతాభ్రసురతరంగిణి చెంతన్. 15

పొడయెండ గాయని పొన్నగున్నలనీడఁ, గ్రొమ్ముత్తియపుటరంగులు చెలంగ
గొజ్జంగి పొదరిండ్లపజ్జలఁ బచ్చక, ప్రములు నిండిన ద్రాక్షపందిలి తగ
శశికాంతకుట్టిమస్థలులను బన్నిటి, పరజల్లు జలయంత్రపాళి దనర
కేళి కేళాకూళి క్రౌంచ చక్ర చకోర, హంసశారిమ త్సారసాదికలిత
కలకలారావ విస్తార కమల కుముద, సౌరభాగార నీహార నీరపూర
వీచికావార దుర్వార విహృతి ధీర, శీతలసమీర కాసారసీమఁ గంటి. 16
వ. మఱియుఁ దత్కాసారంబు ననిమిషసంచారయోగ్యంబై యమరావతీపురంబును, శంఖమకరకచ్ఛపాధిష్ఠానంబై యలకాపట్టణంబును, ధార్తరాష్ట్రవిహారస్థలంబై హస్తినగరంబును, బకనివాసంబై యేకచక్రంబును, శంకరాధారంబై కాంతారంబును, శింశుమారచక్రవికాసితంబై మేరువుచుం బురుడించుఁ దత్తీరంబున. 17
క. పల్లవిత కలిత పుష్పిత, సల్లలిత మరంద వళిత సత్ఫలిత మహీ
జోల్లసితాభ్రంకషమై, యుల్లము రంజిల్లఁ జేయు నొకవన మొప్పున్. 18
ఉ. అవనసీమ నొక్కతరు వంబరచుంబితశాఖియై ముదం
బావహిలంగఁ జేయఁ గని యాగమనశ్రమముఁ క్షుధార్తియుం
బోవఘటింపఁ బూనియును భూజముపై వసియించి నాకగం
గావనజాతజాతబిసఖండము లానుచు నుంటి నయ్యెడన్. 19
కొండలు క్రిందుమీఁదుగను గూల దిశావళి వ్రీల నష్టవే
దండము లుర్విఁ వ్రాలఁ ద్వరితంబున వారిధు లింకి క్రాల బ్ర

ష్టాండము తూల నాదిమసుహాహిపసూకరకూర్మమూర్తు లొం
డొండఁ గలంగి సోలఁ జటులోద్ధతి నుగ్లైను నేలయ న్గొగిల్.

వ. అప్పుడు. 21

చ. హరిశిఖిదండిదైత్యవరుణానిల యక్షపభర్గు లెక్కి యా
మరకరిమేషవాహరిపుమానవనక్రమృగాశ్వనందులన్
గురుపవిశక్తిదండశరకుంతగుణధ్వజఖడ్గశూలభృ
త్కరులయి కుంభయంత్రగతిఁ దాల్చిరి దిక్పురసైన్యసంగతిన్. 22

క. ఆతఱి నే నాకసమున, కౌతతసంరంభగతుల నతిజవ మొప్పం
గాఁ జెలివి నెగసి చూడఁగ, భూతలచలనం బడంగి పోయినపిదపన్. 23

క. ధరణీసుర భూభృద్వి, ట్చరణజభటరథగజాశ్వసద్వస్తులచే
నిర వొందు పాండ్యభూమిని, బరిపూర్ణం బనఁగ నొక్కపట్టణ మున్నన్. 24

తే. కని మహామోద మొనరింపఁగాఁ బురంబు
కాపురంబుగ నుండెడు ఘనజనముల
కలిమి బలిమియు వీక్షించు కొంత వోడమి
యొక్కసౌధంబుపై డిగ్గి యుంటి నంత. 25

తే. పరకతలగుడ్డ యొకపాటిపచ్ఛడంబు, ముడుక నీర్కావిదోవతి మొలనుసంచి
తత్తి వెండుంగరము వ్రేలహత్తి యొప్ప, నుండు శతుఁ డను పేదనియోగి యొకఁడు.

సీ. క్షేత్రఘాతంబులస్థితులు పకాణించి, సౌవర్ణగణితోక్తసంఖ్య దెలిసి
మిశ్రితగణితార్థమిళితమననుకఁడై, గాఢప్రకీర్ణకగణిత మెఱిఁగి
త్రైరాశికాద్యంతసారాంశము గ్రహించి, సూత్రగణితంబులు జొచ్చికలఁచి
మఱిభిన్నగణితంబు మార్గమెల్లను గాంచి, పరగణితంబులు పారఁజూచి

తే. నిఖిలసిద్ధాంతసూత్రము ల్నేర్చి జగతి
గణకకులసార్వభౌమత్వగణనకుఁ దగి
గణితమర్మజ్ఞుఁ డితఁ డని ఘనులు మెచ్చఁ
దెలిసి యతఁ డెంత లెక్కైనఁ దేటపఱుచు. 27

గణితముపేరులు.

సీ. త్రైరాశికప్రకీర్ణసువర్ణపంచరా, శికమేరుపూర్ణరాశికసమాధి
కౌరవీరాచారఘాతకుంటావ్యాయ, చ్ఛాయార్యభటబృహజ్జాతకోత్క
లితసప్తరాశికలీలావతీవర్గ, వర్గమూలక్షేత్రవాస్తుభాగ
గణితసారచతురంగప్రశంసాభళీ, నాదీయబీజభిన్నవరాశి

తే. ఘనఘనామూలశిల్పిసంకలితసూర్య, సోమసిద్ధాంతయుగలబశోధరత్న

ఘట్టితైకోనరాశ్యాదిగణితతతులు, దెలిసి యతఁ డెట్టిలెక్కైనఁ దేలపఱుచు. 28

తే. సరవి గుడికట్టుగా చెంగ వరసి వ్రాసి, యంతకము లేసి కులవర్గు లాయకట్లు
దీర్చి దినవహీనపరగతిప్రతీర, నారవణి నిర్ణయింప శేషాహి యతఁడు. 29

చ. చదువులు చెప్ప చూఁచె మతిసారెకుఁ గూలికి లెక్క వ్రాసి చూ
చదయతఁ గోలుకాఁడగుచు నన్నిఁట మందుపల న్నటించి చూ
చదియును గాక రాయసపుటార్యుల ఘంటము లాకు దుద్దలున్
వదలక మోసి చూచె నొకపట్టునఁ బొట్టకు లేక తక్కినన్. 30

క. పారుగిరుగువారికలిమికి, గుటిగాఁ దా నెంతకూడు గుడుచుచు వీటం
దిరుగాడి ప్రొద్దుగ్రుంకెడు, వర కొకపాతికకుఁ గొలుచు వడిఁ గొని తెచ్చున్.

తే. తెచ్చి సుఖమతి యను నామధేయమునను
పరఁగు ప్రియురాలిచేతి కేర్పడఁగ నీయ
నాబిడన్నంబు సంకటి యంబలియును
జేయ సమరేయివేళ బోసేసి పోవు. 32

క. అతఁ డీలాగున గ్రాస, స్థితికై యూరెల్లఁ గలయఁ దిరుగాడంగా
నతనాలు మరునికేళికి, వెతఁగొని తిరుగున్ భుజంగవీరులఁ గలియన్. 33

క. ఒసపరి వగలది ముద్దల, నసియాడెడు గౌను గలది యందము గలపైఁ
డి సరైనమేనుచాయల, పస గలదని విటులు దానిపని కలవడుమన్. 34

తే. ఎనయు నేవేళ నెందైన నేపు రేఁగి
పురిని గలజారు లత్యంతమోహు లగుచుఁ
గ్రుక్కిళులు మ్రింగికొనుచు నొక్కొక్క రొకరె
తిరుగుచుందురు దానింటితెరువుఁబట్టి.

ఉ. ఇందుఁడు కందునిద్దపురహిం దగు సుందరిమోముగోము తా
నందమి నిందిరేందుముఖినందనుఁడుం దనడెందమందు నిం
దిందిరకందబృందకచదృక్తతిచందముఁ జెంద జాళువా
లొందమిఁ గుందు జారులిఁక యుగ్మలిఁ బొందమిఁ గంది కుందరే. 36

శా. నెత్తావు ల్వెదచల్లుపుష్పలతల న్నెమ్మేను సింగంపురా
మొత్తంబున్ నునుగౌను శ్రీలగరిమంబున్ వీనులుం దమ్ము ద
ళ్కొత్తుం గ్రొవ్విరిగుత్తులన్ మినుకులొల్కున్ గబ్బిచన్గుబ్బలున్
నెత్తమ్మిన్ గళజేరు మోము దెగడు న్నీమాటి రంభన్ నగున్. 37

క. అసుఖమతితరుణవయ, శ్శ్రీసంగతి నలరు విటులఁ జేరి గతులకున్
వేసారకయుసికొల్పఁగఁ, దా సుఖపడి నెచ్చుటట్టి ధన్యులలోనన్. 38

చ. ఒకనికి మోముచుంబనము లొక్కనికిన్ మొనగుబ్బపోటు వే
ఱొకనికిఁ జెంపపెట్టు మఱి యొక్కనికిన్ బిగికౌఁగిలింపు లొం
డొకనికి గాఢసంగమము లొక్కనికిన్ రతిబంధనైపుణుల్
కకవిక చూపు మన్మథుఁడు గట్టినధట్ట సడల్ప నియ్యకన్. 39

చ. దుసికలఁ జారుచీరకటుల దూఁకొనుచుండెడుకీలుగంటుపైఁ
బస పొనరించునిగ్గు గల ఫాలతలంబునఁ జాదుబొట్టు దృ
గ్వసతికిఁ గజ్జలంబు నరకొలున నంచులఁ జీఱుచీరఁ దా
రసమగుపుష్పకంచుకము రంజిలఁగాఁ జరియించు వీథులన్. 40

తే. ఇటులఁ జరియింపఁగా దాని యెమ్మె లెఱిఁగి, పట్టియనుమానములచేత బెట్టుగుంది
కని విరూపినిఁగాఁ జేసి కాంతవీడి, చనియెద నటంచు నెమ్మది శతుఁడుఁ దలఁచి.

క. ఒకనాఁటిరాత్రి యింటను, సకియకడం బవ్వలించి సంభ్రమమునఁ బొం
డ్రకదేశమునకుఁ జనియెద, నొకపని కని వేగ యామ ముండెడువేళన్. 42

తే. పయనమై లేచి పోవుచో భార్యతోడఁ, జెప్ప నొక్కింతదూర మచ్చిగురుబోఁడి
సాగ నంపి బహిశ్శంక కేగ నతఁడు, దిరిగి కిసురించి వేగ మందిరము సొచ్చి. 43

ఉ. దూలముమీఁదిఁదుట్టుకను దొంగవిధంబున నిశ్చలాంగుఁడై
తాలిమిఁ జిక్కఁబట్టి కులతామరసేక్షణచర్యలెల్ల నా
మూలముగాఁ గనుంగొనెడు బుద్ధిని నాశతుఁ డుండునంతఁ బ్రా
క్శైలశిఖాగ్రభాగమున సారసమిత్రుఁడు దోఁచె నంతటన్. 44

క. పనిపాటఁ దీర్చి సుఖమతి, పనివడ నేఁ డింటితోడుసు బాసెఁ గదా యం
చును వెల్వడి చని వీథిని, మనసిజవేదనల జాలి మూలి తిరుగఁగాన్. 45

సీ. గౌరిపంచాంగంబు గౌళిపంతులపంచ, పక్షుల శకునము లైవ్వఁడికంటి
పలుకులరీతులు ప్రశ్నభాగంబులు, గల్యాలు గాయంగఁ గలుగుమేలు
కీడును బోచిల్లజా డెఱింగెడునేర్పు, దిక్కువిదిక్కులు దెలిసి నుడువుఁ
గుమ్ములక్షణములు తొడరు కాకరవంబు, సాముద్రికస్థితిఁ జతురమహిమఁ

తే. దెలియ నేర్చినయొకమహాధీరవరుఁడు, శకునవిద్యావిచక్షణాధికుఁడు సౌకు
మార్యరేఖల మారట మారుఁడైన, యపనిదపిజుండు మతిమంతుఁ డనెడువాఁడు.

క. ఎమరైనఁ జూచి సుఖమతి, కదియం జని వాని సొబగు కలిమికి మోదం
బెదనొంది యతని నో నవ, మదనా యని పిలుచునంత మాత్రనె యతఁడున్.

తే. దీనిఁ దగిలించుకొనవలెఁ దియ్యవిలుతు, దురము పనిలోకినేఁడు ముద్దుగ నటంచు
ఫలఁచుపంతత్రిలో భాణలీవములాడి, లోఁబఱచి వానిఁ బోడ్తెచ్చె లోలనయన.

మ. అటులం దోడ్కొనిపచ్చుచోఁ గులుకు టొయ్యారంబుగాఁ జూచి చొ
క్కటపుఁ జిబ్బెపుఁగబ్బిగుబ్బనెలవంక ల్పాము గాన్పింపఁ బై
పట మొక్కింత సడల్పుఁ బచ్చిదొరలన్ భాషించు లేనవ్వుతో
సటలుం జేష్ట లొనర్చుఁబైపయిఁ బఁడున్ జారుండు హర్షింపఁగన్. 49

చ. నిలయములోని కిట్లు విటు నిట్ వెసఁ దోడ్కొని వచ్చి హెచ్చి కం
బళము ముదంబునం బరిచి పల్లవుఁ డంపు వసించినంత న
య్యళికచ యేక్రియం గనెనొ యట్టుకపై నిజభర్త యుండుటం
దెలిసిన భీతిలేక సుదతీ యపు డేమని బొంకెఁ జెప్పుమా. 50

చ. అని యలవాన జాలిపులుఁ గా వనజాక్షినిఁ జేరి వేఁడినన్
విని తలపోసి చూచి యిది వింతసుమీ తెలియంగలేను నే
ర్పున నది భర్తకింపు మదిఁ బుట్టఁగ నెట్టులబొంకెఁ జెప్పవే
యనఁగలహంస పంశకల శాంబుధిచంద్రుఁడు కొంత కిట్లనున్. 51

క. విను హేమావతి సుఖమతి, తనవల్లభుఁ డటుకమీఁద దాఁచుక యున్నాఁ
డని తెలిసి ధృతి చలింపక, యనుపమచాతుర్యధుర్య యై విటుమోహిలన్. 52

క. ఏకార్య కిడి సద్భక్తిని, మ్రొక్కి కనుంగేఁటి శకునములు చూడు పరుం
డేకార్యంబున కేగెనొ, యకార్యము లెసఁగ సఫల మానో కావో. 53

తే. లెస్సఁగాఁ జూచి చెప్పుము లేమిచేతఁ
జనిన నాపతి శీఘ్రంబె సఫలుఁడై సు
రక్షితంబుగ వచ్చునో రాఁడొ యనుచుఁ
దెలుప యడిగిన నాస్సెఁగఁ దెలిసి యతఁడు. 54

సీ. అంగుళిక్రమమున నశ్విని భరణియుఁ, గృత్తిక రోహిణి మృగశి రార్ద్రి
పొసఁగఁ బునర్వసు పుష్య మాశ్లేషయు, మఖ పుబ్బ యుత్తర మటియు హస్త
సరవిఁ జిత్రయు స్వాతి పరఁగ విశాఖాను, రాధలు జ్యేష్ఠయు రమణ మూల
పూర్వోత్తరాషాఢ లుర్విని శ్రవణ ధ, నిష్ఠల శతభిష ప్రోష్ఠపదలు
తే. నుత్తరాభాద్ర రేవతు లొనర నెంచి
మేష వృషభ మిథున కర్కి మృగప కన్య
కాతులాళి ధనుర్లగ్న కలశ మీన
రాశి సంఖ్యలు వరుస నేర్పడ గుణించి. 55

తే. సూర్య శశి భౌమ బుధజీవ శుక్రమంద, రాహు కేతుగ్రహస్థాన రాశికూట
చాపచోరోదచయకేంద్ర సారటిచ, పరమసౌఖ్యాంశలగ్నము ల్పథిలపఱిచి. 56

తే. జన్మకర్మసాంఖ్యాతిక సాముదాయ, కౌంగజామిత్రవైనాసికారివామ
పార్శ్వవేధలుఁ లత్తలు భావమస్వ, భావనీచాస్తమయములఁ బరిహరించి. 57

సీసమాలిక. ద్వాదశాబ్దాబ్దమాత్రగ్రహమాత్మన, క్షుత్రాంశరాశిమాసదిన మరసి
పద్మసింహాసన పణకూర్మనరచాప, కుంతలఖలజీవ కుంభవర్గ
శనిఖడ్గరథగజాశ్వవ్యూహనాడికా, దిద్విధచ్ఛత్రద్వితీయపంచ
విధదశవిధరాహు వృశ్చికలాంగూల, పంచసప్తశలాక పక్షిడింభ
కామాఖ్యతోర్మణ గాళిత్రుతశ్యేన, యాత్రాత్రికాలసూర్యఫణిజయక
ఘోరకాలానల గూఢకాలానల, భూచరఖేచర పుణ్యభూమి
చంద్రకాలానలసంకటసూర్యకా, లానలరాహుకాలానలకలి
వర్తులభాస్వరవామగౌడద్వితీ, యతృతీయమాతృకా చతురదీర్ఘ
వర్ణేశ్వరాహ్వాద్రి నతయోగతుంబురు, ప్రస్తారసర్వతోభద్రకులక
లాలకోటావహా లక్ష్మినఖక్షితి, వలయలక్షక్షేత్రవాలభూమి

తే. ఘనపుళిందకొల్లాపురి వెనకపటక, కాలరేఖమహామాలి కానిరామ
యాఖ్య లలరారుచక్రము లందు బీజ, పంక్తి లిఖియించి తత్ఫలాఫలము లరసి.

క. ఈలాగుచక్రముల గ్రహ, జాలము లిఖియించి చూచి చంద్రాస్యాపరుం
డాలయమున దాఁ గుండుట, కాలజ్ఞుఁడు దెలిసి పలికెఁ గౌతుక మెసఁగన్. 59

తే. కడుపులోఁ జల్ల గదలక కలికి వినుము
నేఁడు రేపటఁ దలపువ్వు వాడ కతఁడు
రాఁగలఁ డటంచు శపథ మేర్పడఁగఁ జెప్పి
యతఁడు దానిల్లు వెలువడి యపుడ చనియె. 60

ఉ. ఆసమయంబునందు శకుఁ డట్టుపపై వసియించి యుండి యెం
తో సుముఖత్వ మొప్పఁగని తొయ్యలిభక్తికి సచ్చరిత్రలీ
లాసుగుణప్ర[illegible]ధ భళా యని మెచ్చుచు [illegible] వచ్చి రా
వే సరసీరుహాక్షి యని వేగమె కౌఁగిటఁ జేర్చి వేడుకన్. 61

క. ప్రమదానిపాతివ్రత్యము భక్తియుఁ గంటి సందియము లేదిఁక నం
చు మనోరాగంబున శకుఁ, డమితస్తుతు లొనరఁ జేయ నది యిట్లనియెన్. 62

తే. కాంత నే నెన్నకోవాదు గాక నన్నుఁ
బోలఁ గలసాధ్వు లున్నారె పుడమిలోన
ననుచుఁ బతితోడఁ జెలరేఁగి యాడుకొనుచు
నిండు[illegible] సుఖాన నుండి రప్పుడు.

చ. అని కలహంస చెప్పిన నయాఱె కథాస్థితి యంచు మెచ్చికొం
చును దపనోదయప్రభలు సుందరి గన్గొని యింటిలోనికిం
జని పవలెల్లఁ బోఁగడపి సారసమిత్త్రుఁడు పశ్చిమాద్రికిం
జనినయనంతరంబ మనుజప్రభుపై విరహంబు మీఱినన్. 64

సీ. కళదేఱు కస్తూరితిలకంబు వాసన, ల్లపనగంధములకు లంచ మొసఁగ
నవరత్నతాటంక వివిధకాంతిచ్ఛటల్, నునుఁజెక్కుజిగికిఁ గానుక నొసంగ
నలరుమానికపుసోయగఁపు దండలచెక్కు, కలితాంగదీప్తికిఁ గట్న మిడఁగఁ
జెంగావిసలి పెంపు చీరంచు సరిగడా, ల్పదశోణఘృణులకుఁ బగిడిఁబెట్ట
తే. మదనమదహస్తివిడివడ్డమాడ్కిఁ బడఁతి, పుడమి యొడయనికడ కేగ బెడఁగునడల
నడుచుపడిఁ గడుక్రొమ్ముడి సడలి విరుల, జడి పొసఁగ నిల్లువెలుసడి చనఁగనపుడు.
క. కని రాజహంసపరుఁ డి, ట్లను భళి మేల్జాణ వౌదువౌ సొగ సమరెన్
జననాథు నెనయఁ బోయెదొ, విని పొమ్మొకకథ యటన్న వెలఁ దిట్లనియెన్. 66

మ. కలహంసాధిప నీస్వబుద్ధి నిటులం గల్పించెదో కాక పె
ద్దలచేఁ బూర్వము విన్నవాఁడవో మహాదైవప్రసాదంబొ విం
తలును మ్మట్లుఁ జింప నన్యులకు మేధాశక్తి నిన్ బోలువా
రలు లేరింక భళా ఱె చెప్పు మనుచున్ రాజాస్యప్రార్థించినన్. 67

## పదునాల్గవకథ.

క. ఆమానసౌక మభినవ, తామరసమరందబిందుతరబృందంబుల్
నేమించుగుఱియు వాక్కుల, హేమావతి కనియె మోద మిగురొత్తంగన్. 68
చ. వినుము విదర్భదేశమున విశ్రుతమై సిరులందు విహ్వాలం
బన నొకపట్టణం బమరు నచ్చట నొండొకవైశ్యుఁ డెంతయుం
దనరు హిరణ్యగుప్తుఁ డను నామముతోడఁ దదీయభార్య హ
స్తిని యను పేరునం బరఁగుఁ జెప్ప నశక్యము దానివైఖరుల్. 69
క. మిలమిలమిలఁ దళుకులజలు, పొలయలరుల వలపుగులుకు పొలతుఁక నవ్వుల్
మొలకరిక ల్చలదలకలు, చెలిసొలపుల పలుకు లలరు చిలుకలకొలికిన్. 70
క. విరులా నగవులు నీలపు, సరులా కురులుబ్బుగబ్బి చన్నులు జాళ్వా
గిరులా యూరు లనంటుల, సిరులా యని జనులు మెచ్చుఁ జెలువ చెలంగున్. 71

క. చిందం బనఁదగు గళము సు, గంధమ్ముల తీయదన కోరకపంక్తుల్
మందమ్ములు గమనమ్ములు, నందమ్ములు పొగడఁ దరమె యతివపదమ్ముల్. 72

ఆ. కలువచెలువు చెలువుఁ గైకొను కన్నులు, జగ మెఱుంగు రంగు జిగి మెఱుంగుఁ
గులుకు దొలుకు మొలకగుబ్బల పసగల, వనిత మేలు కొక్క వనిత మేలు. 73

సీ. బలితంపుఁ బులినంపు వెలఁబెంపు జఘనంబుఁ, బోఁడి మెన్నఁగ నొక్కనాఁడు పట్టుఁ
విరితమ్ములను గ్రమ్ము సిరిజిమ్ము వదనమ్ము, చెలువ మెంచుట కొక్క నెలయుఁ బట్టు
నిగులెప్పుడును గుప్పు నెఱికప్పు గలకొప్పు, ప్రణుతింపఁగా మహాబ్దంబు పట్టు
జితజంభకరికుంభతతడింభ కుచకుంభ, యుగ మెన్నుటకు నొక్కయుగము పట్టు
తే. జొక్కులపుటిక్కగమినిక్కు టెక్కుజక్కు, నఖములనుతింపఁగల్పకాంతంబు పట్టు
గెంజిగురు సంజకెంజాయపుంజిఁ దెగడు, పదము లెన్నంగ బ్రహ్మకల్పంబు పట్టు.

క. ఘనజఘనస్తనయుగములు, వెనుకను దనుమ్రోల నుద్దవిడి నొత్తంగాఁ
జనలేక యూరుమయఁగుల, బనుపడ దాఁగె నసఁగొను భామపఁదనరున్. 75

సీ. విష్ణుపాదం బంటు వేమఱు మేఘంబు, చంద్రుండు ముట్టె నీశ్వరుశిరంబు
తీర్థంబుతోఁ గొని ధృతి నిల్చె శంఖంబు, కోరి ప్రసాదంబు గొనె ఘటములు
దండనుండిన సాధుతరులదాఁ టెనులత, లతనుధర్మములతో డనియె విరులు
పుణ్యనదీనదంబుల నిల్చెఁ బులినమ్ము, లలపితామహు నాజ్ఞ నలరె నంచ
తే. కుంతలానన కంధర కుచసుబాహు, నఖకటీయానపటుశోభనత వహించి
దీటురావే మటంచును దృఢమనీషఁ, జెలియ యంగమ్ములకుఁ బాస చేసినటుల.

ఆ. మొగము నిండియుండు మోహంపుఁగన్గవ, యురము నిండియుండు నుబ్బుచనులు
వీఁపు నిండియుండు వేనలిజొంపంబు, దానిఁ బొగడఁ దరమె మానవులకు. 77

క. ఆహస్తిని యౌవనము, త్సాహమునన్ బిడ్డపాపసందడి లేమిన్
మోహనతరవిటవృషభ, వ్యూహములకు వల్లెత్రాఁటి యొఱపున మెఱయున్. 78

చ. మిడిమిడి గానిచేకటులు మేలిమిసూనలదండ జోడుబోల్
కడెములు సందిబొందె విడి కమ్మలమించులమించుమించులన్
నిడి బుగడల్ జరాసరిహొణీలఁ దనర్చినకట్ల దండచే
గడ కుతికంట్లు సూసకము ఘల్లను మెట్టెలు పూని వీఁగుచున్. 79

క. అది గరగర నగుపురుషుం, డెదుటం బడ వీఁడు జీవితేశ్వరుఁ డయినన్
మది గలదుఃఖం బెల్లను, దుదముట్టు నటంచు మోహ దుర్దశ నొందున్. 80

వ. అది మఱియును.

ముదమునఁ బల్లెబట్టులకు మూఁటను ముట్టై కటంము నాథుఁ డిం
పొదవఁగ నేగ జారజనయూథహితప్రదభాగధేయ మై
కదిసి పరించుఁజిన్నెలను గాసిలఁ జేయుచు మోహకాంక్షతో
మదనుఁడు సానచిమ్ములు సుమాళిముతోఁడుతఁ జిమ్ము చుండఁగన్. 82

వ. ఇట్లు సంచరించు నయ్యవసరంబున. 83

సీ. హారాది యొడ్డాదిభారా సులను సచ్చు, గోనెలు తణగాలు గోతములును
నూలానునగలు కంట్లాలు కఁవడికట్లు, మూఁటలు చిక్కాలు బాటసంచు
వలలావణము పట్టి వారతుకొక్కను, సుంకము పేటికొసులును మగలు
కొవలి దేపళ్లకొనులు కుప్పబ, త్తైము విశేషము దోపతీర్వ యక్థ

తే. మాన్యములు తరుగువిడుపునుమడుపుమణియ, గానికోల్కానిబంటోత్రితుకరణములకు
నారిపెట్టి బసివిగణాచాను లచట, వాదిలెక్కలు రాఁబట్టువాఁ డొకండు. 84

ఉ. సుంకరకొల్వుకాఁడు సరసుం డనుపేరిఁటివాఁడు చూడ నే
ణాంకసంతకంతుల జయంతుని నెంతయుఁ బోలువాఁడు ని
శ్శంక నలంకరించుక హుశారున వీథికి వచ్చి యప్పు డా
పంకజలోచనం గని సెబా సని మెచ్చినయంతలోపలన్. 85

పొగడలు చారుచెంగలువబొండల మేలకిపువ్వు ధట్టి సం
పఁగి విరి తేఁటి మేల్లనినపొగశిరీషపు గోషుఫేషు మేల్
జిగితొగడాలు జాజిబరిసెం గొని చిల్కలవాజి నెక్కి పెం
దెగువను గంతుపాదుషహ దే యని యార్చెద బొమ్ము గ్రుమ్మినన్. 86

క్రీడావిహిత్థప్రవేగోన్మదోగ్రరో, షప్రబోషవితర్కచపలదైన్య
పరుషసత్రాసకచరమలీలాపని, ర్వేదనాసూయవిషాదగర్వ
మోహాంచితాస్మృతిమోహనమాధుర్య, జడగుప్తిధృత్యపస్మారహైన్య
హర్ష విజ్ఞానశం కౌలస్యసుఖనామ, ధేయముల్ గల్గి వర్తిల్లునట్టి

తే. ముప్పదియు మూఁడు సంచారములను మ్రగ్గి, స్వేదవైవర్ణ్యరోమాంచవిశ్రుతాస్య
కంపముల్ ప్రళయస్తంభకము లనఁ జను, సాత్త్వికపుభావములచేత జడిసి తెలిసి.

సీ. సాక్షాత్కరించిన చంచలాలతికయో, మాటాడ నేర్చిన మణిశిలాశో
జీవంబువచ్చిన చిత్తరుబొమ్మయో, కడురూపుదాల్చు శృంగారరసమొ
చేష్టలు వెలయించు చివురుపూరెమ్మయో, చెఱలాడుజాబిల్లిచిన్నికళయొ
కలితరేఖ నటించుకమ్మ నెత్తావియో, మోహింపఁ జేయు సమ్మోహనంబొ

తే. కాకయుండిన సితశక్రకాంతిముఖపు, సొగ సలంకృతికళయును సురభిశుభద
విభ్రమంబులు గలవె త్రివిష్టపముల, నిండి యున్నట్టి చక్కని నెలఁతలందు. 88

క. కరములు సుమలతికాశ్రీ, కరములు చిగురువ్వు లబ్జకరములు పద్మా
కరములు నాభీరుచు లా, కరములు సొగసులకుఁ జెలికిఁ గలయవయవముల్. 89

క. నారికెన పఖులు తేరే, లేరేదారఁదెగడు నిటలలీల లయారే
యారేవునమరు నారే, నారేఖకుఁ దనుఘనాళి నాఁగను మెఱయన్. 90

క. బాలాద్భుక్తతి వాలా, వాలాఱుంగన్ను లతులవనజశ్రీలా
శ్రీలా చెవులు సులీలా, లీలావతికంఠరవము లెరబాబాలా. 91

సీ. శశిరేఖశశిరేఖ సత్కళా సౌందర్య, ములు మాయఁ జేయు నిచ్చెలువతీరు
పద్మినీపద్మినీపరిమళజాతుల, నలరింపుచుండు నిక్కలికిసౌరు
రేవతీరేవతీరేఖావిలాసముల్, తలకింపఁ జేయు నిత్తరుణిమురువు
వరహేమవరహేమసురుచిరలీలలు, గఱఁగంగఁ జేయు నీకాంతహురువు
తే. తారతారనుదారనుదారసించు, భద్రభద్రను భద్రను బరిహసించు
నౌర యిట్టుండ వలదె శృంగార మనుచు, మెచ్చి పల్మాఱు బలుమోహ మెచ్చికెరలి.

క. మిఱు కైనయాకృశాంగీ, మణి నిప్పుడు మోహినీసుమతమంత్రాక
ర్షణకళ నాకర్షించుక, కణకం బలుగతుల రతులఁ గవిసెద ననుచున్. 93

క. మది నూహచేసికొని తన, సదనంబున కపుడె వచ్చి చలమునఁ దన్నుక్
మదనుం డేచఁగఁ దమిచే, నొదవిన యొకయమృతసిద్ధయోగమునంమన్. 94

సీ. వైష్ణవి కౌమారి వారాహి చాముండ, బ్రాహ్మి మాహేశ్వరి బగళ లలిత
కాత్యాయ నీంద్రాణి కాళరాత్రి భువనేశ్వరి మహామాయి పంచదళ దుర్గ
భగపతి మాతంగి బాల మహాకాళి, కామేశ్వరియు భద్రకాళి శక్తి
మలహరి కృష్ణాక్షి మాధవి శాంభవి, శాకంభరియు లఘుశ్యామలాంగి
తే. మోహినీ కామరాజాఖ్యముఖ్యదేవి, రాజరాజేశ్వరియు మంత్రరాజరాజ
ముఖి వరూపిణి భైరవి ముఖ్యమూల, మంత్రములలోన మోహినీమంత్ర మరసి.

సీ. కడుభక్తి శుక్లపక్షమునఁ బుష్యార్కమి, నాఁడు హస్తిని వీథి నడుచువేళఁ
గుడియెడు గిడుమన్ను గొని తెచ్చి శయనమం, దిరము గోమయమున నెఱయ నలికి
మధ్యమంబున నెఱ్ఱమంటిప ట్టిడి పస, పున ముగ్గొసఁగి మధ్యమునను మన్ను
నెఱపి యాపైని నస్నైలఁతరూపము వ్రాసి, చుట్టుయంత్రము గురుస్తుతి యొనర్చి
తే. మొదల నోం శ్రీంవినిర్మించి మోహమోహి, నీపటుస్వాహయనిమంత్రనియతిఁదీర్చి
యందు దిగ్బంధన మొనర్చి యరుణగంధ, పుష్పదీపాదులను లెస్స పూజఁ జేసి.

ఆ. లక్షజపముచేసి లక్షణయుతముగఁ, దద్దశాంశము మధుతర్పణంబు
తద్దశాంశ మగుచుఁ దగు పలాశలతాంత, హోమవిధియుఁ దీర్చుచున్నయపుడు.

సీ. మినుకొప్పు నునుగొప్పుమినమిన ల్దూఁగాడఁ, గన్నులధళధళ మిన్నులాడ
బునుఁగిడ్డనెఱపూఁతభుగభుగ ల్చెలఁగాడ, గుబ్బలచకచక ల్డొబ్బులాడ
జిగిపూని తగుమేనిధగధగ ల్దిరుగాడ, నగుమోము నిగనిగల్ నాట్యమాడ
గుమిగూడుసరిదండఘుమఘుమ ల్పొరలాడ, నందెలఝుళఝుళ ల్చిందులాడ
తే. నెదుట సాక్షాత్కరించుమోహినికి నతఁడు
గరిమెతో లేచి మ్రొక్కినఁ గరుణఁ జూచి
తనకుఁ బూర్ణాహుతి యొనర్చి తప్పకుండఁ
దంత్రము ముగింపుమా నీవు దలఁచినట్లు. 98

క. వర మొసఁగెద నన నటువలెఁ, జరిపి మనోజాత పంచశర యని యంత్రా
వరణము దుడిచి మదీప్సితము రయంబునఁ దీర్పు మనిన మోహిని యంతన్. 99

తే. మంచి దని యచ్చెలిని నావహించి శక్తి, తెచ్చి ముందట నిల్పి యదృశ్య యైన
సంభ్రమంబున సరసుండు సరసరతులఁ, బరవశత్వంబు నొందించి భ్రమము గొల్ప.

చ. కనుఁగవ విచ్చి చూచి యల కామిని యెక్కడి దీనికాంత మీ
ఘనుఁ డితఁ డెవ్వఁ డిట్టిరతి గల్గుట యేమని విస్మయంబుచే
మనమున నెన్ని యే మయిన మంచిదె నామదిఁ గోర్కెఁ దీర్చెఁ బ్రా
బ్బనమకరాంకు నింకఁ దనభృత్యునిగాఁ బని పూని యేలెదన్. 101

వ. అదియునుంగాక. 102

తే. భర్తఁ దన దత్తకుఁ డనంగఁ బరఁగు కూచి, మార పాంచాల విట పీఠమర్దనాగ
రిక విదూషకు లనఁ బ్రౌఢరీతి మెలఁగు, నాయకులవంటిరసికుఁ డీనాయకుఁ డని.

చ. మనమున మెచ్చి నాయకుఁడ మానెఱజాణవు ప్రౌఢ వేక్రియన్
గొని రతి నేలినాఁడ వనుకూలము నా కిది నిచ్చ నిచ్చలున్
ననవిలుకానికేళికల నన్ వెలయించు మటంచుఁ బల్కినన్
విని సరసుండు మంచి దని వేడుక నాతినిఁ బంపె నింటికిన్. 104

క. అది మొదలుచేసి హస్తిని, మది రంజిల సరసుమీఁది మమతను నిచ్చ
ల్మదనునికేళికిఁ బిల్చును, దుదఁ దనగృహమునకు సందు దొరికినయెడలన్ 105

వ. ఇట్లు విహరింపుచుండి యొక్కనాఁడు. 107

క. మధ్యాహ్నవేళ జనతా, రాధ్యుం డగుసరసుఁ డలరి రతిపతికేళీ
సాధ్యత బుద్ధిమతాంకిమ, సాధ్య మ్మని యావధూటి సదనమె చేరెన్. 106

తే. చేరినప్పటిసరసునితీరుఁ జూచి, భుజము లుప్పొంగి హస్తినీపుష్పగంధి
కలయఁబడి మఱి పన్నిటఁ గాళ్లుగడిగి, మేల మాడుచుఁ దోడ్తెచ్చె మెచ్చు హెచ్చి.

సీ. జీవదంతపుజగాజీనినఖానుమే, ల్తళుకుటద్దపుబిళ్ల బెళుకురవలు
వింతసంతనఁ జేసి విప్పుగాఁ దాపిన, హురుమంజు పాపల మెఱుఁగుకుచ్చు
లునిచి తీర్చినసొంపు మిను కైనకెంపురా, మొనముక్కు లూడెడు ముద్దుగులుకు
కళుకుఁ గ్రొంబని పచ్చచిలుకలు రహిమించు, తొగరాచలువరాల నెగడు లోవ
తే. గలవగలనిండుపచ్చనిజిలుగుప్రతిమ, కతల నిరవొందు చిత్తర్వు కప్పురంపు
మెప్పు మేల్కట్లు చవికెలో మెరయు హంస,తూలికాతల్పమునఁ జేర్చి తోయజాక్షి.
క. తొడరి నునుగబ్బిగుబ్బల, పొడ వడఁగఁగఁ గౌఁగిలించి పొడమినదార్ఢ్యం
బెడలంగనీక మన్మథు, బెడిదపుదురమం దతనికిఁ బ్రియ మొందించెన్. 110
తే. ఇట్టులంగున వారిద్ద ఱేపు రేఁగి
మిథునకార్యప్రవిష్టులై మెలఁగుచుఁడ
దానిపతియింటి కరుదెంచి తలుపు దెరువు
మనిన నది యెట్లు బొంకఁగఁ జనునొ చెపుము. 111
తే. తెలిసెనా నీకు హేమావతీలతాంగి
తెలియకుండినఁ జెప్పెదఁ దెలిసికొనుము
విభుఁ డటులఁ బిలిచిన విటుఁడు వడఁక
వెఱువకు వటంచు ధైర్యంబు గఱపి యపుడు. 112
చ. ముసుఁగిడి పండుకొమ్మనుచు మోహముతోడ వితర్దిఁ జూపి తా
నును రసు రంచు ఖిన్నయయి యొయ్యన నేగి కవాట మవ్వలన్
బెసబెసఁ ద్రోచి మాటఁ దలఁ బెట్టుక వచ్చినభర్త కింత సా
ధ్వస మొదనంగఁ జెప్ప విని వాఁడు విభావిత యేమి యంచనెన్. 113
వ. అని హీనస్వరంబున. 114
క. అడిగినపతితో నిట్లను, దడవాయెను సుంకరీఁడు తమలెక్కలకై
పడియున్నాఁ డిదె కనుమని, పడఁతి యతనిఁ జూపఁ జూచి భయ ముప్పొంగన్.
క. వెను కడుగు లిడుచు నవ్వలఁ, దనపొరుగింటను విభుఁడు దాఁగినచో జా
రునిరతితృప్తాంగన్ వే, తనిపి వెడల ననిపి తరుణి ధవునిం బిల్చెన్. 116
తే. పిలువ నతఁ డెప్పటట్లన భేదపడక, కూర్మితో నుండెఁ బతి దాను సుందరవదన
వింటివా యిట్టిచాతుర్యవిశదశక్తి, నీకుఁ గలిగినఁ బోవమ్మ నృపతి నెనయ. 117
చ. అని కలహంస చెప్పఁగ సుహాదరణంబున నాలకించునం
తనె తపనోదయప్రభలు తద్దయుఁ గాన్పడఁ గేళికానికే
తనమున కేగి యచ్చట సుధాకరబింబనిభాస్య ప్రొద్దుగ్రుం
కినఁ దను కౌఁగిలింపుమనఁ గేళిమునన్ వెతఁ జొంగి యుండఁటన్. 118

క. కుముదమ్ములు కుముదమ్ములు, సముదమ్ములు గాఁగ మెఱయుఁ సాయాహ్నమునన్
రమణీమణి ఘనరుచిభా, రమణీఘృణి సిరులు సిరులు రంజిలు వేళన్. 119

సీ. తారకావృతపయోదముమాడ్కి సురుచిదామ, పరివృతం బగుకొప్పు పరిఢవిల్లఁ
దీఁగను వనలు హత్తినచందమున మేన, సొగసుగా రతనంపు సొమ్ములలర
వదనచంద్రునిగూడి వచ్చినరోహిణి, ముఱువున ముత్తెంపుముక్కఱ రహిర
మంచు గప్పినగట్లు సంచునవలిపెంపుఁ, బైఁటలో గబ్బిగుబ్బలు వెలుఁగఁ
తే. బరఁగు జగడాలపగడాలసరణిలోనఁ, గ్రాలు పుగరాల చిగురాల వేల విడెపు
కరుణరుచిఁ జల్లి నోరఁ బల్వరుస మెఱయ, వచ్చినిల్చినయా హేమవతినిఁ గాంచి.

క. జలజభవాశ్వం బిట్లనుఁ, జెలియా యింకొక్కగాథ చిత్రతరంబై
చెలువొందెడిఁ జెప్పెద వినఁ, గలవే యని యడుగ వినెదఁ గాకని నిల్చెన్.
వ. హంసం బిట్లనియె. 122

---

## పదునేనవరాత్రికథ.

మ. ఇతరధ్యానము మాని నీవు వినుమా హేమావతీ ద్రావిడ
క్షితిలోఁ జిత్రవిచిత్రవస్తువితతిన్ జెన్నారు కాంచీపురిన్
స్థితుఁడై కాఁపుర ముండు శూద్రుఁ డొకఁ డాత్రేదృష్టికిం బాత్రమై
శ్రితనానాజనభాగధేయ మగుమన్ సీరాంకనామంబునన్. 123

సీ. ముంగిటఁ బులిజాదములు గీచి యుండిన, రచ్చబండలు గొప్పప్రహరిగోడ
పంచదిన్నెలు చాపపట్టెలు ముమ్మూల, గూండ్లు దీర్చినయట్టిగోడ లలరు
దేవరచవికె పందిరి కోళ్లగూడులు, గొఱ్ఱ గుంటుక కాడి క్రొత్తపల్వ
లట్టువగల గాడి కొట్టంబు పలుగడి, కంపపాతినలేగ కదుపుదొడ్డి
తే. ప్రత్తిగూటంబు తొట్టియు బలకపీట, బావి పిడకలకుచ్చెల పసులమేపు
మంగలము దాలి ఱోలులొల్కి మాఁగినసందు, గలిగి విలసిల్లు నాతనినిలయ మెపుడు.

వ. అదియునుంగాక మఱియును.

తే. ముద్దగిద్దజపులమార్పు ముసుకుపచ్చ, మార్పుజిలుకపురిపరంగి మల్లెమార్పు
పాల్పసరకొమ్ముసూగూరి పైరజల్లు, మసరపల్లెర జొన్న లమ్మంగఁ గలవు. 126

సీ. జడకొఱ్ఱ కొఱ్ఱలు చామలు వెలిచాము, కుట్టారు కారిక కొండబరిగె
బరిగెసజ్జయు గిడగిరసజ్జ మజ్జపా, ల్గిడ్డచెన్నెద్దరాగియును యువయు
గోధుమ పెదనువ్వు కుఱుసువ్వు తెలినువ్వు, కులుము వెల్లగిసయు గోఁగుజనుము
గట్టితోట వెలిపెద్దచెపరగి పేరాని, దము దక్కెడ చిఱామువదముకు మఱియు

తే. మినుము వెర తెల్లకంది చిర్సెనగ సెనగ, పిచ్చ నలపిచ్చ కుఱుపిల్ల పెసరగాయ
మఱ్ఱ అలసందు లుబ్బడాల్ నల్ల తెల్ల, యులవలు పటాణములు పుల్లకొలఁదిగలవు.

సీసమాలిక. బంగారుతీగెలు గంగాజలమ్ములు, కస్తూరిసిగరాలు కటకసరులు
నిప్పపూరాజనా లేసుంగుకొమ్ములు, మల్లెశ్రీగంధులు మదనగంధు
లేలికరాజనా లీశ్వరప్రియములు, రావిపూరాజనాల్ రత్నసరులు
కునుమపూరాజనా లుత్తిబల్లుత్తులు, కస్తూరిపట్టెలు గంధసరులు
మందిగంద్రలు నాగమల్లెలు తీఁగెమ, ల్లెలు కృష్ణనీలాలు వెలుపడాలు
మన్మథబాణాలు మరువంపుమొలకలు, సన్నమణింగెలు జున్నుఁబ్రాలు
పొన్నప్రిరాజనా లుప్పునుఁగురాజనములు, ముద్దుప్రాఁగారళ్ళ ముత్తుసరులు
సన్ననూదులు పచ్చగన్నేర్లు గోదండ, రామము లేక్కసర్లు రాయసర్లు
చంద్రవంకలు జీనిసరులు కాంభోజులు, వంగాకు బొడమలు పొంగుబ్రాలు
జిరకర రాజనా ల్చింతపువ్వులు గోరు, రాజన లుబ్బదపోర్లిల్ రాజనాలు
రామబాణాలు రెక్కలములు వెన్నముద్దలు జిల్మ బుడమలు దాళువాలు
గొప్పకొయాలు ఎలుగుత్తులు పాలమీఁ, గడలు త్రిరంగాలు కొమదార్లు
తెక్కపాలలు కొకి తెక్కలు పుష్పమం, జరులు సీతాభోగసరులు గౌరి
కుంకుమల్ రణబెండ్లి కొడుములు పిచ్చుక, గోళ్ళు ప్రయాగలు గొజ్జఁబ్రాలు
గరుడసరు లొప్పితుగంటరాజనములు, మోఁగుగతొడిమలు ముదుకసరులు
పచ్చసరుల్ రెడ్డపాలపంకెలు సుఖి, భోగులు పచ్చకర్పూరసరులు
నిప్పరు దెబ్బస లీనరుకొవులు గాజు, కప్పెర లుక్కురువడా ల్కంఠసరులు
సాలంక లలుగురాజనములు సంభావు, లవసరదార్లుమోహనపుసరులు
మణిసరుల్మసరులు మంకెన ల్పగడంపు, తీఁగెలు మడిప్రాలు దేవసరులు
లత్తుకబొత్తలు లక్ష్మిమనోహరా, ల్భారతీసేసలు బాహుపురులు
వజ్రపుఁదళుకులు వాసనరాజనా, ల్జవ్వాజిపంకెలు గవ్వసగులు
సంపంగిపూవడ్లు జాజిరాజనములు, గంబూరరాజనా ల్కన్నెసరులు
తుమ్మిపూరాజనా లమ్ముడుకొణిగెలు, జీనువముక్కలు చిలుకముక్కు
లేదుకబ్రలు వంకె లిసుకరాజనములు, పులిగోళ్లపంకెలు బొగడసరులు

తే. జిలితొగలరాజనమ్ములు నలపరులును, దెల్లనల్లచెన్నంగులు దీపసరులు
నాది యగు పేరు గలుగువడ్లతనియింట, నుండుశతకోటిపుట్లులొక్కొక్కడినుసు.

తే. దొండకాయ మఁలుకకాయ తొట్లకాయ, జఁబికాయయు నెత్రలసందకాయ
వెలయు నుస్తికాయయుఁ రావములకకాయ, మేడికాయ కాకరకాయగూడ నిఁక.

సీ. రామగుమ్మడి యోంబరాజుగుమ్మడి చార, గుమ్మడి బూడిదెగుమ్మడులును
గిండిసొరయు దీఁగెకిన్నరసొరయును, బీర సముద్రపుబీర నేతి
బీర పిచ్చుకపొట్ల పెద్దపొట్లేచుఁగు, దంతపుళ్లలు తంబలు వెలి
కాకర పొట్టికాకరలు మేఁకచెవి చిక్కుడు పాలగణపులగోరుచిక్కు
తే. డులు సుగంధాలు బొంతసంటులు సురశులు,గంజిపందిటికపురపాంకాయతరులు
బూజుపుచ్చకురాసానిపుచ్చ పెద్ద, దోస నక్కదోసలు వానితోఁటఁగలవు. 130
ఆ. చేమకంద గెనుసు చిత్రిగోరు పెండ్లము, పొసఁగు తెల్లగెనుసుభూతగెనుసు
అల్ల ముల్లి పసపు ముల్లంగి వెల్లుల్లి,గాజరయును మొదలు గాఁగఁగలవు. 131
చ. గురుగెఱ బొద్ది చెంచలియుఁ గుచ్చలి చిత్రి తగిర్స తుమ్మి ను
స్సరి బలుగూటిబొద్దినెలి చల్మలి పల్లెరు రూకపాత్కె
ల్వారిగిసె ముస్గ వెల్గ చెవిపావిలి దొగ్గలి పొన్నగంటి దే
దరి నరవంజిచేత రసదాపయు గొండలి కొండపిండియున్. 132
తే. పాల వామింట తక్కలి బచ్చలి కొయి,గూర చక్రవర్తము చిల్కకూర గోళి
కూరగుంప బచ్చలి తోఁటకూర కొతిమ,రాపసోపు మెంతాకు చుక్కకుగలదు.
సీ. పనస సీతాఫలా ల్చినిమ్మ గజనిమ్మ, దూదినిమ్మయు నార మాదిఫలము
నారదఖర్జూరనారికేళాదులు, రామఫలంబులు జామఫలము
లలరారు బొంతకిత్తళియుఁ బోఁకయుఁ బోక,పిప్పలి నేరేడు పెద్దవెలఁగ
రామాపళియు గమరక జీడిమామిడి, బాదంగి పెనురేఁగు పాలఫలము
తే. చెట్లుపండెడితోఁటలు చిట్టు గొట్టు, చెఱకు రసదాళిచెఱ కెఱ్ఱచెఱకు నల్ల
చెఱుకుతోఁటలు కలుజోడ్లు సీర్పి దినుసు, కారపాకుతోఁటలుఁగల పతనికి.
సీ. మామిడికాయయు మారేడుగాయయుఁ,గొండముక్కిడికాయ కొమ్మికాయ
గరగుకాయయు మొల్లకాయ యుమ్మగుకాయ, ఉసిరికెకాయలు నుస్తికాయ
లేకరక్కాయయు వాకల్మికాయయుఁ, జిటినెల్లికాయయుఁ జిల్లకాయ
కలబంద గజనిమ్మకాయ నార్దపుకాయ, చిననిమ్మకాయయుఁ జీడికాయ
తే. కొండనపుకొమ్ము మామెనకొమ్ము బుడమ, కాయ యల్లము మురియంపుకాయ బీఱ
కాయ కంబాలు కరివేఁపకాయ లాది, యైన యూరుఁగాయలు గల పతనియింట
తే. పంట మోటాటి పెడగంటి పాకనాటి
యరవెలమలాదికొండాగె మొఱసుగోన
కొణిదెకాఁపులు మొదలైనక్షోణిఁ దనరు
కాఁపులకు నెల్లమిన్న యకొ్కఁపుకొడుకు. 136

తే. అతసికాకోకసులాంగన యగ్రమహిషి, చనినపిమ్మట సత్యకేశిని యనేటి
పేరుగాంచినచిన్నారి బిసరుహాక్షిఁ, దేవుఁ బ్రియురాలు నాఁగ సొంపెక్కెఁ గ్రాలు.
సీ. మెఱుఁగంచుకమ్మలు మెట్టెలు గెరలము, కర్కర యుద్దెబుగడలు కట్లసరులు
దండితీరైన చింతాకుతీఁగయు నాను, పల్లేరుబూవులు బన్నసరము
కుప్పెసౌరము మెచ్చుకొన్నసూనలదండ, యందగించినజోడు సందిబొందె
నిగరమైనసిరాజిపగడాలచేకట్లు, కొంతికడెంబు లుంగరపుజోళ్లు
తే. గిలుగుమట్టెలు గెంటీలఁ గులుకు అవికె
సన్నవహా వేయుఁగన్నుల చలువచీర
పసిమిఁ జెల్వొందుముంజేతిపచ్చలమర
దుడ్డెతనమునఁ దిరుగాడు రెడ్డిసాని. 138
క. ఆచొక్కపుజిగి చన్నవ, లావిక్కని మెఱుఁగుటూరు లామోమందం
బాచక్కనిరూపమునస, చూచిన మరుఁడైన భ్రాంతి సొలయక యున్నే. 139
సీ. మేఘేందుకార్ముకమీనదర్పణవజ్ర, కచముఖభ్రూనేత్రగండనాస
దరసుధాబింబకుందశ్రీమణీకీర, గళవాగధరదంతకర్ణజిహ్వా
పద్మలతాధరభంగభోగమృగేంద్ర, కరభుజాకుచవళికక్షమధ్య
బిలతుండచక్రకాహాళితారపల్లవ, నాభ్యూరుతటిజంఘనఖరపాద
తే. ప్రసవవిభ్రమచలదళపత్రకనక, కదళికాపద్మకాముదీగంధసార
మారవాంగుళ్యనంగసద్మరుచిరమగు, హాసవాసన యగుచు నయ్యబల మెఱయు.
క. మినమినలీనెడు నునుమే, నునవొనరిన వనజనయననూతననలినా
నలమున నవుపుగఁ గనుఁగొనఁ, దనరిన కనదనఘునఖనిదానసునాభిన్. 141
సీ. పలుకులు కప్రంపుఁబలుకుల వర్షించు, చూపు మారునితూపు రూపుమాపుఁ
గరములు బిసభీతికరములై సిరులొందు, జడజగ్గ విరులకు జడతసేయు
మందయానము హంసమందము నిరసించు, మించుమైనిగ్గు క్రొమ్మించు నొంచుఁ
గుచములపస లాలికుచముల నిర్జించుఁ, జెక్కుఁదళ్కు ముకురాలఁ జెక్కువైచుఁ
తే. దావికెమ్మోవి యమృతంబు బావికీవి
యూరు చెన్నారు చీమలబారు దూరు
నూరు లలరారు ననఁటుల సౌరు గేరుఁ
గాంత యగుఁ గాంతలతికాంతకుంతకంత.
క. కమలంబులఁ గమలంబులఁ, గమలాననలోచనముల కాంతి జయించుం
భ్రమదాళులఁ బ్రమదాళుల, రమణీమణివాలుఁజూపు రహి నిరసించున్. 143

తే. దానిబిగిగబ్బిసిబ్బెంపుఁ దళుకుటుబ్బు, గుబ్బచన్నులకౌఁగిలిఁ గోరనట్టి
మానవాగ్రణి వసుమతీస్థానములను, వెదకి చూచిన లేఁడు పో విప్రమౌళి.
తే. అది మనోజ్ఞము లైనయాహారములను, గంధమెం తైనమదముచేఁ గన్నుఁగాన
కమితపల్లవరతికేళి కౌస వోడమి, మిాఱుచిత్తముతోడ నేకౌరఁ దొడఁగె. 145
సీ. పనివంటవార్పులబాధ లించుక లేక, తీరిన మంచిసంసార మొదవె
నత్తమామలపోరు నారదూ రెఱుఁగక, పాం దొంద నిచ్చఁగాఁపురము దనరెఁ
గుడువఁ గట్టను బూయఁ దొడుగ వస్తువులు య, థేచ్ఛముగా నుండునిల్లుదొరకెఁ
బట్టిపల్లార్చ కేపట్టున దయఁ జిక్కు, మనసు గల్గినయట్టిమగఁడు గలిగె
తే. నింతగల్గిన నేమి నాహృదయ మెఱిఁగి, మమత దీరను బదివేలమంది మగలఁ
గలుగఁజేయక చెడుదోసకారిబ్రహ్మ, యొకనిగాఁ జేసె ననుచు నూరక తపించు.
క. ఆపాప మేమి చెప్పుదు, గాఁపుది మదమెత్తి కన్నుఁ గానక పురిలోఁ
జూపరుల నెవరి నైనను, నేపున సంభోగకేళి నెనయంజూచున్. 147
చ. అటువలెఁ జూచువేళ నొకఁ డంగదనామకుఁ డాయుధోపజీ
వటకుఁ బ్రయోజనార్థము రయంబున వచ్చిన వాని టెక్కుచొ
క్కటపుటొయార మారఁ గని కౌఁపది మోహము నిల్పలేక మి
క్కుటపురతిప్రయత్నమునకుం గరఁగించెద నంచు నిట్లనున్. 148
తే. ఎన్నడును రానివాఁడ వీ వేమి పనికి, వచ్చినాఁడవు కూర్చుండు వన్నెకాఁడ
మంచ మదె తెచ్చి యింటిలోనుంచినా న్నటన్న వినివాఁడు పోవలెననుచుఁబలుక
ఉ. పోవలెనంటె వారమణిమో మటుచూడక నీడ నుండ లే
వో విలపించుబిడ్డలకు నొయ్యనఁ జన్నిడి నిద్రఁ బుచ్చఁ బోఁ
గావలెనో భ్రమించు ఖటకత్తెలయల్కలు దీర్చఁ బోయెదో
శ్రీవిభవోత్తమా యెఱుఁగఁ జెప్పు మటంచును టెక్కుపట్టుచున్. 150
తే. కోర్కు లిండారఁగా దొడ్డగొంగ డపుడు, పరిచి యాతనిమంచంబు పైకిఁ జేర్చి
వలచి వలపించి చిన్నెలవగలు చూపి, యొనసి రతికేళి నేలె న య్యాగురుబోఁడి.
వ. ఇత్తెఱంగున. 152
క. అనిరుద్ధచేష్టఖేలన, మనివారితదంతఘాత మతిచిత్రతరం
బనిశము పూర్వానందం, బనుపమగురుసురతసౌఖ్య మబ్బినయంతన్ 153
క. ఈలాగు నిచ్చ నిచ్చలు, మేలుగఁ గోరికెలు దీర మిథునత నన్నుల్
దేలింపు మనుచు ననిపినఁ, జాలం బాదుగ నతండు సలుపుచు నుండెన్. 154
క. అలకౌఁపువగల చిలుకల, కొలికికిఁ దమి యింతయైనఁ గొల్పడక మదం

బలరాణి యుండ నొకనాఁ, డెలమిని నయ్యూర జేరి హిత మలరారన్. 155

ఉ. ముదుకరుమాలుగుడ్డ భుజమూలమునం గిడితంబుమీఁదఁ బ్రాఁ
తది యగుదుప్పటంబు మెలఁ దాఁ్రిసును గీసరయుండు తిత్తి వ
న్నది నెలవంక నాపుము వినాయకు నుంగర మంగుళంబునన్
బొదవఁగ రత్నగుప్తుఁడు సమున్నతి నింటికి రాఁ బ్రియంబునన్. 156

అసత్యకేళిసీసతి, నాసత్యసమాను వైశ్యనాయకురూపం
బాసఁ గొని చూచి మోహము, తో సరసము లాడఁకొనుచుఁ దోషణ మొదవన్.

క. వక్కాకుఁ బొగా కిడు మని, చక్కటికిని బోయి పైట జాఱఁగ నెనుటన్
మొక్కనఁగ వొప్ప నిలఁబడి, దక్కితి విఁక నెందుఁ బోయెదవురా బావా.

తే. అనుచుఁ దమి నిల్వలేక నయ్యంబుజాక్షి
వలుదగుబ్బలఁ గౌఁగిట బలియఁబట్టి
సురతకేళులఁ దేలించి చొక్కుచుండ
నపు డటకు వచ్చి యయ్యింగిదాహ్వయుండు.

చ. వచ్చితి రెడ్డిసాని తలవాఁకిలి దీయు మటంచుఁ బిల్వ లో
హెచ్చినసాధ్వసాప్తి నపు డెంతయు వైశ్యుఁడు సంచలింపఁగా
నచ్చపలాక్షి వాని భయమందకు మం చొక గాదెలోపలం
జెచ్చెర నుంచి నాయకుని చెంతకుఁ జేరి మహానురాగయై. 16[illegible]

ఉ. వాకిలి దీసి చొక్కటపు వాలుగకన్నులఁ దేలఁ జూచి నా
ళీకదళాక్షికుందనపులిబ్బుల నేలెడుఁ గుబ్బచన్నొనల్
సోఁకఁగఁ గౌఁగిలించి నెఱ సొంపునఁ గేళిగృహంబులోనికిం
దోకొనిపోయి వానిరతినూతనసంభవపారవశ్యయై. 1[illegible]

క. అలకాఁపుసంపదల నల, రలకాఁపువధూటియానసాలంకృతికా
ర్యలకాపుంజతయై వే, డ్కలఁ గాఁపుర మొప్పఁ జేయుకాలమునందున్. 1[illegible]

ఉ. నల్లనికమ్మిపచ్చడము నామము బొట్టును గుచ్చుటద్దముల్
తెల్లరుమాలు వల్లె మెలఁ దిత్తి కరంబునఁ గోలవేళ్లఁ సం
ధిల్లిన వంకటుంగరము తీరగుపూజలజంటగుండ్లు రం
జిల్లఁగ వచ్చి రెడ్డి తనచెల్వగువాఁకిలి దీయఁ బిల్చినన్. 1[illegible]

క. ఆయెడ నిద్దఱు మిండలఁ, బాయక రతిసల్పుకాఁపుపడఁతుక యెటులన్
మేయించి బొంకవలెఁ జెపు, మా యని చక్రాంగవంశమండన మనినన్. 1[illegible]

ఉ. అవచనంబు వేడ్క విని యాదల యూఁచి నిదూర్పు పుచ్చి హే
మావతి-పల్కె హంసవర మాటికి మాటికిఁ బ్రాచ్చ యేల నీ

వే వినుపింపుమా వినెద వింత సుమీ తెలియంగరా దశె
ట్లో విశదంబుగా ననిన నుత్పలగంధికి హంస మిట్లనున్. 165

చ. తననిజనాయకుం డిట్టులఁ దల్పు సడల్పు మటంచుఁ బిల్చినన్
విని యలపన్నెకాఁడు భయవిహ్వలుఁ డైన వడంకవద్దురా
యని నగి వీఁపుఁ దట్టి చను మాపగఁ జాటుచు మళ్లి చూడఁ గే
మనకయు రెడ్డితోడ నని యాసఖి పంచిన నాతఁ డంతటన్. 166

వ. మంచి దని యప్పుడు. 167

క. త్వరితమ్మునఁ దలవాఁకిలిఁ, దెరచుక బంట్రౌతు నోటితిఁటయుఁ దీరన్
బొరిపొరి వదరుచుఁ జనియెడి, తెఱఁగు నిరీక్షించి రెడ్డి తెగువ న్మగువన్. 168

తే. పిలిచి కోపారుణాక్షుఁడై పేర్చి పలికె, నేమిబంట్రౌతుగాఁ డిటు లెమ్మె మెఱసి
వచ్చినాఁ డదిగాక తా వదరుకొనుచుఁ, బోవుచున్నాఁడు సెప్పుమా పువ్వుఁబోఁడి.

క. అని పతి యడిగిన జడియక, వినుమా యని రెడ్డిసాని వింతలు గులుకన్
నునునగ వొప్పఁగఁ జెప్పెను, గనుమా యీసెట్టిగానిఘర్షణ మొదవన్. 170

తే. నగరివారలు పిల్చుచున్నా రటంచుఁ, దఱుముకొని రాఁగ నిలుఁ జొరఁ దలుపు వేయ
గో డతఁడు దూఁకి వచ్చితోఁడ్కొనుచుఁ బోవ, రెడ్డి లేఁడుగదా యని యడ్డపడితి.

ఉ. అంతట నీవు వచ్చితివి యాతఁడు నాగ్రహవృత్తిచేత న
న్నెంతయు దూఱుకొంచుఁ జనియెన్ మగఁడా యని చెప్పి వైశ్యునిం
జెంతకుఁ జేరఁ బిల్చిన వసించుకుహూలము వెళ్లి సాధ్వసా
క్రాంతశరీరుఁడై యెదురుకట్లకు వచ్చిన రెడ్డి యిట్లనున్. 172

తే. వానిదయఁ జూచి నే నున్నవాఁడ నీవు, భయపడకు సెట్టిగా యని పల్కరించి
పొమ్మనిన మస్తకవిధూననమ్ము చేసి, యేగె నాతఁడు తనయింటి కేమి యనక. 173

ఉ. ఆవిధి బొంక నేర్చిన నృపాగ్రణి డగ్గర కేగు మన్న హే
మావతి నాసికాగ్రమున మాటికి వ్రేలిడి కర్ణపత్రశో
భావళి చెక్కులన్నటన మాడ శిరం బటు లూచి మెచ్చుచున్
వేవినఁ జూచి యంత నిజవేశ్మముఁ జేరఁగ నేగె గొబ్బునన్. 174

క. ఈగరిమను నిజగృహమున, కేగి ధరాధీశమోహహృదయాంబుజయై
యాగజగామిని యుండొక, లాగున దినమెల్లఁ గడపి లలి నిశ యైనన్. 175

చ. ఘనశితికంఠకంఠకలకంఠఘనాఘననీలకంఠకం
జన యన ఖంజరీటబలశాసననీలతమాలమాలికా
ప్రణుతమృగేక్షణాచికురభారమృగీమదచంచరీకకా
ననకిటికోటికజ్జలవనద్విపసన్నిభ మైనచీఁకటిన్. 176

ఉ. కొప్పున జాజిక్రొవ్విరులు కుంకుమగంధపుఁబూఁత గుబ్బలం
గొప్పసుపాణిరాసరులు గోమలదేహలతాంతవల్లికం
గప్పెడుసొమ్ము పెఱసిరులు గన్నులపండువు లాచరింపఁగా
నెప్పటియట్ల వచ్చి హరిణేక్షణ నిల్చెను హంససన్నిధిన్. 177

ఆ. నిలువఁ గలువకంటిచెలువంబు వీక్షించి, దినముదినము కొక్క తెఱఁగు దోఁప
సొగసుఁ బూవనేర్చుసుందరాంగివి నీవె, యనుచు మెచ్చి హంస మనియె సతికి.

## పదునాఱవరాత్రికథ.

మ. పొగడం జొప్పడు శౌరసేనజగతిం బుణ్యోపలబ్ధం బనే
నగరం బొక్కటి యందుఁ గాఁపురము దీర్ఘప్రౌఢితో నుండు భ
ద్రగుణోపేతుఁడు సూతవంశజుఁడు కుద్దాలాభిధానంబునన్
దగఁ బెంపొందినవాఁడు రూపజితకందర్పుండు భామామణీ. 179

తే. రాజ నలరాజ రతిరాజ రాజరాజ, రాజతాజాత్మజామర్త్యరాజ వదన
రాజ రాజితరేఖావిరాజమాన, సౌష్ఠవాకారసంపత్తి జరుగు నతఁడు. 180

క. తరణిజను దరణిధరణీ, తరుణీరమణీయవేణిఁ దతనిర్ఘరిణీ
వరరమణీమణిశ్రితజన, దురితాటవ్యరణిసుగుణధోరణి యమునన్. 181

తే. ఈఁదుకొయ్యలు తెప్పలు నీఁదుకాయ, లరడ లరికోల్లు పడవలు తరులు పుట్లు
చేపడవ లోడ లాదిగాఁ జెలఁగునట్టి, యంబుతరణంబులకు నెల్ల నధిపుఁ డతఁడు.

క. ఆకర్ణదఘ్నపుణ్యాక, ధాకర్ణనలలితహృదయుఁ డసమానయశుం
డాకర్ణధారుఁ డంహతి, ధీకర్వుఁడు ధీవరకులదేవుం డరయన్. 183

తే. కొడమ తిఱ్ఱడ్డకొడమ ద్రొబ్బుడుపటంబు, చాప యొత్తిలిగూడయుఁ జల్లుడూఁదు
లుంటకొలంబు తెరదీములునురుగాల, మొసుకుగొరకపుఱుకుసొక్కు లెసఁగు మండు.

క. మెడపల సన్నపువల తోఱ్ఱి, పుడుపల డొంకవల మింటముక్కిడివల దాఁ
టుడుపల సింగిత మనుకుప, లెడపల కుండెవల లాము లెసఁగెడివలలున్. 185

సీ. నీరుకుమ్మరపుర్వు నీరీఁగె తలకప్పు, తెలిదెమ్మ కరివేల్ల పాలికె నత్త
గుల్ల చుట్టుడుగుల్ల కురిమిండ నాచుడు, గస్వా మురుండము కొకిచిప్ప
నులిగుల్ల యెరబిల్ల పురుగు గోదుమగప్ప, కప్ప కత్తెరి యెండ్రకాయ జెలగ
గుఱకరింతము నీరుగుట్టు శంఖనఖంబు, పలుకొసినసిమిరి బంగపురువు

తే. వెలుక నిస్సూత కోచుఁ దాఁబేలు పిడక, మొసలి శింశుమారము పెద్ద మొసలినీరు
పాప నీరెన నీర్బలి ప్రాచిపురువు, లాదికొరగాని జంతువు లన్ని విడిచి. 186

సీ. కొరదు దాసరికొయ్య కొఱ్ఱమీను లశుచుచ్చంగి బేడిస జెల్ల చారమీను
వాలుగు ముకుబొమ్మ పల్లికితట్ట పు, గ్గడికొను ఫూమేను కడిసెలంబు
పక్కె చిత్తర నీరుపాపెర మలుగు మీ, నరిజె యిగ్గాఫుచుఁప యాకుజెల్ల
మిసికల్లు రజు తేలు మేను తొల్లికడాత్తి, గొరక మాపురమును సంటముక్కు

తే. మోర పక్కిర దొండుచు గూరముక్కు, పుల్లరుజ గిజ్జె గెండయు బొమ్మడాయ
యల్లెద మ్ముప్పుచేఁపయు గొల్లదొంచు, పరిగె రొయ్యాది యగుమీలఁ బట్టు నతఁడు.

క. కులకాయకపుంజాలరి, కులనాయకమంబుతరుణకోటీశత్వం
బులు జార్తక్రియశాసన, మలవడ కుద్దాలుఁ డందమానన మెలఁగున్. 188

తే. మేలుబలువాలుగల నేలమిసిమి గ్రాలు, కన్నుఁగవ డాలు మరువాలుకరణిఁ బోలు
మురిపెముల ప్రోలు కల దొక్క ముద్దరాలు, వానియిల్లాలు బొమ్మరవానిడోలు.

తే. దానినామంబు తగు భద్రసేన యనఁగ, రూప యౌవనగరిమ నారూఢి కెక్కి
యీడుజోడును సరి సాటి యెంచు లేక, విఱ్ఱవీఁగుచు నుండు నావిభ్రమోష్ఠి 190

సీ. జడ చిల్వ యాస్యంబు శశి నొసల్ నెల బొమ, ల్ధనువు లక్షులు తొవ లాన్నస గంధ
ఫలి చెవుల్ శ్రీ దంతములు మొల్ల లధరంబు, తలిరు చెక్కి ళ్లద్దములు గళంబు
జిగిశంఖ ముంగుళు ల్పగడాలు కరము ల, బ్జములు కక్షములు భోగములు భుజము
లు లతలు గుబ్బలద్రులు వళు లూర్ము లా, వాల్నాభి గుహ గౌను బయలు కటులు

తే. దొడలనంట్లు మోఁకాళ్లు బిరడలు పిక్క
లు శరధులు గుల్ఫములరడలు ప్రపదములు
కూర్మములు గోరు లుడు లడుగులు మహోత్ప
లములు వెక్క బల్కులై యొప్పు లలనకెపుడు. 191

క. కెంపా వాతెర జిగిబిగి, శంపా నును మేను మోము సౌరిందుని మేల్
సొంపా బలభిన్మణిఘృణి, గుంపా కుంతలవిభూతి కోమలి కెన్నన్. 192

సీ. సారంగసారంగసారంగములఁ గేరు, గమనంబు కనుదోయి కచభరంబు
సారాబ్జసారాబ్జసారాబ్జముల నేలు, వదనంబు కంఠంబు పదయుగంబు
పున్నాగపున్నాగపున్నాగములఁ బోలుఁ, దీరైన నాభినూగారు నడుము
తారకతారకతారకమ్ముల మీఱు, దంతము ల్నఖములు దరహాసములు

తే. వడిఁ బ్రవాళప్రవాళప్రవాళగతి న, ధరము భుజములు వేళ్లు నెత్తావి మోవి
రమ్యతరచక్రచక్రచక్రములఁ దెగడు, ముదితజఘనంబు చనుగవ మొఱుంగులరయ.

క. మబ్బులు గ్రమ్మెడు క్రొమ్ముడి, జొబ్బిల్లెడు తేనెమోవి సొబగౌ మొగముఁ
సిబ్బెంపుగబ్బిగుబ్బలు, నిబ్బరమౌ పిఱుఁదు తొడల నిగ్గుచెలంగున్. 194
సీ. మృగధరబింబంబు మెలఁత నెమ్మోము, మృగంబు కన్దోయి ధరంబు లుదుటు
గబ్బిసిబ్బెపుచనుగుబ్బలు బింబంబు, తావిచక్కెరలొల్కు మోవి కేవి
సుమచాపబాణంబు లమరు పాదమ్ములు, సుమముల నవ్వు చాపములు బొమలు
బాణము లొక్కారివ్వాఁడి రాణించు వాల్చూపు, లళులు నిద్దపుఁగుటిలాలకంబు
తే. లమృతధరమావిహారంబులలరు కురులు, నమృతములు పల్కులు దరంబురమణిగళము
మోవికెంపు చివుళ్ళు సమ్యక్కరములు, హారములు దంతపంక్తిసోయగము లరయ.
ఆ. భ్రమరకములఁ బోలుభ్రమరకముల డాలు, పృథులకుచములొ బయఁ బృథులకుచము
లతనుభామఁ గేరు నతనిభామాకృతి, యులమఁ గొమ్మఁ దెగడు నలరుకొమ్మ. 196
శా. ఆరాజన్ముఖ మావినీలచికురం బాచెక్కుటద్దంబు లా
శ్రీరమ్యాధర మాభుజాలతిక లాసిబ్బెంపుచన్గుబ్బజో
డారోమావళిపొంక మానడలయొయ్యారంబు వీక్షింప న
మ్మారుండైనను దానిసంగతికిఁ బ్రేమన్ బంటు గాకుండునే. 197
తే. అదియుఁ దల్లికి జనియించి నది మొదలుఁగ
సంగమాపేక్ష లెలకెక్కి చాలఁ దివురు
నంత నుపకాంతసంగతి యబ్బెనేని
యాకసము తూఁటు వొడుచుకయైనఁ జనును.
సీ. కలికిచొక్కటంపుబెళుకుచూపులు ముద్దు, కనుబొమ ల్జంకించుకొనెడు హొయలు
కలయికమాటలఁ గరఁగించు చెలువంబు, లాస పుట్టఁగ నవ్వునట్టి నేర్పు
తేలించి చేతులు ద్రిప్పెడు పొంకఁబు, హర్షించి తాను చుక్కనెడు సొబగు
చిన్నెలపసఁ జూపి సన్నఁ జేసెడితీరు, ముక్కుపై వ్రేలిడి చొక్కునగలు
తే. నలుదగుబ్బలఁబయ్యెద వైచు కేవి, నఱకు మెట్టెలరొదవిన నడుచు సొబగు
విను త్రిలోకములందుండు వెలఁదులందుఁ గానఁబడ దెన్నటికి నైనఁ గమలగంధి.
తే. అదియుఁ గ్రొవ్వున వీఁడు వాఁ డనక చొచ్చి
టెక్కు గలవాని రూపుసొం పెక్కువాని
బలము గలవాని రతులఁ జేర్వాడి వానిఁ
గనిన విడువదు వానితోఁ గలసి కాని. 200
వ. ఇట్లు ప్రతిదినప్రవర్ధమానానూన మోహాతిరేకంబున నన్యమానవవితానమీనకేతనా
యోధనాధీనమానసాంభోజయై యయ్యంభోజనయన విజృంభించి మెలంగుచున్న
యనంతరంబున. 201

చ. ఒకఁడు కిరాతదేశమున నుండెడు కోమటిపోలిశెట్టిపు
త్త్రకుఁడు హిరణ్యనామకుఁడు తండ్రి యదల్చిన నల్కతో సఖి
ప్రకరము గొల్వఁగా సుకృతిపాటవ మొప్ప మహానదుల్ నిధుల్
సకలముఁ జూడఁ గోరి చనె స్వైరయానమునన్ ముదంబునన్. 202

వ. ఇట్లు చని చని. 203

ఆ. బదరికాగుహేతుకదళికాచంపక, నహుషదేవదారునైమిశములు
దండకావనంబు దనరు వింధ్యాటవి, యాది యగుమహావనాళు లరసి. 204

సీసమాలిక. గంగ సరస్వతి కాళింది గౌతమి, చిత్రోత్పల విశాల శివ చంద్ర
భాగ కావేరి విపాశ సితాలక, శీలలవాహిని సింధు సరయు
గిరి విరావతి గండకి దశార్ణ కృష్ణవే, ణిక శంఖమాల దేవిక తృణఘ్ని
బహుళ విశాఖిని బ్రహ్మభాగ సురస, వాలుకావాహిని వర్ధమాన
శోకావధూతపినాకిని ఋభుతామ్ర, పరి పలనితామ్రనతి విత్రదు
నర్మద బాహుక నంద చిత్రరథ యుత్ప, లావతి కపిల మాల్యవతి త్రిదివ
లక్షణ హరిణి కలాంగలిని త్రినామ, ద్యుమతి కుముద్వతి తుంగభద్ర
ఋషిత జితాపగ ఋజ్వాభద్ర సునంది, భృగుపర గండకి భీమరథి మ
హాజల గోమతి హంసావళీశ్వర, గండక హరిగండక శతభద్ర
బ్రహ్మగండిక నీల పద్మావతీ శాన, తి హిరణ్యశాఖావతి హిమక్రౌంచ
హరితల మానస హంసకంబు సుమేఘు, సౌభద్ర కౌశికి చక్రధార
శ్యామ మహోత్కట సోమ మహావక్త్ర, శాక్లి ప్రాశావతి చంద్రము క్త
పంచగంధ్యరుణప్రభాంజని పలరవ, ఐంద్రవాలుక శూక వరుణవక్త్ర
పంచమహామాయి ఫల్గుణి సురకన్య, ఘనమస్మతి విత స్త నంద్రవక్త్రి
స్కందావతి సమూల చక్షుక దంబక, పుండరీక పయోష్ణి భూతి పాద
కూట వైఘయుఁ జిత్రకూట వేదవతి న, క్రవతి వేగవతి వేత్రవతి గర్భ
వతి యింద్రనందియుఁ గృతమాలకృష్ణపా, దజయంత పందశాతాక్ష్య శుక్తి
మతి హరిధృతి సువర్ణతటీ మణిప్రభా, ప్లక్ష కుజల పిప్పల శుచి సింధు
వర్ణ కౌస్యపి మణికర్ణిక మందాకి, ని మలప్రహారి సానుమతి క్షీర
కామోదకీ సఖీమోమిత కరతాల, వేదత్రయి మయూఖ విలయ విదిత
భవనాశనియు సర్వపాపహ కటికక్షి, పోత్రిదవేదస్మ జంబూర కుంభ
కరణి త్రిసంధ్యయు గాయత్రి ఋషికుల్యా, ప్రభ విష్ణువు వికూట రత్నకృష
తోయపాపఘ్ను విద్యుత దౌర్గ్యసగ్వదా, వైరద్విషిద్యుతి పందవార
శీఘ్రోదయుఁ ప్రణీతచెయ్యేరు గుండ్లక, మ్మయుఁ గుంద మొదలుగా మహిఁ దనర్చు

తే. పుణ్యకూలంకషాబ్బ్రందము లన మంద, వికస దరవింద గంధిల విమల కమల
ఝరరవంబుల నురుభక్తి జలక మాడి, సకలదానాదిసత్క్రియల్ సలిపె నంత.

తే. శార్ఙ్గకోటి గదాకోటి శంఖకోటి, చంద్రకోటి శిరఃకోటి చక్రకోటి
సిద్ధకోటి మహాకోటి చిత్రకోటి, పుణ్యకోటి ధనుఃకోటి ముక్తికోటి. 266

తే. పద్మసర సీంద్రసరసిని బ్రహ్మసరసి, శుభ్రసరసి మహాసర సభ్రసరసి
గృధ్రసర సీందుసరసి నిక్షీరసరసి, మానససరసి నన్నిఁట స్నానమాడె. 267

సీ. స్వామిపుష్కరణిలో స్నానంబు గావించి, శశిపుష్కరణి నీళ్లు చల్లులాడి
చంద్రపుష్కరణిలో జలకంబు ఘటియించి, సోమపుష్కరణిలోఁ జొచ్చి పొరలి
గుహాపుష్కరణి నీత కొమరొప్ప నొనరించి, యమృతపుష్కరణిలో నాడి వెడలి
నిత్యపుష్కరణిలో నీళ్లాడి చిత్రపు, ష్కరణిలో స్నాతకక్రమము జూపి

తే. శంఖపుష్కరణిని గ్రుంకి చక్రపుష్క, రణి మునిఁగి దేవతాపుష్కరణిఁ దోలంచి
ష్కరణిని దూఁకి సేతుపుష్క, రణిని మజ్జనమాడి సరాళముగను. 208

సీసమాలిక. మత్స్య కూర్మ వరాహ మాండవ్య నరసింహ, రామ పరశురామ రామవామ
న మహేంద్రచక్ర గోనారద శంఖపాం, డవ శార్ఙ్గి పత్న్యగస్త్య విజయ జయ
కపిల వసిష్ఠ మార్కండేయ భృగు జహ్ను, వాయుముని బ్రహ్మ వరుణ విష్ణు
ధర్మ పరాశర దామోదర కంపజ్వల శుక గౌండిన్య గాలవ హిరణ్య
వసు కృష్ణ శాండిల్య వజ్ర కౌశిక ధనం, జయ ముక్తిదేవర్షి సర్వపిప్ప
ల సరస్వతీ ముద్గల భరత పర్వత, పరమకాశ్యప శేష పంచగోప
రైభ్య భరద్వాజ శైభ్య తుంబురు గౌత, మ జటిల భార్గవ మాధవ గురు
భాభ్రవ్యపుణ్య గోపాల ముకుంద త్రి, విక్రమ సౌర గోవింద మోక్ష
కు ల్యాచ్యు తామృత గోమద సురకృప, నారాయణ మను జనార్దన హరి
వైకుంఠ కేశవ వాసుదేవ పతంజ, రి జరథ ధన్వంతరి కురు భోగ
పావన శ్రీధర పావన ప్రద్యుమ్న, పురుషోత్తమ పరమపురుష సిద్ధ
పాతకనాశన పాపహార జ్యోరు, విమతి భాస్కర మధుకమల సోమ

ఆ. నామధేయములను భూమిలో సార్థత్ర, కోటితీర్థములను మేటి వనఁగఁ
దనరు నట్టినూఁటయెనిమిది తీర్థాల, స్నానదానవిధులు సలిపె నంత. 209

క. తిరుకొళము నూతలోటయు, చెరువు మడువు లొండు కుంట చెలమ వడియకో
నెరు బుగ్గ చాఁగు దోనతల, పరిగుండము కాల్వ డిగ్గ బావి దొరువులన్. 210

సీ. సంకల్పములు సెప్ప సాగు బ్రాహ్మణు లుండ, భైరవార్ఘ్యం బిచ్చి భక్తితోడ
స్నానంబు గావించి సంచిమాత్రము దక్కఁ, గలధన మెల్ల బాపల కొసంగి

కపిలగోఘృతములు గ్రముకపర్ణంబులు, గుడములు ఫలములు గుగ్గిలములు
గానుక ల్వత్తులకట్టలు పూలసరాలు గైకొని మోదరసముఁ జిల్క
తే. నార్ద్రివస్త్రంబు లంగంబు లంటఁ గడఁకి, కోసుచు నమ్రత నడుగడుగునకుఁ బెద్ద
మాట గోవింద యనుచునుమాఁటమొనిమి, దితిసుపతులలో స్వాములఁ దెలియఁజూడ.
వ. మఱియుఁ దలంచి చనిచని. 212

మంజులగతిరగడ. శ్రీవైకుంఠక్షేత్రంబునఁ దగు, వాసుదేవునకు వందన మొనరించి
యామోదస్థలియందలి సంకర్షణునకుఁ గర్పూరాచ్ఛాదనములు నిడి
సరవిఁ బ్రమోదస్థలమునఁ జెలఁగిన, ప్రద్యుమ్నునకును బ్రణతి యొనర్చుచు
సమ్మోదాఖ్యస్థలమున నుండెడు, ననిరుద్ధునకు సమారాధన మని
సత్యలోకమున సతముగ నెనసిన, విష్ణువునకు గోవిందలు సల్పుచు
సూర్యమండలము సొంపుగఁ బ్రబలిన, పద్మాక్షునకుఁ బ్రపత్తి వహింపుచు
క్షీరాబ్ధిస్థలి శేషశయనునకు, హాస్తస్వస్తిక మనువందింపుచు
శ్వేతద్వీపక్షితిఁ బ్రభవించిన, తారకహరికిని దండము లొసఁగుచు
రమణబదరికారణ్యం బందలి, నారాయణునకు నమ్రత లొసఁగుచు
నైమిశపుణ్యవనంబునఁ బొందిన, హరికిని మంగళహారతు లెత్తుచు
దనరు హరిక్షేత్రంబున నెలకొను, సాలగ్రామస్వామి గణింపుచు
బొసఁగ నయోధ్యాపురిలోఁ జెలఁగెడు, రఘునాయకులకుఁ బ్రణిపాతము లని
మధురాపురిలో మహిమలఁ జెందినఁ బాలకృష్ణునకుఁ బ్రాణాచారము
మాయాస్థలిలో మధుసూదనునకు, నిరతం బల్లో నేరేళ్లను కొని
కాశీస్థలిభోగశయానునకును, నమరఁగ నూర్ధ్వశయంబుఁ జొనుపుచును
దలఁప నవంతీస్థలిలో నవసి, పతిదేవునకును బ్రాంజలు లిడుచును
ద్వారవతీ యాదవకులభర్తకుఁ, దాళహస్తములు దప్పక కొట్టుచు
వజ్రపురిని దావలమై చిక్కిన, గోపప్రియునకు గొబ్బిళ్లనుచును
వసతిగ బృందావనమున నిలిచిన, నందాత్మజునకు నతు లొప్పించుచు
నలరఁగఁ గాళియహ్రదతలమునఁ గల, గోవిందునకును గొండీ లెన్నుచు
గోవర్ధనమునఁ గొలువై కన్పడు, గోపవేషునకుఁ గొణిగె లొనర్చుచుఁ
దనరు భక్తలోచనము భవఘ్న, స్వామికి భక్తస్తంభనఁ బట్టుచు
మహిమ వెలయ గోమతపర్వతమునఁ, జేరినశౌరికి సేవ లటంచును
రమ్యహరిద్వారమునఁ బ్రసన్నం, దైనజగత్పతి కభివాదన మని
చాలబ్రయాగస్థానమ్మునఁ గల, మాధవునకు సన్మానకరంబులు
గయలో సాక్షాత్కారము నొందు గ, దాధరునకు జోతలు చెల్లింపుచు

గంగోదధిసంగస్థలిఁ జెలఁగిన, శ్రీవిష్ణువునకు జేజేలాగుచుఁ
జిత్రకూటమున సేమం బందిన, రాఘవునకు నేత్రనిమీలన మని
నందిగ్రామమునను జెలువొందిన, రాక్షసఘ్నుఁ డగు రామున కెరగుచు
సరవిఁ బ్రభాస్థలి సంచారుం డగు, విశ్వరూపునకు వినుతులు సేయుచు
శ్రీకూర్మస్థలిఁ జేకొను కూర్మ, స్వామికిఁ బుష్పాంజలు లర్పించుచు
నీలాచలమున నెలకొను పురుషో, త్తమునకు హాణిగలు దండిగఁ జేర్చుచు
సింహాచలమున జెంయు మహాసింహాకారునకు జోహారులు నెరపుచుఁ
దులసీవనమునఁ దులకించు గదా, ధరునకుఁ జర్యలు తఱుచుగఁ గఱపుచుఁ
గృతశౌచస్థలిఁ గేళిక లొందెడి, పాపఘ్నునకు సపర్యలు సలుపుచు
శ్వేతాద్రిస్థలిసింహాలోచనున, కెలమిని గేకిస లిచ్చుచు భక్తిని
ధర్మపురక్షేత్రము యోగానం, దస్వరూపునకు దాస్యము సలుపుచు
శ్రీకాకుళమున సిస్తుగఁ దోఁచిన, యాంధ్రనాయకున కర్చన మనుచును
ఘనత నహోబలగరుడాద్రిహిర, ణ్యాసురవధునకు నతిజోబిళ్లని
పాండురంగమునఁ బాటిలు విఠ్ఠల, దేవునకు సదా దిగ్విజయము లని
వేంకటగిరిపై వెలసిన తిరువేం, గడముడయానులఁ గాంచి నమస్సులు
యాదవపర్వత మందలి నారా, యణునకు జయజయ లావర్తింపుచు
ఘటికాచలమునఁ గల్గు నృసింహుని, గృపణత్వంబునఁ గీర్తన నడుపుచు
వారణగిరిపై వరదస్వామికిఁ, బిడికిలింత లని పెంపుగ నొడువుచుఁ
గాంచీపురిలోఁ గమలాక్షునకును, మోదముతోడుత ముకుళితకర మని
యొప్పున నుండు యథోక్తస్థలము య్యథోక్తకారునకు దోయిలి దీర్చుచుఁ
బరమస్థలిలోఁ బరమేశ్వరునకుఁ, గర మర్థింపుచుఁ గన్నుల మ్రొక్కుచుఁ
బాండవభూస్థలిఁ బాండవదూతకు, వలయు బాహువులు వైపునఁ దీర్చుచు
విక్రమస్థలిఁ ద్రివిక్రమహరికిని, సారెకు సారెకు సాగు భళా యని
కామాళికిలో గణుతికి నెక్కిన, శ్రీనృసింహునకుఁ జేతులు మొగుపని
యష్టభుజస్థలి నష్టభుజునకును, జిత్తము రంజిలఁ జిన్నిపువ్వు లని
ప్రవాళస్థలిని బ్రవాళవర్ణునకు, నమర నమోనమ యని వర్ణింపుచు
దీపాభస్థలిదీపాభునకును, మోహముతోడ నమోవాకం బని
రాజిలు గృధ్రసరస్తీరస్థలిఁ, గలుగు విజయరాఘవునకు శరణని
రసికతవీక్షారణ్యశయానపు, వరరాఘవులకు వరపుకరం బని
తోతాద్రిస్థలిఁ దుంగశయాన, స్వామికి నిత్యోత్సవములఁ బనిగొని
యలరు గజస్థలమందు గజార్తి, ఘ్నునకు శయద్వయిఁ గోలాటం బని

బలిపురమందుల బలియు మహాబల, దేవున కిదిగో తిరువారాధన
భక్తిసారమునఁ బ్రబలు జగత్పతి, కిని సంధించిన గిడిగిల్లో యని
యైంద్రస్థలమున నవతారముగొను, దేవదేవునకు ధృతహృత్పుటములు
గోపపురస్థలి గోపదేవునకు, నెలమిఁ బ్రదక్షిణ మేగెద గొబ్బున
శ్రీముష్ణస్థలిఁ జెలఁగు వరాహ, స్వామికిఁ జేర్చెదఁ జంకలఁ జేతులు
మహితస్థలమున మసలక పొదలెదు, పద్మాక్షునకును బడుబాటలు వడి
శ్రీరంగస్థలి శేషశయనుఁ డగు, రంగస్వామికి రహి మ్రొక్కెద నని
శ్రీరామస్థలి సీతాప్రియునకు, మానక యెప్పుడు నమస్కారము లని
శ్రీనివాస మను క్షేత్రంబునఁ గల, పూర్ణమూర్తి కిదె పొరిఁ బూజింపని
స్వర్ణమందిరసువర్ణస్వామికిఁ, గేరుచు జరిపెద గిడిగిల్లనుచును
వ్యాఘ్రపురస్థలియందు మహాబా, హుస్వామికిఁ గేలోసఁగెద హితముగ
నాకాశనగరమం దనువొందెడు, హరిమూర్తికి నిదె యప్పాల్ దిరిగెదఁ
బరఁగ నుత్పలావతగస్థానం, బందలిశౌరికి నారాధన మని
మణికూటస్థలి మలయు మణిప్రభు, పెరుమాళ్లకుఁ గడుఁ బింపిల్లాడుచు
విష్ణుపురంబున విలసిల్లుమహా, విష్ణుస్వామికి వెన్నెలకో లని
భక్తిస్థానము భక్తిప్రదునకుఁ, బొసఁగఁగఁ జేసెదఁ బొర్లుదండములు
శ్వేతప్రార్థన క్షేత్రం బందలి, శాంతమూర్తికిని సంసర్గంబులు
నగ్నిపురస్థలియందు మురద్విషు, నకు నొనరింతుఁ బ్రణామము లూకొని
భార్గవతలమున భరతస్వామికిఁ, గీలించెద లంకెగఁ గేల్మొడితలు
వైకుంఠపురీవాసుండై తగు, మాధవునకును నమస్కృతిఁ బేర్కొని
పురుషోత్తమునకుఁ బొల్పుగ భక్తిస, భాస్వామికి నిజకైంకర్యం బని
చక్రతీర్థసంచారిసుదర్శన, దేవుఁడె మదిఁ బ్రార్థించుచు నంతటఁ
గుంభకోణమునఁ గొనకొని కదలని, శార్ఙ్గధరు నుపాసనఁ జేసెద నని
భూతస్థానము పురమును నెళవగు, శార్ఙ్గస్వామికిఁ జాగుబడికె లని
యరయఁ గపిస్థలమందలి దంతా, వళవరదునకు సివాళికరము లని
చైత్రకూటమున సరసతఁ గొల్వగు, గోవిందునకును గొల్పెదు చేతులు
నుత్తలతలమున నుత్తమహారికిని, ఘనతరభక్తిని గైలాటము లని
శ్వేతగ్రావక్షేత్రంబునఁ గల, పద్మలోచనునిఁ బ్రస్తుతి సేయుచుఁ
బార్థస్థలమున బాగ వసించు ప, రబ్రహ్మమునకు రామురాము లని
కృష్ణకోటి యను క్షేత్రము లోని మధుద్విషునకు నిదె తొంగలిపాట్లని
నందపురీశ్వరనందను మహా, నందునకును శరణార్థి ఘటింపుచు

వృషపురస్థలిని విడియు విపాశ్రయ, దేవుని కిదిగో దీవనకో లని
కడక సంగమగ్రామం బందలి, సంగమస్వామికి సాగిలింత లని
తనరు శరణ్యస్థలము శరణ్య, స్వామికి నిదె కైవారపుచెయ్యని
చెన్నగుసింహక్షేత్రమహాసిం, హస్వరూపునకు హస్తార్పణ మని
మణిమంటపమున మల్లరిసామికిఁ, బొందించెద గోవింద లటంచును
నిబిడస్థలిలో నిబిడాకార, స్వామికి మతిఁ గైచాపు లొసంగుచు
ధానుష్కస్థలిఁ దలఁకొను జగతీ, శ్వరునకుఁ బెట్టెద సరిటెంకణ మని
మాహురమందసమానతవిడిసిన, కాలమేఘునకుఁ గైమోడుపు లని
చక్కని మధురాస్థానమ్మునఁ గల, సౌందరరాజస్వామికి మేలని
యనిశంబును వృషభాద్రిని యళఘురి, పేరిటిహరికిని బేడిస లెన్నుచు
వరగుణస్థలవ్యాపకుఁ డగు నా, థస్వామిని బరధ్యాన మొనర్చుచుఁ
గురకస్థలమునఁ గూర్చున్నరమా, సఖుని మంత్రిపుష్పము లిడి వేఁడుచు
గోష్ఠిపురస్థలి గోష్ఠిపురస్వా, మికి నర్చించెద మేలుకొల్పు లని
దర్భసంస్తరస్థానంబందు నె, యానదాశరథి కతికై విష్కృతి
ధన్విమంగళకతలమున నెలకొను, శౌరికిఁ దగు పరిచర్య లొనర్చుచు
భ్రమరస్థలమునఁ బరఁగు బలాఢ్య, స్వామి సలా మని సత్కార మెత్తుచు
ధరణిఁ గురంగస్థలమందలిపూ, ర్ణస్వామి నివారణమునఁ గొల్చుచు
నవనిపటుస్థలమందలివిష్ణు, శ్రీమూర్తికి నిదె చెంగనలో యని
క్షుద్రనదీస్థలి శోభిలుచుండెడు, నచ్యుతునకును శిరోవనతులు నిడి
యంత ననంతశయనమంగుండెడు, పద్మనాభునకుఁ బాణిమోడ్పు లని
ధృతి నూటెనిమిది తిరుపతులందుల, నవతారంబుల నలరఁగ వెలయుచుఁ
గృపతో మము రక్షించెడు స్వామికి, సలుపుదుఁ బదివేల్ సాష్టాంగంబులు.

వ. అని ప్రపత్తిపూర్వకంబుగా నష్టోత్తరశతతిరుపతులు సేవించి యంత. 214

సీసమాలిక. అభిషేకవల్లి మోహనవల్లి విద్రుమ, వల్లి చంపకవల్లి వజ్రవల్లి
మకరందవల్లి కోమలవల్లి మాణిక్య,వల్లి చందనవల్లి పచనవల్లి
జంబూరవల్లి కాసారవల్లి వసంత,వల్లి శోభనవల్లి వసుధవల్లి
మరకతవల్లి నిర్మలవల్లి మౌక్తిక, వల్లి కస్తూరికావల్లి గంధ
వల్లి విభ్రమవల్లి వర్తులవల్లి వ,రిహావల్లి నిక్షేపరాజవల్లి
యుంబుజవల్లి విహారవల్లి వినోద, వల్లి నిత్యోత్సవవల్లి చిత్ర
వల్లి మనోహరవల్లి కేతకివల్లి, సారంగవల్లి కర్పూరవల్లి
కల్యాణవల్లి శృంగారవల్లి మనోజ్ఞ,వల్లి నాయకవల్లి స్వచ్ఛవల్లి

సౌభాగ్యవల్లి కేసరవల్లి మాధుర్య, మాలతీవల్లి సామ్రాజ్యవల్లి
మంజులవల్లి సంభ్రమవల్లి శుకవల్లి, నర్తితవల్లి యానందవల్లి
కేయూరవల్లి కోకిలవల్లి సుందర, వల్లి సుమంగలవల్లి మదన
వల్లి సరసవల్లి వైభవవల్లి కి, సలవల్లి రుచివల్లి చారువల్లి
కౌతుకవల్లి శర్కరవల్లి వికసిత, వల్లి మండనవల్లి పరమవల్లి
హాసవల్ల్యమృతవల్లి యనురాగవల్లిక, సుమవల్లి సుఖవల్లి శుభ్రవల్లి
చంచలవల్లి భూషణవల్లి సుకుమార, వల్లి వనజవల్లి వామవల్లి
రంగవల్ల్యకలంకరత్నవల్లియు శ్యామ, వల్లి కుండలవల్లి వకుళవల్లి
విచికలవల్లియు వేదవల్లియుఁ బెరుం, దేవివల్లియు భూమిదేవివల్లి
యలమేలుమంగ తాయారును బీబినాం, చారు శ్రీరంగ నాంచారుతాయి
కొమరొందు శ్రీచూడికుడుత్తనాంచారమ్మ, చెలువొందుచుండెడు శ్రీపిరాట్టి
నం దగుపేళ్లఁ జెన్నొందు దయాన్విత, సీతాభిధాన లక్ష్మీస్వరూప
తే. ములను నూటెన్మిదితిరుపతుల వసించు, విష్ణుమూర్తులతోఁ గూడి వివిధగతుల
ననుపమవిహారములమించు నమ్మవార్ల, పాదపంకజముల కతిభక్తి మ్రొక్కి. 215
సీ. వారక పొయిఘూళువారుల గొనియాడి, వరల భూదత్తాళువార్లఁ గొలిచి
ధీరతఁ బేయాళువారల దర్శించి, పెరియాళువారల పేరు దలఁచి
నమ్మాళువారల నెమ్మదిలో నిల్పి, తిరుమంగయాళ్వారిఁ దెలియఁ జూచి
తిరుమళిశయాళ్వార్లఁ బరికించి మఱి తొండరడిపొడియాళ్వార్లఁ గడిమిఁ బొగడి
తే. వేడ్కఁ గులశేఖరాళ్వార్ల వినుతిఁ జేసి, మఱి తిరుప్పాణియాళ్వార్ల మరుగుఁ జెంది
మధురకవియాళువారుల మాట లెన్ని, నాథమునియాళువార్లకు నతు లొనర్చి.
క. సాష్టాంగ్యమంతం బిదె, వీక్షింపుం డనుచు జూపువిధిని బ్రపత్తిన్
నిక్షేపించి సుమేరున, దృష్టంబుగ నున్నవైనతేయునిఁ గొలిచెన్. 217
సీ. మత్స్యావతార నమస్తే మహాకూర్మ, దేహ నమస్తే వారాహవర న
మస్తే నృసింహ నమస్తే వటో నమ, స్తే భృగుకుల నమస్తే దశరథ
తనయ నమస్తేర్కతనయావిభేదనోద్దండదోర్దండప్రచండవిక్ర
మతిబలోదగ్ర నమస్తే బలానుసం, ఘన నమస్తే బుద్ధ భవ్యరూప
తే. ధరనమః కల్కివేషసుందరసురారి, శక్రముఖదిక్పతిపయోజజాతరుద్ర
సిద్ధసాధ్యాదినుత నమస్తే యటంచు, వివిధవిష్ణుస్థలములు సేవించి వేడ్క. 218
వ. తదనంతరంబ శ్రీశైల ఝిల్లి చక్రేశ్వర మూకాంబికా కోటీశ్వర గోకర్ణ కేదారహా
టకేశ్వర జంబుకేశ్వర బ్రహ్మేశ్వర పుండరీక పంచనదీశ్వ రారుణగిరీశ్వర జటా
నాథ వైద్యనాథ గౌరీనాథ రామేశ్వర శంకర నారాయణ సుబ్రహ్మణ్యస్థలాద్య

ధీశ్వరులగు నీశ్వరులను సేవించి వెండియు మహీమండలిం గలపుణ్యస్థలవిశేషంబు
లం జూచుచు సంచరించు నయ్యవసరంబున. 219

శా. సర్వద్వీపవతీప్రపూరితపయస్సంబంధధారాధరా
ఖర్వధ్వానభయోత్పతిష్ణుబిసభుగ్రాజ్యాద్యకూర్మాదికం
బుర్వీంద్రాయుధపాతభగ్నకుటిలవ్యూహాక్షరద్యాఃపత
త్తర్వాశ్మక్షుభితాహిలోక మగుచుణ్ దర్పించె వర్షం బిలన్.

సీ. నెళనెళధ్వనులతో ఫెళఫెళ మనుగర్జి, తములు కర్ణత్వోభిదాభ మెనయ
ధళధళద్యుతులతో మిలమిల ల్గలమించు, లక్షిబలౌద్ధత్య మడచుచుండ
ఘుళఘుళార్భటులతో ఫళఫళా రనువాన, ధాత్రీరాష్ట్రాది మహార్తినింపఁ
జిటచిటారవముతోఁ దటతట వడగండ్లు, యువరాజముఖ్యుల నొదుగఁ జేయ
తే. విజయవిఖ్యాతి నమ్మహావృష్టిసమయ, మమర వరధర్మవిలసనం బనిలజాత
ఖేలనము కృష్ణఘనయుక్తి చాలఁ గలిగి, యవనిజనములు వినుతింప నతిశయించె.

క. ఆయెడ సఖు లొకఁ డొక్కఁడు, కూయిడి జతగూడ కెడసి గునుకపరువులం
బోయిరి చెంగటియూరుల, కాయూరవ్యఁడు హిరణ్యుఁ డల్లటిగతితోన్. 222

తే. వడఁకు చట భద్రసేన యావాసమునకుఁ, బోయి నేను బ్రవాసి నోపుణ్యురాల
తడసితిని వర్షధారలఁ దాళఁజాల, నేర్పెఱుఁగ నిందు రాసిమ్ము నిద్రఁ జెంద. 223

క. అని వేఁడిన వైదేశికు, ఘనకరుణాదృష్టిఁ జూచి కొమిని పడుకొ
మ్మని ముంగలిచావడిఁ జూ, పిన హా లక్ష్మి యటంచుఁ బేర్కొని యచటన్. 224

చ. తడిసినవస్త్రము ల్విడిచి తాళ్లపయి న్వెస నారవేసి యో
పడఁతుక నీదుపెద్దలకుఁ బల్కఁగ శక్యముగానిపుణ్య మ
య్యెడు నిట కగ్నిఁ దెచ్చి సెగ యించుక చూపు మటంచు వేఁడఁగాఁ
దొడిపడ నట్లొనర్చి యలతొయ్యలియూతనిరూపసంపదల్. 225

తే. మంటవెలుఁగున వేమాఱు మనసు దూలఁ, దళుకు తెలివాలుగన్నుల బెళుకుఁజూచి
యెవ్వ డేగ్రామమం దుండు దేమి పనికి, నెచటి కేగెదు నీదుపే రేమిచెపుమ. 226

క. అనినసఖి కనియె నుండుదు, వనిశంబు కిరాతదేశమందు హిరణ్యుం
డనఁ దగుఁ దనపేరలఁ బు, ణ్యనదీనిధు లెల్ల జూచి యరిగెదఁ బురికిన్. 227

చ. అని వచియించు తైర్థికున కాపవజాయతపత్రనేత్ర యి
ట్లను నహయౌవనంబున రతాస్థఁ దొలంగి కులాబ్జగంధిపైఁ
గనికర మింత లేక తిరుగ న్మనసాగ్గె నటోయి నీకు నా
విని నిజమాను నీపలుకు వే యన నేల వివాహహీనుఁడన్. 228

తే. ఆలికే నంగలార్చుచు నన్యసతుల, జూచి గ్రక్కున్న ద్రుంగుచు సుఖము లేని
కతన యాత్రం జరించెడికతయె కాని, మనసు సంభోగవాంఛల మఱిగి తిరుగు. 229

చ. అనుపరదేశికుం గని సుహాదరణంబున లేచి కౌఁగిటన్
నును జిగిగబ్బిసిబ్బెపుఁజనుంగవ నాటఁగఁ జేర్చి మోహముం
బెనుకఁగ మోవి నొక్కి మురిపెంపుఁ దార్చిన వాఁడు పేర్చుచుం
డినతమిచేతఁ దద్రతికి శీవి సమున్ముఖుఁడై ముదంబునన్. 230

తే. గుబ్బ లనునట్టు లూఁతఁగాఁ గొని మనోజ, కేళికావార్ధిలోపల నోలలాడు
చుండె నవ్వేళ దానినాథుండు వచ్చి, యెవరు వా రని ఘర్షించి హెచ్చరింప. 231

క. ఆసమయంబున నెటులై, భాసురమతిఁ బొంకపలుకుఁ బలుకంగఁ గదే
యోనుదతీ యని యడిగిన, నాసఖి యిది తెలియ దనుచు నటుమొగ మయినన్.

తే. హంస హేమావతికి నిట్టులనియె వేడ్కఁ దెలియకుండిన నేమాయెఁ దెలిసికొనుము
వింటివా సతి ఘర్షింపవిటుఁడు ఏడఁక, వెఱపకు మటంచుఁ జెలి వానివెన్నుఁ జఱచి.

ఉ. కీలెలుఁగున్ ఘటించి పరికింపక పండుకయుండి పల్కె యా
త్రాలసదుర్విచారులము రాత్రిజనించిన నేఁడు తావకీ
నాలయమందు మే మిదె సుఖాప్తిని సుప్తి యొనర్చి రే పుపః
కాలమునందుఁ బోయెదము కారుణికోత్తమ పండరియవే. 234

తే. అనిన మంచిది యని లోని కరిగె నాథుఁ, డరిగినది చూచి సఖి లేచి యంతలోన
బంటితో నీళ్ళు పట్టుక యింటిలోకిఁ బోయి రేఁడుంటి వీసరి ప్రొద్దుదనుక. 235

క. ఒక్కతనె గ్రక్కుమిక్కని, దిక్కడసినరీతి నుండి తెరువరు లెవరో
యిక్కడికిఁ బంపవచ్చిన, నక్కటఁ ప్రాణమ్ము లుండె నధిపా యనినన్. 236

ఆ. నిండినింటిలోన నీకేల భీతిల్ల, గోల యూరఁ బ్రొద్దు గ్రుంకలేద
టంచుఁ గౌఁగిలించి యనుమాన మొందక, యోర్పుతో సుఖాప్తి నుండెఁ జెలియ.

శా. ఈలీలన్ వెస బొంకనేర్చిన నృపత్యేకాగ్ర మాఢామశీ
కేళీసంభ్రమభూమిపాలసురతక్రీడాచమత్కారచ
ర్యాలాలిత్యకథాప్రయత్నమున కత్యాసక్తితోఁ బొమ్ము లే
దా లోలాంబక యూరకుండు మని కాదంబేంద్రుఁ డిట్లాడఁగన్. 238

చ. తెలతెలవారవచ్చుట సతీమణి యప్పుడు చూచి కేళికా
నిలయముఁ జేర నేగి ధరణీధవుపైఁ దమిమీఱి నుండెనా
చెలి యనుచుం బురోహితుఁడు చెప్పిన నాత్మజనించువేడ్క నా
నలనరపాలవశాళి తదనంతరగాధ వచింపుమా యనన్. 239

శా. రక్షశ్శిక్షకరక్షయక్షయన్నపాధ్యక్షా సదాక్షేమకృ
ద్వ్యక్షా రక్షితశుభ్రపక్షహయదార్ధ్యక్షాఖ్యముప్రారిస
ర్వ్యక్షా యన్యనిలాక్షరాక్షసజలాధ్యక్షాగ్నివాయుఃక్షపా
ధ్యక్షేక్షార్భకపద్మరక్షకరమాధ్యక్షారవిందేక్షణా. 240

పాదభ్రమకకందము. రామానుతతనుమారా
ధీమదనవధీనసానధీనవదమధీ
తామసజయయజసమతా
నామగతాఘనయతతయనఘతాగమనా. 241

మణిగణనికరవృత్తము. హరిహయహరిణాభ్యుదయసభరణా
హరిహయహరిణాస్యదనువిభరణా
నరవరవిగమననినుతిచరణా
నరవరవిగమనవిమలకిరణా.

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవిత్రాయ్యలరాజాన్వయసుధావార్ధిపూర్ణిమా చంద్ర నిస్పృహాయుకవిత్వనిర్మాణచాతుర్యనిస్తంద్ర శ్రీరామనామపారాయణనారాయణామాత్యప్రణీతంబైనహంసవింశతి యనుమహాప్రబంధమునందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

# హంసవింశతి

## పంచమాశ్వాసము.



ధర ధరధర నిరధా
రాధరసఖపర్ణ సమదరావణమకుట
క్షోధగచరశర విబుధా
రాధిత కరుణాభిరామ రఘుకులసోమా.

వ. అవధరింపుము నలరాజన్యునకుఁ బ్రత్యుత్పన్నమతి యిట్లనియె నట్లు ప్రభాతంబుగా వచ్చిన నిజమందిరంబు చేరి మరునాఁడు దినాంతం బయినయనంతరంబ హేమవతీ కాంత యత్యంతసంతోషంబున. 2

సీ. నిటలాధరీకృతస్ఫుటచంద్రకళలీల, నెలవంక నామంబు నీటు గులుక
మరుదాప్తిరేఖగా నెలయు పద్మరజంబు, వలె వక్త్రఘువసారతిలక మమర
నంతస్థనృపవిరహాగ్ని పైఁ బర్వీన, గతి గుబ్బకుంకుమకలప మమరఁ
జిగిరించి పూచినచిన్నారిలత రీతిఁ, జిత్రపట్టాంబరగాత్ర మమరఁ

తే. గనకసుమదామఘుమఘుమల్కాచములందుఁ, గంబురాపూఁతభుగభుగల్గళమునందు
నంద మొందంగ వాసింప హంసమున్న, నెలవునకుఁ జేరె సాతానియలరుబోఁడి.

తే. చేరినప్పుడె కలహంసశేఖరుండు, తవిరి హేమవతీకాంతదిక్కుఁ జూచి
వేడుకలరంగ నొకగాథ వింటివేని, చెప్పెద నటన్న మంచిది చెప్పు మనిన. 4

వ. హేమావతికి హంసం బిట్లనియె. 5

### పదునేడవరాత్రికథ.

పరఁగు నొకపురము రత్నా, భరణంబనఁ దరణికిరణపటలీసంరో
ధ్యురుసౌధస్థిరకేతూ, త్కరచిత్రపటాంశుచిత్రితద్యుతలం బై.

తే. తనయుఁ డగురాజు ఘనమార్గమునఁ జరింపఁ, గోట యాత్రోవ నరికట్టుకొన్న సుద్ది
విని జలధి దానిచుట్టును విడిచె ననఁగ, నాగసాలనిమ్ము ఖేయంబు దనరు. 7

ఉ. అందొకకుంభకోణకమహాన్వయమండలదుగ్ధవార్ధిపూ
ర్ణేందుఁడు చక్రదాసుఁడన నెన్నిక కెక్కిన పేరుఁగల్గి చె
న్నొంది మనోహరాంగరుచిరాకృతిసంపదచేత నిందిరా
నందనుఁడే యితండగు ననందగి కాఁపుర ముండు నెప్పుడున్.

ఆ. సలుప కడవరాయి సారె కలాసంబు కట్టెయిసుము జల్లి కడవ ముల్లు
మంటిముంత గుబ్బవ్రాను నావంబును, మన్ను మోయఁ బోఁతు మలయుచుండు

సీ. ఆదివరాహంబు మేదిని నెత్తిన, మాడ్కిఁ జొప్పడఁగఁదా మన్ను మోయుఁ
బ్రథమవేళలసృష్టి బ్రహ్మచేసినయట్లు, ఘటకోటు లుత్సాహగరిమఁ జేయు
విష్ణుచక్రంబు వేడుకఁ ద్రిప్పెడు, చాట్పునఁ బలుమారు సారెఁ ద్రిప్పు
బయలిపురంబులు భర్గుండు గాల్చిన, చందంబు సూపట్ట నావంబుఁ గాల్చుఁ

తే. గపివరుఁడు పర్వతంబులు గమిచి తెచ్చి, కప్పలిడుఁ రీతిఁ గుండలు కుప్పవెట్టు
నవిదివియు ధాతకాండంబుఁ లడఁచు నరణి, సాధుపదవర్తిఘటకారచక్రవర్తి.

తే. కాఁగు మజ్జిగముంతయుఁ గడవ గూన, బాన వెసలయు బుడిగెలు పరవుచట్టి
కడవముంత కరిగెదుత్తి పిడతగురిగి, కుండె లటికయు మూఁకుడు బిందె ప్రమిదె.

చ. చెవులపెనంబు గోలమును జిల్లులసిబ్బియు దోనితొట్టియుం
గువిచిలుమూఁతమూలయును గుమ్మెత యందవుధూపపాత్రమై
సవరని బూజిపెందొనయు సానికెయొప్పు కమండలంబు వే
డోపతెపకంబిదుత్తె నెరదుల్చియుఁ గప్పెరపంటు లాదిగన్. 12

తే. తీర్థపూరెలు కులుకులు త్రేటగట్లు, గరలమురువులు పడికట్లు కిరుదుకట్లు
బొద్దుటీనలు నునువులు మొదలుగాఁగఁ, బనులు నిర్మించుఁ గుండలపైనతండు. 13

సీ. దేవకార్యములకుఁ దిరునాళ్లకును మహో, త్సవములకును గంగజాతరలకు
సంప్రోక్షణములకు జన్నములకుఁ బెండ్లి,వడుగునోములకును వ్రతములకును
సత్రంబులకు సహస్రంబులకును సమా, రాధనపితృకార్యయాగములకుఁ
బండుగులకు నాలపంబులకును బొంగ,లికిని దేవలకు గొబ్బికిని నడరు

తే. జంగమార్చనలకు బాలదాసభోగ, నములకును దండు వెట్టికి నగరివారి
కొండబక్కలకును భిక్షుకులకు నైనఁ, గొఱఁతపడకుండఁగుండ లాకుమ్మరిచ్చు. 14

క. ఒకపాటికలిమిచేతను, గకపికపడ కప్పులేక కనకాభరణాం
శుకముల గరగరికల నిం, చుక తక్కువగాక నతఁడు సుఖమున నుండున్. 15

క. అతని కొక్కకులాంగన, శీతాంశునిభాస్య రూపసేనాఖ్యను వి

ఖ్యాతిని వెలయును గంతుని, చేతఃజగాచాఁకసంగ జిగిబిగిసగతోన్. 16

ఆ. ఘనము ఘనముకన్నఁ గచసైల్యవిత్పూర్తి, మెఱుఁగు మెఱుఁగుకన్న మేనిచాయ
విపుల విపులకన్న నుపమింపఁ గటితటి, దాని కెనయె భూమిలోనిసఖులు. 17

ఉ. పోఁకలరీతి నొంది మెఱుపు గ్గాని మిట్టలు గట్టి పైమెవల్
జోకుఁగఁ దీసి తాళములచొప్పనఁ గన్పడి చెడ్డవైఖరిన్
దీకొని యొప్పి గిండ్లపగిదిం గొమగొప్పఁ బసిండిమందపై
వీఁకను దండనుండి యలివేణికుచంబులు పొల్చు నెంతయున్. 18

పంచశరాహితుండికుఁడు భామిని పొక్కిలిపెట్టెలోనఁ దా
నుంచినకాలసర్పము సమున్నతి నాడఁగ శేవ మీఱు బు
స్సంచుఫణాగ్రమొత్తి యలరారెడుచాడ్పున రోమరాజి య
భ్యంచితలీల మించి మది హర్షముఁ జేయు జనాళి కెప్పుడున్. 19

చంద్రభాగనిరూఢి సతిమోము రాణించు, నెఱిగొప్పు కృష్ణవేణిగతిఁ గాంచు
నువిదవాల్గనుదోయి యుత్పలాసలి నొంచు, సఖియ పల్కులు సరస్వతిని మించు
శంఖవర్ణారూఢి సఖిగళంబు జయించు, నవ్వులు క్షీరసుందరత మించు
స్తనము లుత్తుంగభద్ర సులీలదర్పించు, నాయ నిన్వారికృతి నందగించు

తే. జఘనము విశాలహేలల సంభ్రమించుఁ, బదయుగము పల్లవాకారమద మడంచు
నడలు హంసావళిఖ్యాతిఁ గడువహించు, నంగము హిరణ్యకళలతో నతిశయించు.

క. తమ్ములు చెలికరములు కుం, దమ్ములు పలువరుస పర్వతమ్ములు బలుచం
దమ్ములు చన్నులు తోవలం, దమ్ములు కను లలక లంబుదంబులు పొగడన్. 21

చ. హరివరకాంచనాబ్జకమలాళిఘనాకృతు లంచు పెంతయ
బ్బురము పటూక్తి నాస గళముం గరముల్ కుచయుక్తి మంచు న
త్తెఱన సుమధ్యదేహముఖదృక్తతికుంతలకేశపాశముల్
హరివరకాంచనాబ్జకమలాళిఘనాకృతులందు నిచ్చలున్. 22

ఉ. దానిమిటారిసోయగపుదట్టపుమోహము లూరుచూపులున్
దానికచంపుసొంపునగఁ దాల్చినచాయలరాయుఁ డింపుకన్
దానిరసోక్తు లావలమనంబు గుఱుంగొని లోనుగాని య
మ్మానవుఁ డెంచు లేఁడు వినుమా యనుమానము మాని మానినీ. 23

చ. అది నెఱప్రాయపున్ సొగసు దాట నొకానొకపైన గర్భముం
బొదలని దాట యింటియెను బోఁతునకంటె మదంబు హెచ్చి నె
మ్మది పరసంగమంబునకు మార్కొని సొక్కఁగ జారవీరులన్
వదలక చూచుచుండఁ దలవాఁకిలి గాఁపుర మయ్యె దానికిన్. 24

క. చిటిపొటిసొమ్ములు పెట్టుక, పుటపుటగా వీథివెంటఁ బొరిగిండ్లఁబడిన్
విటులనిమిత్తము మట్టెలు, చిటుకుచిటుక్కనఁగఁ దిరుగు సిస్తగు వగతోన్. 25
సీ. జేజేలరారాలజిగిఁ గాఱిలు నిడువాలు, కురులు వేమరు దువ్వి కొప్పు పెట్టు
బలువాలుఁగలనేలు తెలిడాలు గలమేలు, కనులరేఖలదీర్చుఁ గజ్జలంబు
కపురంపురుచిఁ బెంపు కమునింపుఁ దులకింపు, పెదవిపైఁ గెంపు పెక్కువిడెము సేయు
పలిసిబ్బెములగుబ్బలులనిబ్బరపుగుబ్బ, చనులఁ బూయును మంచి చందనంబు
తే. మంగళాంగరంగద్రవాంగవృత్త, ఘనజఘనసీమ సవరించుఁ గలువచెలువు
నలుపుచునల్లనైన దువ్వలువ మెఱయఁ, జిత్తజునిదాడి కుమ్మరచిగురుబోఁడి 26
సీ. తరితీపువగలు బిత్తరపుఁ జూపులు మోవి, విఱుపుల సొలపులు విఁతమాట
లుమటుఁగొకాటంపుటొయ్యారిచేష్టలు, సోబానపాటలు సొగసుగుల్కు
పొగరువికావికనగవులు బెళకించు, కనుసన్నసేవ్పలు కలికికతలు
సామితెల్పిన్నెలు జాణతనంబులు, తెచ్చికోల్మరుపులు తేటపడని
తే. జంకెనలు బొమ్ముతాటింపు సాహసములు, పచ్చి తేఁగఁ బల్కాడి ముచ్చటలను
విటులఁ గనుగొన్న వేళల విస్తరించు, రూఢి మించినతమితోన రూపసేన. 27
క. ఈలాగునఁ జెలి పల్లవ, జాలచకోరములకెల్లఁ జంద్రోదయమై
చాల విహరించుచుండెడు, కాలంబున నొక్కనాఁటికడయామమునన్. 28
మ. పరఁగం గూలినయిండ్లు పేళ్లు గరిసెల్ పల్లేరు లుమ్మెత్తలుం
జిత్రిపెంకుల్ చిగిరింతలున్ గునుకలున్ జిల్లేడులున్ మూఁకతో
త్కరముల్ దున్నినపెంటదిబ్బలును నక్కల్పందికొక్కుల్ దరు
ల్దూరుఁగం బూడినపాతిరల్ పడినగుళ్లున్ గల్గు పాడూరిలోన్. 29
ఉ. లాడికి మూఁగుకొక్కులపెఱాయన మొందఁగఁ జేయ వీఁపుపై
వ్రాడునవేఱిలు నీఁకె గుదితాపినదేహము పేఁడి కొళ్లమన్
రోఁడి నళించుతోఁక బలుగోమము లంటినజోటుటీగలున్
గూడిన బంధముం గలిగి కూర్కుచునుం డొకబక్కగుజ్జమున్. 30
తే. మందగుది రిప్పగొరిసెలు మక్కిగొళ్లు, బరతుమురుకొమ్ములును దోటుబర్లతిడక
వాటు తెరడొక్కమిడితోఁక వేటుగాళ్ళ, నేరువోసిన యొకబీదయెద్దుఁ జేరి. 31
వ. అందు వసియించి యున్నసమయంబున. 32
చ. నలువగు తుంకిచేవన గనంబడుకొమ్ములు విత చింతని
ప్పులసరివచ్చు కన్నుగవపోసరము న్మైడ ముద్దపక్కలుం
దెలుపులరాలు లావుపాలతిం దగు పాదము లుక్కుపోత సం
ధిలినవిధాన నుండు బలుదేహము గల్గినపోఁతు వచ్చినన్. 33

ఉ. చేరి శుభంబె ఘోటకమ ప్రకరమే వృషభంబ మీర టి
తీరున దస్సియుండు కథ దెల్పఁ డటంచును బోఁతువేఁడ వే
సారక విన్ము చెప్పెదను సైరిభవర్య మదీయ గాథయుం
చారసి యాత్రిఁ గుఱ్ఱమును వృషాగ్రణి పోఁతును జూచి యిట్లనున్. 34
సీ. తలయేరుఁ బెట్టి బీడులు దున్నఁ బడఁగొట్టి, గాలుచిక్కనుబంద్లఁగట్టి మొత్తి
పొలముకొండ్లకుఁ బంచి తలదిమ్ము బట్టించి, పలుదుంకవిపెలపదను జెఱచి
పాపనమ్ములఁ జిక్కు పఱచియు రెండేసి, గొర్లుకాడి నమర్చి గొట్టుచేసి
బలుగుంటకలచేను పాయఁబో సాగని, తావులసెలకోలఁ దాఁకమొత్తి
తే. గానుగలఁ ద్రిప్పి సరువళీ గలఁచి బంతి
దుడ్డుబరువెత్తి యొకింత దోలి యడలు
గళ్ళిపడి రెండుదుక్కులు వెళ్లదున్ని
యట్లు గడగిపోఁదోల ని ట్లైతిసుమ్ము. 35
క. అనవిని తలద్రిప్పెనుబోఁ, తనియె మహోక్షంబ కష్ట మనుభవ మయ్యెన్
వనజభవు వ్రాఁతఁగడువఁగ, మనతరమా యనుచు వగచి మహిషము హరితోన్. 36
తే. నీవు హరిరీతి గంధర్వనిచయ మెల్లఁ, గొలువ దేవమణీచక్రములు వహించి
విబుధులభరింపుచుండెడు విధము లెల్లఁ, దొలఁగి చిక్కితి విటు లేల తెలుపుమనిన.
వ. తురంగంబు మహిషంబున కిట్లనియె. 38
క. ఆనాఁటి కటులనుండితి, నీనాఁటికి నిట్టుల నయితి నేమందు నయో
లేనాఁటి మేనిసత్తువ, లేనాఁటికి గలవె విను చరించినవిధమున్. 39
సీ. పేరిమ నెదురొక్కలు పెంపువారల కిచ్చి, తెవులైనవారి కర్గలకు నొసఁగి
మేయఁ బోయినచోట మెడవెండ్రుకలు పట్టి, యాకతాయలును వాహ్యాళిఁదోలి
సారె గృహప్రవేశమువారి నెక్కించి, సంతె సారెకులందు స్వారివెడలి
పల్లెపట్లలనుంచి బర్వు వేనుకపచ్చి, పలసలచే కంట్లములఘుటించి
తే. తీరకున్నట్టి కష్టసంసారమునకుఁ, గసవు కట్టెల లద్దల గాసి పఱచి
లావు సత్తువ చెడఁగొట్టి లాఁడె పోవఁ, జేసి తోలిన నిటకు విచ్చేసినాఁడ 40
చ. కొఱపసు చెడ్డయొట్టు చలిగొట్టినచో కవణంబు కల్ల మే
నఱసినమాదమూర జల మార్పుట యెన్నఁడు కానివావి యే
తఱిఁ గలలోనమున్ బడెడుదాణ యెఱుంగను బేదదంటుముం
దరఁ బడవేసి యొడ్డ కడ దామెన త్రాడునఁ గాలుగట్టినన్. 41
తే. ఎడ్లు పోట్లాడి కొమ్ముల నెత్తివేయ, గేదె లాకదిక్కు సెలఁగఁగఁ గేరుపుఁదల్లు
లార్థఁ దన్నంగ నమ్మహావస్థచేత, గోడిగై పుట్టియును గోడు కుడుచుపలసె. 42

సీ. పిల్లపీచర నక్కపీ చెల్కచవి గొట్టె, పొలలంబును నేఁకపా లలంబు
బుడ్డకొసరియట్ల బొందిదొఁ తరలంబు, మాడుపుగురుగును మదనకట్టె
నూనెచుంతలమును నానఁబ్రాలలమును, గుండగురుగుపాల పెండలంబు
పొర్లుగాడియు నల్లపూలల మిసక చెం, చలి కందికారము గిలకలంబు
తే. కన్నెకొమరెడ్డుమట్లెక్క వెన్నవెదురు, లంజెసూరము వెత్తిపూలలము చిట్ట
బొట్టలము గోళ్లగొండియు కట్టలంబు, నల్లతీగాదియలములు సళ్లవిడిచి. 43
తే. కనుము లీడలిక్కోరికె కాకివెదురు, దర్భ చిగిరంత గోరిగె దాడయంబు
జంబు నూదరతుంగ పెక్కజంబు పెద్ద, తుంగ భోజవతీ నక్కతోఁక విడిచి. 44
సీ. కాచిగోగడ నెత్తుకొరె బూడెదతోల, కాచి పండెడగోళ్లగడ్డయూల
ముల్లూపుచంగాయ మల్లయకరవెల, యెలగొయ్యి వేఁబుతు మెఱుఁగుగడ్డి
గంపదొల్లాకకొమ్ము కొరెపోఁతరముల్లు, నట్రింత కదురు కార్యాకు చిత్ర
కందురుబూత రాకొసి పిచ్చుకపియ్య, మళ్మరి వెర్రి చేమర్లుగునుక
తే. చీమచిప్పర చిప్పర చేఁతిబోద, ఫట్లగడ్డుట్ల చిప్పర పూడుకసవు
పొలికె పెనుకెడ కుందేటిపొరుజు గరక, పరికి సాళ్వము సొంటెపందురుగరిమిడి.
వ. మఱియును. 46
తే. వేరుతొల్లింగి తొండును నూరువెల్లి, తోపరిస్త్రింత యెద్దుకొమ్ముప్పి గడ్డి
ప్రల్ల పూరూచయును బూద పూలగడ్డి, కదురు తుంగాకు తుఁగలు గలయ నిడిచి.
ఉ. చిక్కులమారి యాబలిజసెట్టి నయాళులగట్టి బర్వ్యాలక్
స్రుక్కడలంగఁ గొట్టి తనసుందరిచేతికి గడ్డి కోసమై
చెక్కడుపార యీయఁబడి సేటది చక్కనికోడెకాండ్రపైఁ
బ్రక్కలవ్రాలి సోలి నగుబాటున కళ్ళక సంజచీఁకటిన్. 48
తే. దానకపువాండ్రు లద్దిలోఁ దలకదీసి
దిబ్బలను వ్రేయుఁ జెడుగత్తుగబ్బుగడ్డి
గంపలో వేసికొనివచ్చి చంపఁజాలు
పూనికను గ్రమ్ముకొని నామొగాన వైచు.
క. విను మాపెదర్య కినుమడిఁ, గొనకొని కొవించుదానికోడలినడతల్
కని కని వేసారితి పెం, చ్చెను బాపపుఁగాల మనుచుఁ జెప్పెడువేళన్. 50
సీ. చండవేగోత్థభూమండలధూళ్యాప్తి, పంకీకృతాభ్రికూలంకషాంభ
మభోఽభిత్పతద్ద్రుషద్వ్యాఘాతభగ్నధా, త్రండరక్షరద్వాహ్యకొండకాండ
మద్రిభిత్కల్యటవ్యగ్రభాగద్రాక్క్ర, తపోఽద్ధుతక్షమాస్థక్షమాజ
ముగ్రుగ్ర ఘురధీకృదుగ్రత్వరోద్ధృత, వ్యోవీధ్యటద్ధరిత్ర్యుచ్ఛ్రిన్నతపుర

సీ. వనదజనగాత్రిమమునఁ గనచ్ఛోణాంశు, వితతితత్కాళసుధాప్రతతు లనఁగ
జలదపూర్ణ్వాజాండజలరాశితటమరు, చ్ఛలితవిద్రుమలతాచయ మనంగ
నమయలకడవినోదము చూపు సమయమహాం, త్రికు నోర వెడ లగ్ని దీప్తు లనఁగ
ధారాధరాహ్వాంబువారుణేంద్రమదారు, ణేక్షణాంచలకాంతు లెసఁగె ననఁగ
తే. ఘనఘనాఘనగహనసంఘాతములను, గర్జితధ్వానములు మోయఁ గా రహించు
దావపావకకీల లంటఁద వర్వె,ననఁగఁ దళుకొత్తెఁ జంచల లభ్రిసరణి. 58

సీ. బిబిబిబిదరగరుద్భేకభీమధ్వని, వివిధజంతుశ్రేణిఁ జెవుడు పఱుప
ధిగధిగద్ఘృణిగణదేదీప్యవిద్యుచ్ఛ, టల నిశ ల్పవలట్ల వెలుఁగుచుండఁ
బెటపెటార్భటిరటచ్ఛటులాభ్రనిర్ఘోష, ములముజ్జగము వార లులికిపడఁగ
ఘుమఘుమారావసంకులకులాకులకుధ్ర, త్కుహరానిలముల దిక్కోటు లురుల
తే. ఛిటఛిట యటంచు కిరకి లుత్కటలు రాల
నిగనిగద్యుతి మేఘముల్నింగి నెరయ
ఘళఘళపయఃపృషత్పరంపరలు గవియ
ఝోరుఝోరున దారుణాసార మడరె.

క. పటుధాటీరటదుత్కట, పటహాలటహాకోటరములు పాటిలినటులన్
నెటనెట పటపట వెటవెట, పిటపిట చటులార్భటులను పిడుగులుఁబడియెన్. 60

వ. అప్పుడు. 61

సీ. గగనమండలభద్రకాయమానంబున, ఘనపంక్తులను మేలుకట్లు కట్టి
ధరణివేదికమీఁదఁ గరకొనికొయవహ, త్రికముల రంగవల్లికలు దీర్చి
ఘనఘోషభేరికాధ్వనులు బర్హిణగళ, ధ్వానకాహళినినాదములు మోయఁ
దెగనిమెఱుంగుల దివ్వటీలు చెలంగ, ద్విజరాజమంత్రము ల్విస్తరిల్ల
తే. వృష్టిగజరాజగామిని విభుఁడు సమయ, పురుషుఁ డయ్యెడ నిమ్నగాపుత్రికలను
గాంచి పెంచి ప్రమోదంబు గడలుకొనఁగఁ, బరిణయ మొనర్చె శరధికి భవశరధికి.

తే. అప్పు డవ్వానకొట్టున నళికి యుళికి, పడినగోడలు నొరుగుకంబములపట్లు
వదలి కూలినగోపురావళులు గల్గు, పాడుగుడిలోని కెయపోఁతు పఱచి నిలిచె. 63

క. అంతటవర్షము నిలిచె ది, నాంతము జనియించెఁ గజ్జలాభ్రతమాలా
శ్రాంతరుచి పర్వె నెల్లెడ, సంతమసము చుక్క లమరె సత్పథవీథిన్. 64

క. ఎనుబోఁతు నపుడు కుష్మరి, తనయింటికి రాకయున్నఁ దత్పురమందున్
వనముల సంకల డొంకలఁ, గనుగొనుచున్ వచ్చి వచ్చి కని యచ్చోటన్. 65

ఉ. లంపులమారిదాన నిను లాముక మాదిగవాఁడు గోయ వే
కొంపకుఁ బొమ్మటంచు మిఱుగుఱ్ల జనింపఁగఁ బాడ్లు దీటి నై
కంపము పుట్టఁ జేగుఱియుకట్టెను దిట్టుచుఁ గొట్టఁ బోఁతు బ
ల్గుంపెన నింటికై చనినఁ గుమ్మరి గాడిని గట్టెఁ గట్టినన్. 66

తే. కట్టు విడువకు మని చెప్పి కాంతతోడ, రేయి యొకరీతిఁ గడపి యా రేపకడను
గుమ్మరయ్యాఱిపట్లెలఁ గుండలమ్ము, వెడలఁ దదార్య జాముల వెదకుచుండె. 67

ఉ. సారణనామధేయుఁ డొక సాలియవాఁడు మనోజమూర్తి కా
శ్మీరధరిత్రినుండి యలసింధువసుంధరఁ జేరఁ బోవఁగా
దారిని రాఁగ రాగమునఁ దప్పక యాతనిదిక్కు చూచి యే
యూరెట కేగెదేమిపని యున్న తెఱం గెఱుఁగింపుమా యనన్. 68

తే. అతఁడు దానిసెగాడిగ నరసి చూచి, దుడ్డుగట్టిది పనిలేక తొల్తఁ దానె
పిలిచె నిది పాట్లమారి గావలె నటంచుఁ, జేరి తనపేరు పురిపేరు చెప్పినిలిచి. 69

సీ. దప్పి కిమ్మన మది దప్పినదా యనుఁ, జెంబువె మ్మనినఁ గుచంబె యనును
గూరఁబెట్టు మనఁ జేకూరె నాహిత మను, నన్న మడిగిన సుజహాన్న మనును
సున్న మిమ్మన్నఁ గుసున్నమె యనుఁ బోఁక, పక్కలే పన్న గుర్వీక్కె యనును
నిప్పని పలుకఁగా నిప్పని కనియును, నాకిమ్మనిన మసియాకె యనును

తే. దేహ మలసె నటన్న సందేహమా య, టంచు నిక్షేపు రేగి యమ్మించుబోడి
యతని మాటల కలమాట లాడుకొనుచుఁ గేరి నవ్వినఁ జూచి యా సారణుండు. 70

క. నెరమాటలఁ గోడిగముల, నరమాటల జాణతనము లతిచతురతలన్
బరిహాసంబుల నీసరి, బెరకాయపుసతులు లేరు బిసరుహగంధీ. 71

వ. అని పలికి యంత. 72

ఉ. క్రొమ్మెరొ ప్రొద్దుగ్రుంకె నెటకుం జనలేవు బరుండ నింత చో
టి'మ్మని పల్కరించఁ దరళేక్షణ మంచి దటంచు నవ్వుచున్
గ మ్మని చేరఁ బిల్చి యరరమ్మొగి మూసి గడెన్ గదించి మో
దమ్మున రెట్టఁబట్టికొని దర్పకకేళికి సంభ్రమించినన్ 78

తే. అతఁడు సురతాభిలాషసంగతుఁడు గాన, మంచి దని సమ్మతించిన మమతతోడఁ
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చుక కుచము లొత్తి, యొనసి మదనరణక్రీడఁ బెనఁగులాడ

ఉ. అంతట దానిభర్త నిలయాంగణసీమకు వచ్చి నిల్చి య
య్యింతినీ దల్పుఁ దీయు మని యెంతయు ఘుర్షముతోడఁ బిల్చినం
జింత యొకింతలేక యల చేడియ యేగతి బొంకఁ జెప్ప మో
కాంత యటంచు నంచ యడుగన్ విని యాబిడ యూర్పు సంధిలన్. 75

తే. తెలియ దెటువలె బొంకునో జలజగర్భు, వీతిరత్నము చిక్కులు పెట్టనేల
చెప్పినను జెప్పు మిక్కుధచిత్త మలర, వినియెద నటన్న రాయంచవిభుఁడు పలికె.

చ. అటువలె భర్తపిల్చిన భయంబునఁ జారుఁడు కంప మొంద నా
కుటిలసుకుంత లయ్యెడను గొబ్బున వానిభయంబు వాపి యు
త్కటధృతి సైరిభంబు మెడఁగట్టినత్రాడు వదల్చి దైవమా
కటకట యెట్లు సంగతము గానెను బోఁతును గల్గఁ జేసితే. 77

తే. గాడిపట్టున నిల్వము కట్టివేయుఁ, దరముగా దంచు వాఁకిలి దెఱచి పోఁతు
వెడలి పొయ్యాని వాఁకిలి వేరియుమనుచు, మగనితోఁ జెప్పి యాదిట్టమమతపుట్ట

తే. ఈదయానిధి వీథిలో నేగుచుండ, బిలిచి తోడ్తెచ్చితిని మెడతలుగు పెట్టి
వింతమానిసిఁ గనఁ గట్టివేయనీక, నురుకగాఁ దల్పు త్రెసితి నోయి రమణ. 79

క. అని చెప్పి మగనిచే జా, రుని నుతిసేయించి వారిరుహముఖియు విభుం
డును దొంటిరీతి నుండిరి, యని యంచ వచించునెడ నిశాంతం బయ్యెన్. 80

చ. పొనపొన నిద్రమబ్బునఁ బ్రపుల్లసరోజదళాయతాక్షి మె
ల్లన నృపమోహతాపమున లంపటతోఁ జనె నంచ దెల్పఁ దా
వినినకథాచమత్కృతికి వేమరు నౌదల యూఁచికొంచు హా
యనుచు నిడూర్పుపుచ్చుచు నయారె యటంచును బోయె నింటికిన్. 81

తే. పోయి యభ్రంకషం బైనచాయ, లాలుకు
కలువరాజాలకళుకులోపల రహించు
తళుకుమగరాలగోడలు గలసుపాణి
మేటిక్రొమ్ముత్తియపుజాతి మేడలోన. 82

చ. పరవుపరంగిపోషుగల బంగరుమంచముపై వసించి భా
స్కరుఁ డుదయింప నూడిగపుఁ గామిని లేపఁగ నిద్ర లేచి త
త్ఖరకరుఁ డస్తమించుదనుకా నొకరీతి మెలంగి చీఁకటుల్
నెరసినపిమ్మటన్ నలిననేత్ర మహీపతిమీఁదికోరికన్. 83

ఉ. శాలు మెరాలు వాలుసవరాలు మెఱుంగులనూపురాలు వ
జ్రాలసరాలు మేలుబవరాలు వరాలజిరాలు తూలుహా
రాలు తురాలు ముంగవుమురాలు తరాలసిరాలు సందితో
రాలుసుటుంగరాలు బిగిరాలఁగ నాజవరాలు దాల్చగిన్. 84

సీ. చీరకుచ్చులు నేలఁ జీరకుండఁగఁబట్టు, కొని పార్శ్వముల సఖీజనము నడువఁ
బాదుకలెక్కి రాఁ బదిలముం చుడిగంపు, టెంతులు కైదండ లిచ్చి కొలువ

మనవుల కని చెలు ల్గనుకుపఱ్వున వచ్చి, మొగ తెలకట్టుతో ముచ్చటాడఁ
బ్రొద్దున నే పను ల్వాని చేయుద మంచు, బోనక త్తెలు వేగిరాన రాఁగఁ
తే. ద్వరితగతి నిండ్లకుఁ జనంగఁ దమకుఁ దమకు
సెలవొసఁగు మంచుఁ బాటలు సెప్పు విప్ర
యోష లేతేర నొయ్యార ముట్టిపడఁగ
వచ్చినిల్చిన రాయంచ మెచ్చి యపుడు. 85
సీ. సొగసుమిటారంబు సొంపునొయ్యారంబు, నీటు జగ్గుతనంబు నెరతనంబు
సొబగు నాగరికంబు చొక్కాటమునుఁ డెక్కు, గరకరికతనంబు ఘనత నడత
హొయలు చక్కదనంబు నొసపరి నెరకీవి, సవరణచెలువంబు సరసరీతి
హాసుచమత్కార మారజంబును నేర్పు,గర్వారంబును నాయకంబు వన్నె
తే. సిస్తుజిగిబిగివగ బాగు చిన్నె యొప్పు
పేరునాణెంబు మురిపెంబు పెద్దతనము
కులుకుప్రౌఢత్వ మభినుతి గొనబు సెలవు
నడత యి ట్లుండఁ డలదె హా యనుచుఁ బలికె. 86
వ. ఇవ్విధంబునఁ దను మెచ్చి పలికిన రాయంచం జూచి హేమావతి యి ట్లనియె. 87
క. తురగము వృషభముతోఁ దన, తెలఁ గెన్నుచుఁ దనకుఁ గనవుదేనిచెలిని ద
ద్వరనుతుసతి సెంచెఁ గదా, యొతిఁగింపుము దానిచర్య లెట్టివొ యనినన్. 88
ఆ. అంచ మించుబోడియాననం బీక్షించి, యడుగవలయు నిట్టు లడిగినపుడు
చెప్పకున్నఁ దనగు శేముషి యది యేల, యనచు నిట్టు లనియె నాదరమున. 89



పదునెనిమిదవరాత్రికథ.

శా. శ్రీధామం బన నొక్కపట్టణము ధాత్రిన్ మించుఁ జంచన్మణీ
సౌధస్తోమవధూముఖేందుఘృణిసంస్పర్శస్రవత్స్వచ్ఛతా
రాధీశాశ్మపయఃపృషచ్చయవిధూతాకాళక్షాలంకపా
సాధూత్తుంగతటీమునీశ్వరతపస్సంజాతసంతాపమై. 90
తే. సాల మున్నతిభూర్భువస్స్వర్మహర్జ, నస్తపస్సత్యములు ఖేయ నైమ్న మతల
వితల సుతల తలాతల తతి రసాత, లము మహాతల బలిసదనము లెఱుంగు. 91
చ. కనఁ బురిచుట్టుతోఁటల సుగంధఫలంబులు రాల వానిపైఁ
బనసలు పండి త్రెళ్లి పడుపాటున రొంపులు గట్ట వానిమీఁ
దను రసదాళిప్రీలి రసధారలు నించఁగ నైనయుబ్బలిన్
జనపడిఁ బాఁధులందఱు బడి సారె హసించుదు శాలిపాలికల్. 92

క. ఆపురమున నొకఁడుండును, గాఁపురముగ బలిజెసెట్టి గణదాసుఁ డనన్
దీపురముగాఁగ నయ్యాల, కాపురమున ధనదుఁ డుండుగతిఁ గడువేడ్కన్. 93

వ. వెండియు నతండు. 94

చ. సరిపెనతోడిసజ్జ బలుసందిటితాయెతు లంగవస్త్రముల్
సరిగెచెఱంగుపాగ విలసన్మణిముద్రిక లంచుకమ్ములున్
మెఱుఁగులు గుల్కుదోవతియు మిన్నగునీలపుపోఁగుజోడు బి
త్తరపువిభూతిరేఖ లఱుతన్ రుదురక్కలు గల్గి భాసిలున్. 95

ఉ. పోరకసీదుపట్టెమొగ ముట్లతలాటముజల్లు వేరుచిం
పోరయఁ గంచుకుప్పెలును బూదెలగొల్సును బెద్దగంట సిం
గారపుదృష్టిదండ మెడగజ్జెలపేరులు నందె లొప్ప లా
వేరినదొక్కపస్పె యెకిరింత మహోక్షముపొల్చు వానికిన్. 96

చ. తణగము లానుకంట్లములు తఁడిగము ల్సలకల్ దడెల్కుతూ
గణములు చెక్కుగుంపు లడిగంబులు పంబులు త్రాడుగట్లు మం
కెనములు గోతము ల్నగలు గెంటెపుబోరెము లాతనింటిలో
గణన కశక్యమై వెలయుఁ గంజసమానవిశాలలోచనా. 97

సీ. గూటపుఁదిరుగళ్లు కొలికిదామెనత్రాళ్లు, కంద కెముకలి కదురుకోల
మఱగజుమును మోడిమెఱుఁగుగాఁ దీసిన, పిల్లచుట్లలు నల్లబిళ్లవల్లె
త్రాళ్లును బురికొన ల్దబ్బనములును సి, గంతలు నట్టెన కట్టెలసిమ
బలుపొన్ను లలలారు బగినగూటంబులు, పెలుజోగిపట్లెస్లు పిల్లపట్టె
తే. డలును బూవులకోరగిన్నెలు విభూతిపండ్లు గంగాళమును గుసిగెండ్లిపాల
మర్ద్ధిభరణియు రుద్రాక్షమాలికాస, మూహములుగల్గియుండుఁ దద్గేహమునను. 98

ఉ. కాముని మేనుగాలెఁ బలుఁగాకి జయంతునిరూపు గూలె సా
సోమునిసత్కళాగరిమ చూడఁగఁ జాడఁ గృశింపఁ జాలె నీ
భూమి జనించి యాక్షణమె పొల్చు వసంతునియాకు రాలె నో
హో మతి వీనిరీతిఁ జెలు వొందిరె వారని యెంతు రంగనల్. 99

చ. అతనికి నొక్కయాలు గల దన్నిట మేటి మిటారి రూపునన్
రతి నిరసించు మీఱి మరురాయునిదిగ్విజయభేరి వింతలా
చతురతలందుఁ గేరి ఘనసాహసచర్యల బల్తిటారివా
క్తతిచెలువంపుకీలయభిధానముచేత విహారి యారయన్. 100

చ. కమలభవాలయాంగజగర్వ మడంచుముఖంబు యానము
ల్గమలభవాలయారికళలన్నగుఁ గంఠము శ్రోణిబింబముం

కమలభవాలయారిగతిఁ గైకొనుఁ గన్నులఁ గబ్బిగుబ్బలన్
గమలభవాలయారిఘృణిఁ గాంచుఁ గరంబులు వేణి యింతికిన్. 101

చ. ఘనము కచంబు చెంబు లన గబ్బిచనుంగవ మించుమించులన్
దనరుచి రూపు మాపు నెలతళ్కులఁ గెల్చు మొగంబు గంబురా
నలఁ దగుఁ బల్కు పల్కుదు రయారె నుపాణులు పాణు లబ్జముల్
మనసిజునారి నారియసమానపుటూరలరారుఁ దీసగన్. 102

క. ఆలపనము శశిబింబం, బాలపనము తేనెధార లంబుదవర్ణ
శ్రీ లపనయంచుఁ గబరీ, శ్రీ లపనముఁ బొగడఁ దరమె శేషునకైనన్. 103

ఆ. కాంతకరము గళము కలముద్దురూపంబు, దరము దరము దరము తరము పరము
వాలుమీలఁ బోలు వనజాక్షికన్నులు, సారెసారెసారె సారసములు. 104

సీ. మొన యైననఖరాన మిను కీనునిటలాన, జోకగుల్కు విభూతిరేకమర్చి
నయ్యార జిగిదేఱ నొయ్యార మలరారఁ, బసపుతో సన్నంపుఁ బట్టెదీర్చి
నలదండ కలతండముల నిండుతనముండ, సరసకుంకుమరేఖ సంఘటించి
నాచెంత కాసంత యాసంత జిగిజంత, సొగసుగా నిడు చాదుచుక్కఁ బెట్టి
తే. మెడను జందనచర్చ ధమ్మిల్లసీమ, విచికిలంబులు గంబూర కుచములందుఁ
గప్రపువిడెంబు పుక్కిటఘుమ్ము మనఁగ, విటుల వలపించుమరునైన వెస భ్రమించు.

తే. మీఁటిగడిదేరి భోగము కేరిచేరఁ, జీరి చిన్నారి వగఁ గేరి వారి దారి
కోరి విటుఁ జీరి రానిచో మారుబారి, సారెవేసారి పొరలు నాహారి నారి. 106

వ. ఇత్తెఱంగున. 107

క. పరపురుషచింత నచ్చెలి, నిరతము చరియింపఁ జూలు నిలిచెను వృద్ధిం
బరఁగుచు నవమాసంబులు, బరగినతదనంతరమునఁ జంద్రవదనకున్. 108

సీ. గుడిమీఁదఁ బడు రావికడిలోని చెఱకు గీఁగె, పుణ్యనదీతీర్థమునను మొసలి
కంటిలోఁ గొరవెండ్రుకయు రచ్చమట్టిని, బ్రహ్మరాక్షసి కాఁపురమ్ము సేయు
భవనసీమను ద్రాఁచుపాము కల్పకజంబు, కడగచ్చపొదపాలకడలివిషము
వనమునఁ జిచ్చు దివ్యౌషధికినిఁ బుప్పి, బ్రతుకు బాలెడు నింటఁ బరశురాము
తే. హస్తముదకాన గ్రుడ్డు సస్యమున మల్లె
జీవవితతికి రోగంబు చెఱకు వెన్ను
మణికి దోషంబు నృపునందు మార్దవంబు
పుట్టుచందానఁ బుట్టెను బుత్త్రుఁ డొకఁడు. 109

తే. వాఁడు నానాఁటి కభివృద్ధి వఱలఁ బెఱిఁగి
కాఁకలనుదేఱి గడిమీఱి గట్టిపారి
రాలుఁగాయతనాన బేరజపుదారి
నాఱితేఱియుఁ బలుగుంటమారి యయ్యె. 110

మ. గుణమా సైబ్ర వివేకమా నహి మనోగూఢత్వమా లేదు భా
షణమా కల్ల విచారమా రవళి వంశాచారమా నాస్తి మా
ర్గణముఖ్యాపనశీలమా శశకశృంగప్రాయ మాస్తాదితో
షణమా దబ్బర సత్యమా హుళి గణించన్ వాని కద్రిస్తనీ. 111

వ. వెండియు నతండు. 112

సీసమాలిక. ఆకతాయబికారి యడిబండగుండఁడు, మొండికట్టె గులాముమొప్పెగోపు
పోలెవాఁడగచాట్లపోఁతు దుర్మార్గుండు, పడిసేటు నగరానుపంద లండి
కొయ్యద్రిప్ప ఖరాబు కూళి బందెలమారి, ముందటిపాపాలముద్ద ధగిడి
నోగు దూబరదిండి నోచవాఁడపలక్ష, ణములాడు గోల వ్రాత్యుఁడు బజారి
పలువిత్తు పలుగాకి ప్రాడ్వాకుఁ డుచ్ఛిష్ట, మొందునుద్దులమారి యులిపికట్టె
పాపిష్ఠి బజగేడి పంచమహాపాత, కియు వ్యతీపాత పోకిళ్లమారి
దదిబేసి చెడుగొట్టు బెరికి దగాకోరు, విషపాలవిత్తు చిల్విషము దగులు
బాజిహ రాఁకోరు వ్రాజప్రక్కలముచ్చు, చీవాట్లమారి ప్రాచీనవిత్తు
మూసినమురికి నిర్మోహి స్వామిద్రోహి, దుష్టు రోఁతలమారి దోసకారి
బడిమికూళ్లకుమిత్తి పడిసె యెంగిలికాయ, బడుపుగూడెసగొట్టు పాడెగట్టు
గుండెకుల్లడము తాకట్లమారి యభాసి, కడుపేరిత నడపీన్గు గలపడింపు
ధూబదర్శనమూఁడు తోకగుక్కన గుల్ల, గుజ్జాల గోవోద కొరుకుబల్లి

తే. కొంటె కసుమాళమును దూబ కొంపచెఱుపు
వేడిగేరియ చెరపనచేట రోను
బడియ దుర్బీజమును భ్రిష్టు మడియచేట
పెయ్యకల్మచ్చు చెడుగుసాపెనలమారి.

క. అనుచుఁ బొరుగిరుగువారుం, దనవారుం గాసి
దనుఁ దిట్టఁ జేయు దుడుకులు, మనమున లజ్జింప కతఁడు మఱియు న్మఱియున్.

తే. వానికనిమిదిరేండ్లది మేనమామ, కూఁతుఁ బెండిలిచేసినఁ గోడెవయసు
పోక ముజ్జూతలూఁగెడు భార్యమీద, మనసు చాలించి దుర్మార్గమతి వహించి.

క. భోగాలవారియిండ్లకు, భోగాలకు మించి యరుచిభోఁ గామించున్
భోగాలపలపు విడియపు, బాగా లీవక నువదీప్తిపలె మూఁ పెనయున్. 116

వ. ఇట్లు నిజవధూవైముఖ్యంబును, వారవనితాభిముఖ్యంబును వహియించివల్లవుండను
వాఁడు వర్తింపుచుండ నొక్కనాఁడు. 117

సీ. రంభ ఘృతాచి యూర్వశి మణిప్రభ చిత్ర, రేఖ మేనక శశిరేఖ హరిణి
హేమ స్వయంప్రభ హితమోహ మోహిని, పుంజకస్థల రత్నపుంజ సరస
ధాన్యమాలిని తిలోత్తమ వరూధిని మంజు, ఘోష సౌగంధి నికుంద తార
మణిమాలిక సుమంబు మంజరి మణిభద్ర, మణిక విద్యున్మాలి మదమయూర
తే. దివ్యమూర్తిసువర్ణదేదీప్యమాన, రుచిరమకరందసుమదామవిచికిలాంగి
యనఁదనరు నప్సరస్త్రీలకన్న మిన్న, చెన్నలరు వారసఖులహెచ్చెన్నఁ గలఁడు.

క. ఆవారసతులలో సొగ, సై వారణలేనికలిమి నందఱును సుశో
భావారమరునిపసిఁడిజి, రావారణ మననొకర్తు రతిసేనాఖ్యన్. 119

సీ. కలధనమెల్లఁ బోకడఁబెట్టి సన్యాసి, యై బిచ్చమెత్తనియగ్రజుండు
చేతికైదువును నాశింపక తెగఁగట్టి, కులశేఖరులఁ గూడుకొననిరాజు
సంచిమూల్యమునిచ్చి సడి కోర్చి త్రైవర్ణి, కులజంటఁ దిరుగనికోమటీఁడు
కారుకలపమొదల్గానన్మి సీమపై, జోగులఁ గలియనిశూద్రబిడ్డ
తే. లేఁడు ధరలోన రతిసేనఁ గూడిమాడి, యున్న విటులందు రతియందుచున్న వేళ
సందు గనిపెట్టుకొనిపెట్టుమంగుగుళిగె, మహిమ యెటువంటిదోకాని మధురవాణి.

ఫ. అది మఱియును. 121

భారుడంబును శుద్ధపద్ధతి బహురూప, లక్షణంబులు దండలాస్యములును
బెక్కణపద్ధతి పేరణాపద్ధతి, కుండలీనృత్తంబు భాండికంబు
రాసకాఖ్యము నాటరాసకంబును జిత్ర, పద్ధతియును దేశ్యపద్ధతియును
జర్చరీకంగులచానరికోలాట, ములు నాఁగఁ దగువేళ్లఁ గలుగునట్టి
షోడశంబగునృత్తంబు చౌరవ లెఱిఁగి, సరవిఁ జంచుపుటంబును జాంపుటమును
ధృవము మధ్యము రూపక త్రిపుట జంపె, యేకతాళాటతాళాదులెల్ల నెఱిఁగి.
భైరవి మాళవి బంగాళ హింవోళ, రాజమంజరియు శ్రీరాగ గౌళ
భూపాళ లెన్మిది పురుషరాగంబులు, దేశాక్షి ఘూర్జరి దేశితోడి
దేవక్రి యాందోళి దేవగాంధారియు, గౌళ గుండక్రియాహారి సలలి
త బిలాహరి కురంజి ధన్యాసి పూర్వగౌ,ళ వరాళి నాట భల్లాతకి మల
తే. హరులు సారంగ రామక్రియలు ననంగఁ
గన్నడ యనంగ మంగళకౌశికి యన
వెలయు నారాయణియుఁ జతుర్వింశతివివి
ధములఁ దనరారు స్త్రీరాగములను మఱియు. 123

సీ. కాంభోజ కేదార గౌళ శోకవరాళి, పున్నాగ గుమ్మకాంభోజి శంక
రాభరణము మేఘరంజి తోడి వరాళి, నాదనామక్రియ నాట రీతి
గౌళ రామక్రియ మేళరామక్రియు, గౌళ నారాయణగౌళ మధ్య
మావతియు ముఖారి మలహరి సామంత, పంతువరాళియు బౌళిరాగ
తే. చెంచు మలహరి దేశాక్షి శ్రీవరాళి, మాళవియుఁ బాడి సింధురామక్రియయును వ
సంత సామంత శుద్ధవసంత గుజ్జ, రియును హేజిజ్జి నీలాంబరియు నవంగ. 124

తే. పొసఁగు ముప్పదిరెండు నపుంసకములు, మాళవశ్రీ యనంగను మలహరి యన
దేవమలహరి రేగుప్తి దిరముసుంద, మలహరన నైమమిత్ర లీమక్క మరసి. 125

తే. షడ్జ గాంధార మధ్య మర్షభ నిషాద
పంచమ సుధైవతాఖ్య సప్తస్వరములు
మంద్ర మధ్యమ తారకమహిమ లెఱిఁగి
యాడఁ బాడగ నేర్చు నయ్యబలఁ జూచి. 126

క. వలచి యతఁడు కడుమోహము, తలమునుకలుగాఁగ మరునితామరవిరితూ
పులకకబికలను లోఁబడి మలయుచుఁ దా వెంటజాలిమాలం దిరుగున్. 127

వ. ఇట్లు దిరుగుచుఁ దాఁజేయు యత్నంబులఁ దన కభిమతంబు ఘటియింపం దలంపని
యారతిసేనను మరులుకొల్ప నూహించి యాపల్లవుండు వైద్యసహవాసం బొనర్చి
యంత. 128

తే. ఇంద్రగోపంబు రోచన మెజ్జులు వెలి, గారము జలభ్రమణములు నీరుగొబ్బి
విత్తనాల్పుట్టపండు రసోత్తరముగ, నూరి మసుపునఁ బెట్టిన నారి వలచు. 129

సీ. నల్లేరు కణిక గందలు తేనె వగనూరి, లేపించి కూడిన లేమ వలచు
కరక తాండ్ర యుసిరికలు కోష్టు పాలచే, నూరి పట్టించిన నారి చేరు
వెలిగారమును నెజ్జువిసెపూసి నిజతనూ, జలముల నూరిడ్డ చెలియ కలియుఁ
గలుగొట్టుని రావుకొల్మడిచేనూరి, విడెములోఁ దగిలింప వెలఁది చిక్కుఁ
తే. గూర్మి జిల్లేడుదూదిని గోశఫలర, సములను మెదించి వత్తిగాఁ జక్కఁజేసి
కునుమనూనెను దీపంబు పొసఁగఁ బెట్టి, చూప లోనౌదు రెటువంటిసుదతులైన.

తే. జాజికాయలు జాపత్రి చారపప్పు, సెనగ లనుములు గసగసల్ మునగపువ్వు
మదనవిత్తులు కొబ్బెర మందపాల, నూరి త్రాగిన మద ముబ్బుఁ జేరువేళ. 131

క. అనుచు నిజరచితవితరణ, జనితామోదమున వైద్యజనములు దెలుపఁగా
వనితావశ్యౌషధములు, విని యట్లొనరించి యింతి వెస వలపింతున్. 132

క. అని నిశ్చయించి యాబోజు, గనుపమమణిహేమఘటితమై సిరు లొలయం
దనరు రతిసేనమందిర, మును గాపెట్టుకొని యుండు మోహము కల్మిన్. 133

సీ. పంచాంగమయ్యకుఁ బాగ సమర్పించు, నట్టువకానికిఁ బెట్టు మురువు
భరతంపుటొజ్జకుఁ బచ్చడం బొగిఁ గప్పు, బాగడుబస్సుకుఁ జేర్చు బోఁగుజోడు
కథఁ జెప్పు భూసురాగ్రణికి దోవతొసంగు, ననువుకానికి బత్తెమెనయ నడుపుఁ
బూల్గట్టు సాతానిబోడి కుంగర మిచ్చు, గందొడివానికి విందుసేయుఁ

తే. జతురికకుఁ జీర దూతికి సందిబొందె, కడెము పరిచారకకు సారికకును రవిక
తాపికకు సొమ్ము వైశ్యమాతకును గాన్క, లిచ్చి చెప్పించు రతిసేన కెచ్చుతమిని.

వ. మఱియును. 135

ఉ. గుండలికిం బసిండిపని గోరడిబండకు వెండితాయతుల్
లండికిఁ జేకడెంబు పదిలంబుగ గుమ్మెతకాని కందెలుం
బెండెము బాడుగోలునకు భృత్యునకున్ మైడనూలు చాటుకో
దండున కుంగరాలు మొలత్రాడులు గుంటెనకాని కియ్యఁగన్. 136

క. వారందఱు తమచాతురి, మీఱి మహాసంపదాప్తి మించినవాఁడీ
జారాగ్రణి యని చెప్పిన, నారతిసేనయు మంచి దని యియ్యకొనెన్. 137

క. పదఁతుక నతఁ డీగతిలోఁ, బడఁజేసుక మూరిపె ముట్టిపడఁ గడుదమి దుం
దుడు కొనరింపఁగఁ గోరిక, లడరఁగ రతిసేన రతుల కాయత్తం బై. 138

క. పన్నీట జలక మొనరిచి, కన్నురి రానున్న మిన్న గన్నన్నకు ముం
మునొనెసఁగి సన్నబియ్యపు, టన్నము మితభుక్తి చేసి యమితోత్సుకుఁడై. 139

తే. చాదు శ్రీగంధ మగరు కేసరి కదంబ
మత్తరు పునుంగు జవ్వాది హరిణమదము
బుక్క యత్తరు గోవగంబూర బోలు
చట్ట కలపంబు పన్నీటఁ జాది పూసి. 140

క. సిగ నరవిరిసరములు పొం, దుగ వేసి రుమాలు గట్టి దుప్పటి వలెవా
టుగ వైచి విడెముసేయుచు, సొగ నుట్టిపడంగ నతఁడు సొంపు జనింపన్. 141

సీ. సకినెలపట్టెమంచము పాన్పు తలగడ, బిల్లలు చందువ మల్లెవిరులు
కరడ సురటిగిండి గద్దె సున్నపుఁగాయ, గాజద్ద మడపము కలపము చిటి
చాప తబుకుసాన జాలపల్లికదీప, ములు గందవడిదట్టి పునుఁగుబరణి
యాకుసంబెళతంబు రగురుధూపము పాను, కలు తమ్మపడిగము కప్పురంబు

తే. క్రొవి కస్తూరివీణె కుంకుమసుమంబు, పొట్లములు రుద్రవీణె మేల్కట్లుభాగ
ములకరండంబు రతిబంధకలితచిత్ర, ములు గలుగు కేళినిలయ మింపలరఁ జేరి.

తే. బలసి కోకిలు నొడ్డీలు పల్లటీలు, పావురాయులు బకదార్లు బట్టిగాండ్రు
నంచలు నెమళ్ళు కేర్జము ల్పంచవన్నె, చిలుకలు పికాదిశకునము ల్గలసి పలుక. 143

తే. చంద్రకావి ఖురాళంబు సరిగెచెఱఁగు, జిలుగుకెందమ్మి దోదమ్మి చీనికమ్మి
పైఠిణీకమ్మి తెఱచాటుపాన్పుమీఁదఁ, బదటుశమి నుండునంతనప్పణ్యకాంత. 144

వ. మజ్జనభోజనాదివిధుల సంతుష్టహృదయ యై భావసూచక బిబ్బోకహావభావలలిత కుతూహలకిలికించితవిహృతవిచ్ఛిత్తి విభ్రమ ధైర్య లీలాహాసమాధుర్య హేలావిలాస చకితాది శృంగారచేష్టల కనువైన యాలింగనంబు సరసాలింగనంబు దృఢాలింగనంబు సర్వాలింగనంబు స్పృష్టక పృథక యనురూపగూహన జఘనోపరిగూహన కుచాలింగన లలాటిక నిరూపణ లతావేష్టిత వృక్షాధిరూఢ తండులక క్షీరకంబులను చతుర్దశాలింగనంబులు గావించి యుప్పొంగుతమకంబున నతండు.

తే. చుంబనంబును బిలతనంబుఁ గబళి, తంబు తూషణ మనుపేళ్లఁ దనరు నాల్గు
గతుల ముఖరతిభేదము ల్గలయఁజేసి, ద్రవముఁ బుట్టించు తాన కౌత్తడవి చూచి.

తే. సఖియ యంగుష్టపదగుల్ఫజానుజఘన, నాభ్యురస్స్తనకక్షకంఠసుకపోల
దంతగల్లాక్షిఫాలమస్తకశిరోజ, ములు ప్రతిపదాదిగలకళాస్థలము లంటి, 147

సీ. చెవులనిమిత్తంబు చెక్కులస్ఫుటితంబు, నధరోష్టమున భ్రాంత మడరఁ గన్ను
గవదిర్యగంబును గక్షదేశంబులఁ, బ్రథితంబు చనుదోయి నధరకంబు
చిత్తజుగృహమున నుత్తరస్ఫుటితంబు, పొక్కిట సంపుటంబును శిరోధి
ననుపదం బూరుల నన్వితం బన నొప్పు, దశచుంబనములు దత్తత్స్థలములఁ

తే. బొదలు ముదమునఁ బర్యాయమున ఘటించి చ్ఛికలయశశకప్రతనుయూరఫలకరంజి
సుచ్ఛురికమండలికగండసుత్రిభాగ, ముఖముఖనఖక్షతంబులు మొనయఁజేసి. 148

తే. క్షతరదోచ్ఛ్వాసఖండాభ్రికప్రవాళ, మణికమూఢకరుచిబిందుగుణకబిందు
మాళికాగోళచర్చితాఖ్యాళివెలయు, పది రదక్షతముల వేడ్కఁ గదియ నొక్కి. 149

క. స్థితమును దిర్యగముక్తో, న్నీతమును నాభిసిత మనఁగ నిపుణజనులు ప్ర
స్తుతిగొనఁ దనరు చతుర్విధ, రతుల గతుల నతుల నబ్బుగము గావించెన్. 150

వ. వెండియు నఖండసురతపాండిత్యంబున విటుండును నయ్యండజయానయు మగవేదండంబులరీతి జృంభక కూర్మక రణాస్కంధయుగ గర్భపీడిత సాధుక దృఢేలావుక కర్కటక సముద్గక వేణుదారిత సంయమకృత కోపరతి ధృతోరువక నాగర ప్రేమాభిరామ చక్రభ్రమణ ప్రసాదిత శూలాంచిత పాదవేష్టితబాణరంజన మదనరంజన పార్శ్వఘట్టన భావికోల్బణ మండూకకరణ గ్రామ్యకరణసర్వతోభద్ర మండలప్రభ మధురకంపితాంగ సంపుటార్ధసంపుట పద్మక అర్ధపద్మక అంబురుహభారచరణ

పాదపదక పాదబంధ పాదాశ్లేషణ మదనడోలన చంద్రార్ధ మండలార్ధ యూరు
చరణ కక్షపాద విష్టిక హారిక కరణ నాగపాశాంగ చక్రగుహ్యాక ద్వారదావలం
బన చిత్రలాఘవ మదనకుంచిత గగనకరణోర్ధ్వబాహూద్భూత మర్కట విమర్దన
వేణుకోద్వేగ పదావృత్త గజాంగ దృఢాంగ సింహావలోకన పాదారోహణ
ప్రియాంగ బాడబబాణ కృత్తమదన రాజహస్త లాఘవ బాహుచరణ చక్రపాద
మదన సంఘట్టన పాదమేళన గోముఖాంగ సంవేద్యకరణ సమితాంగకరణంబులను
చాశీతిబంధంబులను జమత్కారంబులఁ బెనంగుచుండి రయ్యవసరంబున. 151

సీ. గంబూరమును జాజికాయ లుమ్మెత్తవి, త్తులు మల్లు మాతంగి కలువగడ్డ
పచ్చయెన్నులు కోష్టు పచ్చిక మంచేనుఁ, గమదము గుల్లసున్నమును రుద్ర
జడవేరు వస ఖురాసాని వామము పుడు, కలషోలుఁగాడు మైగారుచెమట
నీ రావుగజ్జలచేరినమట్టును, గాల్మడి జాతంటుగాను నూరి
తే. కలయ గురిగింజలంతేసి గుళిక లమరఁ, జేసి నీడనె యారించి తీసి దాచి
యున్నమం దింతమదుపుతో నొసఁగెనతని, కధికతర మోహమూన నాహంసయాన.

క. ఈ బాళిమందు మసగొని, యాబిడ తనకండ్లు గట్టినట్లుండ నతం
డేబుద్ధిలేక నచ్చెలి, సోబెల కెదఁ జిక్కి చిక్కి చొక్కుచుఁ దిరుగున్. 153

తే. వాఁ డటుల మీఱి భోగము వారిఁ గేరి
చేరి రతిసేన రతిరాన్ఁ జెలఁగు మదిని
దానిసొమ్మైన యమ్మైన దట్టమైన
వయసు మరుబారిఁ బడఁజేయు వానిజాయ. 154

సీ. బొమ్మలపెండ్లిండ్లు బువ్వఁపుబంతులు, పుణికిళ్ళు నిట్టుక్కి బొమ్మరిండ్లు
గుజగుజరేకులు గొబ్బిళ్ళునిగ గే, బుడిగిన్న జాబిల్లి పుక్కటిల్లు
గుజ్జెనగూడులు కోలుకోలన్నలు, గీరనగింజలు పారుపట్లు
పిప్పిళ్ళు త్రొక్కిళ్ళు బేడిసెతిరుగుళ్ళు, నచ్చనగండ్లు దాయాలు పాళ్ళు
తే. లడరు వామనగుంట లాడైనయట్టి, యాటపాటలఁ బ్రొద్దువో నసుఁగుఁ జెలులఁ
బాయక చరించు బాలకీప్రాయ మేల, వచ్చె విరహాగ్ని యిటులేల హెచ్చె నసుచు.

క. నెరవయసు పిక్కటిల్లఁగి, సురతం బొకవేళనైనఁ జొప్పడమి మదిన్
బరపురుషవాంఛ వొడమిన, విరహంబున రేయిపవలు వేగుచు నుండున్. 156

చ. ఉదు టగువానిఁ బ్రాయమున నుండెడువాని మనోజ్ఞలీలసం
పద గడిదేరువాని గుణపాటవ మొందెడువాని నేపుచేఁ
బొదలెడువాని గీతములపొల్పు లెఱింగినవాని సంగమో
న్మదమున మించువానిఁ గనిగన్ మరుబారికి నగ్గమై పడున్. 157

తే. ఇరుగుపొరుగులదంపతు లేపురేఁగి, సంగమక్రీడ నోలాడి సరసమాడు
సొవసొవలు విన్నమాత్ర నున్నరు మటంచు, మన్మథునిబారిగొల్లరై మగువదలకు

వ. అంత నక్కాంత వేఱొక్క వాసరంబున. 159

చ. అటుపలె వేగుచుండి మగఁ డత్తయు మామయు నింటలేమి వె
ల్పటికి హుస్సారునం జని గుబాదెబవీథులవెంట జంటలై
చిటిలినపూఁతగంధముల సిస్తగుపాగల నిండుచల్వదు
ప్పటుల విభూషణావళుల బాగుగ నేగెడు దుండెకాండ్రలోన్. 160

సీ. పసిడిమప్పెలకీవి పారుకుచ్చులు నిండ్ర, గోపంపుజగజంపుగుంపువారి
కుమ్మకుక్క సిగ్గెము గ్లొల్లెల్లు ముసనాభు, చెక్కడపుంబచ్చచిలుకచెండ్లు
పట్టుపట్టంచుతాప్తాలేపు జీవదం, తపుగోడియలు పట్టుత్రాళ్ళ దిండ్లు
నేనుంగుకొమ్ము కాశేరకిఁ బేటాకు, విలికెలమ్ములు సెల్లు వెండపీటి
తే. కేను లీవంగి సోఁక పొక్కిలులపోలు, పుప్పిచిమతిండియును లేఁతముందునిమద
గణపుసదుఁపావుసీలరక్తములపన్ని, కొమ్ముపున్నాగ మపురం దలమ్ములంచు. 161

క. పగ లుట్టిపడఁగఁ దమతమ, సొగసులతో విఱ్ఱవీఁగు సొంపుల మీసాల్
పగలున వడిస్రేయుచుఁ జిఱు, నగవులఁ బద మనుచు జారనాయకు లలరన్ .162

సీ. పైచరమోరడిబలిమికం బొద్దిక, ముల్లడితాకుడు జల్లికట్టు
మైసళ్ళు మెడగుడు మారువెంబడిబిట్టు, జతుకు సమాధానజతన మడుగు
లోదాటు నడ్డకౌలువపాదబెళకుని, బ్బరము నీరడికందు బలిమిదిరుగు
నుమ్మలి సెలవు పాదొత్తుకలు ధుతాళి, తోడిగట్టయుఁ గాలజడుపులావు
తే. హోయలు బూరుగ పన్నాగహోయలు బిగవు, బొట్టు డేగురురేకప్ప బెట్టడిసుము
పటమ తాకుడు మొగవోయల్పదిలమదిగో, హెచ్చరికటంచు పడిబోయలేగుమండ.

ఉ. సంచపురేకు దుప్పటులు జారుసిగ ల్బిగిచల్లడాలు వా
సించెడిగంధపట్టియలు బిల్లురుమాలలు సందితాయెతు
త్మెంచుగ సొనచిమ్మునుమీసలు దీటుచు మీటీ కేరి ధి
క్కించు పటంచు గుంపుగొని కేకలు వేయుచు వచ్చువారిలోన్. 164

తే. మంతుఁ డన నొప్పు నెరవింత హొంతకారి, సొగసుబయుకారిఁ జానయుఁ జూచిదగ్గి
కేకరించిన నాతఁడు కెరలి కాంచి, యిదియుఁ బగలాడిరా యని కదియఁ జనఁగ.

ఉ. గేఁదగిరేకుటత్తమునఁ గీల్కొనుచూతదళంబు నాళ మిం
పూఁదినజాజిమొగ్గ గజమత్పలపుజ్జ జలికట్టు సంపఁగిం

బాదురుగా నొనర్చినతుపాకిని బుప్పాడి మందు కప్రపుం
బూదియగుండు నుంచి మరుబోయఁడ మీయన నేసె నిర్వ్యరన్. 166

వ. అప్పు డామంతుఁ డయ్యింతిచెంతకు సంతసంబున వచ్చుచు నిజాంతర్గంబున. 167

ఉ. ఆరయ నేరఁజేటియసలందులవెన్నెలతేటనించి తో
ల్కారు మెఱుఁగురంగు లిడి కమ్మసుధ స్పద నిచ్చి మేటిశృం
గారరసంబుతోడఁ బొసఁగంగ ననంగ విధాత చేసెఁ గా
కీరమణి న్విధాత సృజియించుచు నంటినఁ గంద కుండు నే. 168

సీ. దీర్ఘమై విలసిల్లుఁ దేటవాల్గనఁ దోయి, గుఱుసైన నాభియుఁ గుల్కుచుండుఁ
గ్రొమ్మించుగతి హెచ్చుఁ గొమెరచేతులరీతు, లుత్వంబుచందాన నొప్పు జఘన
మాత్వంబుభాతిని నమరుఁ గర్ణద్వయం, బేత్వమై జడపొంక మెసఁగుచుండు
నైత్వంబువిధమున నలయూరు లలరారుఁ, దలకట్టువలె మించుఁ దళుకునొసలు

తే. నున్న నడుము విసర్గలు చన్ను లాయ, పొసఁగు వలపలిగిలక యాభుజము లనఁగ
నలరు గుణితంబు వైఖరిఁ జెలఁగు నంగ, సౌష్ఠవముతోడ నున్నది సకియ యనుచు.

వ. కదియం జేరి యప్పుడు. 170

చ. చెలియరో యేపురం బెటకుఁ జేరఁగ వచ్చిట నిల్చినావు నీ
కొలరప మొప్ప దగ్గితివి నెమ్మదిలోఁ గలపూన్కి దెల్పు మా
యలు పచరింపఁ బోకనిన నమ్మక చెల్లరొ యీతఁ డెందు కం
దులకుఱు లొగ్గి నేచి కడుదొమ్మికి రాఁ దలచెఁ బెబాసుపో. 171

తే. అనుచుఁ జిఱునవ్వు మోముపై నంకురింప, భయము సిగ్గును దనుముంపఁ బలుకు నెడల
గద్గదరవంబు జనియింపఁ గన్నెదాన, మేలు పడినాను జాణ నన్నేలుకొనర.

క. అనినవిని మంచి దని యొ, క్కనివాసస్థలముఁ జేరఁగా రమ్మని వ
చ్చినఁ జేరి ముద్దులిడి మె, ల్లనఁ జేష్టల నుబుసుపుచ్చి లాలిత్యమునన్. 173

క. కళలంటి ముద్దు వెట్టుక, వెలసినతమి మోవి నొక్కి వీపునుఁ జనుము
క్కులువెళ్ళఁ గౌఁగిలింపుచుఁ, బలురీతుల రతులఁ గలసి భ్రమ నొందించెన్. 174

క. ఈచక్కి నీవు నిచ్చలు, రాచిలుక సిపాయి రౌతురణమున వలపుల్
పీచణుచు మనిన హా యని, యాఁచిగురుంబోడి కౌతఁ డభయం బిచ్చెన్. 175

తే. ఇచ్చి సందైనయపుడెల్ల వచ్చి సైగ, చేసి విటుఁ డేగఁ దానేగి చెలియ యింట
సురతకేళుల నలరింప సుఖము మరిగి, తిరిగెఁ దనయత్తకన్నఁ గావరముపట్టి. 176

ఆ. అత్తకన్నకోడ లయ్యత్త కోడలి, కన్న నేపు రేఁగి యాప్తజార
జనులఁ గూడి పాడి చరియింప సాఁగిరి, యొంటిపాటు దొరకి యున్నయెడల. 177

తే. అత్త యేమఱి యుండెడు నంతలోనఁ, గోడలు చరించి వచ్చును గొంతదడవు
కలయఁగ గుణాలు వచ్చునాక్షణమె బుద్ధి, కోడలికిఁ జెప్పియత్తరంగాడఁబోవు.

క. ఈమాడ్కిని నన్యోన్యం, బేమాత్రము తెలియకుండ నిచ్ఛాప్రవృత్తిన్
గామించుచు నొకదినమున, లేమాపునఁ గోడ లింట లేకుండునెడన్. 179

క. ఎలవనిసతిపురుషులకును, వలపులు పుట్టించు మందు వగ నెఱిఁగి రతిన్
వలపులు మరుపం జాలిన, బలియుం డగు హొంతకారి పథమున రాఁగన్. 180

ఉ. అత్తలహొంతకారిని రయంబునఁ దోడ్కొని మూలయంటిలో
హత్తుకకేళి సల్పునెడ నంతటఁ గోడలు వచ్చి యింట మా
మత్త విభుండు లేరనుచు మంతునిఁ దోడ్కొని యిల్లుచేరినన్
దత్తర మారఁ గోడలిని దద్విటునిం గని యత్త కిన్కతోన్. 181

తే. అపుడు గృహమధ్యమునయందు నత్త నంత, విటునిఁ గోడలు గాంచె నవ్వేళయందు
నేర మొక్కింత రాకుండ నేర్పు మెఱసి, వారలిరువురు బొంకఁగావలయుఁ జెపుమ.

క. అనవిని హేమానతిరయే, యను సమరఁగ నితరశంక లందక యుండన్
ఘనకచలు బొంకి తమవిట, జనముల నిల్వోడల నంపఁ జాలిరొ యెఱుఁగన్ 183

క, నీ వెఱిఁగించిన వినియెద, నా విని హేమాతీ వినం గడువేడ్కల్
భావమున నున్న విను మని, ధీవిభవము హంసవింశతిలకం బనియెన్. 184

తే. అటుల విటయుక్తయై యింటికరుగుదెంచు, కోడలినిజూచి యత్తసక్రోధయగుచు
వీఁ డెవఁడు వీనిఁ దోడ్కొని వేశ్మమునకు, సంజకడ రాఁబనేమనిజడియ నడుగ.

క. దిటచెడక దిగులుగొని సట్టు, సొట లోపక వెనుకముందుఁ జూడక బొంకే
దెటు లని చింతింపక యా, ఘటకుచ తడఁబడక యత్తఁ గన్గొని పల్కెన్. 186

తే. తల్లిదండ్రులు మీరు బాంధవులు మఱియుఁ జిక్కి తక్కినవారలు చెప్పినపుడు
వినక నాపతి నన్నిట్లు విడిచిపెట్టి, తిరుగుచున్నది మీకెల్లఁ దేటగాదె. 187

క. వనితాపురుషుల కీయన, యనువున నన్యోన్యమోహ మందఁగఁ జేయున్
ఘనుఁ డని కొందఱు చెప్పఁగ, విని తోడ్కొని తెచ్చినాను విభునను గూర్పన్.

క. ఇది యేక్రియ నీయనచే, ముదమునఁ జేయింపవలెనో ముగ్ధను బ్రాయం
బొదవినదానను మోహము, దుది సైఁపఁగఁ జాల ననుచు మమతఘటిల్లన్. 189

ఉ. కోడలుపల్కుపల్కు విని కొంకక నిక్కముగాఁ దలంచి యా
చేడియ నాదుజారుఁ గని చిత్తములో నెటులం దలంచునో
దూడెల నమ్మరా దని విధుంతుదవేణి తనందు సత్యపుం
జాడఁ గనంబడన్ స్వతనుజాతిలతాంగిని జూచి యిట్లనున్. 190

క. నీవింత యడుగ నేటికి, నీవిభుఁడు పరేచ్ఛఁ బూని నిను విడిచి చరిం
చేవిధము తెలిసికాదే, యీవైద్యుని దోడి తెచ్చి యింటికిఁ దరుణీ. 191

వ. అని యజ్జగజంత నిశాంతంబున నున్న తనయుపకాంతునిఁజూపి వెండియుఁగోడలి
కిట్లనియె. 192

క. నీపతి నిన్నుఁ బరింపక, బ్రాపగు యత్నంబు నితఁడు భస్మస్థలిలో
నేపున నొనర్చినాఁడిక, రేపట మర్నాట నీనుప్రేమ ఘటిల్లున్. 193

తే. అనుచుఁ దనయందుఁ జెలియ సందియముఁ జెంద
కుండ నెఱిఁగించి యత్తయో యుత్పలాక్షి
యతని నంపించు మిప్పటి కితనిచేతఁ
గాకయుండినఁ జూతముగాక యనిన. 194

క. విని కోడలు నాయందలి, నెనరున నీయత్త యతని నిక్కము తోడ్తె
చ్చినయది పతి ననుఁ గూర్చుట, కనితలఁ చటు సందుగామి ననిచెక విటునిన్.

ఆ. అంత దానియత్త యాత్మోపపతిఁ జూచి
సైగసేయఁ దెలిసి జారుఁ డపుడు
తత్ప్రియత్న మపుడె తగఁ జేసి తని వార
లిరవు లెఱుఁగఁ బలికి యింటి కరిగె. 196

చ. అని కలహంస వంశమణిసాంగముగా వినిపించె వీనుదో
యినిఁ గడుసమ్మదమ్ము జనియింపఁగఁ దత్కథ యాలకించి కాం
చననుమగంధి యాసతులచాతురికాత్త నెబా సటంచు మే
లనుచు గణించికొంచు నిలయంబున కేగె నినుండుదోఁచినన్. 197

క. ఈరీతిఁ బడకయింటికిఁ, జేరంజని మఱుసనాడు చీఁకటి జేజే
రారాకళ రా రాఁగల, యారజనీవేళవిరహ మగ్గల మైనన్ 198

సీ. విరిదండనెత్తావినెఱిఁగుంపు గండుతు, మ్మెదపిండునకు మోద మొదవఁజేయఁ
గాశ్మీరతిలకంబుకొంతులు పదనెందు, బింబంబునకు సంజడంబు గూర్పఁ
గస్తూరిపత్త్రభంగములనిగ్గు కపోల,శశిఖండములకు లాంఛనములీన
వాసించు నెఱిగంధపడిపూఁత చనుగుబ్బ, పువ్వుగుత్తులకుఁ బుప్పొడులఁ గురియ

తే. నీలమణికొంచి ఘృణులు విశాలజఘన, ధరణి కంబుధిమేఖలాత్వము ఘటింప
నృపతిమణిఁ జేరుకోర్కె నన్నీరజాక్షి, వచ్చి రాయంచకడనిల్చె మెచ్చులొల్క.

వ. అప్పుడు హేమవతికి హంసం బిట్లనియె. 200

## పందొమ్మిదవరాత్రికథ.

క. శ్రీకర మను నొకపురమును, ధాకరబింబభ్రమప్రదస్వర్ణమణి
ప్రాకారగోపురవర, ప్రాకారనువజ్రకలశమైసిరు లొంమన్. 201

శా. సాలాగ్రస్థలకేళితత్పరమహీస్వామ్యర్భకవ్యూహవో
పాళీక్రీడితరత్నకందుకమహాబాధప్రణావాప్తిచే
నాళీక ప్రియ ధీరసారథికి ను స్నాటిల్లి యీనాఁటికిన్
బోలేదయ్యెననూరునామమదివో మూలంబు తత్సంజ్ఞకున్. 202

మ. పరిఘాంభఃపరిదృశ్యమానవిలసత్సాతాళసంచారబం
ధురదర్పోత్కరభోగరత్నఘృణిసందోహంబు కెందమ్మిమొ
గ్గరహిన్ గుల్కి హరింపఁబూని యది రాకన్ దక్కినన్ బల్మఱున్
గరముల్ సాఁచఁగ బోండ్లు నవ్వుదురు వీఁకన్ వారికేళిన్ సతుల్. 203

తే. ఆపురంబున ఫణిహరుఁ డనెడుపేరఁ, గాఁపురము చేయు నొకతిలమాతకుండు
సంభ్రమంబున నాకారసౌష్ఠవమున, వాఁడు కందర్పునకుఁ జీటి వ్రాయఁగలఁడు.

తే. గాలిగిక డెంబు మోకులుగడ్డపార, కొడిసిద్దెలు గూటంబు కడవ జల్లి
గంప కనుగంత తక్కెడి గట్టియెద్దు, చుట్టుచవికెయు సర్వవస్తువులు దనరు. 205

తే. వెల్లగిసెనూనెకుఱునూనె వెట్టినూనె, నల్లనూ నిప్పనూనెయుఁ దెల్లనూనె
కుసుమగానుగ దుండుగ కొబ్బెరయును, నూనె పొగనూనెతగిరెసనూనె మఱియు.

క, పరిపాటికల్మి చేతను, గరగ్గరిక వహించి మించి కడునాగరిక
స్ఫురణం దమపంశంబున, కరయంగాఁ బిన్నపెద్దయై యతఁ డుండున్. 207

చ. అతనికి నొక్కయింతిగల దంగజుపట్టపుదంతి జారిణీ
సతులకు మేలుబంతి విటజాలము లాడెడుపూలబంతి యా
యతమతి జారచిత్తజమహావిరహాగ్నికి శాంతిదేహని
ర్జితచపలానుకాంతి మణిచిత్రిణినాఁదనరారుఁ బేరునన్. 208

నిరోష్ఠ్యకందము. దరగళఘనరసధరకచ, ధరసదృశస్తన సురదన తరళనయన నుం
దరకంఠకక్షుకరయుగ, సరసనయన యనఁగఁదరుణి సరసతఁ దనరున్. 209

సీ. నీలధారాధరనిర్మలకాంతుల, గడియలో మాయించుఁ గలికివేణి
సంపూర్ణపూర్ణిమాచంద్రబింబస్ఫూర్తి, దినము కుందఁగఁ జేయుఁ దెఱవముఖము
నిద్దంపురుచు లొల్కు నద్దమ్ము లీక్షించి, గవిసెనల్ పెట్టించు కాంతచెక్కు
ళ్లలరారు జిగిదేఱునలచక్కోరంబులఁ, బుట్టుగుబ్బిడ్లనిపల్కుఁ బొలఁతికనులు

తే. నెట్టుకొని గట్టు పగపట్టి పుట్ట చెండ్లఁ, బట్టి కొట్టించు వీఁపునఁ గొట్టుఁ బాఱఁ
గొమిరెసి బ్బెంపుగబ్బిచన్గుబ్బదోయి, విపుమదారంభగంభీరవేగమన. 210

క. తనుకాంతి మెఱుఁగుమిసుకా, మిసుకాంర మణఁమఁ గౌను మేలిమి గనకా
కనకాద్రితోడ సరి చనుఁ, జనుకానన్యస్మ పొగడ సన్మణితునకా. 211

తే. నీరజేక్షణనిబ్బెంపునిబ్బరంపు, గబ్బిగుబ్బల నెఱరూపు గాంచి తొడరు
కాంతిఁ బొంగారు బంగారుకలశములకుఁ, గనలు బిబ్బోకనిరాక గలుగఁజేసి.

మ. వనజాతాక్షిపయోధరంబు లలకవ్రాతంబు కంఠంబు మో
హనలీలం దగు ఫాలభాగమును నూగారున్ నవశ్రీలచే
ఘననీలాబ్జకళాకలాపజయకాంక్షన్ మించు నే యభ్రముల్
ఘననీలాబ్జకళాకలాపజయకాంక్షన్ వేణి రాణించఁగన్. 213

ఆ. దానిజవ్వనంబు దనువు నిరీక్షింప, నూనికైన నెనరు మనసు పుట్టు
నితరజనులు చూచి యేణాక్షిరతిఁ జెంద, నిచ్చయింతు రనుట కేమి యరుదు.

తే. త్రుప్పడుల్లిన నొప్పారుతోయజాస్త్రి, చికిలినిద్దంపుఁగ్రైదువుఁ జెలువు తోఁప
నూనె మెఱుఁగున నునుచాయ మేను దనర, నది విటాసల కన్నాస యై మెలంగు

చ. నడపడిగల్గువాఁడు కడునాణెము చేఁగలవాఁడు రూపునన్
బెడఁగగువాఁడు బల్రతుల బేరజమై తగువాఁడు నిద్ధరన్
జెడుఁగల బ్రహ్మ దీనిని నిసీ మగనాలుగఁ జేసె నంచు లో
మిడుకుచు దానియింటికడ మీసలు దీటుచు నుందు రెప్పుడున్. 216

సీ. పనిలేనిపని పూనుకొని వచ్చి ముంగిటి, నెళవుగఁ దిరుగనినీటుకాఁడు
వేఱొక్కకడ కేగువేళల నటుతొంగి, చూచి పోఁదలఁపనిసొగసుకాఁడు
సంగడికాఁ డిందుఁ జనుదెంచెనా యని, వాకిలిద్రొక్కనిచిన్నెకాఁడు
గానుక యీప్రొద్దు కట్టలేదా యంచుఁ, గూర్చి యింటికి రాని కోడెకాఁడు
తే. మంచునకు నైనఁ బ్రాయంపుమనుజులందు, వెదకి చూచిన నొకఁడైన వీటిలోనఁ
గలుగఁ డటువంటిమహిమ గల్గంగ దాని, కేమి జనవశ్యమున్నదో యెఱుఁగ రాదు.

ఉ. ఆమణిచిత్రిణీసుదతి యన్యజనోత్కరసంగమంబుపైఁ
బ్రేమ జనింప నాత్మ పిసిబీకులు వెట్టఁగ వీటిలో విట
స్వాముల గారవించుఁ గృకవాకభుజంగమధేనుకేభము
ఖ్యామితబంధకేళులఁగళాదు లెఱింగి కరంగఁ జేయుచున్. 218

తే. ప్రేమఁ గన్పట్టి వీథిలో బెనకువగల, నరని కనుసైగ చేసెడి యంద మంత
లోనె లోఁబడఁ జేయంగఁ జూననేర్పు, దానికే కాక కలుగ దేచాన కైన. 219

తే. ఇరుగుపొరుగింత వినకుండ నింటిమగఁడు, తెలియకుండఁగ బరరతిఁ దేలి నంగ
నాచివలె నుండుఁగాని యానాతిగుట్టు, బ్రహ్మదేవున కైనను బయలుపడదు 220

వ. వెండియు నయ్యండజయాన విటకాండంబులఁగూడి యఖండమోహంబునఁ బలు
దెఱంగులఁ జరింపుచుండె నివ్విధంబున. 221

ఉ. అంత వసంతవేళఁ జెలు వంతట నెంతయు సంతసిల్లె న
త్యంతలతాంతకుంతదళపత్త్రనిశాంతమరంతతాంతతా
శాంతికరంబు కంతుశరసంతతసంతతికాంతతాసమా
క్రాంతవనాంతరంబు కలికాతతిదంతురితద్రుమాంతమై. 222

తే. కలయఁ గొమ్మలతోఁ గూడి కాననమున, నుండు విటపుల ననిలచోరుండు పట్టు
కొని దళాంబరముల దోఁచుకొనియె ననఁగఁ, బండుటాకులు గాడ్పులు పర్వరాలె.

క. వనలక్ష్మీమాధవశో, భన మగు నత్తఱిని బాదపలతాపురుషాం
గన లన్యోన్యముఁ గ్రీడిం, చిన నెఱయ వసంత మనఁగఁ జివురులు మొలిచెన్. 224

చ. వనకమలాయణాంబర మవారితకుంజపికౌఘశోణలో
చనఘృణిమండలంబు తరుసంఘదిగంబరపంక్తిమస్తకో
కనదభసజ్జపాన్పృతము కానన మేఘతటిల్లతోత్కరం
బనఁగ నవీనపల్లవచయంబు రహించె నరణ్యభూములన్. 225

చ. అళితతి దక్కయెల్ల కుసుమావళి చుక్కలనామ ముల్లస
త్కళికలు పూసపేరు నన దట్టము పట్టుగఁ బూని మావిజా
జులకు శుభాశుభాలు పికసూక్తులఁ దెల్పుచుఁ జైత్రుఁడనే
యల బుడబుక్కివాఁడు కలయం జరియించె వనాలయంబునన్.

చ. అళికుల గానవైభవము హర్ష మొనర్పఁ బరాగపూగము
ల్చలువపుతావిగందపొడి సమ్మద మానఁగఁ గిల్కిచిల్కప
ల్కులు నలరింపఁ గ్రొత్తవిరిగుత్తిచనుంగవ లింపు నింపఁ బూ
ల్పలరు లతాలతాంగులను బాయుట లెట్లగుఁ బల్లవాళికిన్. 227

చ. చాయతరాతపత్త్రములు చామరము ల్సురటీలు పావడ
ల్సారసరోత్తరీయములు చల్వపువల్వెపుదుప్పటంబు లిం
పౌను సుగంధలేపనము లందముఁ జెందువితానఁబంక్తులై
మీఱె వసీరమాసతికి మెల్లనిగాడ్పుల రేఁగుపుప్పొడుల్. 228

వ. ఇత్తెఱంగున జగన్మోహనంబైనవసంతసమయంబున నవశిసుర లగ్నిష్టోమంబును షోడ
శాప్తోర్యామంబు ద్వాదశాహస్సు వాజపేయంబు పౌండరీకం బతిరాత్రంబు చయ

నంబు గరుడచయనంబు శ్యేనచయనం బశ్వమేధంబు గవాలంభనంబు ప్రతిపస్తో
మంబు మహావ్రతంబు విశ్వజిత్తు రాజసూయంబు సర్వతోముఖి విశ్వతోముఖి సత్త్ర
యాగంబు బృహస్పతిసవనంబు ప్రాతస్సవనంబు మాధ్యందినంబు సౌత్రామియు నాగ్నే
యంబు షస్యం బశ్వినంబు హేమంతప్రత్యవరోహణంబు వృషభయజ్ఞంబును మొద
లగుసకలక్రతువు లొనరింపం దొడంగి రట్టిసమయంబున. 229

క. హరిశర్మ యనెడుపేరునఁ, బరఁగిన యొకసోమయాజి పనిచిన నొకభూ
సురసుతుఁ డొకదిక్కున న, ధ్వరపశువును బట్టుకొని ముదంబున రాఁగన్. 230

క. కంతువసంతజయంతులఁ, బంతంబునఁ గెల్చు నతని భవ్యాకృతి న
త్యంతముదంబునఁ గన్గొని, కంతుశరాహతుల కలికి గానుగ దాత్మన్. 231

చ. కలికిచకోటపున్ సొగసుకాయము కాయజుఁ గేరి మీఱు నీ
కలికివయోవిలాసుబిగికౌఁగిట సొక్కుచు నుండలేని యా
కులుకుటొయారగబ్బినసగూటిమిటారుల యంద మేల యె
మ్మెలపసరేల యం చతనిమీఁదను గాంత దృఢానురాగయై. 232

ఉ. చెంతకుఁ జేర నేగి ముఖసీమ దరస్మితమొప్ప వారసీ
మంతిని కీయనో వెలకు మార్చనో యేటికిఁ గొంచుఁ బోయె ద
త్యంతరయాన ఛాగము నటంచును మాటలు దీసి పల్కు న
శ్రాంతముదంబుఁ గైకొని ధరాసురసూనుఁడు విచ్చఁగన్నులన్. 233

మ. అనవద్యాకృతి యౌవనంబు దగు నయ్యబ్జాక్షి వీక్షించి హా
వనజాతాసనసృష్టికౌశలము లేవన్ దీని నిర్మించినం
తనె కానంబడె నేర్ప రౌ ననుచుఁ దద్వాణీశుఁ గీర్తించి మె
ల్లనె చేరం జని దానిచెంగటను మేలం బాడుచున్ నిల్చినన్. 234

తే. అలరుకన్నులఁ దేలించి హర్ష మొదవ, సరస మాడుచుఁ గనుసైగ నెఱపి వేగ
నింటి కేగిన నచ్చెలి వెంట నేగి, క్రతుపశువు నాతఁ డొకచోటఁ గట్టివైచి. 235

వ. అప్పుడు. 236

క. మోహంబుమీఱఁ గంద,ర్పాహవమున వార లిరువు రతులప్రౌఢిన్
బాహాబాహి కచాకచి, దేహాదేహిని బెనంగి ధృతి నున్నంతన్. 237

ఆ. దానివిభుఁడు వచ్చి తలుపుఁదీయు మటంచుఁ, దనదుసతిని బిల్వ విని విటుండు
కడుభయంబు నొడముఁ గంపితదేహుఁడై, యింక నెట్టు లనుచు నింతి కనియె.

ఉ. అత్తఱి నెట్లు బొంకి వసుధామరశేఖరుఁ డైన యాభుజం
గోత్తము వెళ్ల నంపఁదలె నుత్పలగంధసుగంధి లెస్సఁగాఁ

జిత్తములోన యోజనలు చేసుక తెల్పు మటన్న హంసతో
బిత్తరి నే నెఱుంగ నిది పెంపుగ నీవె యెంచింపు నావుడున్. 239

క. మంచి దిది విను మటంచుఁ గాంచనగర్భాభ్య మబలఁ గనుఁగొని పలికెన్
బ్రాంచన్మధురసుధారస, చంచన్మకరందబృందసదృశమృదూక్తిన్. 240

ఆ. లలన నటుల భర్త పిలిచినఁ దా విని, యసుమతీసుతుండు వడఁకుచుండ
వెలుపల దటంచు వీఁపు దట్టి లతాంగి, వేగ మేకపోఁతు విడిచిపెట్టె. 241

తే. పొదువు పోసికపట్టును భూమిదేవ, సర్వ యనుకొంచు నచ్చి కవాటము గడె
యొడపినంతనె తద్భర్త యింతితోడ, నెవ్వఁ డీతండు గజిబిజి యేమి యనుచు.

చ. గదిమిన నావధూటి కలగన్ బడ కాత్మభయంబు లేక భూ
మిదివిజుఁ డీతఁ డీసవన మేషముఁ బట్టుకపోవఁ ద్రాడువే
వదలిన వేగ నచ్చి మనవాసముఁ జొచ్చుక చిక్కకుండినన్
బదపడి తల్పు మూసికొనఁ బల్మరు మేషము ద్రిప్పులాడెడిన్. 243

క. చూడు మని చూపి పాపినఁ, బోడు కడు స్మృగ్ధ మేకపోఁతునుఁ బట్టి
మ్మేడకుఁ బోవలెనో యని, చేడియ చెప్పిన నతండు చిఱునవ్వొలయన్. 244

తే. తరిమి మేషంబు పట్టిచ్చి తరలు మయ్య
బ్రాహ్మణోత్తమ యని పంపి భార్యమీఁద
సందియము లేక యెప్పటిచందమునను
వేడ్క లిగురొత్తఁగా నుండె వెలఁదిమగఁడు. 245

క. ఈమర్యాదఁ జరింపం, గా మహిమ యెకింత నీకుఁ గల్గిన భూమి
స్వామినిఁ జేరఁగఁ బొమ్మని, హేమావతితో మరాళి మిట్లను వేళన్. 246

సీ. కృకవాకుకంఠకీచకనివృత్తకదంబ, కమలకుఁ బడమటికడమరుత్తు
బహుళనిద్రాముద్రపద్మకాననపద్మభవనను మేల్కొల్పు పాఠకుండు
చక్రవాకద్వంద్వసంబంధసంధాన, శేముషీభూషణచేటకుండు
సురమార్గదీర్ఘికాంతరతీరబిసఖండ, భక్షణాయాతవలక్షపక్షి

తే. భూరికైరవవనరమాముఖవివర్ణ, భాజనసంపత్కరం బైన పగలుపత్తి
కులటలెదసుర్కఁ జోరులు గుట్టలెక్క, వేగ జనియించె జిగినిక్క వేఁగుచుక్క.

చ. అపుడు కథాచమత్కృతికి నద్భుతయై తలఁ ద్రిప్పి యద్దిరా
నిపుణత తద్ద మెచ్చఁగల నేర్పరి వౌ దని పల్కి యంత న
చ్చపలమృగాక్షి దివ్యమణిసౌధములో విరిదమ్మిపాన్పుపై
విపులస్థూలమోహాపహవేదనచే శయనించెఁ బొక్కుచున్. 248

వ. ఇట్లు శయనించి కొంతదడవు నిద్రించి హేమావతి రాజదూతి యగుహేలతో ముదంబున నిట్లనియె. 249

చ. కలయొక చేను గంటిఁ గలకంఠసుకంఠశుకాశ్వకేళికా
కలితకశోకశాపపతిగాఢభుజాపరిరంభణక్రియా
సలలితపారవశ్యసుఖసంభ్రమగుంభనజృంభమాణపుం
గల నల మేలుకొంటి రవిఁగంటి నకుంఠతరోదయోపరిన్. 250

వ. అనిన హేమావతిఁ గాంచి నియ్యిష్టంబు శీఘ్రంబునన యీడేరు నని దూతి చెప్పిన విని సంతోషించి యమ్ముగుద క్రమ్మర దినాంతంబున. 251

తే. నీల కాకోలకాకోల నీలనీల, కంఠ కంఠ శ్రీకంఠ ఘనఘనాఘ
ఘనఘనాఘ ఘటాఘట ఘటనరుచుల, పెంపు గనిపించుచీఁకటి పేర్చువేళ. 252

క. నలుగిడి కుంకుమపిండిని, దల సంపెఁగనూనె నంటి తావులగంధా
మలక మొసఁగి పన్నీటను, జలకం బొనరించి చల్వఁ దడి యొత్తి వెసన్. 253

సీ. చీనికలంకారి చీటికుచ్చులమీఁద, సిరిమించుసరిగంచుచీరఁగట్టి
కొదమరాచిల్కలఁ గూర్చి తీర్చినసీమ, సవుతుమేల్పనిచల్వరవికెఁ దొడిగి
తళుకుమానికపునిద్దాచెక్కడపుఁబైఁడి, సొమ్ములు నెమ్మేన నెమ్మిఁదాల్చి
కమ్మనెత్తావి చొకాటంపుఁగిలపంబు, నెఱనీటుగా మెడనిండఁ బూసి

తే. తుఱుములోపల నరవిరిసరులు దురిమి, చేడ్కఁ గపురపుబాగాలు వేసికొనుచుఁ
గులుకుజిగిబిగివగ వింతగొలుపవచ్చె, బోఁటి లావణ్యమదనవధూటిఁ బోలి. 254

క. వచ్చి తనమోమ్రోల నిలిచిన, యచ్చపలమృగాక్షిఁ జూచి హంసము భళి ని
న్నెచ్చితి నీసాగసునకున్, మెచ్చుము కథ విని యటంచు మెలఁతకు ననియెన్.

## ఇరువదవరాత్రికథ.

క. ఉజ్జయిని యనఁగ నొకపుర, మిజ్జగతిఁ బ్రసిద్ధికెక్కు నిద్ధవిభాసం
పజ్జలజరాగహర్మ్యచ, రజ్జారాలింగితాప్సరఃస్త్రీగణ మై. 256

మ. నెలతాలోవలుచిల్కపల్కుపనివన్నె ల్వన్నుముత్తెంపుఁదా
పలకప్రంపుటనంటిమొగ్గమగతాబలొప్పిదిదంతంపుసి
స్తులు గుల్కుం బవడంపుఁజాపులు రహించున్ గెంపుతాయోడుబి
ళ్లల నిద్దం బగు నిల్పుటద్దములమేడ ల్వేనవే లప్పురిన్. 257

చ. పురవనభూజపుష్పఫలముల్ గొను వేడుకఁ బూని తద్రుమో
త్కరములమీఁది కెక్కి సతతంబును దంటల నుండు వందిన

స్ఫురదురువృక్షపంక్తి సుమము ల్వెసఁ గైకొని కొప్పులం దలం
కరణ మొనర్తు రాపురిని గల్గినభిల్లసుపల్లవాధరల్

వ. ఇట్టిపురంబున 259

మ. చతురోపాయసమర్థుఁ డప్రతికళాచాతుర్యధుర్యుండు వి
శ్రుతకార్యజ్ఞుఁడు రాజనీతిపథదక్షుం డింగితజ్ఞాని య
ద్భుతశక్తిత్రయపారగుండు గుణసంపూర్ణప్రభావుండు సం
తతభూపాదరణీయుఁ డొక్కరుఁ డమాత్యశ్రేష్ఠుఁ డుండుం బురిన్. 260

తే. అతనినామంబు బహుమానుఁ డండ్రు జనులు, మానినీరత్నమపరాకు మానివినుము
భర్తృహరిచెంగటను గీర్తిఁ బరఁగునట్టి, మంత్రిజనులందు మేటి యామంత్రిబోటి.

సీ. నిర్ణయం బాబ్రహ్మనిర్ణయంబు స్వమాయ, విష్ణుమాయయెఁ జర్య కృష్ణచర్య
వాక్యంబు శ్రీరామవాక్యంబు దృష్టి యీ, శ్వరదృష్టి దీప్తి భాస్వంతుదీప్తి
బల్మి భీమునిబల్మి పద మింద్రపదవి స, త్యము హరిశ్చంద్రుసత్యము ప్రతిజ్ఞ
రాముప్రతిజ్ఞ ధైర్యము మేరునగధైర్య, మాజ్ఞ సుగ్రీవాజ్ఞ ప్రజ్ఞ గురుని

తే. ప్రజ్ఞ బలము సుయోధనుబలము కట్టు, డన భరతుకట్టడి కలిమి ధనదుకలిమి
గాఁగఁ బతి మెచ్చ నఘటనఘటనపటిమ, నమ్మహామంత్రి రాజ్యభారమ్ము దీర్చు.

వ. మఱియు గురుమహాప్రధాన సామంత సేనాపతి ద్వారపాల కావసరిక ఘటికాని
ర్ధారక గణక లేఖక పౌరాణిక పురోహిత జ్యోతిష్క కార్యజ్ఞ విద్వాంసక దేవ
తార్చక మాలాకారక పరిమళకారక చేష్టాధికార గజాధికా రాశ్వాధికార భాం
డాగారాకాధికార ధాన్యాధికా రాఁగరక్షక సూతి సూద భేతాళ మత తాం
బూలిక తాళవృంతక నరవాహక చ్ఛాత్రిక దామరిక కళాంచిక శరశారిక కీర
మాలిక పాదుకాధార నర్తక గాయక వైణిక శాకునిక మాగధ వైతాళిక స్తుతి
పాఠక పరిహాసక క్షౌరక రజక సౌచిక చర్మకారక ముద్రాధికార పురపాలక వన
పాలక గజవైద్య అశ్వవైద్య పశువైద్య భేరివాదక మురజవాదక కారక కుంభ
కారక చిత్రకారక వ్యవహారిక మృగయారి పక్షివాహిక పణిహారి కోగ్రాణాధి
కార వైశ్యజనంబు లాదియైన డెబ్బదిరెండు వినియోగంబులవారు సేవింప నతండు
వెలయుచుండు. 263

ఉ. వానికిఁ గొన్నినాళ్ళ కిల వార్తకు నెక్కినవాఁడు రూపరే
ఖానవపంచబాణుఁ డనఁగాఁ దగుఁ క్కనివాఁ డొకండు స
న్మానవిభూషణుండు సుకుమారుఁడు దైవకటాక్షవీక్షణా
మానకృపాప్తిచేఁ గలుగ నుత్సవ మొప్పఁగఁ బెంచి రంతయున్. 264

తే. పెంచియెలప్రాయమొదవఁ గాఁగాంచియతని, పెండ్లి సేయుదమనుచుసంప్రీతినొందు
తల్లిదండ్రులతో బంధుతతులతోడఁ, బరిణయము నొల్ల నే నని పలుకుచుండు.

వారలు పెండ్లి యేమిటికి నల్లనటంటి వటంచుఁ బల్కినన్
వారలకాతఁ డిట్లనియె వారిజనేత్రల నమ్మరాదు మా
యావచనాప్రవీణలు పరానుగతేచ్ఛ లొకింత యే మనన్
వారక నాఁడురూపములు వ్రాసినయింటను నిల్తురే బుధుల్. 266

క. కుల మెంచ రాడికోళ్ళకుఁ, దలకరు నడి వావివరుసఁ దలఁపరునీతిన్
దలకొనరు సత్యమాడరు, కలకంఠులు వారి నమ్మఁగా నెటు వచ్చున్. 267

ఉ. చన్నులకన్న మున్నొదవు సాహసము ల్వెలికించు దృష్టికిన్
మున్నుగఁ బుట్టుఁ బెద్దలను మోసము పుచ్చు మనీష యౌవనా
సన్నతకన్న మున్నె యగు సత్య మసత్య మసత్య మెన్నఁగాఁ
దిన్నఁగ సత్య మందు ధృతి డీకొను ధీరత పుష్పబోండ్లకున్. 268

ఉ. టెక్కులు నెమ్మెలున్ సొగసు ఠీవియు నాగరికంబు సద్దపుం
జక్కఁదనంబు జవ్వనముసంపదసొంపు వినోదపున్వగల్
చొక్కపువైఖరు ల్సతుల నూడిదె చాతురి గల్గువారికిన్
దక్కినయట్లు భర్తలకుఁ దక్కరు నిక్కమిం తెంతయున్. 269

తే. గరగరిక నుండు మోహనాకారవిభవ, శుభవయఃపాకపురుషులఁ జూచినపుడె
దృష్టి వారలపై నిల్పి తెవులు లేని, దశలఁ గృశియింతు రింతులఁ దరమె తెలియ.

క. అని పల్కెడు తత్పుత్రునిఁ, గనుఁగొని తలిదండ్రు లాప్తగణములు బంధుల్
వనితాభిముఖునిఁ గాఁ దమ, యనుపమచాతురి నొనర్చి రతిసంప్రీతిన్. 271

క. కులగుణరూపప్రజ్ఞా, దులు గల కన్యకల మానధూర్వహసంజ్ఞన్
జెలఁగిన యతనికిఁ బరిణయ, మలరఁగఁ గావించి రంత నతఁడు నిజాత్మన్. 272

తే. నెలఁతలను నమ్మరా దని నిశ్చయించి, పోఁటుటీఁగకు నైనను బోవరాని
యొంటికంబపుమేడలం దునిచెఁ దత్స, తీద్వయంబును హితసఖు ల్దెలిసి ప్రోవ.

వ. ఇత్తెఱంగున నయ్యలఁ బొంద శక్యంబు గాని సౌధంబుల నిజభార్యాద్వయంబును వే
ర్వేఱఁ గాఁపురం బుంచి తత్పరిపాలనార్థంబు పెద్ద లగుహితవయస్యల నియమిం
చిన నచ్చెలికత్తెలత్తెఱఁగున నన్నపానాద్యుపచారంబులఁ బోషించుచుండు నెడ భువన
మోహనాకారం బైన యౌవనోదయంబు సంభవించిన. 274

సీ. కంధర కిమ్మేలారి కార్ముక సంజాత, కాంచనకంబుల గర్వ మణఁచి
పద్మరాగ పటీర పద్మారి ఖండప, ల్లవ పద్మముల సముల్లాస మెంచి

వజ్రవల్లీద్వయంబును మతీశ్వర వార, జారి వారణ వసుధాళిఁ గేరి
కదళికా కౌహళ కచ్ఛప కలకంఠ, కనక కర్పూరసంఘముల మీఱి
తే. కచముఖభ్రూభ్రమనయననాసికాగళోష్ఠ, పరిమళ కపోల కోమలపాణిదంత
బాహుకుచమధ్యగతినితంబాంకజాను, పదపచోంగస్మితము లొప్పు భామినులకు.
చ. తరుణులగౌను లాకృతులు తళ్కు మొగంబులు చన్గవ ల్సువా
క్స్వరణులు పాణులుఁ మెడలు సారనితంబము లారురేఖలుఁ
దరళవిలోచనంబులు పదంబులు మేలు ముణుంగు లారయఁ
హరికమలాబ్జచక్రనిపహంబు నయంబు రయంబున న్నగున్. 276
సీ. ధరజయోన్నతి మించెఁ దనరు చన్నులు కృష్ణ, వర్ణఘనాకృతి వఱలె నెఱులు
కనుబొమల్ ధర్మవిఖ్యాతిఁ గైకొనె ముఖం, బులు నిశాకరకళాకలనఁ గనియె
జలవరసంభ్రమంబులఁ గేరె నాభులు, కటులు మహాబలోత్కటతఁ దనరె
నీలకంఠప్రియశ్రీ లందె నారులు, గజరాజగతిఁ దాల్చె గమనగరిమ
తే. యమరకాంతల లీలల నపయసములె, పరిహసింగఁగ మెఱయు నప్పద్మపత్ర
పద్మశనేత్రల కిఁక ధరాస్థలిఁ జెలంగు, చెలువ లన నెంత హాసనిర్జితలతాంత. 277
సీ. మెఱుఁగుమోములు ప్రభాకరబలంబు వహించె, లపనము ల్చంద్రబలంబు గాంచె
జఘనము ల్వసుమతీజాతబలం బందెఁ, గలితబుద్ధులు సౌమ్యబలముఁ జెందె
గురుబలంబు ధరించెఁ గుబ్బచన్గవలు న, ఖంబులు శుక్రబలంబుఁ బూనె
మందబలంబు నమ్యగ్యానములు దాల్చె, స్వర్భానుబలము కచంబు లొందె
తే. నతను కేతుబలం బూనె నలరు కన్ను, లిట్లు సకలగ్రహబలాప్తి నెనసియు సుమ
నోజబల వేధఁ దత్సతుల్ నైజనాథ, బలము చాలక కోరిరి పరబలంబు. 278
వ. ఇవ్విధంబున నివ్వటిల్లి యౌవనగర్వాతిరేకంబున నిర్మానుష్యంబు లగు సౌధాంతరం
బుల నుండుటం జేసి పంజరబద్ధకీరంబుల దారిని నపారజారవిహారవిచారపూరితమా
నపలైన యామానసకాసారగభీరనాభులు స్వాత్మగతంబున.
క. పతిరతిఁ దీరదు తమి వా, పతిరతి యేరీతి దొరకు భావంబునసం
గత మగు నీ వెతఁ దీర్చెడి, హితవరు లెవ రని తలంచి రెంతయు వంతన్. 280
సీ. అమరఁగిర్వాగాతులందైన వేశ్యక, నరజన్మ మేల యందఁగ నొనర్చె
నొనరించుఁ గాక నిం పొదఁగఁ బురుషులఁ, జేయక మమ్మేల స్త్రీలఁ జేసెఁ
జేయుఁగాక రతిఁ జెందువానికిఁ గూర్ప, కీరీతి నిర్లోహ కేల కూర్చెఁ
గూర్చుఁ గాక యథేచ్చఁ గొని చరింపఁగ నుండ, కీదుర్గమస్థలి నేల యుంచెఁ
తే. గటకటా మాయెడా పాపకతనహృదయుఁ, డాయెఁగాఁబోలు వాణీశుఁడటులగాక
యున్న నిట్లేలచేయు నంచువిద లాత్మఁ, బరితపింతురు మరుబారివిరహ మొదవ.

వ. ఇట్లు తమకు వలయు నెపంబఁ బపఁతుల గొనుచు తడవసితమయొడయుఁడు తమ్మిగులఁ
గూడి యాడి యుంపమికి మర్గమస్థలసంస్థితలసటజారప్రదకుఁ బొసఁగమికిఁ గంతు
శరసంతతసంతాపంబునకు సంతపించుచుఁ జిన్ననాఁటనుండియును దమ్ము నెత్తి
పెంచిన దాదులకు సైతము నెఱుంగనీయక యొండొక తెఱంగున నయ్యంగనలు మెలంగు
చుండి రయ్యెడ నుపేన్ద్రయనుతేదప్ర భార్య మోహంబున మదనాదుల నుద్దేశించి తన
మనంబున. 282

సీ. నీసుమశరముల నీసుమసమహాస, నీసుమతిని సేయు నేల మదన
నీరాక కులుకుననీరాక విడకపో, నీరాక శాకల నిరజారి
ఘనమార్గ ముడిగించి ఘనమాపమాపథ, ఘనమానిషాపాది వచుచు నిన్నుఁ
బవమానకరుణ నిం పవమానగతిఁ జరిం, పవమానమున కల్కి పడవు నీవు
తే. మధురధర్ముఁడు సర్వజ్ఞమౌళి నురప, ధామసత్త్రి మహాబలుండనెడు నిజము
హాత్మ్యములుమాని యిట్లు స్త్రీహత్యఁ జేయు, చున్న మీరీతి నెవ్వరైన విన్న నగరే.

క. తారాధిప రజనీకర, కైరవభేదనవిచక్ష గౌరీశశిరో
దూర కమలానురంజన, కారణ వారాశిభంగ కౌరాభ్యుదయా. 284

చ. పరిధిమిషంబు మాలికలబంతి కలంకపు గావు బొట్టు భీ
కరకిరణంబులన్ జడలు కాముభిభూతి నిసుఁ దాల్చి మంత్రివై
విరహులఁ జంప సాగితివి వే యన నేమిటి కూరు మొక్కచేఁ
బరఁగిన తోడుబోఁతులరపం బనుమాట నిజంబె పో శశీ. 285

క. కీరమణీ నీకోడక, కీరమణీ రత్న మిదియ కిల్బపమతివే
కీరమణీయపుఁ జమవు శు, కీరమణా కాని వారె కీరాలాపల్. 286

దే. మాటిమాటికి వేఁడు నీమాటియెడలఁ, బాటి దప్పినవార లేపాటివారు
గావున దయార్ద్రబుద్ధి న న్గావు నికుఁ, జేఁటి నామీఁదఁ గోప మింతేటి కరయ.

క. పికమా ఘోరాకృతి చూ, పిఁక మాదృశవిరహిణుల రతీశమహోద్ది
పకమార్గము చూపఁగ నో, పికమానస మూని యేఁచ బింకమె నీకున్. 288

వ. అని పెండియు నయ్యండజయాన పెక్కుతెఱంగుల నయ్యనంగుని సైన్యసమేతంబుగఁ
బలుకుచున్న సమయంబున దైవయోగంబున. 289

ఆ. ఆసువర్ణమందిరాంగణమున నొక్క, పాము కొద్వ్యయంబు పడియె నంత
దాని వెంబడిన మహీనిర్జరుం డొకఁ, డతిరయమునఁ బడియె నంగ మద్రువ. 290

వ. ఇట్లు పడిన యప్పుడమి తెఱగంటికొమరు నత్యనుపమమోహనాకారు నిరీక్షించి భ
యవిస్మయహర్షాదులు ముప్పిరిగొనుచిత్తంబున డాయం జని యొంటిపాటగుట వివి

ధోపచారంబుల నేద దీర్చి నీ వెవ్వండవ వి ట్లిందుఁ బడుటకు నిమిత్త మేమి యనిన
నానునర్లకు నతం డిట్లనియె. 291

మ. హిమవత్పర్వతమందు మండుఁ డనుమానింత్రుం డొకం డుండు సం
యమిచంద్రుండు తపఃప్రభావుఁ డల సన్న్యాసిన్ వెసన్ మోసపు
చ్చి మహాభ్రస్థలివాయువేగమున వేంచేయున్ సమర్థంబులై
యమరం బాదులు తాను బూని చనుచో నాకాశమార్గంబునన్. 292

ఉ. మున్నలవాటులేమిఁ బదముక్తములై పడె నిందు పావలే
నున్నిలు వోపలేక దివినుండిట వ్రాలితి నట్టిపావలెం
దున్నవొ చూపు మం చనిన నుస్మలి యం దొకచోటఁ గాంచె నేల్
సొన్నపుసన్నపుం బనుల సొంపు ఘటింపఁగఁ జాలుపాదుకల్. 293

వ. వాని గ్రహించి యచ్చంచలాక్షి యాహారాదివిధుల సంతుష్టుం జేసి యాబ్రాహ్మణ
కుమారు నెత్తుకొని తత్పాదుకాసామర్థ్యంబున నిలయనికటనిజపతికేళికారామంబు
చేరి తదనంతరంబ. 294

ఆ. తగినప్రహరిగోడ దక్షిణోత్తరముల, నలరు వెడఁద కూట మంద మొందు
మందిరంబు గాంచి యందొక్క యఱఁ దన, పడకటిల్లు చెరెఁ బద్మనయన. 295

ఉ. అందొక కొంతసేపు వసుధామరపుత్రునితోడ వేడుకన్
గెందలిరాకువిల్తురణకేళులఁ దేలి యజస్ర మిట్లు పొ
ల్పొందిన యిప్పురంబున శుభోన్నతిచే వసియించినన్ రతిన్
జెంది సుఖించు మీవితరచింతలు మానుము భూసురాగ్రణీ. 296

క. నీ కితరభయంబులు రా, నీక మెలంగుదు నటంచు హితవు గఱపి బి
బ్బోకిని యతనికి వ్యయమున, కై కొంతపదార్థ మిచ్చి యనిచెం బురికిన్. 297

వ. ఇట్లతనిఁ బ్రియపూర్వకంబుగా నాదరించి సెలవొసంగి క్రమ్మరఁ దనయిల్లు చేరె నివ్వి
ధంబునఁ దత్పాదుకాసామర్థ్యంబున. 298

క. కేళీవనమున సముచిత, కాలంబున నతనితోడఁ గంతురణక్రీ
డాలలితసౌఖ్యవారిధి, నాలోలమృగాక్షి యోలలాడుచు నుండెన్. 299

వ. ఇవ్విధంబునఁ బ్రథమభార్య సుఖించె నంత ద్వితీయభార్య యగుసుప్రభయు సప
త్నిరీతినుండియుఁ బరపురుషగాంధవొడమి కడుమిడుకుటం జేసి యేచందంబునం
బ్రొద్దువోక యొక్కనాఁడు సౌధాగ్రంబున. 300

క. ఆసుప్రభ సంగీతక, ళాసరసతి గలది యొకట లలితముగ సము
ల్లాసమున వీణమీటుచుఁ, జేసెన్ గానంబు సౌధశిలలు ద్రవింపన్ 301

క. సురపథమున నపు డొకముని, యరుగుచు నిజగానసిస్వనాకర్ణనవి
స్ఫురితానందంబున నటు, కరుదెంచిన లేచి మాచి యతినికి మ్రొక్కెన్. 302

తే. మ్రొక్కి నిలిచి వనిత మునితో స్వవృత్తాంత, మంత మనము గరఁగునటులఁ దెలిపి
దేవ నీవు రతులఁ దేలించి ననుఁ బ్రోవు, మనుచు వేఁడుకొనిన నబలఁ జూచి. 303

తే. నేను విజితేంద్రియుండనుగాన సతులఁ, జెందఁ గాదు నాకుఁ బూర్ణేందువదన
యైన నీయిష్ట మీడేరు నట్టినేర్పు, తెలియఁ జెప్పెద విను మని తెరవ కపుడు.

వ. కారుణికాగ్రేసరుండై యొక్కసిద్ధమంత్రంబుచెప్పి యీమంత్రస్మరణంబునవలయు నెడకుం బోయి రావచ్చుఁ గావున నీవాంఛితంబు దీనఁ దీర్చుకొమ్మని యానతిచ్చి మౌని విచ్చేయుడు నంత నాకాంత యత్యంతసంతోషంబున నొంటిపాటైనసమయంబున. 305

క. ఆరాజన్మంత్రస్మృతి, నారామము చేరి యన్నయపు డచ్చటికై
చేరినఁ దద్వనపాలుని, మారసమాకారుఁ జూచి మది ముద మొదవన్. 306

తే. ఓరచూపులఁ జిన్నెల బేరజముల, మనసు గరఁగించి తనమీఁద మరులు కొలిపి
వానిఁ దోడ్కొనిపోయి యావాలుగంటి, కడమయరలోన రతికేళిఁ గలసి చనియె.

క. అదిమొదలు వానిఁ గవగొని, మదవతి యారామమధ్యమందిరమున నిం
పొదవఁగ రమింపఁ దొడఁగెను, మదనుఁడు విల్లెక్కుడించి మరలి చనంగన్. 308

ఉ. అంతట నొక్కనాఁటినిశియందు శశిగ్రహణంబు గానఁ ద
చ్ఛాంతికి స్నానదానములు సల్పను వేఁకువజాము వచ్చుప
ర్యంతము పట్టునం దనుక రాఁడిపు డింటికి నాథుఁ డంచు దా
దెంతయు వచ్చి చెప్పిన మృగేక్షణ లాత్మల వేడ్క లూనుచున్. 309

. ఒంటిపాటై యున్న సమయంబున. 310

తే. జలక మొనరించి జిలుగువల్వలు ధరించి, కమ్మనెత్తావి కలపంబు కలయ నలఁది
యఱవిరులగొప్పు లమరించి యారగించి, తమసమర్థతఁ దద్వనాంతరముఁ జేరి.

క. ఒకరి నొక రెఱుఁగనీయక, సకియలు పడకిండ్లు చేరి షోడశిసుబం
ధకళానైపుణి నుపనా, యకులతొ రతికేళిఁ బెనఁగు లాడెడివేళన్. 312

సీ. ఫణిరాజతల్పంబుపైఁ బద్మనాభుండు, తిన్నఁగా శయనించు వన్నెఁ దెగడి
తనరు శ్వేతద్వీపమున గాఢతమి నొక్క, దెసనుండి పర్వెడు పస హసించి
క్రమమునఁ బుష్పగుచ్ఛముమీఁద మగతేఁటి, మొత్తంబు వ్రాలెడు దత్తుమీటి
హిమశైలతుంగశృంగమున నీలాభ్రంబు, పర్యాయమునఁ గప్పుభాతి మెఁఅసి

తే. సార కర్పూర డిండీర హారహీర, తారకోదార ధవళాంశువారకలిత
నీరజారాతిబింబ మున్నిద్రరౌద్ర, గతిఁ గ్రసించెను రాహు వక్త్రాలమునను.

సీ. మంత్రికుమారుఁ డామానధూర్వహుఁడు ది, వ్యౌషధం బవ్వనం బందుఁ గలుగు
నెఱిఁగి యుండుటఁ జేసి హితమిత్రపరిజనా, న్వితముగ దివ్వటీ ల్వెలుఁగ నేగి
బదనిక గలపాదపముఁ జూచి యది తీసి, కొని రండు పొం డని కొందఱ హిత
వరుల నంపించి వా రరుదెంచునందాఁకఁ, దా విశ్రమింపఁగాఁ దలఁచి తనదు

తే సతులకెప్పుడు సంకేతసదనమైన, తద్వనీమధ్యసద్మంబు దండ కరుగఁ
బ్రస్ఫురత్కరదీపికాప్రభలు సూచి, పరు లెవరో వచ్చి రని యుపపతులు వడఁక.

తే. వెఱవకుఁ డటంచు వెరవుచేవెన్నుఁ జఱచి, యుపపతుల నిండ్లలోననెయుండఁజేసి
నిలయములనుండి వెలువడినెలఁతలు తన, కెదురుగారాఁగ మదిఁగోపమొదవఁ జూచి.

తే. పరుల కటు తొంగిచూడను బాటుగాని, దుర్గమస్థలి నుండెడితోయజాక్షు
లివ్వనంబున కేరీతి నెమ్మె మెఱసి, వచ్చినా రనుసందియం బిచ్చఁ బూని 316

తే. ఇమ్మహానిశి నిచ్చోటి కేమిపనికి, వచ్చితి రటంచు గద్దించి హెచ్చరించు
తోడవల్లభుని నవ్వేళ వనిత లెట్లు, బొంకి పోవలె నెఱిఁగింపు పంకజాక్షి. 317

క. అని యడిగిన హేమాంవతి, తనతలఁ గదలించి తెలిసి తా నిది వివరిం
పను జాల నీవె తెల్పుము, వినియెద నన హంస మపుడు వెలఁదికి ననియెన్. 318

తే. మానధూర్వహుఁ డప్పు డామానవతులఁ, గాంచి వీరలు మత్కులకాంత లనుచు
నిశ్చయించుక రౌద్రనిద్రబుద్ధి, మీర లివ్వేళ నిట కేల చేరినారు. 319

ఉ. చెప్పుఁడు చెప్పకున్న విమ్ముఁ జిత్రముగా వధియింతు నంచు నేఁ
డప్పుడు తమ్ము రొప్పిన భయంబు వహింపక యాసువర్ణసాం
పొప్పఁగ భర్త కిట్లను సుఖోన్నతలీలల నివ్వనంబునన్
దప్పక సంచరించు వనదైవతకాంతల మమ్ముఁ జూల్కఁగన్. 320

క. నీమనమున మద్భామిను, లీమగువ లటంచు మమ్ము నెంచితి వాదిన్
మేము భవదీయసతులము, గా మస్మత్కాళిలు నీదు కామిను లనఘా. 321

వ. అదియునుంగాక. 322

క. ఈయెడ మేము చరింపను, మ యంశమ్ముల జనించు మదిరేక్షణలన్
నాయిల్లాం డ్రని పల్కితి, వే యేమి నిమిత్త మనిన నెఱిఁగింతు మొగిన్. 323

తే. చైత్రరథమున మును మేము సరసగతుల, సంచరింపఁగ నవ్వేళఁ జైత్రుఁ డచటి
కరుగుదెంచినఁ గాంచి యనాదరమున, లేవకుండిన సక్రోధలీలఁ జూచి. 324

తే. సాపరాధుల మమ్మాపసంతుఁ బెరసి, మర్త్యసేవను నూఱేండ్లు మహిని మెలఁగుఁ
డని శపించినఁ బ్రత్యక్షమటుల నుండఁ, 'జాలమని మేముప్రార్థింపసదయుఁడగుచు.
సీ. ఆరీతిమీరు ప్రత్యక్షంబున మెలంగ, కున్న నేరం జేమి యువిదలార
మీయంశములఁ బుట్టు మెలఁతల మానఘా, ర్వ్యాహుఁడను బహుమానవరకుమారుఁ
డగువిప్రునకు భార్యలై యుండ నియమింపుఁ,డని తెల్పి యావేల్పు చనిన నచటఁ
గూర్మితో నీకు మేల్గోరుచు నున్నవా, రము సువర యన సుప్రభ యనంగ
తే. మామకాంశముల జనించు మనుజసతులు,నీకుఁ గులకాంత లైనారు నిక్కమిదియ
రూపయౌవనసంపదారూఢ నీదు, చానలకు మాకుభేద మింతైనలేదు. 326
తే. ఇట్టిచుట్టరికం బుండు టెఱేఁగి కావె, నిను సహించిత మితరభూజనులు మేము
మెలఁగుచోటికి నివ్వేళఁ బోలసినపుడె, చెడ శపింతుము నీవింక నుడియరాకు.
క. చుట్టరిక మెంతగలిగిన, రట్టున రా రానియెడకు రా వారలపై
నెట్టిసుబుద్ధులకైనను, బుట్టును రోషంబు దానఁ బుట్టుం జెట్టల్. 328
కావున నీవిచటికి నిఁక, రావలదు వసంతిశాపరహితలమై మా
దేవుని కేగినంతట, నీవిట నెమ్మదిఁ జరింపు నీయాత్రలతోన్. 329
క. అని సంతోషము భీతియు, జనియింప నువర్చ పలుకు జాడనె పలికెన్
వనితామణి సుప్రభయును, విని తద్వాక్యములు మాని విభుఁ డపుడాత్మన్. 330
ఆ. ఏపు జవ్వనంబు రూపాక్కలై యుండు, టాత్మసతులు వీర లనుచు నుంటి
నేము నీసతులము గా మస్మదంశజ, లీలతాంగు లనిరి దేవమొ సతులు. 331
క. ఇంటికిఁ జని కనఁదగు వా, ల్గంటుల నీపలుకు లాత్మకామిను లింటం
దొంటిగతి నున్న సత్యం, బిఁటను లేకున్నఁ గలయ యిది దృఢ మరయన్. 332
ఆ. అనుచు నిశ్చయించి యతఁ డింటి కేగెను, వానికన్న మున్నె వనజముఖులు
నిజసమర్థతాప్తనిలయంబులకుఁ బోయి, పవ్వళించి యుండి రవ్విభుండు. 333
చ. వెసఁ జనుదెంచి యింట నలివేణులఁ గన్గొని తద్వధూవచో
విసరము సత్యమౌ ననుచు వేడుకఁ గైకొని తప్పనిద్రలుం
బసగల హంసతూలికలపాన్పులపై శయనించి యున్న యా
త్మ సతుల లేపి తొంటివనితావిముఖత్వము మానె మానినీ.
తే. అరమరలు లేనికూటమి నధిపుఁ డపుడు, కులవధూటుల నెంతయుఁ గుస్తరించి
పచ్చి వగదేరు రతులతో నిచ్చ నిచ్చ, లిచ్చకము పుట్టఁ జేయుచు నెనసి యుండె.
క. ఈమహిమ నీకుఁ గల్గిన, భూమివిభున్ రతులఁ గలయఁ బొమ్మని హంస
గ్రామణి వినిపించిన విని, హేమావతి మెచ్చుకొని ఖగేంద్రుని కనియెన్. 336

తే. జనపతిని జేరఁ బోనీక దినము దినము, కతలు చెప్పఁగ సాగితో కతలకౌరి
చిన్నిరాయంచ యిఁకనైన సెలవొసంగు, పోయివచ్చెద ననహంసపాలఁతికనియె.

క. ఇఱువదిదినముల కింటికిఁ, బఱతెంతు నటంచు నీదుపతి చనుచో నా
కెఱిఁగించె రే పవశ్యముఁ, బఱతెంచును గాన నీకుఁ బఱువం దగునే 338

చ. నరపతిఁ జేర దర్పకరణక్రియలన్ దగఁ బ్రొద్దుపుచ్చిని
ద్దురఁగొని యైనరాజు నినుఁ దోడనె పాయఁగ లేనిపూర్తిమం
దిరమున కేగు మన్ దనుక నిల్పిన నిల్చుటనైన నింటిలోఁ
దెరవరొ నీవు లేమి నరుదెంచిన నీపతి కేమి దోఁచునో. 339

క. కావున భూవిభుఁ జేరం, బోవుట కార్యంబు గాదు పొమ్మింటి కటం
చావనజాక్షికి హంసధ, రావరమణి చెల్పు నపుడు రవి యుదయించెన్. 340

తే. అంతహేమావతియుఁ బ్రాదయాంతరమున, భూమివిభుమీఁదిమోహంబుపొంగిపొరల
బడకయిలు సేరి వేఱొక్కపగిది నుండె, నపుడు తత్పతిగృహచరుం డరుగుదెంచె.

క. అదిగో నీపతి వచ్చెన్, ముదమున నగరోపకంఠభూమిని విడిసెన్
సుదతి ననుఁజూచి రమ్మని, పదరక ముందుగను నన్నుఁ బనిచెన్ వేడ్కన్. 342

క. అని చెప్పినఁ దద్వాక్యం, బనలశిఖాకీలతప్తమై చెవి నాటన్
ఘనభయవిస్మయలజ్జా, తినుహర్షభరంబు లొమ్మఁ దగిలినవగతోన్. 343

ఉ. దిగ్గన లేచి నిల్చి సుదతీమణి భూవిభుమీఁదిబుద్ధితోఁ
దగ్గుచు మ్రగ్గి నిగ్గు సిరితగ్గినితామరమొగ్గదోయి బల్
జగ్గుల కగ్గు నిం పెసఁగుచక్కనిచక్కనిగబ్బిగుబ్బలన్
నుగ్గడితంబు పయ్యెదయు నొప్పుగుఁ గ్రమ్మిడి చక్క దిద్దుచున్. 344

ఆ. ఓడబేరమాడ వేడుక నే నేగి, నదియు మొదలు శుభమె యుఁదఱకును
ననుచు బాంధవాదిజనుల యోగక్షేమ, మడుగ భద్రిమతుల మనియె నతఁడు.

క. వెండియు నిట్లను మదవే, దండలసద్గమనతో సుధారసధారా
పాండిత్యమండితోక్తులఁ, బండితపుఁడలికిఁ జెవులపండువుగాఁగన్. 346

క. జనపదములు పురగిరులన్, గనులు వను ల్నదులు నిధులు కట్టక్రొట్టల్
కనుమలు పేటలు తోఁటలు, మునుకొని కనఁగొనుచుఁ బోయి మోవిలన్ లీలన్

సీ. ముజ్జగంబును బూతముగఁ జేయ నగుధౌతి, వనభంగగంగ యెవ్వనికి భార్య
దేవాపనోత్సాహదృఢకళాసందోహ, మున మించు చంద్రుఁ డెవ్వనికి సుతుఁడు
కడలేని సిరులీనఁ గలరమాగజయాన, యలరారు నెవ్వాని యనుఁగుకన్య
బహుళపద్మభవాండపరిపాలనాఖ్యంపు, వాత్సల్యశౌరి యెవ్వనికి నల్లుఁ

తే. దట్టినక్రముక్రీడలీరావివాఁళ్ళ, రాచనీయానకేళీమహాబహాద్రి
మాలికాడోలికాపాళికోల్లసన్న, రాశికోల్లాసికలనవారాశి దాసి. 348

వ. సభయభక్తినమస్కారంబు గావించి తదుత్కటతటంబున. 349

సీ. జాతిలీలాయతిసకలాతిమేల్కట్లు, కాంబలపనకిముఖాబులోనఁ
బైఠణీజరబాబుపసలగోడసరాలు, మేలరబ్బీమొకమాలు దిండ్లు
గోపబూర్నీసనిగ్గులబిల్లసంతన, బలుచీనిహొంబట్టుప్రగ్గములును
దగుటురుమ్మీతాపుతానవారు కసీదు, నేస్తు బందరుగీటి లస్తరీలు
తే. ఖాతువా జంబుఖాన మఖాటివానుఁ, లరల సుకదాసులబనాతు లమర దిండ్లు
కాంచనస్తంభములు రత్నకలశతతులు, వాగ్లలను గుజ్జుగుండాగుత్రాగ్లె మఱియు.

క. హితవరులతోడ యుష్మ, త్పతిపేశుక విడిసి సకలపరిమళవస్తు
ప్రతతులు వళాక్తికవిస్రమ, వితతులు మొదలైన రస్తు వెలఁదీ కొనియెన్. 351

సీ. తళుక్కటద్దంపుబిద్దపునిల్వుటద్దము, ల్దంతపుదువ్వెన ల్లావులొల్క
నత్తరుఁ బునుఁగును నంబరు గౌళిక, చ్చూరము ల్కుఖము గంబూరచోవ
జల్లిసవరములు జిల్లరసము కదం, బము గోప జవ్వాజి పచ్చి పునుఁగు
కురువేరు పచ్చకప్పురము పన్నీరు బే, డెము మలాకెలు కుంకుమమును మంచి
తే. బుక్కకస్తూరివీణెలు చౌక్కటంపు, టగరు సంపెంగనూనెలు నాదియైన
మెచ్చుగలదీవులందుండి తెచ్చినట్టి, వివిధపరిమళవస్తువు ల్వెలకుఁ దీసి. 352

సీ. ఘుర్జరకలును బీంగాండ్లు తాబాణాలు, గిన్నెలు లేబుకులు గిండ్లు స్నపన
పాత్రలు చట్లును బానపాత్రలు మేలు, చట్టువంబులు మంచిమట్టుగిండ్లు
సంపుటంబులు గొప్పస్థాలీలు తబుకులు, కంచము ల్పట్లు గంగాళములును
చెంబులు పడిగముల్ చిప్పలు హస్తాం, బులు కంకణములు ఘంటల్లును గజ్జె
తే. లాదిగాఁగల్గు దీవులయందుఁ వెలయు, కంచరపుజాతిపగవగ లింపఁజేసి
నట్టిసామగ్రి బహువెల ల్వెట్టికొనియెఁ, గాంతభూకాంతమణులకుఁ గాన్కఁజేయ.

తే. వేఁడికొండమలవింతయా నేటిపునుఁగు, పిల్లుల జవాజిపిల్లల బెట్టుపురుల
ముంగిస సివంగి జోణంగి యింగిలీషు, కుక్కగుంపులఁ గోఁతులఁ గొన్ని గొనియె.

సీ. సపంగకావులుఁ జందురుకావులు, వెలిపట్టుపుట్టముల్ వేఁటచాళ్లు
జిలుగుబొమ్మంచులచీరలు నాచులు, నుదయరాగంబులు నురుతవన్నె
లొప్పుముయ్యంచులపుష్పాళ్ళ హొన్నంచు, వలువలుఁ గరకంచువస్త్రతతులు
ముత్యాలపందిళ్ళు నుత్తరగోప్రహా, ణములు నిగమగోచరములుఁ బద్మ

తే. ఫుతిలకలు నిండుమన్నెలు బొడలు బచ్చె, లును హారిణనస్య హంసపల్లులు మరంగ
పల్లు బొందలును సామంతపదులు నవఁగఁ, దనరె మపసందుపటములు గొనియె వెలకు.

రగడ. చొక్కాలు నొంట్లు చేసరులునుఁ మొలకట్లు
రాకట్లుచుట్టుంగరములు బల్చెక్కలు
మురువు లొప్పు కిరీటములు మేటితాళీలు
సరిపణలు మించులును సాటిలేనితురాలు
రంగుగల ముంగామురాలు నాభరణములు
నంగదంబులు పంచిహంవీర తాయెతులు
కంఠమాలికలు జిగిగల్గు చేకడియములు
కంఠసరములు బిరుదు గండపెండేరములు
నద్దంపుటుత్తరిగె లలరు చిఱుగజ్జియలు
కుందనపుఁ జెక్కడము గుల్కు మణిఘంటలను
మితిలేనివెల లిడిన మేఖలా లందియలు
చకచకల్గలజాతి సకలమణినికరములు
నకలంకవర్ణపట్టాంబర ప్రకరములు
పీతాంబరంబులును బేర్వడిన బుగుసాలు
జాతినీలాదులును సాలువులు చీనీలు
పచ్చపట్టులు తగటుపాగలును నంగీలు
నచ్చుపు మెఱుంగు గల యవురంగజేబీలు
బుడుతకాసీలు మహముదులు నిరాసీలు
సరి సేయరాని హంసావళులు లాకీలు
మాదళంబులు వెన్న మణుగులు ముసజ్జీలు
చాదరలు పైడిణిలు చక్కనికబాయీలు
నడుచు చిల్లానితేంట్లమరు బుర్నీసులును
నడికట్లు మేఘవర్ణంబులును ద్రోపులును
మొకమాలులును సూర్యపుటములు బనాతులును
సకలాతులం దెలుపు చలికప్పడంబులును
హొంబట్టు లోడీలు హొన్నకాదుకూలాలు
కబ్బాయితలు డాలు గల్గు జిరబాబీలు
వింతవింతలు గాఁగ వెలసినభపంతీలు

కాంతితతి వెదచల్లఁ గల్గినసకంతీలు
దుప్పకంబళ్ళు చందువలు తివాచీలు
పద్మలకుఁ గైకొన్నబలుజంబుఖానాలు
ప్రతిలేనిపట్టంచుపలురత్నకంబళ్ళు
నతులితము లైన చతురంగములబల్బలము
తళుకుపగడపుకోళ్లఁ దగుపట్టెమంచములు
కులుకునెత్తావికుంకుమపువ్వుతల్పములు
ఏకరంగితలాటు లిడుగోర లేజీలు
ఢాకచూపట్టు సురతాణి సింగాణీలు
కళలుదేరు పిరంగి కత్తులును జూరీలు
పొలుపొందు నందలపు బొంగులును గేడీలు
ఏరి కైకొనిన హారబ్బికెలును పన్నియలు
పేరైన సూరత్తు పింగాణిగిన్నియలు
రాయంచ లైదువర్ణము లైనకీరములు
మాయురే యని యెంచ మరుపట్టు జీనీలు
చీర్ణంపుపనులమించినపిరగిపీతములు
నిర్ణయింపఁగరానినిజలసద్వస్తువులు. 356

క. స్వగమండలములు కిన్నెర, లురబాబులుదండవీణ లురుజారుతరా
ల్వరరానణహస్తంబులు, మరితంత్రులు తంబురలు సమస్తము గొనియెన్. 357

వ. అయ్యవసరంబున. 358

సీసమాలిక. రాయదుర్గము గుత్తి రాయవేలూ రానె, గొంది మాహురి కాశి గోలకొండ
ముంగిపైరిణి డిల్లి ముళువాయజాబురా, బాదుషబ్బా మహామూరు మచిలి
బందరు సూరతు చెందెరు గోవేరు, శ్రీరంగపట్టంబు చెంజి కాంచి
బాదయు నారంగబాదు దౌల్తాబాదు, కప్పర గాగర గదుగు బిదిలి
కోట కల్యాణము గొందానమహముదా, నగరంబు బంగాళినరస గోన
పన్నాళ చదరంగపట్నంబు గలగల, గజరాజధాని బంగాపురంబు
కాంబాగర ప్రయాగ ద్వార కాయోధ్య, లక్ష్మీశ్వరంబు సోలాపురంబు
మధుర కొల్లాపురి మగధ మా యావంతి, కౌపురాణపురముల్ కౌబలగయు
నాదవేని కళింగ మానూరు వినుకొండ, కొండవీడును నేలకొండపల్లి
పొదిలె తంజాపురం బుదయగిరి కైనూరు, మైసూరు పెనుగొండ మంగళగిరి
బసువపట్నము సీర్పి భద్రాచలము పాల, వంచ నిజాంపురి వందవాసి

పుంఢిర్పి బెల్లముకొండ దేవరకోట, రాచర్ల మునిమడుగు రాయపురము
సైదాపురము గోన సాళ్వాక దూపాడు, రాపర్తి మాచెర్ల రాచవీడు
బనగానిపల్లె కంభము పోరు మామిళ్ళ, ధారావురము చీని తాడిపర్తి
నంద్యాల చిరువల్లి నందవరము కంము, భూసు రామయపట్న మాచబండ
హంపి విరూపాక్ష మారణి వెంపలి, కొంపిల్యనగరంబు కందనూరు
కడప సిద్ధవటంబు గండికోట కనూరు, సింహాద్రి పుట్టూరు చింతగుంట
గయ చెన్నపట్నంబు గండవరం బోరు, గల్లుదా మెనచెర్వు వెల్లటూరు
కల్లూరు కలువాయి నెల్లూరు వేలూరు, రాచూరు చదుమూరు రాచకొండ
కదిరి కూటాగుళ్ళ గంగేసు శృంగేరు, రామళ్ళకోట వజ్రగిరి నుసుము
నూగూరు చోబాడ బాగూరు కొళ్యాల, గుడిబండ బళ్ళారి కొత్తకోట
గుమిలేనిపాళెంబు గొబ్బూరు బళ్ళాపు, రము పుంగనూరాకు రామవెంకి
మానవ కౌతాళ మానుకొండైనూరు, జలపూరు పెదపలి జల్లికోట
కుంభకోణము కోటకొండ తంజావూరు, పెరవలి దువ్వూరు బెంగుళూరు
వొత్తూరు చిత్తూరు హుణి చిత్తనాపల్లి, రాజవోల్ గద్వాలు రాచనగరు
చిరుతని కాళహస్తి సినూరు మధ్యార్జు, నము తిరునామల నాముకొండ
పాకల కావేరిపాక మోహనగిరి, చదుకూరు మల్లూరు చాదుకొండ
పాగొండ వావిలి నాగోలు తాళ్ళూరు, మైలాపురము బెద్దమంగళంబు
రామసముద్రంబు రామాపురము జటు, పోలూరు వెల్లాల భువనగిరియు
హరిపనల్లి బేదనరవారి గొండాపు, రము గౌరి మాయూర మమరవీడు
నడిగల్లు కొక్కల్లు కడనకోలచు రత్న, గిరి వెలిగోడు తంగెళ్ళ దర్శి
కంగొంది తనుగొండ గడవ నెత్తము దూస్తి, సివనగాళ్ళవళంది సింగళంబు
మన్నారుకోవెల సొన్నగిలు చిదంబ, రము వాగెనగరి పురాణపురము
పడిగూరుపాళెంబు నుడిపి సుబ్రహ్మణ్య, ముజ్జంగి మండువా మోసవగలు
రామనాథపురంబు మాముగోళ్ళబెడంద, ధర్మపరంబును దాడిగోళ్ళ
మవణికె మందము మారకపురి కుంభి, హారంగ ముజ్జారి హాళికె హళ్లి
రెక్కిహాళి కురంజి రేణి సన్నకి, బాగూరుగుజ్జరి పాలువాయి
రామచంద్రాపుర మామూరు బెజవాడ, కొండేరు కాండూరు కోటకొండ

తే. మొదలుగాఁ గల్గు జనపదమ్ములను దుర్గములను బేటలఁ బాళెలఁ బురులవెలయు
వర్తకులు వచ్చి రచ్చటివస్తుతతులు, బేరసారంబు లాడెడు పేర్మి మెఱసి. 359

క. ఆరీతి వచ్చువారల, కారయఁ దాఁబిన్న పెద్ద యై నీవిభుఁ డిం
పారఁగ నస్తువు లన్నియు, బేరము పొసఁగించి చేసి వెల కిప్పించెన్. 360

ఉ. అంచితభక్తి వర్తకజనాళి కిట్లు సమస్తవస్తు లి
ప్పించి తదీయభూములకు వేడ్కఁ జనం బనిచి వారి నెల్ల నం
పించి నృపోష్ట్రవాజిరథబృందముపైఁ దనకొన్న వస్తు బొం
దించి సమిత్రుఁడై యరుగుదెంచె విభుఁ డహాయ చరఁగన్. 361

వ. అనిన విని హేమవతీకాంత సంతోషంబున భోజనాదుల సంతుష్టిం జేసి లబ్ధయోగ
క్షేమంబులఁ బతి కెఱింగింపు మని యతని నంపి తదనంతరంబ. 362

తే. కథలు చెప్పుటయె కాదు కరుణఁ బ్రస్తు, పోనియప్పలెల్ల రాయంచ పూని చెప్పి
నట్టి నయవాక్యముల చేత నైన సన్మ, హేమవతీమంజుభాష యపుడు. 363

క. పరపురుషసంగమం బిహ, పరసుఖదూరంబు గావునఁ బాతివ్రత్య
సురక్షణ గలసతులు మదిఁ, గొ రరటించుచు నిశ్చయించి ప్రమదం బెసఁగన్. 364

తే. చిత్రభోగులపైఁ బ్రేమ చింపఁ జేసి, నిజవిభునియెడ కలిగి యప్నరజాక్షి
తనదు గృహకృత్యములు దీర్చుకొనుచు నుండె, నంతఁ దత్పతి యింటికి నరుగుదేర. 365

క. కు చనపుబిందియల హారి, చందనతరువుల నుహిమసంతప్తంబై
క్రొందావు లొలుకు పన్నీ, టం దగ జలకం బొనర్చి తడయక యంతన్. 366

ఉ. ఆజనరాలు కీలుజడ నంబురుహోత్పలకేసరాలు వ
క్షోజభరాలఁ గప్పుకొను క్రొమ్మగరాలసరాలు నంగుళీ
రాజవిచిత్రరత్నముల రంగు చెలంగెడి యుంగరాలు వి
భ్రాజితనూపురాలు పదపద్మములన్ సవరించి వెండియున్. 367

సీ. వనచరంబులు గాన వచ్చె మైత్రికి నన, వేణికాశ్రేణి విరులు దురిమి
నీటఁ బుట్టిన పొటనెమ్మి దాసె ననంగ, గళశంఖమున హారములు ధరించి
జలజంబు లౌటనె చెలిమిఁ జెందె ననంగఁ, గరవారిజములఁ గంకణము లుంచి
సారంగజము లౌట సఖిత నొందె నన్నన, వక్షోజకుంభములఁ గస్తూరిఁ బూసి

తే. కనకరుచు లౌట మిత్రత ననఁగి పెనఁగె, ననఁగ దను హేమలతను మిన్నగు పదాలు
పన్నె బంగారుపువ్వులసలువఁ దాల్చి, పతికి నెనరుగ నేగె నప్పద్మగంధి. 368

వ. ఆసమయంబున. 369

సీ. మిసమిస మాపులు మిరుమిట్లు గొలుపంగఁ, గిలకిలనవ్వులు చెలువొనర్ప
ఘల్లుఘల్లు మని చిఱుగజ్జెలు రొదసేయ, ధళధళద్యుతుల కమ్మలు చలింప
ఝణఝణంకృతులఁ గంకణములు మెఱయంగ, ఘనఘనధ్వనుల మేఖల నటింప
ధగధగద్దీప్తి రత్నపుసొమ్ము లలరార, నిగనిగ బావిలీ ల్నిటు చూప

తే. భుగభుగలు గుల్కు మైపూతసొగసు గుల్క, గమగమలఁ గ్రప్పు విడెంబుగంధ మొలయ
మిసమిస ల్కుంకుమపు రేఖ మించు లొల్క, ఖణిఖణిల్లని మెట్టెల ల్కదురహింప.

క. తన కెదురుగ వచ్చిన తన, వనితామణి నపుడు చూచి వదనాంభోజం
బునఁ జిఱునవ్వొలయఁగ నెమ్మనమున నానంద మొందె మాలిని యంతన్. 371

తే. విభునిపదములు పన్నీట వేడ్కఁ గడిగి, నెచ్చెలులతోడ వెస నివాళిచ్చి వైచి
యింటిలోనికిఁ దోడ్తెచ్చి యింతులెంచ, భర్తతోఁ గూడ నతిసుఖప్రాప్తి నుండె. 372

వ. అంత హేమవతీకాంతవృత్తాంత మంతయు నాత్మీయదూతి విన్నవించినవిని కంపితశి
రస్కుండై కొంతదడవు చింతించి మహారాజచంద్రుండును నీతిజ్ఞుండును నకళంకుం
డును వివేకధురంధరుండును గావునఁ జిత్రభోగన్నృపాలుండు దనమనంబున. 373

ఉ. మున్నల రావణాదులు సముద్ధతిసాధ్వులఁ గోరి యేమి సౌ
ఖ్యోన్నతిఁ జెంది రిల్లగుట నుర్విజనావన లన్యకాంతలం
బన్నుగఁ గోరరాదు కడుఁ బాతక మంచుఁ దలంచి యింతిపై
నున్నమనంబు ద్రిక్కొని యథోచితపద్ధతి నుండె భూవరా. 374

క. అనుమఁ బురోహితుఁ డెఱిఁగిం, చిన నలరాజన్యమౌళి చిత్తాంభోజం
బున నద్భుతప్రమోదము, లెనయఁగ మెచ్చికొని రాజ్య మేలుచు నుండెన్. 375

మ. నతసంజీవనజీవనేశభయకృన్నారాచనారాచర
వ్రతబృందారకదారకత్యనపదారక్షోభిరక్షోఘట
శ్రుతసంధారణధారణార్హ్యమణిభాసుగ్రీవసుగ్రీవము
ద్ధతలీలాఘనలాఘనద్యుతిచితా తారాపతారాపహా 37

క. అక్షద్విడ్దక్షుక్షీ, ప్తక్షేమకటాక్షదక్షదక్షతనూజా
ధ్యక్షనుతపక్షపక్షీ, ప్రక్షుణ్ణోర్వ్యమవిపక్షరక్షాశిక్షా. 37

స్రగ్విణి. పద్మపత్రేక్షణా భక్తసంరక్షణా
పద్మగర్భస్తుతా భానుబింబస్థితా
పద్మబాణాకృతీ భవ్యశౌర్యోన్నతీ
పద్మసర్వేశ్వరా పాలితోర్వీశ్వరా. 378

గద్యము. ఇది శ్రీమత్కౌండిన్యసగోత్రపవిత్రాయ్యలరాజాన్వయసుధావార్ధిపూర్ణిమా
చంద్ర నిస్సహాయకవిత్వనిర్మాణచాతుర్య నిస్తంద్ర శ్రీరామనామపారాయణ నారా
యణామాత్యప్రణీతం బైన హంసవింశతి యనుమహాప్రబంధమునందు సర్వంబును
పంచమాశ్వాసము.